


దుర్గకొండ—మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు ... ... ౫౦౫-౫౧౦

భామహాచార్యులు—పెనుమర్తి వెంకటరత్నముగారు ... ... ౫౧౧-౫౧౪

శాలివాహనసప్తశతి—రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు ... ... ౫౧౫-౫౧౮

కాళిదాసభిజ్ఞానశాకున్తలము నేల రచించెను?—కో. వేం. కృష్ణమాచార్యులయ్యవారులుగారు ... ... ... ... ౫౧౯-౫౨౪

నిష్కాసనము—వేలూరి శివరామశాస్త్రిగారు ... ... ... ౫౨౪-౫౨౫

విద్యాప్రచారము-గ్రంథాలయోద్యమము—కోరాడ రామకృష్ణయ్యగారు ౫౨౬-౫౩౪

మనజన్మభూమి—గరిమెళ్ల సోమన్నగారు ... ... ... ౫౩౪-౫౩౫

ఉత్తరరామచరిత రసవిచారము—మల్లాది రామమూర్తిశాస్త్రిగారు ... ౫౩౬

ఉత్తరరామచరిత్ర: రసచర్చ—మున్నంగి లక్ష్మీనరసింహశర్మగారు ... ౫౩౭-౫౪౪

సుమార్చన—శ్రీ. శ్రీనివాసరావుగారు ... ... ... ౫౪౪

దసరా: గిలకలు—కె. నారాయణాచార్యులుగారు ... ... ౫౪౬

తోడిదొంగలు—ముద్దా విశ్వనాథంగారు ... ... ... ౫౪౭-౫౪౮

రామచంద్రప్రభుశతకము—కూచి నరసింహముగారు ... ... ౫౪౯-౫౫౨

కమ్మలు—వాసుదేవరావుగారు హసబ్నిసు ... ... ... ౫౫౩-౫౬౩

అధ్యాయాంతము—దువ్వూరి రామిరెడ్డిగారు ... ... ... ౫౬౪

పతిపత్న్యనుగమనము—వేలాల సుబ్బారావుగారు ... ... ౫౬౫-౫౭౪

సాంధ్యగీత—వేంకటకాళిదాసకవులు ... ... ... ౫౭౫

మహాశీలవజాతకము—కానూరి వీరభద్రేశ్వరరావుగారు ... ... ౫౭౬-౫౮౧

దెబ్బతిన్న లేడి—కొడాలి ఆంజనేయులుగారు ... ... ... ౫౮౨

మీనాక్షి—ఆంధ్ర శేషగిరిరావుగారు ... ... ... ౫౮౩-౫౮౫

నిశీథము—యన్. వి. బి. శంకరరావుగారు ... ... ... ౫౮౫

స్వప్నలీలలు—క్రొత్తపల్లి సూర్యరావుగారు ... ... ... ౫౮౬-౫౯౦

శరన్మేఘము—దివాకర్ల వెంకటావధానిగారు ... ... ... ౫౯౦

ప్రాచీనవిశ్వవిద్యాలయరాజమగు విక్రమశీల [illegible]

మోహనోదయము—పెమ్మరాజు లక్ష్మీపతిగారు ... ... ౯౩-౯౪
హైందవశిల్పచరిత్రము—ఏ. వి. రత్నముగారు ... ... ౯౫-౧౦౪
పూజకు—పురిపండా అప్పలస్వామిగారు ... ... ... ౧౦౪
పిట్టకథ—'ఒకరు' ... ... ... ... ౧౦౫-౧౦౬
తెలుగువారికి—సంపాదకుడు ... ... ... ... ౧౦౬
బ్రౌనుదొరవారి జీవితము—నిడుదవోలు వేంకటరావుగారు... ... ౧౦౭-౧౧౦
శిశువు—జి. జాషువగారు ... ... ... ... ౧౧౦-౧౧౧
విజయనగరద సామ్రాజ్యవు—యన్. వెంకటరమణయ్యగారు ... ౧౧౨-౧౨౫
నిస్పృహ—శన్నీరు కృష్ణమూర్తిగారు ... ... ... ౧౨౫
"నన్ను మఱచినను దేశమును మఱవవద్దు"—ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు ౧౨౭-౧౩౧
పెద్దవాళ్ల పిచ్చిమాటలు—పి. వేణుగోపాలుగారు ... ... ౧౩౨
పునర్విమర్శనము—తెలుగు కావ్యాదర్శము ... ... ౧౩౩-౧౩౪
పరిదేవనము—అల్లంరాజు రంగనాయకులుగారు ... ... ౧౩౪
గాంధీమహాత్ముని షష్టిపూర్తిమహోత్సవము ... ... ౧౩౫-౧౪౦
రాట్నము—వత్సవాయ వేంకటనీలాద్రిరాజుగారు ... ... ౧౪౦
పెమ్మసాని వీరతిమ్మానాయుడు—[స్థానిక చరిత్రలనుండి] ... ... ౧౪౫-౧౪౬
భారతీయమహిళామండలి ... ... ... ... ౧౪౭-౧౪౮
స్వాగతము—అల్లంశెట్టి అప్పయ్యగారు ... ... ... ౧౪౮
పత్రికా సన్మానము ... ... ... ... ౧౪౯-౧౫౫
కలగూరగంప—యతీంద్రనాథదాసు; శారదాచట్టము; కాంగ్రెసు అధ్యక్షుడు ... ౧౫౬-౧౫౮
విమర్శనము; స్వీకారము ... ... ... ... ౧౫౯-౧౬౬
మాణిక్యవీణ—వడ్డాది సీతారామాంజనేయులుగారు ... ... ౧౬౬
సాభిప్రాయవిశేషములు ... ... ... ... ... ౧౬౭-౧౭[illegible]

## చిత్రములు

త్రివర్ణచిత్రములు—పొదుపైన భోజనము; దేవగంధార.

సాధారణచిత్రములు—శ్రీరంగము దేవాలయచిత్రములు ౪; బౌద్ధశిల్పచిత్రము [illegible]; బౌద్ధశిల్పావశేష చిత్రములు ౧౧; పత్రికాసన్మాన చిత్రములు ౨; గణపతిపూజా[illegible] ఆకస్మికచ్ఛాయాచిత్రములు ౭; శ్రీగాంధీదంపతులు; మహాత్ముని రూపచిత్రము[illegible] వ్యంగ్యచిత్రములు ౨; సముద్రమున నక్షత్రరూపము; ఇతరచిత్రములును.

# భారతి చందాదారుల కొరకు ముఖ్యమైన విజ్ఞప్తి



ఈ దిగువ నమోదు పఱచిన సంఖ్యలుగల చందాదారుల చందాలు ఈ శుక్ల ఆశ్వయుజ సంచికతో ముగియుచున్నవి. ఆయా సంఖ్యల చందాదారులు దయచేసి తిరుగ తమ తమ చందా సొమ్మును మణిఆర్డరు ద్వారా పంపుట గాని, వి. పి. పంప ననుజ్ఞ ఇచ్చుట గాని కావింప ప్రార్థించుచున్నాము. అట్లు నవంబరు ౧-వ తేదీ లోగా మాకు మణిఆర్డరు గాని, వి. పి. అనుమతి గాని రాకున్నచో రాబోవు సంచిక వి. పి. ద్వారా పంపగలము. చందాదారులు ఆ వి. పి. ని త్రిప్పివేయక దయతో స్వీకరింప ప్రార్థితులు.

2048, 2414, 2417, 2779, 2793, 2818, 2843, 2844, 2858, 2875, 3305, 3582, 3594, 3600, 4048, 4374, 4380, 4394, 4409, 4415, 4420, 4770, 5114, 5117, 5120, 5124, 5125, 5129, 5138, 5154, 5157, 5189, 5557, 5558, 5578, 5581, 5583, 5586, 5587, 5593, 5594, 5597, 5602, 5604, 5607, 5610, 5612, 5614, 5616, 5622, 5624, 5627, 5629.



## ఇంకొక విజ్ఞప్తి

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుల సంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేద లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

మేనేజరు :

## మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి సర్వక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు : భారతి.




చెన్నపట్టణము, అక్టోబరు ౧౯౨౯

సంపుటము ౬ శుక్ల సంవత్సరము ఆశ్వయుజమాసము సంఖ్య ౧౦


## దుర్గకొండ


మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారు


ప్రకృతి సౌందర్యంబు పరికించు వేళఁ
బురుషునిమహిమంబు నరసెడు వేళఁ
బలు తెఱంగులుగ నిర్మల మైనయట్టి
యానంద మెంతయో యలరారుచుండు,
ననుభవించుచు నున్నయప్పుడు నేను
గవి నంచు భావించి వివరింప నెంతు,
నితరులం దనుపంగ నెంతును; గాని,
తెలుపఁ బూనినదానిఁ దెలుపఁగాలేను;
పదములు తడఁబడు వడఁకు నాలుకయు;
వెనుకముందు లెఱింగి వివరింపలేను;
అనుభవించినవాఁడె సాక్షి దీనికిని.

* * * *

శ్రీత్రయీమూర్తి యాశ్రితచక్రపాలుఁ
డఖిలజగద్బంధుఁ డఖిలమిత్రుండు
సంతత సన్మార్గచరణదక్షుండు
ప్రాకటాశ్లేషాదరణబుద్ధి నొంది
పద్మినీమోద సంపత్కరుం డయ్యె.

మూఁడుమూర్తులకును మూలమై యొప్పి
ప్రవిమలంబైన భాస్వచ్ఛక్తి రక్తి
సింహాధిరూఢమై శ్రీకరం బయ్యె.
భూభృద్వతంసులై పాలుపొందుఘనులు
జీవనప్రదు లౌచుఁ జెన్నారుకతన,
నాడుచుఁ బాడుచు, నానంద మొసఁగి,
యమృతకుల్యాతతు లందందుఁ బాఱె.
నవనవకాంతుల నలుగెలంకులను
వరిలక్ష్మి యానందవారి నోలాడె,
వరిలక్ష్మిఁ బూజించి భక్తిఁ జూపించు
పరమపవిత్రమౌ హరిదినం బయ్యె.
హరిసతీపూజయు, హరిపూజ గూడి,
యొక్కదినంబున నొప్పారుకతన,
ద్విగుణీకృతంబయి విలసిల్లె భక్తి.
భక్తి ముక్తు లొసంగి పోషించు నంచుఁ,
బగలెల్ల రక్తియు, భక్తియుఁ జూపి,
శ్రీసతీశ్వరపూజ శ్రీప్రసాదంబు
గావించి, సేవించి, భావించియుంటి;
అనురాగ మొప్ప, సంధ్యాకాల మయ్యె.
సాంధ్యకృత్యముల యాచారంబుఁ దీర్పఁ,
బ్రకృతివైచిత్ర్యంబుఁ బరికించి చూడఁ,
బరమేశ నామసంస్మరణం బొనర్ప,
నుత్సాహ మొంది గ్రామోపకంఠమునఁ
బాఱుచునున్న కాల్వసమీపమునకు
నల్లనల్లనఁ బోయి, యచ్చట నుంటి.

* * * *

పూర్వదిక్కునఁ దోఁచె దుర్గపర్వతము.

* * * *

తన లేనిదినము దుర్దిన మంచు జనులు
తనకు నంజలు లిచ్చి కొనియాడుచుండఁ,
బగలు గల్గియుఁ దమోభావంబు లేక,
యరుదైన మెచ్చుకొన్నట్లు కృత్యంబు
లన్నియుఁ దీర్చి, లోకాంతరమ్మునకు
నినుఁడు పోవుచు నుండె; నిరుగెలంకులను
హరిఁ జూచి, గిరిఁ జూచి, యానంద మయ్యె.

* * * *

ఖండచంద్రుఁడు మస్తకమునందుఁ గ్రాల,
కేశపాశముగ నాకాశంబు తోఁపఁ,
జటులోరువృక్షముల్ జటలట్లు వెలుఁగ,
ఝరిణులు సర్పభూషలరీతి నొప్ప,
దుర్గేశుగతిఁ బొల్చె దుర్గపర్వతము.
జగ మొనర్చెడు కర్మ సంచయంబునకుఁ
దాను సాక్షిగ నుండి, తనశక్తిఁ జూపఁ
దన చేయుకర్మసంతతుల కేవేళ
సాక్షియై యొప్పు దుర్గాధీశుఁ డనుచు,
నతనిపాదము లంటి యర్చనల్ సేసి,
తనకరమ్ములఁ బవిత్రములఁ గావించి,
యా యనంతపదస్థుఁ డరిగె నొండెడకు.

* * * *

అంతఁ బ్రదోషవేళారంభ మయ్యె.

* * * *

పాఱుకాలువల శబ్దంబుగా నొప్పి,
రాచువాయువుల స్పర్శంబుగా నొప్పి,
ప్రాలుపిట్టలను రూపంబుగా నొప్పి,
జాఱుతేనియల రసంబుగా నొప్పి,
దాఁగుపూవులను గంధంబుగా నొప్పి,

తన్మాత్రరూపమై ద్రవ్యమై యొప్పి,
మూఁడులోకములకు మూలమై యొప్పి,
నెన రొప్పఁ బ్రకృతియు నిండుఁగొ లువుండె.
శాంత తేజంబున సాక్షియై యొప్పి,
కొలువున్న ప్రకృతిని గోరి మెప్పింప,
దుర్గేశ్వరుండు సంతోషంబుతోడ
ధణధణాధణలతోఁ దాండవం బాడె.

తత్త్వ మిత్యాదిశబ్దములఁ గొల్చుచును
హరిమృదంగధ్వని లలమె నెల్లెడల.

నవనవకాంతుల నవకం బెసంగ,
నాకు పచ్చనిచీర యందం బొసంగ
వరిలక్ష్మి పాటలఁ బాడుచు నుండె.

స్వస్థానవాసులై చనుభవ్యతరులు
సుమనశ్చయంబుతోఁ జుట్టుప్రక్కలను,
నిజకలాపాలికల్ నేత్రపర్వముగ
సభ్యులై దరి నుండు చంద మింపారె.

భూభృద్వరుఁడు, సర్వభూతేశ్వరుండు,
దుర్గాధిపుండు ప్రదోషకాలమున
నారీతిఁ దాండవం బాడుచు నుండి,
రాణియై చెలువొందు ప్రకృతిదేవతకు
నానంద సంధాయియై వెల్గుచుండె.

దుర్గాధినాథుఁడై తొలుకాడుచున్న
రాజశేఖరుని నర్తనవిద్య చూచి,
తన్మయంబయ్యెఁ జిత్తం బంత నాకు.

తత్త్వ మ్మటంచును ధ్వనియించుచున్న
హరిప్రక్క నేనును హరి నైనయట్లు
స్వస్థానవాసినై భాసిల్లునేను
సుమనోవిలాసినై సొం పొందినట్లు
సభ్యుండనై చూచు చందంబు తోఁచె.

అణురూపమునఁ దన్ను నటు చూచుచున్న
ననుఁ జూచి యీశుండు నగుమోముతోడ
సవ్యమార్గములఁ దాండవమాడుచుండె.

జగ మంత యేకరీతిగఁ జూచుచుండి,
తన్మయానంద మందఁగఁ బోలు నైనఁ
బరమేశ్వరుని నాట్యవైదుషీమహిమ
నాకు మాత్రమె యన్న ననుపు కన్పట్టె.

ననుఁ జూచి మాత్రమే నాట్యం బొనర్చి,
నాకు నొక్కనికె యానందం బొసంగి,
యితరలోకం బేది యెఱుఁగనియట్లు
వర్ణనాతీతమౌ భావంబు కలిగె.

ఆరీతి దుర్గేశుఁ డాడు తాండవము
కనుఁగొని ముదాబ్ధి మునుఁగుచునుండ,
వేఱొక్క దృష్టి హృద్వీథిలోఁ దోఁచె.

ప్రళయసంధ్యావేళఁ బరమేశ్వరుండు,
సాక్షి యౌ ప్రకృతి కుత్సాహం బొసంగఁ
దాండవం బాడు చందంబు కన్పట్టె.

ప్రళయసంధ్యావేళఁ బ్రకృతి చూడంగఁ,
బరమేశ్వరుఁడు తాండవం బాడుచుండ,
నపు డందు నే నున్న యట్లు కన్పట్టె.

ప్రకృతిదేవతలోనఁ బ్రకృతి నైనట్లు
పురుషునిలో నేను బురుషుఁ డైనట్లు
రెండురీతుల నాకుఁ బ్రీతి కన్పట్టె.
ఈశుతోఁ దాండవం బే నాడుచుంటి,
నింతితో సాక్షిగా నేఁ జూచుచుంటి,

నెందుఁ జూచినను నేనే తోఁచుచుంటి,
పురుషుండ నే నంచు నరయుచునుండఁ
బ్రకృతిలోపల నున్న పగిదిగాఁ దోఁచె.
ప్రకృతి నే నంచును బరికించుచుండఁ
బురుషునిలో నున్న కరణి గన్పట్టె.

ఈశునిలోపఁ, నింటిలోపలను,
వెలుపల, లోపల, నలుగెలంకులను,
నేనె తోఁచుచునుండి, నృత్యమాడుచును,
సాక్షిగాఁ జూచుచు, నానంద మొంద—
అంతలో-అపుడె-దృశ్యము మాఱిపోయె.

* * * *

బుధగురుప్రముఖ విస్ఫూర్తి లేకుండె.
ఎదుటఁ గన్పడుచుండెఁ గృష్ణమేఘంబు;
శిఖిశిఖాకారమై చెల్వొందె మెఱపు;
వేణునాదంబయి విలసిల్లె గర్జ;
యమునాజలంబయి యంధకారంబు
వ్యాపింపఁగాఁజొచ్చె నన్ని తావులను;
కాళీయఫణియయి కన్పట్టె గిరియు,
సెలయేళ్లు నాగకాంతలుగా నెసంగె.

యమునాతరంగిణీ హ్రదమధ్యమందు
శిఖిపింఛధరుఁ డౌచుఁ జెల్వొందు కృష్ణుఁ
డల కాళియాహి ఫణాగ్రంబులందుఁ
దాండవంబాడు చందంబు కన్పట్టె.
నాగకాంతల భయానందజం బైన
యాక్రందనధ్వని యలమె నెల్లెడల.
వరనారదోపేత పర్వతప్రాంత
జటులమానందంబు సాంద్రమై యొప్పె.
గోపికారామాది కోమలాకృతులు
శిఖరివ్రజంబును జేరి కన్పట్టె.
తన్మాత్రరూపమై తనరారుప్రకృతి
రాధికాకారమై రాజిల్లుచుండె.

రాధికాకారమై రాజిల్లుప్రకృతి
సాక్షియై కనుఁగొంచు నానంద మొంద
సరసగంభీరసుస్వరమైన మురళి
మ్రోయించుచును నాట్యమును జేయుచున్న
కృష్ణసౌందర్యంబు ప్రీతి గావించె.
ఆ నృత్యమును జూచి, యద్భుతం బంది,
మఱిచూచి, మఱిచూచి, మఱిచూచి చూచి,
తన్మయంబయ్యెఁ జిత్తం బేకరీతి.

పర్వతప్రాంతానఁ బర్వతాకృతియు,
నారదసన్నిధి నారదాకృతియు,
గోపికాదుల మ్రోల గోపికాకృతియు,
ధరియించి, ధరియించి, తనివొందనైతి.
శిఖిశిఖారూపమై శిరమునం దుంటి,
మురళీనినాదమై మోవిఁ జేరితిని,
గాని, యింకను దృప్తి కాలేదు నాకు.
ప్రకృతిరూపంబైన రాధికాకార
మును దాల్చి సాక్షినై కనుఁగొంచునుండ,
సంకల్ప మొక్కటి జనియించె నాకు.
రాధనై నృత్యంబు రహిఁ జూచుచుండఁ
గృష్ణుండనై యాడ నిచ్చ జనించె.
కృష్ణరూపంబున నృత్యంబు సేయ,
రాధనై చూడంగ రాగంబు పుట్టె.

* * * *

ఇంతలో నింకొక్క దృశ్యంబు తోఁచె.

* * * *

ప్రళయకాలంబునఁ బ్రకృతి యంతయును
నేకమై, సాక్షినై, వీక్షించుచుండఁ,
గాలసర్పఫణాగ్ర ఘనరంగమందు
నాట్యం బొనర్చెడు నటరాజమూర్తి
సాక్షాత్కరించె నాస్వాంతంబునందు,
నేను నే ననునట్టి నేను నే నైతి;
నే నైతిఁ బురుషుండ, నే నైతిఁ బ్రకృతి.
ప్రకృతిపూరుషు లైక్యభావంబు నొందు
నర్ధనారీశ్వరుం డైతి నంతంత,
హరిహరాకృతిఁ దాల్చి యలరారుచుంటి,
నద్వయంబైన బ్రహ్మాకృతిం దాల్చి,
చిద్రూపినై యుంటి * *
* * చెదరెఁ జిత్తంబు.

తలచూపెఁ గొంత చైతన్యంబు నాకు.

* * * *

తొలుతఁ బచ్చికపైన నిలుచున్న నేను
తెప తెప నీటిలోఁ దేలుచునుంటి.

వర్షంబు జోరనఁ బడుచుండె మీఁద;
వెల్లువ జోరున విలసిల్లెఁ గ్రిందఁ;
జిమ్మన నంతటం జీఁకటుల్ గ్రమ్మె;
నలుగెలంకులను గన్పట్ట దేమియును;
గుండియల్ తటతట కొట్టుకొంచుండె;
నెందు నే నుంటినో, యెటు లుంటినొక్కొ,
ఏ మౌనొ నాగతి యెఱుకలేదయ్యె;
పరమేశ్వరుని మనః పద్మమం దుంచి,
యాత్మభారం బంత నతనిపై వైచి,
యంధకారమునందు నద్భుతంబైన
జ్యోతిఃస్వరూపంబుఁ జూచుచునుండి,
యతిభయంకరమైన యానందవారి
మునుఁగుచుఁ దేలుచు మునుఁగుచునుంటి.

* * * *
* * * *

చచ్చెఁ జచ్చె నటన్న శబ్దంబు వచ్చె,
లేదు లే దను నొక్క నాదంబు వచ్చె;
లోఁతైన వెల్లువలో మునుంగుచును,
దేలుచు, మునుఁగుచుఁ, దేలుచు నున్న
నన్నుఁ జేతులతోడ నడుమను బట్టి,
పై కెత్తి యొడ్డునఁ బడవైచి రెవరొ.

* * * *

చయ్యన మఱికొంత చైతన్య మబ్బె.

* * * *

నీటిలోఁబడి మృత్యునికటంబు చేరఁ
గానున్న నాపైని గారుణ్య మంది
దరిఁ జేర్చి కాచిన ధన్యుఁ డెవ్వండొ
యనుకొంచు, వెనుకకు నరసి చూడంగ,
మెఱసెఁ దళుక్కున మెఱపొక్కఁ డపుడె.
దృక్పథంబును బాసెఁ గృష్ణదాసుండు.

* * * *

సంపూర్ణమైనట్టి చైతన్య మబ్బె.
ఆకాశ మంత మేఘావృతం బయ్యె;
గాఢాంధకారంబు గప్పె నద్దెసల;
కాల్వ పాఱుచునుండె గట్టులం దాసి.
తడిసిన బట్టలు, వడఁకెడు కాళ్లు,
కొయ్యవారిన మేనుఁ గూడి బాధింప

నింటికి నొక్కండ నేతెంచుచుంటి;
కనఁబడకున్న త్రోవను జూడనైనఁ
దలఁ పొందఁగా లేక, జలమధ్యమందుఁ
గొట్టుకొన్నప్పటి ఘోరసంతోష
మొక్కఁడే యూహించుచుంటిఁ జిత్తమున.

* * * *

హా పరమేశ్వరా, హా కన్నతండ్రి,
ననుఁ గన్నతండ్రీ, యనాథనాథుండ,
చిత్రంబు, నీచర్య చిత్రంబు తండ్రీ,
యాపదుద్ధరణ కార్యంబు చిత్రంబు;
ని న్నెందుఁ జిత్తాన నిలిపి నే నుందు,
భక్తుండనైన నాపైఁ గటాక్షంబు
పలుతెఱంగులఁ జూపి యలరించినావు.

నీవు న న్నరయని నిముసంబు లేదు
కాని, సంపూర్ణమౌ కరుణను జూపి,
యినుమాఱు మాత్రమే ననుఁ బ్రోచినావు.

మనసులో మనసుగా మనియున్నయట్టి,
తనువులోఁ దనువుగాఁ దనరారినట్టి
యాత్మలో నాత్మగా నలరారినట్టి
ప్రాణేశ్వరిని నాకుఁ బాపియున్నట్టి
యా భయంకరవేళయం దొక్కమాఱు,
పాఱువెల్లువలోనఁ బడి జీవితాశ
విడిచి, కాల్సేతులు విసరుకొంచున్న
యీభయంకరవేళ నివు డొక్క మాఱు,
పూర్ణమోదంబును బొందించినావు;
ఆపదలం బాసి, యరసి కాపాడు
నప్పటి శాంతమౌ నానంద మద్ది
యానంద మైనచందానఁ గన్పడదు.
ఆపదలో మున్గినపుడు నిన్ దలఁచి
యాత్మభారము నీకు నర్పించువేళ
నతిభయంకరమైన యాకృతిం దాల్చి
డెందానఁ గల్గు నానంద మానంద
మట్లు—సంపూర్ణమౌ నానంద మట్లు—
అద్వైతమైన బ్రహ్మానందమట్లు—
కనుపట్టుచుండును గాన నా కట్టి
యానంద మిచ్చి న న్నాదరించితివి

నీకుఁ గృతజ్ఞుండ, నీకు భక్తుండ,
నీకు సేవకుఁడను, నీకు దాసుండ
ననుచు నేమేమియో యనుకొంచు, నవలఁ
గృపఁ బూని నాపైని గృష్ణదాసుండు,
ప్రతివతంసుండు, కారణ దేహచారి
నన్నుఁ గాపాడుచు నున్నచందంబు
తలపోసి, గురువు లందఱకు నైజంబు
గా నొప్పు నిష్కామకరుణకు మెచ్చి,
యల్లనల్లన నింటి కరుగుదెంచితిని.

* * * *

* * * *

ప్రకృతిసౌందర్యంబుఁ బరికించువేళఁ,
బురుషుని మహిమంబు నరసెడువేళఁ
గలుగు భావము లన్ని తెలుపఁగాఁ జాల:
ననుభవించినవాఁడు "సాక్షి" యొక్కండె.

అలంకారశాస్త్రంలో, నేటికి మనకు మిగిలిన గ్రంథాలలో, భామహాచార్యుని కావ్యాలంకారమే ప్రాచీనతమము. అతని ప్రాచీనత్వంలో పండితకోటికి భేదాభిప్రాయా లున్నవిగాని, సూక్ష్మంగా పరిశీలిస్తే భరతునికి పిమ్మట దొరికిన అలంకార వాఙ్మయాని కెల్ల భామహుడే మొదటివాడని తీర్మానింపక తప్పకున్నది.

భామహుణ్ణి అనేక ప్రాచీనాలంకారికులు తమ గ్రంథాలలో పరామర్శించారు. ఆనందవర్ధనాచార్యు లంత పరమ ప్రామాణికుడు తన ధ్వన్యాలోకం వృత్తిలో

'న పునః పర్యాయోక్తే భామహోదాహృత సదృశే వ్యంగ్యస్యైవ ప్రాధాన్యమ్; వాచ్యస్య తత్రోపసర్జనీభావే నావివక్షితత్వాత్.' అని ప్రథమోద్యోతంలోనున్నూ, 'భామహేనా ప్యతిశయోక్తిలక్షణేయదుక్తమ్'. అని తృతీయోద్యోతం లోనూ భామహుని యభిప్రాయములు సూచించాడు. అభినవగుప్తుడు, మమ్మటాచార్యుడు, హేమచంద్రుడు, జయమంగళాకారుడు, ప్రతీహారేందు రాజు మొదలగు సుప్రసిద్ధులున్నూ తమతమ గ్రంథాల్లో భామహుని కావ్యాలంకారాభిప్రాయాలు వివరించారు. ఇంతే కాక సుప్రసిద్ధులైన అలంకార సర్వస్వకారుడు, విద్యాధరుడూ, విద్యానాథుడూ భామహుని ఆద్యాలంకారకునిగా స్పష్టంగా చెప్పారు.

'ఇహహి తావ ద్భామహోద్భటప్రభృతయ శ్చిరంతనాలంకారకారాః ప్రతీయమానమర్థంవాచ్యోపస్కారకత యాలంకారపక్షనిక్షిప్తం మన్యంతే.'

అలం. స. పుట 3.

'యత్పున రలంకారకోటినివిష్టత్వం, వస్తుధ్వనే రుదభావయన్ భామహాదయః, తదపి విచారవిధురమ్.

విద్యాధరుని ఏకావళి. పుట 30.

'పూర్వేభ్యో భామహాదిభ్యః
సాదరం విహితాంజలిః.'

వి. నా. ప్రతాపరుద్రీయము-పుట 3.

ఈ ప్రకారం సర్వప్రాచీనాలంకారికులు ముక్తకంఠంగా భామహుని ప్రాచీనత్వాన్ని ఒప్పుకొనిరేగాని శంకించలేదు. ఉద్భటుని 'కావ్యాలంకార సంగ్రహం'లోని చాలా అలంకార లక్షణాలు భామహుని లక్షణములకు ప్రతికలని చెప్పవచ్చు. రసవత్, అతిశయోక్తి, సహోక్తి, అపహ్నుతి, ఉత్ప్రేక్ష, యథా సంఖ్యం, అప్రస్తుతప్రశంస, మొదలగునవి పోల్చుడు.

ఉద్భట సమకాలీనుడైన వామనాచార్యులు గూడా భామహుని బాగుగా నెఱిగియున్నాడు.

భామహుడు ఉపమను నిరూపిస్తూ, 'విరుద్ధేనోప మానేన...ఉపమేయస్య యత్ సామ్యమ్ గుణ లేశేన సోపమా' అని చెప్పాడు. వామనుడు దీనినే సూత్రీకరించి 'ఉపమానే నోపమేయస్య గుణలేశతః సామ్య ముపమా' అని చెప్పాడు. ఉపమలో 'అతిశయవా నర్థః'—అనగా అతిశ యముగల అర్థం వుందని చెపుతూ, భామహుడు

'యస్యాతిశాయవా నర్థః
కథం సోఽ సంభవో మతః,
ఇష్టం చాతిశయార్థత్వ
ముపమాత్పేక్షయో ర్యథా.'

అని వివరించాడు. దీనినే వామనాచార్యుడు
'అనుపపత్తి రసంభవః'.

'న విరుద్ధో ఽతిశయః'—

అని సూత్రీకరించాడు. వామనాచార్యులు కావ్యాంగాలను వివరిస్తూ, 'ప్రకీర్ణమ్' అనే అంగం క్రింద 'అపేక్షణ' మను దాని నొకటి చెప్పాడు. అపేక్షణ మంటే 'పదాధానోద్ధరణ మపేక్షణమ్.' పదముయొక్క న్యాస మాధాన మంటారు. ఉద్ధరణ మంటే అపసారణము. పద ములకు స్థైర్యం సంపాదింపవలె ననే తాత్ప ర్యార్థ మిచ్చే రెండుశ్లోకము లీసూత్రముక్రింద వుదహరించాడు.

'ఆధానోద్ధరణే తావ
ద్యావద్దోలాయ తే మనః,
పదస్య స్థాపితే స్థైర్యే
హంత సిద్ధా సరస్వతీ.

'య త్పదాని త్యజం త్యేవ
పరివృత్తి సహిష్ణుతామ్,
తం శబ్దన్యాసనిష్ణాతాః
శబ్దపాకం ప్రచక్షతే.'

ఈ శ్లోకద్వయమున్నూ భామహ భణితాలనీ గోపేంద్రతిప్పభూపాలుడు వ్యాఖ్యానం వ్రాస్తు న్నాడు: 'అత్ర భామహేన భణితం ప్రమాణ యతి' అని.

తరువాత వామనుడు పంచమాధికరణం ద్వితీయాధ్యాయంలో, 'మాతంగం మాన భంగురమ్' అనే ప్రయోగం యిచ్చాడు. ('భిదు రాదయః కర్మ కర్తరి కర్తరిచ' అనే సూత్రం వల్ల దీనికి సాధుత కల్పించాడు.) ఈపాదము భామహాలంకారంలో, ద్వితీయాధ్యాయం, 27 వ శ్లోకంలో వున్నది. ఈశ్లోకకర్త భామహుడుగా జయమంగళ వ్యాఖ్యాత గూడా చెప్పతున్నా డు. (భట్టికావ్యం వ్యాఖ్య.)

వామనుడికి భామహుడంటే ఎంత భక్తి తాత్పర్య ముందో ఉపరినిర్దిష్టోదాహరణాలు నిరూపిస్తవి. వామనుడు తన సూత్ర వృత్తిలో భామహుని అనుసరించి శబ్దసిద్ధికొఱ కొక అధికరణం ప్రారంభించాడు.

ఈహేతువులవల్ల భామహుడు క్రీ.శ. 8 వ శతాబ్దికి పూర్వుడని తేలుతోంది. కాని పాఠక్ పండితుడు భామహోదాహృతు డగు న్యాస కారుడు (6 వ పరిచ్ఛేదము, 36 శ్లో.) కాశికా వ్యాఖ్యాతయగు బౌద్ధజినేంద్రబుద్ధియే అనీ, అతడు క్రీ. శ. 700 లో వున్నాడు కాబట్టి,

భామహుడు 8 వ శతాబ్దములోని వాడవుతున్నాడని వ్రాశాడు. కాని జాకోబీపండితుడు జినేంద్రబుద్ధి మితాక్షరీకర్తయగు (గౌతమ ధర్మసూత్రవ్యాఖ్యాత) హరదత్తుని కర్వాచీనుడనీ, అందువల్ల, హరదత్తుని కాలం క్రీ. శ. 878 కాబట్టి, భామహుడికాలం యింకా యివలకు వస్తుందనీ అన్నాడు. వామనాదులకు భామహుడు పూర్వుడగుటచేత, 8 వ శతాబ్దంలోని వామనాదుల కర్వాచీను డౌట అసంభవము.

అసలు, న్యాసకారు డంటే జినేంద్రబుద్ధియే కాదు. అనేకమంది న్యాసకారులున్నారు. వారిలో ఏపూర్వుడో భామహోదాహృతుడేల కారాదని త్రివేదీపండితుడు తన పీఠికలో వ్రాశాడు.

'కేను' అను పండితుడు తాను ప్రకటించిన సాహిత్యదర్పణం పీఠికలో అలంకారవాఙ్మయ చరిత్రి వ్రాశాడు. అతను రెండు పక్షాలవారి వాదాలూ వివరించి ముఖ్యంగా యిలా తేల్చాడు: (ఆ రెండు పక్షా లేమంటే, (1) దండి భామహునికి పూర్వుడని వకటి, (2) భామహుడు దండికి పూర్వుడని యొకటి)—

'ఎవరికంటే ఎవరు ప్రాచీనులైనా, దండి భామహులిద్దరూ చాలాదగ్గిర కాలంలో వున్నారు. వారు సుమారు క్రీ. శ. 500 — 630 మధ్యకాలంలో వుండివుంటారు. వీరిద్దరిలో ఎవరో యింకొకరిని విమర్శిస్తారు. ఈ విమర్శబట్టి చూస్తే నాకు మట్టుకు నాకు దండియే ప్రాచీనుడని తోచుచున్నది. భామహుని ప్రాచీనత్వానికి చూపించే కారణాల కన్నా దండిప్రాచీనత్వ సూచక హేతువులు బలీయాలుగా కనబడుతున్నవి'.

ఈవాదం వ్యక్తిగతాలైన అభిప్రాయాల బలం కలదే గాని, హేతుబలం ఎక్కువ కలదిగా కన్పట్టదు. డాక్టరు Berridale Keith అనునాంగ్ల పండితుడు తన 'లౌకిక సంస్కృత వాఙ్మయ' మనే గ్రంథంలో (Classical Sanskrit Literature, 'Heritage of India' series) భామహునికంటె దండి పూర్వుడని వాదించాడు. అంతరంగసాక్ష్యం (internal evidence) ప్రకారం, భామహుని అభిప్రాయాలు దండి మతాన్ని ఖండిస్తున్నాయి అని చెప్పినాడు. దండి భామహుని శ్లోక మొకటిగూడ quote చేయలేదనీ, ఒకవేళ దండి భామహుని విమర్శించినట్లు కనబడినా, అవి భామహుని school లో పూర్వుడైన మేధావిమతఖండకములు కావచ్చుననీ వ్రాశాడు. బలవత్ప్రమాణము కలది కాదీ అంతరంగ సాక్ష్యం. ఇంక, బహిరంగ సాక్ష్యం (external evidence) ప్రకారం నైయాయికుడైన ఉద్యోతకరునికి పూర్వుడు గాడనీ, అతనుదాహరించిన న్యాసం జినేంద్రబుద్ధిదే అనీ, అందువలన క్రీ. శ. 700 కి పరుడని కీత్ వాదించాడు.

ఈ బహిరంగసాక్ష్యంగూడా అంతవిశ్వాసార్హం కాదు. ఏలనంటే, ఉద్యోతకారుని కంటె పూర్వమే అతని మతం ప్రచలితమై

వుండేదని ప్రమాణాలు చూపించవచ్చు. తరువాత, జినేంద్రబుద్ధిప్రకారం కాలనిర్ణయం చేస్తే భామహుణ్ణి 9 వ శతాబ్దమునకు యీడ్చుకొని రావలెనని పైన నిరూపించాను. దండికంటె భామహుడు పూర్వు డనేదానికి మా సాక్ష్యము భావుకులు పరిశీలించండి.

భామహుడు తన అలంకారగ్రంథంలో, (5 వ ఆశ్వాసంలో) కవిత్వాలంకారాల్లో శాస్త్రంయొక్క స్థానమును చర్చించాడు:

'స్వాదు కావ్య రసోన్మిశ్రం
శాస్త్ర మ ప్యుపయుంజతే,
ప్రథమాలీఢమధవః
పిబంతి కటు భేషజమ్.'

దీనికి ఆచార్యదండి:—

'ప్రతిజ్ఞా హేతు దృష్టాంత
హాని ర్దోషో నవా వ్యసౌ,
విచారః కర్కశః ప్రాయ
స్తేనాలీఢేన కిం ఫలమ్.'

'సీవిచారము నెంత రసంతో కప్పిపుచ్చినా, అది కటువుగానే వుంటుంది.' అని దండి అంటున్నాడు. అసలు 'విచారః' అను శబ్దమునకు 'ఆలీఢేన' అనే ప్రయోగం ఎక్కడనైనా చూచామా? కాబట్టి, యీ అసాధారణ ప్రయోగం దండి భామహునినుండి గ్రహించినట్లు తోచుటలేదా? 'ఆలీఢేన' అని మనము వినగానే 'మధు' అనేశబ్దము గోచరించడంలేదా?

కాబట్టి దండి యీ శ్లోకాన్ని వ్రాసేటప్పుడు 'ప్రథమాలీఢమధవః పిబంతి కటు భేషజమ్' అనే భామహుని పాదాల్ని మనస్సులో పెట్టుకొని దానికి సమాధానం యిచ్చాడు. ఇదే బలవత్తరమైన హేతువు.

భామహాచార్యుడు

భామహాచార్యు లనేక గ్రంథాలు రచించాడు. అర్వాచీనాలంకారికు లనేక శ్లోకాలతనివిగా వుదాహరించారు కాని, అవి యేవీ యిప్పుడు మనకు మిగిలిన కావ్యాలంకారం లో కాన రావు. అతని బహుగ్రంథ పరిశోధనవల్లా, అద్భుత పాండితీమహిమవలనా, 'ఆచార్య'అను బిరుద మిచ్చారు ప్రాచీనులు. కావ్యాలంకారంలో చాలా విషయా లున్నా,ఏవిధమైన విశిష్టత్వమూ, వ్యక్తిత్వమూ (originality) కానరాదు. దాని నిజమైన గుణం ఆలంకారికుని హృదయపరిశ్రమ కాదు. అతని బహుగ్రంథముల క్రోడీకరణమం దున్నది గుణం.

అందువలన, ధ్వన్యాలోకాద్యుత్తమగ్రంథాలలో తత్తదాలంకారికుల స్వయంప్రతిభ వారి కమరత్వ మిస్తోంది. కావ్యాలంకారం అలంకారశాస్త్ర క్రమ పరిణామ జిజ్ఞాస కల వారికి ఒక చరిత్రవలె వుపచరిస్తుంది. దాని అమరత్వమందు మాకు శంక కలదు.

---

# బౌద్ధ శిల్పావశేషములు-అమరావతి*

చిత్రము ౧



చిత్రము ౨



చిత్రము 3

* ఆర్టు, ఇండస్ట్రీ జర్నలునుండి.

చక్కఁగాఁ జూడ నేర్చు నాజాణ; నిజము;
తనకు సరివారియెడఁగదా తగును వలపు;
ఇంక నది చావనిమ్ము! ని న్నేమి యనను;
దానిచా వైన మెచ్చుకోఁదగును జూవె!

దుగ్గసామి. ౧-౧౩

నీవు వసియించుచోటని నెమ్మనంబు,
తనకు నివి నిన్నుఁ జూపిన వనుచుఁ గనులు,
నిన్ను నెడఁబాసికద యివి సన్నగిల్లె
ననుచు నంగంబులును బ్రియమయ్యెఁ జెలికి.

ముద్దఁడు. ౧-౪౦

చెలిమి, మంచితనము, వలపును గలచోటఁ
దగుల మెవరికైనఁ దగును గాని
మనసు లేనిచోట మనసు నిల్పుట నగుఁ
బాటు మూవె చూచువారి కెల్ల.

హాలుఁడు (వాక్కే?). ౧-౪౧

గోపురంబుమీఁదఁ గొంత తోఁచెడు మేకు
చెంతఁ బావురములు చేరి యఱవఁ,
జూడు! దేవళంబు శూలా మెక్కించిన
బాధ నోర్వ కేడ్చు పగిది నుండె!

ప్రవరసేనుఁడు. ౧-౫౩

కన్ను మూయకుండఁ గడపెదు దీర్ఘ హే
మంతరాత్రు లెల్ల మగువ! యిట్లు;
పెక్కుదినము లయ్యెఁ బ్రియుఁ డూర లేక; నీ
పగటిప్రొద్దు నిద్ర బాగు గాదు.

కంఠేసరుఁడు. ౧-౫౫

వలపు పలువురపైఁ గల్గువాని చెలిమి
కష్టపడి మైదుప్రొద్దులు గాంచినట్టి
వనిత యాఁకవప్రొద్దుకు వాయి విడువ
నేల? దండిగ నె ట్లబ్బు మేలితిండి?

అలయుఁడు. ౧-౬౩

మగని తప్పుపనుల మన సెంత నొగిలినఁ
గాని, వానిమీఁది దానియలుక
సడలి కాఱిపోవఁ దొడఁగెను, బిడికిటఁ
బట్టుకొన్న యిసుకపగిది నదిగో!

మొత్తావాలుఁడు. ౧-౬౪

బాధపెట్టలేదు పరదేశవాసంబు
గాని, పేదఱికము గాని నాకు;
కోరినట్టి కోర్కె గూడక చెలికాండ్రు
వచ్చినట్లె పోవ నొచ్చె మనసు.

భోమవిక్రముఁడు. ౧-౬౬

పల్లెలందు గడ్డిపఱపుల, వనమందు
కాఱుచిచ్చుసెగలఁ గాఁపు దొరకె;
పట్టణమునఁ జూడు! పాంథునిపైఁ జలి
కసిని దీర్చుకొనెడు కరణిఁ దోఁచె.

వినకాయితుఁడు. ౧-౬౭

ఈవు దాక్షిణ్యమునకయి యిటకు వచ్చి
యున్న నింతటి సుఖ మగుచుండు మాకు;
ఇంక మనసార నెవ్వరి నేని చూతు
వట్టివారల సుఖ మెంతో! యందకాఁడ!

ఆదివరాహుఁడు. ౧-౭౫

కొట్టి నొచ్చిన యొకచేయి పట్టి యతఁడు
వేగ నూర్పుల గాలిచే విసరఁబోవ,
నేమి చేయుదు? నవ్వుచు నేను వానిఁ
గౌఁగిలించితిఁ బెఱచేతఁ గంఠమందు.

ప్రహాయీ. ౧-౭౬

అలిగి పెడమోముఁ బెట్టి నీ వరుగుచున్నఁ
గాని మానిని! నీవెంటఁ గదలివచ్చు
మగనిప్రక్కనె యున్నది మన సటంచు
పులకరించిన నీ వీఁపె తెలుపుచుండె.

రేవా. ౧-౭౪

ఆస దీఱ నింక నతనిఁ జూడఁగవలె
నత్త! యొక్కనిముస మపుడు గన్నఁ
గనుల దప్పియైనఁ గడవదు; కలలోన
దాహమెత్తి నీరు ద్రావినట్లు.

పజ్జుఁడు. ౧-౯౩

ఉన్నయన్నినాళ్లు నొకసొమ్ముగా నుండి
సజ్జనుండు వదలిచనిన చోటు,
పెద్దమఱ్ఱిమ్రాను పెల్లగించిన వేళ
పల్లెటూరిప్రక్క బయలుఁబోలు.

హరకుంతుఁడు. ౧-౯౮

తనివి దీఱకుండఁ గనుఁగొనఁ దగియుండి,
మనసు మనసుఁ గలిసి, మంచితనము
నూని, సుఖము దుఃఖ మొకటిగ మనువారి
పొందు గనుట పెద్దపుణ్య మిలను.

పజ్జుఁడు. ౧-౯౯

ఎవరి కెవరు గూర్తు రిలను వారికి వారు
నోంచినను సుఖంబు నించఁగలరు;
దయితు నోటికాటు దగిలినఁగూడ బా
లిండ్లఁ జెలికిఁ బులక లెగయుఁ గాదె?

సిరిస త్తియుఁడు. ౧-౧౦౦

చూడలేక యేడ్చుచును గట్టకడపటి
యిప్పపూలఁ జెసిపె యేఱుచున్న
దదిగొ చూడు! చచ్చినట్టిచుట్టము నెమ్మి
కలను వెదకునట్లు కాటినడుమ.

సిరివలుఁడు. ౨-౮

నేడుగూడ మఱవ నేరను నాపాద
ములకు మ్రొక్కి యతఁడు పలుకకుండఁ;
గాలిబాటన వ్రేల గట్టిగా వాని పె
న్నెఱులఁ జుట్టి యీడ్చు పరమసుఖము.

భీమరుఁడు. ౨-౫

తోడిగొల్లపడఁతు లాడు నాట్యము మెచ్చు
నెపము పెట్టి, చెంత నిలిచి, జాణ,
యొక్క వ్రేత, వారి చెక్కుటద్దములందు
మొలచు కృష్ణు నీడ ముద్దు గొనియె!

సుదరుఁడు. ౨-౧౮

చుట్టములు నశింపఁ జూచి యేడ్చుచునున్నఁ
బరమవీరుఁ డనుచుఁ దరుణచోర
వరుని వలచి చూచెఁ జెఱకొన్న వాల్గంటి;
గుణము నెవరు మెచ్చుకొననివారు?

హాలుఁడు. ౨-౧౯

చెంచు మగువ యింటిచెంగటఁ, జిక్కిన
మగనిపెద్దవింటఁ దెగినచిరుఁగు
పొట్టి మింటి కెగిరిపోయెడు సుడిగాలి,
దానిభాగ్యగుణ పతాక యనఁగ.

హాలుఁడు. ౨-౨౦

కనులు మూసికొనుచుఁ గాంతుఁడు తన చెంతఁ
జేరినట్లు తలఁచి సెజ్జమీఁద,
కలికి సడలినట్టిగాజుల కేలు సా
రించి తన్నె కౌఁగిలించికొనియె.

బంహాగతి. ౨-౩౩

నందు చూచి చెలియ లందఱుఁ జేరి నా
మనసునందు బలిమిఁ జొనిపినట్టి
యలుక ప్రియునిఁ జూచినప్పుడ నిలువక
మాయ మయ్యె, దొంగమగని కరణి.

విలాయిచ్చుఁడు. ౨-౪౪

మనసునందు వలపు మాయుటఁ జేసి కాఁ
బట్టకుండ నొక్కపట్టునందు
నిలువకయ చలించు నీయరచూడ్కులు
పెల్లగించుఁగదర! యుల్లి మెల్ల.

విజయగయి. ౨-౪౬

నిదురవడికిఁ జిక్కి కుదుట నిల్వక కన్నుఁ
గోనలందు నీక్షిఁకొనుచుఁ బాప
లలయు వాలుఁగంటి యరగంటి చూడ్కుల
యుదుటు మదనుఁడైన నోర్వఁగలఁడె?

హాలుఁడు. ౨-౪౭

అర్కమండలమున సకలంకమౌ చంద్ర
మండలంబు సొచ్చియుండు పగిది
నివని కౌస్తుభమునఁ దవులును లచ్చి నె
మ్మొగము వాని కిడుఁడు ప్రమొక్కు లీరు.

శశిలంకుఁడు. ౨-౫౧

తగినచోటు గాదు దాఁచుట కిది; యేల
సాహసంబు చేయఁజనెదు? కొడుక!
ఇందు దాఁచినట్టి హృదయంబు లేమి చే
సినను మఱలి నిన్నుఁ జేర రావు!

సాహిల్లుఁడు. ౨-౫౪

చెలులమాటగూడఁ జెవిని బెట్టక వేని
కొఱకు నాఁడు నిన్నుఁ దఱిమి యుంటి
నట్టు, లివిగో చూడుమా సౌఖ్యములు! ప్రాణ
ములకె సందియంబు పుట్టె నిపుడు!

దేవుఁడు. ౨-౫౭

నలువలఁకులఁ జీఁకటులు గ్రమ్మ పెనుమత్తి
ప్రమానియాకు లెవ్వరైనఁ గోసి
కొందు రనుచుఁ జెడిపె లందఱు వానిపై
నిండఁ జల్లినారు పిండి గలిపి.

అహార్యాయుఁడు. ౨-౬౬

ప్రీతిపాత్రమైన పెండ్లాము సచ్చిన
యింటిపాడు సూచి యేడ్వలేక,
చనఁడు పొలము విడిచి పని లేకయున్నను
పామరుండు కాఁపువాఁడు కంటె!

పుండరీకుఁడు. ౨-౬౯

ఇంటికాఁపు పెద్ద యెనుఁబోతు సచ్చినఁ
దాని మోసికొనుచు దానిగంట
సరము తిరిగి తిరిగి సంతలన్నియుఁ దుద
కమ్మవారి దేవళమ్ముఁ జేర్చె.

సన్నసామి. ౨-౭౩

ఇచ్చకొలఁదిఁ దిరుగు మింక; బైరాగి! గో
దావరీతటమున దట్టమైన
పొదలఁ జేరి యొక్కపొగరైన సింగ మా
కుక్కపోతు నిపుడె కూల్చి చంపె.

౨-౭౫

నేను దూతిఁ గాను నీవును బ్రియుఁడవు
గావు; మనకు నిందుఁ గార్య మేమి?
కాని, యది నశించుఁ; గలుగు నీకపకీర్తి;
దానఁ జేయవలసె ధర్మబోధ.

అసులద్ధి. ౨-౭౭

ఎంతసాము చేసె నీతిలకం బౌర!
నెలఁత మొగమునుండి నీదు మొగము,
నీదు మొగమునుండి నాదు పాదములఁ జేఁ
జేత మార్చుకొన్న రీతిఁ జేర!

హాలుఁడు. ౨-౭౯

చెవిని సొమ్ముగ నేరేటి చివురుఁ జెరివి
కాఁపు కొమరుఁడు వీథిలోఁ గడచి పోవఁ
గంటె! నలుపెక్కెఁ గనులు సగంబు మూసి
కాంచు చామనచాయ వాల్గంటి మొగము.

౨-౮౦

నీవు తక్క నోరులు నేరరు చేఁదుమా
టలను మెతువుగాఁగఁ బలుక; దూతి!
దురద గోఁకునపుడు తోల్తెల్లఁబడకుండఁ
గార్య మెల్లఁ దీర్పఁగలవు సుమ్ము!

అహావసత్తి. ౨-౮౧

'వాఁడు వచ్చిన నేమి మాటాడవలెనొ?
యేమి సేయంగవలయునో! ఎట్టు లగునొ!'
యనుచుఁ దొలుదొల్త సాహసమునకుఁ గడఁగు
సతివహృదయంబు గడగడమని వడంకె.

౨-౮౬

తడఁబడుపల్కులు, కంపిం
చెడు మోవియు, నెఱ్ఱవాఱుచెక్కిళ్లును నై
పడఁతి 'ననుఁ దాఁకవల' దని [తున్.
యెడుగని రోసమునఁ దొలఁగుచుండుట దలఁ

౨-౯౨

వానిమీఁదఁ బడియె వనిత గోదావరి
జాలు రేవున దిగు సాకు పెట్టి;
కనికరమునఁ దప్పు కానరా దని వాఁడు
గట్టిగాఁగ దానిఁ గౌఁగిలించె.

౨-౯౪

ఈవు చేతులార నిచ్చిన దని ప్రాఁచి
పూలసరము తావి పోయి వాడి
యున్న నింతి దాల్చుచున్న దింకను బూజ
ముగియ నూరివేల్పు బొమ్మవోలె.

౨-౯౮

కలికి మంచితనముఁ జెలిమియు నుప్పొంగి
యెల్ల రేఱుఁగ నిన్ను నెట్లు సూచె,
నట్లె యొరులఁగూడ నది చూచుచుండును
వినుము! గుట్టు దాఁచిపెట్టుకొఱకు.

౨-౯౯

'ముద్దుఁగొడుకు, మొదట మొలచిన పలువోయిఁ
గొఱికి కొఱికి కాటుపఱిచె నిదిగొ
రేఁగుపండు గంటిరే!' యని పెండ్లాము
నగుచుఁ దెచ్చిపెట్టె మగనిచేత.

హరితపుఁడు. ౨-౧౦౦

తళుకు వెడ వెడచూపులఁ బొలుచుచుండు
కలికి నెమ్మోము మఱునాఁడు గాంచినపుడు
గలుగునంతటి సౌఖ్యంబు గాదు మదికిఁ
దలఁపఁ దొలునాఁటి వలపుల చెలిమిఁ గూడ.

భాణుసత్తి. ౩-౯

కోరినట్టికోర్కి కూడివచ్చెడు వేళ
గుణము దోష మెంచుకొనుచు నందు
ఊఱక తడవు చూచుచుండెడు మనుజుండు
కడకుఁ జెఱుచుకొనును గార్య మెల్ల.

హాణయిందుఁడు. ౩-౧౪

నాతి మొదటితూరి నదిచెంతఁ బొదరింట
నడత చెడుట చూచి కదుఁ గలంగి
పోలెఁ, బలుఁగు లెగిరిపోవుచో నవిగొ హా!
హా! యటంచు నెక్కు లార్చి యఱచు!

అధ్రరాయఁడు. ౩-౧౮

(సశేషము.)

# కాళిదా సభిజ్ఞానశాకున్తలము నేల రచించెను?

శ్రీమాన్ కో. వేం. కృష్ణమాచార్యులయ్యవారులుగారు

శ్రీమద్రామాయణము జగత్ప్రతీతమగు కావ్యము. వాల్మీకి తనశిల్పమును దోషరహితముగ లిఖించి చిరకీర్తిని గడించెను. ఆతనిశిల్పము ననేకఋషులు స్వీకరించి తమవాఙ్మయము నదోషముగ నొనర్చుకొనిరి. అష్టాదశపురాణములలో నేయొకటిరెండో తప్ప, రామచంద్రుని చరితామృతము లేనిపురాణములే లేవు. ఆతనికిఁ గల సద్గుణములే యందులకుఁ గారణము. రాము నొక్కనినే యననేల? అందలి యేవ్యక్తియు నేదోయొక యద్వితీయసద్గుణమున కుత్తేజకము. అధునాతనులలోఁ గొందఱు తలంచినట్లుగాక, కవికులమునఁ గుంభకర్ణుని కన్న నన్నను వదలి శత్రుమూకలలోఁ జేరిన విభీషణుఁడే యాకాలమునందలి

'గురోరప్యవలిప్తస్య కార్యాకార్యమజానతః,
ఉత్పథప్రతిపన్నస్య పరిత్యాగో విధీయతే.'

యను శాసనముల ననుసరించుటచే 'ధర్మాత్ము'డని వ్యవహరింపఁబడెను.

కాళిదాసు రామాయణమునందలి పాత్రచిత్రణమునే గాక యందలి కవితారసమునుఁ గూడఁ గ్రోలెను. పాఠకులు తామసింపనియెడల కాళిదా 'ఋషభూ కాళిదా'సగుట కదియే కారణ మందుము. రామాయణమునం దింత ప్రేమవిశ్వాసములు గలకవి కావ్యమాత్రముననే యేల తృప్తి నందెను? కావ్యముగూడ రఘువంశచరితము గాని కేవలరామచరితము గాదే! భాసునివలెఁ బ్రతీతిని బడసిన తరువాతనైన యాతఁ డనుసరించినగాథ ననుసరించియే తనప్రౌఢిమను జూపి కీర్తినిఁ గడింపరాదా? నలుగురుకవులును (ఇప్పుడు కనుపించు రామాయణనాటకములలోఁ బ్రసిద్ధకవికృతములు నాలుగు. అలంకారశాస్త్రమున నింకఁ గొన్ని కలవు) రామగుణములపై వైచిన నిందను దానే వైవరాదా?

వాల్మీకితరువాత వ్యాసునిశిల్పము ప్రసిద్ధిని వహించినది. వాల్మీకివలె స్మృతినిఁ బ్రమాణీకరించుట పోయి కాలానుగుణముగఁ గొన్నినూతనధర్మముల స్వయముగా నీతఁ డుపదేశించుచు వచ్చెను. ఇందలి ప్రధానవృత్తమగు పాండవులచరిత నీకవి యనుసరింపరాదా? వార లాకాలమునందలి ధార్మికోత్తములే! కర్ణుని ధృష్టత్వమును, ద్రోణునాచార్యత్వమునుఁ దెలిసి బ్రాహ్మణులవిశ్వాసఘాతుకత నివారింపవచ్చునే! ఏల గమనింపలేదు?

రఘువంశమును దిలీపునిచరిత్రముతోఁ బ్రారంభించినట్లుగనే భరతజననముఁ దగుటచే నీతనిచరిత్రమును రచించె నని కొందఱు తలంపవచ్చును. కాని, దిలీపుని గుణములకును దుష్యన్తునిగుణములకు నెంతదో యంతరము. ఋషిధేనువునుఁ గాపాడెడు దిలీపునకును, మృగయాశీలుఁ డగు దుష్యంతునకు నేమి సాదృశ్యము?

రామాయణాదుల ననుసరించుటయు, శ్లోకములపై శ్లోకముల నల్లి వర్ణనములతో నాటకముల నింపుటయు, జ్ఞేయము లగు సంశయముల నేనినిఁ బ్రతిపాదింపకుండుటయుఁ గాళిదాసు నాశయము కాదు. ఇతిహాసములవలనఁ గూడ నెద్దియేనిఁ గర్తవ్యాంశము తెలియవలయును. సాంఘికస్థితి తెలియవలయును. సర్వజనులకును సాధారణమగు ధర్మమే తెలియవలయును.

పైనియమముల ననుసరించి 'సాంఘికరూపకము'ను రచింపఁ దలపెట్టిన మహాకవి నాలంకారికనియమ మించుక బాధించి, 'నాటకే ప్రఖ్యాతమితివృత్తమ్' మనుచు బృహత్కథనో, భారతమునో చదువవలసినదిగా నాజ్ఞాపించెను. కామశాస్త్రమున 'కన్యాస్వాం చాపలాద్వినాశకం శాకున్తలాదీన్యన్యాన్యపి లౌకికాని కథయేత్' అనుట ప్రేరేపింపఁ, జెక్కుచోటుల నెమకి కడకు భారతమునందలి శకున్తలోపాఖ్యానమును స్వీకరించెను.

అందలికథానక మిది. దుష్యంతుఁ డనురాజు వేటకై యడవిలోఁ దిరిగితిరిగి కడపటఁ గణ్వునాశ్రమమునఁ జేరెను. అప్పటికే కణ్వుఁడు తనకూఁతు శకుంతల నతిథిసత్కారమునకై నియోగించి సమిధలకై వెడలెను. రాజు పర్ణశాలకడ కేఁగునప్పటికి శకుంతల యాతనిరాక నెఱిఁగి యుచితసత్కారముల నొనర్చెను. రా జామె రూపాదులఁబట్టి క్షత్రియయోగ్యగాఁ దలంచి మోహించి యామెవృత్తాంతము నడిగెను. శకుంతల తాను మేనకావిశ్వామిత్రులపుత్త్రి ననియుఁ, గణ్వుఁడు తన్నుఁ బెంచె ననియుఁ జెప్ప, రాజు తనకామమునుఁ దెలిపెను. శకుంతల 'తండ్రిగా రొకనిముసమున రాఁగల' రనియు, వారు 'త న్నొసంగెద' రనియుఁ జెప్ప, రాజు గాంధర్వవివాహవిధిని వివరించి ప్రేరేపించెను. శకుంతల తనపుత్త్రునకు రాజ్య మొసఁగిన వివాహమున కొడఁబడెద నన రా జంగీకరించెను. వివాహ మైనంతనే రాజు నగరమున కేఁగెను. కణ్వుఁ డడవినుండి తిరిగివచ్చి శకుంతలావృత్తాంతము నెఱిఁగి యామెనుఁ బ్రశంసించి, వంశకర్త యగు పుత్త్రునిఁ బడయు మనియు, ధర్మైకచిత్త వగు మనియు వర మొసంగెను. శకుంతలకు మూఁడుసంవత్సరముల కొక పుత్త్రుఁడు పొడమెను. సర్వసత్త్వముల దమియించుటచే ఋషు లాతనికి సర్వదమనుఁ డని పేరిడిరి. తరువాత కొన్నియేండ్లకు ఋషి శకుంతల నత్తవారింటికి కనిపెను. రాజు శకుంతల నెఱిఁగియు నెఱుఁగనట్లు 'నీ వెవ్వరి దాన' వనియుఁ, 'గొమరుఁ డెవని కొమారుఁ' డనియు నిరాకరించెను. అంత శకుంతల ప్రమాణముసేయ రా జాకాశవాక్యము ననుసరించి స్వీకరించెను.

పై కథనుఁ గవిత్రయము ననుసరించి విమర్శింతము. రాజులకు వేట ప్రజాపీడను నివారించుటకైనదే, వ్యసనము కాదు. దుష్యంతుని వేటకూడ నట్టిదే. ఆతఁడు పరదారపరాయణుఁడు కాఁడు. తాను శకుంతలను క్షత్రియపరిగ్రహోచితగా నిర్ణయించుకొనియే కామించెను. కాని కాముకత యెంతవానినైనఁ గార్యవ్యగ్రునిగను, గార్యపరునిగ నొనర్చును. ప్రకృతమున దుష్యంతుఁడుగూడ కాముకుఁడు; కార్యవ్యగ్రతనుఁ బాల్పడెను. శకుంతల తలిదండ్రుల విడిచినది మొదలు పెంచినవాఁడు కణ్వుఁడు. ఆతఁడు పోయినది సమిధలకు, వచ్చుట కాలస్య మెంతక్షణము: కాని రాజాశయ మది కాదు. కణ్వుఁ డిష్టపడునో, లేదో? ఇఁక నాతఁడు గామశాస్త్రములోని 'దూషయిత్వా వైవాహం తస్యై స్వజనే ప్రకాశయేత్' అనుమార్గమునే యవలంబించెను. అవలంబించినమార్గమున నాపద లేమేనిఁ జైపడరాదా? వెంటనే యాతనికనులయెదుట ఋషితపఃప్రాభవము—శాపానుగ్రహశక్తి — మూర్తీభవించి, దణ్డకారణ్యమునుఁ బ్రత్యక్ష మొనర్చెను. ఇఁక నాతఁడు పలాయనమే శరణమని నిర్గమించెను.

ఇచట నొకవిషయమును విమర్శింపవలసియున్నది. దుష్యంతుఁడు బోధించినట్లు

'గీ. తనకు మఱి తాన చుట్టంబు దాన తనకు
గతియుఁ దన్నిచ్చువాఁడు దాన కర్త యనఁగ
వనజనేత్ర! గాంధర్వవివాహ మతిర
హస్యమును సమంత్రకమును నగుచు నొప్పు.'

ఆది. ఆ_4, ప_57.

అనుటచే గాంధర్వవిధియా? దండికవి దశకుమారచరితమున రాజవాహనుని వివాహమును గాంధర్వమునఁగా నిరూపించి, సంఘటనమునకై యొక యైంద్రజాలికునిఁ గల్పించి, యగ్నిహోత్రమునఁ దెప్పించి వివాహ మొనర్చెను. గాంధర్వమునకుఁగూడ నగ్నిహోత్రము వలయునా? దివాస్వాపముగూడ దివ్యముగు గాంధర్వ మగునా? పైవిషయమున వాత్స్యాయనుఁడు 'ప్రతిపన్నా మభిప్రేతావకాశవర్తినీం నాయకః శ్రోత్రియాగారా దగ్ని మానాయ్య కుశా నాస్తీర్య యథాస్మృతి హుత్వా చ త్రిః పరిక్రమేత్; తతో మాతరి పితరి చ ప్రకాశయేత్, అగ్నిసాక్షికా హి వివాహా న నివర్తన్త ఇత్యాచార్యసమయః' యని వాకొనియున్నాఁడు. కావున దుష్యంతభోగలు కాముకతాకృతము లనియుఁ, గల్యాణము గాంధర్వవిధివిరహిత మనియు గ్రహింపవచ్చును.

ప్రజలఁ బాలించెడురాజు దుష్టశిక్షణము, శిష్టరక్షణమునుఁ దప్పక యాచరింపవలయును. తనకృత్యమునకై యనృతమును పలుకుట యటుండఁ, దన్ను నమ్మిన యువతి— తాను ప్రతిజ్ఞాపూర్వకముగ గ్రహించిన

పత్ని—తనకొమరుని దోకొని, తనయొలగమునకుఁ జేర సంతోషపూర్వకముగ స్వీకరించుట లేకపోఁగా, 'నెఱెఁగియు నెఱుఁగన' ట్లేల యభినయించెను? ఈతని రాజ్యతంత్ర మంతయు ధర్మమైన నధర్మమైనఁ దదాశయము ననుసరింపవలసినదేనా? యని మన కాశంక గలుగవచ్చును; గాని మన మాకాలము నింత పరీక్షింతము.

దశరథుని యొలగమునఁ బ్రవేశింతము. దశరథుఁడు తనకొమరునకుఁ బట్టాభిషేక మొనర్పవలయునని తలఁపోయుచున్నాఁడు. రాముఁడు సుగుణనిధి, ప్రజోపకారపరాయణుఁడు. తండ్రి రాజ్య మేలుచున్నను దాను ప్రజలతాపముల నివారించు నుద్దేశముతో నెన్నియో మాఱులు ఎందఱితోడనో యుద్ధములఁ జేసి విజయమును గాంచెను. ప్రజలయనురాగమునకుఁ బాత్రుఁడు తన పెద్దకుమారుఁడు—అట్టివానికిఁ బట్టాభిషేక మొనర్పవలయు ననిన ననేకమంది ప్రజ లేల? ఆ యొలగ మేల? అతికరుణముగ 'భవన్తో హి ఽనుమన్యన్తాం' అని వేఁడ నేల?

ఆకాలమున రాజు నిరంకుశుఁడు గాఁడు. తాను పరాక్రమవంతుఁ డైనంతనే రాజు కాఁజాలఁడు. ప్రజల యనుమతి లేనిదే ప్రతిపనియందు నాతని కేమియు స్వాతంత్ర్యము లేదు. తాను ప్రజల కొకభృత్యుఁడు. తనవేతనము పండినపంటలోని యాఱవవంతు. తాను భృత్యుఁ డగు నపుడు తనకు స్వాతంత్ర్య మెట్లు? తన కెవ్వరు పోషకులో వారియాశయము ననుసరింపవలయును. ఆరీతిఁ జరింపవలయును. క్రమముగా నీవిధి మాఱెను, దుష్యన్తునికాలమునకు మాఱుపు లేక, ప్రజాస్వామ్యప్రభుత్వ ముండెడిది. ప్రజలు తనయడవిలోని వివాహము సమ్మతింపవలయును. కావున నాతఁ డట్లు చరించెను.

ఇఁక శకున్తల నాలోకింతము. శకున్తలతల్లి మేనక; తండ్రి విశ్వామిత్రుఁడు. ఈతఁడు తనకులగురుఁడగు వసిష్ఠుని హోమధేనువు హరించి, యతనితోఁ బోరాడి గెలువఁజాలక తపమునకుఁ బూనెను. తపముచే నస్త్రాదికమునఁ బడసెను; గాని వసిష్ఠుని బ్రాహ్మ్యతేజమును జయింపక లేకపోవుటచే బ్రహ్మర్షి యగుటకై తపమునకు సమకట్టెను. ఈతపమును భంగించుటకై యింద్రునానతిచే వచ్చిన దీదేవవేశ్య. కావున మనము శకున్తలప్రకృతినిఁ బరిశీలించుటలోఁ గామమునుఁ, గ్రోధమును, లోభమునుఁ గ్రమముగ నందిన విశ్వామిత్రుని శీలమునుఁ గాని, లేక దేవాధిపుని బహుపతులపై నాశచేఁ దపోనాశమునకుఁ బూనిన మేనక శీలమును గాని, యీమెపై నెపవలయును. ఐతిహాసికులు 'మాతర మంగనా' యనుమార్గమునే యనుసరించిరి. ఇఁక, నీమెనుఁ బ్రథమమునఁ బోషించినవి పక్షులు: పక్షులకు దారేషణ సహజము: కాన నీమెకుఁ బతిపైఁ బ్రేమ విశేషముగ నుండును. పోషకుఁడు కణ్వుఁడు శాశ్వతబ్రహ్మచారి: కాన నీమె కింద్రియజయముగూడ నలవడియుండవచ్చును. కాని తండ్రి కాముకత తల్లి ఫలాపేక్ష యొకప్పుడు భంజింపవచ్చును. ఈమెస్థితి యింతయే.

కణ్వుఁడు బ్రహ్మచర్యవ్రతుఁ డగు బ్రహ్మర్షియే యైననుఁ బుత్రికవివాహము నించుకయు నెంచక భర్తయానురూప్యమునకు మాత్రమే సంతసించెను. తలిదండ్రు లనుఁగు మిద్దరే. కాని కాళిదాసీతని ప్రకృతిని జాలవఱకు మార్చెను. పాఠకుల కావల సూచింపఁబడును. సర్వదమనునకుఁ దండ్రిమృగయాశీలమే యట్టి ప్రకృతి నొసఁగెను.

కాళిదాసు కవి. ఐతిహాసికునివలె నున్న దున్నట్లు వివరింప నక్కఱలేదు. పాత్రౌచిత్యమునుఁ, బ్రతిపాద్యాంశౌచిత్యమును గమనించి, తనకాలమునందలి స్థితిగతులనుఁ, దనయాశయములను వివరించి, పాఠకుల నానందమయులుగ నొనర్పవలయును. అతనిసాంఘికతత్త్వబోధనకై కథానకము కొంతవఱ కనుకూలముగ నుండుటచే దాని ననుసరించి యననుకూలము లగునెడల మార్చుచు నీ 'యభిజ్ఞానశాకున్తలము'ను రచించెను. మాఱుపులు భారతీపాఠకులు ఎఱింగినవే కావునఁ దద్భలమును నప్పటిసాంఘికస్థితినిమాత్ర మిందు వివరింతును.

రాజకీయరంగమునఁ బ్రవేశింతము. ప్రజాస్వామ్యప్రభుత్వ మంతరించినది. రాజు షష్ఠాంశవృత్తియే యైనను స్వవిషయమునఁ గాని, బరవిషయమునఁ గాని ప్రజానుమతి యనవసరము; కాని తాను నిరంకుశుఁడు

గాదు. తనవృత్తి ననుసరించి 'తల్లి లేనివానికిఁ దల్లి గనుఁ, దనయులు లేనివానికిఁ దనయుఁడుగను, మిత్రుఁడు లేనివానికి మిత్రుఁడుగను' సర్వవిధముల నుపకరించుచుండును. అధికారులమాటలఁ గాని, యమాత్యనివ్రాఁతలఁ గాని, యామ్నాయములవలెఁ బ్రమాణీకరింపక, వస్తుయాథార్థ్యమును స్వయముగాఁ గనుఁగొని ప్రజలకు న్యాయమును గలిగించును. తనకుటుంబవిషయముల మానియేనిఁ బ్రజాకార్యములఁ జూచును. పరాక్రమమున నరుల గెలుచుచుఁ, బ్రజాకార్యముల స్వయముగాఁ జూచుచుఁ బ్రజాపీడలఁ దొలఁగించుచు, వ్యసనాభిభూతుఁడగు నపుడు గూడ వ్యవహారముల లేఖమూలముగ నైనఁ జూచుచుఁ, బ్రజలఁ బాలించుచుండును. చిత్రవినోదమునకై చిత్తరువుల వ్రాయుటలో వ్రాసినవానిని జూచి వ్రాయఁబడినవారలే యని భ్రాంతిగొల్పుటలో వారల (ఆకాలపుప్రజల) కపార మగు చాతురి కలదు.

ఆకాలమునందలి రక్షకభటులు (పోలీసువారు) ముందుగాఁ గొట్టియే మొప్పుటకుఁ బ్రారంభింతురు. న్యాయముపై వారలకు దృష్టి తక్కువ. వస్తువు కాన్పించినంతనే దానియాగమనకారణము వానంతరము విచారింపక, కుటిలవాక్యములఁ బ్రయోగించుచు నధికారిముఖమున రాజునకు విన్నవింతురు. అధికారిగాని, రక్షకభటులుగాని లంచములఁ గొనుటకును, వానిని గల్లుదుకాణముల పాలుసేయుటకును వెనుదీయరు. మంత్రిమాత్రము లంచములఁ దీసికొనక రాజు లేనపుడునుఁ, గార్యకర్తాశక్తి నున్నపుడును రాజకార్యములఁ జూచుచు, రాజు బొక్కసమును నింపఁ బ్రయత్నించుచుండును. ఆ కాలమునఁ జోరునకు శూలారోపణమే దండనము. వాణిజ్య మాకాలమునఁ బ్రబలియుండెను. ద్వీపాంతరముల కేగి యందలిపండినవస్తువులఁ గొనుటయు, నిచటి వస్తువుల విక్రయించుటయు, నోడలపైఁ బయన మొనర్చుటయు నాకాలముననే గలదు. సముద్రమున నోడలపైఁ బయనము సేయునపు డెందరో వర్తకులు మృత్యుదేవత వాతఁ బడుచుండిరి. ఏగ్రామమునఁ జూచినను, ఏయింటఁ జూచినను బంగారునాణెములే. ఆకాలమున నంతటిప్రాభవమున మనినది మనదేశమే.

ఇఁక పురాణికమునుఁ, బౌరాణికశీలమును గనుగొందము. పౌరులలోఁ గొంతవఱ కనృతవ్యవహారములు, కార్యాసక్తి యుండెయుండవచ్చును. గ్రామీణులకెల మంతగా దెలిసికొను నవకాశ మిందుఁ గాన్పింపదు. మునిపల్లెలఁ బల్లెటూళ్ళఁగా నూహింపవచ్చును గాని యందలివర్ణనము ప్రాచీనగ్రంథములకన్న విభిన్నముగ లేదు. కాని సామాన్యముగా నేకజాతీయులగు కొందఱు ఒక సంఘముగఁ జేరి ధనధాన్యసమృద్ధమగు నదీప్రాంతములఁ గుటీరములఁ గల్పించుకొనియుండు రనియు, వారలలోఁ గొందఱు బ్రహ్మచారులు, కొందఱు గృహస్థులు, కొందఱు వానప్రస్థులు ననియు, స్త్రీలుగూడఁ బైవిధముగనే యుండురనియు, వారల కపటము, పరస్పరానురక్తి, స్నేహము, విశ్వాసము సహజగుణము లనియు, వీరల కందఱకును హితకర్తయగు నొకమహనీయుఁడు కులపతి (సంఘాధికారి) యనుపేర నుండు ననియు, స్వపరవిభాగవిరహితుఁడగు నాతనియాజ్ఞ నాసంఘ మనువర్తించుచుండుననియు, నాతఁడు తనతోడివారలకు ధర్మము నుపదేశించుచు ధర్మమార్గమున నడిపించుచు, దుర్నీతుల దండించుచుండు ననియు, (మునిపల్లెలఁ బల్లెటూళ్ళఁగా నెంచిన) నూహింపవచ్చును. పౌరులలో ధనవంతు లాకాలమున ననేకవివాహములఁ జేసికొందురు. కొందఱకు 'సకృత్ప్రసూయలు' గూడ నుందురు. కాని, వారల వివాహము లనపత్యతాదోషకల్పితములు గావచ్చును.

పురుషు లిట్లు పెక్కువివాహము లాడుచున్నను, వారలవివాహములుగాని, వారలకృత్యములుగాని, నాకేమి యగవాఁడవని స్వేచ్ఛగాఁ జేసికొనుట గాక, సతీదోషమునుఁ, బురుషదోషమును సమానమే యని తలంచుచుఁ, దనయనురాగమును దెలుప భయపడుచు, ననురాగగరిమ ననుసరించి తనపత్ని సమ్మతించినంతనే వివాహ మగుచుందురు. ఆకాలమున స్త్రీలు కేవల మజ్ఞానమున నుండక పురాణముల, నితిహాసములఁ బఠించి, యందలి యాంతరంగికభావముల విమర్శించి, గ్రహించి, ప్రేమ, మైత్రి గలిగి, తమ తోడివారల యాపదలకు సాయపడుచుఁ, దమయనుష్ఠానమును బవిత్ర మొనర్చుకొను

యుండిరి. ఒకపటి యాకాలమున నస్మృతమువంటి స్వాభావికరమణీయ భావకవిత చెప్పఁగల చేడియ లుండిరనిన నాశ్చర్యము గాదు. వారు భూతదయ గలిగి స్వాభావిక వస్తువుల నందము నలంకరించుకొనుచు, శరీరపరిశ్రమ మొనర్చుచు, నతిథిసత్కారముల రచించుచుండురు. వారిలోఁ గొందఱు బ్రహ్మచారిణులు, గొందఱు కుటుంబినులు. అత్తమామలు మొదలగు పెద్దల నారాధించుచు, సవతులతోఁ బోరాడక సఖ్యమున వర్తించుచు, పరిజనులఁ గనికరించుచు, భాగ్యమునకు గర్వింపక భర్త యనురాగమునకుఁ బాత్రములగు పతివ్రతలే గృహిణులుగా వ్యవహరింపఁబడుచుండిరి.

ఆకాలమున రజస్వలానంతర వివాహములవిషయమునఁ బ్రబలములగు వాదప్రతివాదములు బయలుదేఱియుండవచ్చును. అట్టి వివాహములు కనువేడుకలనఁ గాక తల్లిదండ్రులయనుమతిపైననే జరుగవలయును. పశుప్రేమకును ధర్మబద్ధమగు గార్హస్థ్యప్రేమకును నెంతయో భేదము కలదు. పశుప్రేమ యస్థిరము: గార్హస్థ్యప్రేమ సనాతనము. వాల్మీకి 'దారాః పితృకృతా ఇతి' యను వాక్యమును, భవభూతికవీంద్రుని

'అద్వైతం సుఖదుఃఖయోరనుగతం సర్వాస్వవస్థాసు య ద్విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మిన్నహార్యో రసః, కాలేనావరణాత్యయాత్ పరిణతే యత్ స్నేహసారే స్థితం భద్రం తస్య సుమానుషస్య...'

యనుతత్త్వము నెఱిఁగినవారై వివాహకాలమునఁ గణ్వుని సోమతీర్థమునఁ గనిపి, యాశ్రమమునఁ జేరినంతనే శకున్తల నావలి కంపెను. భర్త పరిత్యజించినను గణ్వాశ్రమమునఁ జేర్పక పాఱవైచిన మేనకచే మారీచాశ్రమమునఁ జేర్చెను. కాళిదాసు నాటకమున 'వివాహశ్చ వినా నశ్చ సమనోహారేన శోభతే' యనుట యటుండగ, విశృంఖలత్వ మింత యుండవలసిన దావశ్యక మనియు, యువతులకుఁ గనువేడుకలు సాజము గావున నామె యావలివిషయమును నిర్ణయింప లేకపోవుటచే బాల్యవివాహమే యుచితమనియుఁ, దీని కుచితవరసంఘటనమునే కోరవలయు ననియు, వరుఁ డుచితుఁడు గాకున్నఁ దండ్రికి సంతసమే లేదనియుఁ, దండ్రిప్రేమ పవిత్రమై కాముకుని ప్రేమవలె కార్యపరతంత్రము గాక యాత్మజుల హితము నే కోరుననియు నందును. జాతిమతధర్మముల నాసక్తిగల యార్యుల కీయభిప్రాయము సహజమే. యువతి కనువేడుకల నీచకులల మాత్ర మేల వరింపరాదు? ఈవిషయమున నా 'యపూర్వవివాహ' మను నాటకములోనిపద్యము నీక్రింద నిచ్చుచున్నాఁడను:—

సీ. "తైఁ బూని సను నొక కపటమ్ముచే జేష
యాని క్షత్రియుఁ గొంట నపహరించి,
యంతిపురిని నిల్చి యలనాఁడు రుక్మిణీ
దేవి విప్రునిఁ బంపఁ జేరి చూచి,
కశ్యపముని పెంపఁగాఁ జెడ్డ దైన శ
కుంతల పెండిలి వింత కెంచి,
పుణ్డరీకునిపయి బుద్ధి మహాశ్వేత
యభిసరింపఁగ నేఁగునపుడు గాంచి,
జాతిమతధర్మముల నేల స్వాతంత్ర్యమాని
యనల గతుఁగాభోరమ్ము నధిపున కిడి
యష్టవర్షాది యా యౌవనాప్తి బాల
పాణిపీడనము..."

పాఠకా! ఈవ్యాసము పూర్తియగుచున్నది. కాని కాళిదాసునికాల మంటిమే, అదేకాలము? ప్రాచీనుల చరిత్రమంతయుఁ గవిచరిత్రము గాక కవితాచరిత్రమనియు, నితరకవు లాతనియాశయముల నెట్లు గ్రహించిరో దానిని మాత్రమే తెలియఁజేయు ననియుఁ జెప్పుచున్నాఁడను. భోజాస్థానమున నట్టి విమర్శము విశేషముగ జరుగ రాదా? అప్పు డొకకాళిదా సవతరింపనేల? ఎందఱు కాళిదాసులో యెట్లు తెలియును? కాని మన కాళిదాసు కుమారిలభట్టుచే

'కవయః కాళిదాసాద్యాః కవయో వయమ ప్యమీ,
పర్వతే పరమాణౌ చ పదార్థత్వం వ్యవస్థితమ్'.

అని నుతింపఁబడెనఁట! కథలలోని కాళిదాసే మన కాళిదాసైనను ఈతఁడు వ్యభిచారి కాఁడు. రాజముఖమున మోక్షమునుఁ గోరికొనెనుఁ జూఁడీ!

అయి! కాళిదాసకవే!

పునర్భవ జిహీర్షయా కృతి మిమాం త్వయాలిఖ్యతా
సకృద్భవ శతాన్తరే వినిహితం పదం నిశ్చలం,
నిపీయ వచనామృతం విగలితాఖిలాభీప్సితా
మన స్స్వరుచిరం వపు స్తవ విభిన్న మీహామహే.

మాతః భరతవసుధే!

యస్యా గర్భభవా జగ త్త్రయనుతా
శ్రీకాళిదాసాదయో
నేతార స్త్రిదశేన్ద్రసిద్ధిరభుజా
ష్షష్ట్యాంశిస్మృత్యా భటాః,
క్రీతా ద్వీపచయే సదార్థనికరా
యత్సార్థవాహై ర్భృశం
జాతా స్సంప్రతి హా! వయం భవసుతా
స్మృత్యా శునస్సోదరాః.

---

## నిష్కాసనము

వేలూరి శివరామశాస్త్రి గారు

ప్రాగ్గృహసీమ లన్నియును మజ్జనశాలలు పాకశాలలున్
రోగపు శాలలున్ మఱియు రొక్కపు శాలలు నింకఁ దక్కుచో
భోగపుశాలలే యిచటఁ బుట్టదు బెత్తెఁడునేల నీకు నిం
కేగతి వచ్చు? వచ్చినటు లేఁగుము! ముందర నేఁగు మీశ్వరా!

మీయింటియందు నెమ్మియిఁ జోటు లేకుండుఁగాక మీయూర నెక్కడనో యుందు
నందువా? యెంతటి మందుండ వింత మిక్కుటమైన వెట్టి కక్కుఱితి యేల?
గ్రామమధ్యం బది కలుగదా? యందువా? కరణమ్ముగా రది కలుపుకొనిరి
గోష్ఠంబులం దుండఁగోరుదువా? క్రొత్త లేఁగదూడకుఁగూడ లేదు చోటు
బంజ రెందేని చిక్కదా ప్రభువు వినినఁ-జేతి కరదండములు ముందు చిక్కఁగలవు
ఇంక నెందేని జూడుమా! యెంత వెట్టి-వేఁగు మేఁగుమ నిలువక యీశ్వరుండ!

అక్కడ మూఁడు తావు లరుదారఁగ నూరక యున్న వవ్వియా?
యొక్కటి క్రీస్తువారలకు నొక్కటి యల్ల తురుష్క జాతికిన్
జిక్కె శ్మశానభూములుగ శేషము మా కది రచ్చపట్టుగాఁ
దక్కెను నాలుగేండ్ల ఫలితం బది నీ కెవఁ డిచ్చుఁ జెప్పుమా!

పోనిమ్మల్లదిగో విభంజిత శిలాపుంజంబు తత్సీమలో
నే నుండం దగదా? యదా? మును పాగిన్ నీ వున్న జీర్ణాలయం
బే నేఁటన్ వితయంచు దాని భువిఁ ద్రోయింపించియుం జిత్రశా
లా నిర్మాణము చేయుచుంటి మది యేలా నీకుఁ బో పొమ్మిఁకన్.

ఎక్కడ నేనియుఁ దా వది-చిక్కక పోనిమ్ము నీకుఁ జిత్తము లేదా?
అక్కడ నేను వసించెద-నక్కరణికి సమ్మతింపవా? మనుజుండా!

పరిహాసం బది యేల? యందుల జనాఘా లెస్స యవ్వారి నం
దఱినుం బైటికిఁ దీయుచో జగతియుం దాఁ జాలునే? యందులన్
గిరులన్ దాఁటిన వస్తుపుంజము లెటుల్ నిండారెనో చూడవా?
యిఱుకాటంబయి గాలి దూఱుటకు నే నిం దేది నం దీశ్వరా?

ననుఁ గట్టుకొన్నట్టి నాటి నల్ చెఱఁగులు చెఱఁగు లాడించుచుఁ దిరుగవలదొ?
కన్న కౌమారుండు కడు గ్రంథసాంగుఁ డుండండు కొండొకటఁ గూర్చుండవలదొ?
అనుపదంబునయందు నరుదెంచు నెచ్చెలుల్ నెమ్మిమై నట శయనింప వలదొ?
అది నీ కొసంగుచో నల్ల రహస్యముల్ నమ్మి యెచ్చటను నున్నంగ వీలొ?
ఎంత కోక కోరితి వెంత యాశ?-తనకు మాలిన ధర్మ మింతకును దగునె?
నన్ను నావారి నవల కో యన్న నెట్టి-కాఁపురం బుండఁదలఁచితి కాదె యిచట.

కాని మ్మెటులో యొక్కట్టులు-నే నుండం గలను నెంత యిఱుకట మది తా
నైనను దీని పరీక్షకు-నైనను ఊ యనుమి యుండు సందున్ మర్త్యా!

నీకు నాశమె క న్నె మొ? కాకయున్న-నీఁగ కాలికి నైనను నేది చోటు?
విషయముల నిండి మది యని విడిగఁ గలదె?-పడిగ వేంచేయు మెంత యీశ్వరుఁడ వైన.

---

# విద్యాప్రచారము - గ్రంథాలయోద్యమము

కోరాడ రామకృష్ణయ్యగారు, యమ్. ఏ., యల్. టి.

గ్రంథాలయోద్యమ మనునది యీ కాలపు టనేకవిధములగు సాంఘిక రాజకీయోద్యమముల వలెనే యాధునికయుగచిహ్నముగా గనబడు చున్నది. కార్మికోద్యమము, సహకారోద్యమము, సంతాననిరోధోద్యమము, సంఘసంస్కరణోద్యమము, అసహాయోద్యమము, అస్పృశ్యతానివారణోద్యమము, అతిబాల్యవివాహ నిషేధోద్యమము, అనాథశరణాలయస్థాపనోద్యమము, జాతీయోద్యమము, స్వాతంత్ర్యోద్యమము మొదలగున వీకాలమున రాజకీయ సాంఘికవిషయముల నెట్లు ప్రాధాన్యమును వహించుచున్నవో, అట్లే విద్యావిషయమున గ్రంథాలయోద్యమము కూడ ప్రాధాన్యము వహించుచున్నది. విదేశప్రభుత్వము, ప్రజాస్వామ్య భావము ప్రబలుచున్న యీకాలమున మనదేశమున విద్య కూడ రాజకీయసంబంధము కలదే యగుటయు, ప్రతివ్యక్తియు పరిపాలనావిధానమున బాల్గొని యద్దాని నడుపవలసియుంటచే సార్వజనీనం బగు రాజకీయవిద్య యావశ్యకం బగుటయు తటస్థించినది. ఐహికప్రభుత్వవిషయమున బ్రజాస్వామ్యభావ మాదరింపబడు చున్నట్లే యాధ్యాత్మికతత్త్వవిషయమున బాహ్యప్రకృతి పరిశీలనము, తద్విజయము పరమావధిగా గ్రహింపబడుచున్నవి. మొత్తముమీద జనులవిజయదృష్టి బాహ్యవృత్తులపై బ్రసరించినట్లు ఆంతరంగికవృత్తులపై బ్రసరించుచున్నట్లగపడదు. చతుర్విధపురుషార్థములలో నర్థకామములు బలవంతములై తమయధికారము నవ్యాహతముగ నెఱపుచు నొకదాని నొకటి మీరదములో తాము స్పర్థించుచున్నట్లున్నవి. ఇట్టిది ప్రజాస్వామికత్వభావముచే నడుపబడుచుండు నార్థికయుగ మగుటచే ప్రతియుద్యమము నర్థసహాయమున సంఘముచేతనే నడుపబడవలసియున్నది. కావుననే "సంఘే శక్తిః కలౌ యుగే" యను మాట సార్థకత్వమును బొందుచున్నది. ఇట్టికాలస్థితి కనుగుణముగ విద్యాదానము, జనసామాన్యమున విద్యావ్యాపనము సంఘముచేతనే నడుపబడవలసియుండుటచే దత్కార్యసాధనకు గ్రంథాలయోద్యమ మత్యంతావశ్యకమై నెగడుచున్నది.

విద్యావిషయమున ప్రాచీనకాలపు స్థితిగతులకు నాధునికస్థితిగతులకు విశేషభేద మగపడుచుండుటచే గాలప్రవాహమున బడిపోవుచు చేతికి దొరకిన సాధనముల బ్రయోగించుకొని కార్యసాధనకై యత్నింపవలసినదే కాని వానిని పోల్చి చూచికొనుటవలన లాభము విశేష మగపడదు. ప్రాచీనస్థితిగతులు మారినవి. అవి యిప్పుడు రావు. మనము వెనుకకు పోలేము. కావున వానినిగూర్చి తలపోయ నేల యని విసుగుకొనువారు కూడ కలరు. కాని ప్రాచీనహైందవనాగరకతయు, విజ్ఞానమును ననన్యసామాన్యము లనిమాత్రము సర్వజనాంగీకారమును బడసియున్నవి. అవి ప్రాచీనమహర్షుల యతీంద్రియజ్ఞానశక్తులచే పెంపొందింపబడిన వని తలంచువారు పలువురు కలరు. అతీంద్రియజ్ఞానశక్తులయం దపనమ్మకము గలవారు ప్రత్యక్షమునే పరమప్రమాణముగా గ్రహించి, యాధునిక ప్రకృతిశాస్త్రవిజ్ఞానము, నాగరకత వీనిముందర ప్రాచీనవిజ్ఞాననాగరకతలకు స్థానము లేదనియు, నవి కల్పితగాథలతో గూడినవి గాని సత్యసమ్మతములు గావనియు తలంచువారును గొందఱు కలరు. కాని యిటీవలి కాలమున జె. సి. బోసు, ఆలివర్ లాడ్జి మొదలగు వారు ప్రకృతిశాస్త్రమునందును, మానసికశాస్త్రమునందును సల్పుచుండెడి పరిశోధనలఫలితములు ప్రాచీనమహర్షులు సాధనాంతరములచే సాధించిన విజ్ఞానాంశములనే పునరుద్ధరించుచున్నట్లున్నవి.

చేతనంబులవోలె నచేతనముల
జీవకళ జూపి బ్రహ్మాండసృష్టి యెల్ల
పరమపురుషుని ప్రతిబింబభావ మగుట
చాటుచుండెడి జగతీంద్ర చంద్రబోసు.

ఇట్లే తను "ఈశావాస్య మిదం సర్వం" అను ప్రాచీనమహర్షుల యుపనిషద్వాక్యార్థమునే ప్రత్యక్ష ప్రమాణసిద్ధముగఁ జేయుచున్నట్లున్నాడు. అంతరింద్రియ మగు మనస్సుయొక్క అద్భుతశక్తులనుగూర్చి వర్ణించుచు నిది యపారం బగు నొక మహాసముద్రమువంటి దనియు, సాధనచే తరిచినకొలది నద్భుతంబులు, ననంతంబులు నగు శక్తులు దీనినుండి బయలుదేఱఁగలవనియు నాధునిక మానసికశాస్త్రపరిశోధకులలో నగ్రగణ్యుం డగు 'ఆలివర్ లాడ్జి' (Sir Oliver Lodge) అనునాతఁడు తెలిపియున్నాడు. ఇక బ్రహ్మాండమునం దెట్టి నిర్మాణచాతుర్యము వ్యక్తమగుచున్నదో, అట్టి నిర్మాణకౌశలమే పరమాణువునందు గూడ వ్యక్తమగుచున్న దనియు, నీ పరమాణువులకంటెగూడ సూక్ష్మతరంబులుగా నిర్ణేయింపఁబడిన "ఎలెక్ట్రాన్స్" అనబడు పదార్థాంశములు (matter particles) శక్తిస్వరూపములే యనియు నాధునికప్రకృతిశాస్త్రపరిశోధనలు తెలుపుచుండుటచే నిది శక్తిస్వరూపు డగు భగవంతు డిచ్ఛామాత్రంబగు సంకల్పశక్తిచే జగత్స్వరూపమును దాల్చెనని తెల్పెడు శ్రుతివాక్యములను వ్యాఖ్యానము చేయుచున్నదివలె నున్నది.

"స ఇచ్ఛత బహుస్యాం ప్రజాయేయేతి-స తపోతప్యత-స తప స్తప్త్వా ఇదం సర్వ మసృజత-త త్సృష్ట్వా తదేవానుప్రావిశత్."

"అనాదినిధనం బ్రహ్మశబ్దతత్త్వం ప్రదక్షతే,
వివర్తతే ఽర్థభావేన ప్రక్రియా జగతో యతః."

ఈ మొదలగు ననేక వాక్యములు స్థూలరూపము నగు జగత్సృష్టియంతయు నేదో యొకవిధముగ శక్తిస్వరూపమే (a form of energy), శక్తిపరిణామమే యని సూచించుచున్నవి. ఆ విషయమునే యాధునిక ప్రకృతిశాస్త్ర పరిశోధన లెంతచక్కగా మనకు బోధపఱుచుచున్నవో గమనింపుడు. అర్థము తెలియక చిలుకపలుకులవలె, నధ్యయనము చేయుచున్నా మని చదివి ధారణచేయుట మాత్రము తోడనే సంతుష్టి జెందు వైదికు లీశ్రుతివాక్యముల కర్థము తెలిసికొని యాధునికప్రకృతిశాస్త్రజ్ఞానముతో సమన్వయము చేసికొనినచో నిప్పటికంటె విశేషంబు, నమూల్యంబు నగు జ్ఞానధనమును సంపాదింపగలవా రగుదు రనుటకు సందేహము లేదు.

కావున ప్రాచీనార్యవిజ్ఞానము నాధునికప్రకృతిశాస్త్రజ్ఞానముతో మేళవించినచో నద్దాని ప్రభావము మనకు సుబోధము కాక మానదు.

అయితే కాలభేదము, యుగభేదమునుబట్టి యవలంబింపవలసిన మార్గములలో భేద ముండక తీరదు. అయినను మన మిప్పుడు మనపూర్వుల గొప్పతనమును మరల సంపాదించి నిలువబెట్టుకొనవలయు ననియే తలంచుచున్నాము గావున, నాకాలమున నా యార్యసంఘమును నడిపి యంతగొప్పదానినిగా జేసిన మూలధర్మము లేవియో (basic principles) యించుక విచారించుట యప్రసక్తము కానేరదు. మన మిప్పు డెంత నాగరకుల మనుకొనుచున్నను, అర్థముపై నాధారపడియున్న యీ నాగరకత నెంతగా బొగడుకొనుచున్నను, ప్రాచీనకాలమునందలి జీవితస్థితికి నిప్పటి జీవితస్థితికి నెట్టి వ్యత్యాసము కలదో క్రీస్తుశకారంభమున కించుక పూర్వము యవనదేశమునుండి యీ దేశమునకు రాయబారిగా వచ్చిన మెగస్థనీస్ (Magesthenese) అను నాతఁ డా కాలపు హిందూదేశస్థులను గూర్చి చెప్పిన మాటలనుబట్టి కొంత తెలిసికొనవచ్చును. అతని మాటల నిచ్చట స్మరించుకొందముగాక:*—

---

* Indians all live frugally, especially when in camp. They observe good order. Theft is very rare occurrence, and this among people who have no written laws, but are ignorant of writing and must therefore in all the business of life trust to memory. They live nevertheless happily enough being simple in their manners and frugal.

"హిందువులు మిగుల పొదుపుగా జీవింతురు. వారికి నియమమునం దాదరము కలదు. దొంగతనములు సామాన్యముగా లేనే లేవు. ముఖ్యముగా లిఖితపూర్వకములగు శాసనము లేమియు లేక వ్రాతయన్న దేమో యెఱుంగక, తమ వ్యవహారము లన్నిటిలోగూడ కేవల జ్ఞాపకశక్తిమీదనే యాధారపడియుండు స్థితిలో నున్న వీరిలో దొంగతనములు లేకుండుట విశేషము. వీరిది నిరాడంబరమైన సుఖజీవనము. యజ్ఞాదులలో తప్ప సారాయమును వీ రెప్పుడును త్రాగరు. ఎప్పుడును న్యాయస్థానములకు బోరు. దీనినిబట్టియే వారిచట్టములు, నిబంధనలు నెంత సరళములు, నసందిగ్ధములునై నవో వ్యక్తమగుచున్నది. ఒకరిసొమ్ము నితరులయొద్ద దాచపెట్టినను, సాక్ష్యములతోగాని, ముద్రలతోగాని పని లేదు. ఇచ్చిపుచ్చుకొనుటలనుగూర్చి యెట్టివ్యాజ్యములు, తగవులును లేక, యొండొరులపై నమ్మకము గలవారై యుందురు. వారియిండ్లను, ఆస్తులను కాపలా అక్కఱలేకయే వదలి వెళ్లెదరు. దీనినిబట్టి వారు మంచి బుద్ధిమంతులని, సౌమ్యస్వభావులని తెలియవచ్చుచున్నది."

ఇట్లు క్రీస్తునకు పూర్వకాలమునాటి హిందూసంఘస్థితినిగూర్చి మెగస్థనీసు చెప్పిన మాటలలో గొంతైనను సత్య ముండకపోదు. అప్పటివారికంటె నాగరకులమని తలంచుచున్న మన యీనాటిసంఘమును గూర్చి యిట్టియభిప్రాయమునే మెగస్థనీసు పునరుజ్జీవితుడై వచ్చినచో నివ్వగలడా యని మనము విచారించుకొనవలసియున్నది. అప్పటికి నిప్పటికి పరిస్థితులు మారినవి. జనసంఖ్య పెరిగినది. నాగరకత హెచ్చినది. ప్రకృతిశాస్త్రజ్ఞాన మధికమైనది. కావున నాటికటిపరిస్థితులతో నిప్పటి స్థితి పోల్పరాదని చెప్పిన చెప్పవచ్చును గాని, ఆ సత్యసంధత్వము, ఆ ధర్మపరత్వము, ఆ నిరాడంబరమగు సుఖజీవనము, ఆ యాముష్మికచింతయు నిప్పటి మానవసంఘముచే సాధింపదగిన యాదర్శములు కావనగలమా! ఇప్పటి నవనాగరికునకు వీనితోడి సంబంధము లే దనగలమా? బాహ్యాదర్శము లిప్పటికి నివియే యైనను, మానవసంఘము యొక్క యాంతరంగికవృత్తులు మాఱుటచే, ప్రవర్తనలు భిన్నంబులై ఆదర్శములకును ప్రవర్తనకును సంబంధము కలియుచున్నట్లు లేదు. జీవితము డాంబికము, కపటము, కృత్రిమము నగుచున్న ట్లున్నది. ఈనాగరకతయొక్క స్థితి యిట్టిది గాబోలును! ప్రపంచమున స్థిరమగు శాంతిని నెలకొల్పుటకు జేయబడు యత్నములు, సభలు ఎవరెవరెంతెంత బలము, సాధనసంపత్తి కలవారైయున్నారో వ్యక్తముచేసి పోటీ పెంచుటకే యుపయోగపడుచున్నవి. విద్య, మతము, వైరాగ్యము, సన్యాసము కూడ అర్థసంపాదనకే తోడ్పడుచు జనుల స్వార్థపరత్వమునే పెంపొందించుచున్నట్లున్నవి గాని జ్ఞానాభివృద్ధికిని, పరమార్థచింతకు దోడ్పడుచున్నట్లు లేవు. మానవకోటి వాంఛ లధిక మగుచుండుటచే నిరాడంబరజీవనమునకు తావు లేక పోవుచున్నది.

అర్థమే పరమార్థ మగుటచే మహాప్రయత్నముచే సాధింపబడిన ప్రకృతిశాస్త్రజ్ఞానమంతయు నర్థాభివృద్ధికొఱకే వినియోగింపబడుచున్నది. ఈ యర్థపరత్వపిశాచము ప్రత్యేకవ్యక్తులనేగాక కుటుంబములను, సంఘములను, జాతులను, దేశములను, రాజ్యములనుగూడ బట్టి పీడించుచుండుటచే నెన్నటు జూచినను పోటీలు, స్పర్ధలు, కలహములు, జయైషిత్వమునే గానవచ్చుచున్నవి. ఇదియే యాధునిక మానవజీవితముయొక్క సచలనత్వమునకు (activity) దార్కాణముగా జెప్పబడి సమర్థింపబడుచున్నది. ఇక నిరాడంబరమైన శాంతసుఖజీవనమున కవకాశ మెక్కడిది? దానికై యత్నించువారికి సంఘమున స్థాన మెక్కడిది? మేథ్యూ ఆర్నాల్డ్ (Mathew Arnold) అను నాంగ్లేయవిమర్శకాగ్రేసరు డొకచో

They never drink wine except at sacrifices. The simplicity of their laws and their contracts is proved by the fact that they seldom go to law. They have no suits about pledges or deposits, nor do they require either seals or witnesses; but make their deposits and confide in each other. Their houses and property they generally leave unguarded. These things indicate that they possess good sober sense".

Mac Crindle's Megasthenese.

సంఘమందలి యల్పసంఖ్యాకులగు (good minority) సత్పురుషు లపమార్గమును బట్టిన యధిక సంఖ్యాకులచే తిరోధూతులైనపుడు వారు చేయదగిన పనినిగూర్చి చెప్పుచు, పెద్దగాలిదుమారము పట్టినపుడు బయట బోవుచున్న పాంథు డద్దాని నెదుర్కొనిపోవ సాహసింపనేరక యది తనను దాటిపోవువరకు నొకగోడమూలకు తిరిగి యొదిగియుండి పిదప నెట్లు తనదారిని పోవునో అట్లే యీమైనారిటీవారును కాలప్రవాహము నెదురీద యత్నింపక కొంతకాల మొదిగి యుండవలయునని సలహా చెప్పియున్నాడు. ఆట్లే వీరు నాసలహానే యనుసరింపవలసి యుండును.

ప్రాచీనకాలమున నట్టి యున్నతస్థితి నందియున్న యీదేశమునగూడ నిట్టిస్థితి సంభవించుట కిచ్చటిజనులు కూడ నర్థమునకు దాసులగుటయే ముఖ్యకారణమని గుర్తింపవలసి యున్నది. అయినను, మహాత్సాధనచే దాము సాధించిన విజ్ఞానమును, తత్సాధకయంత్రములను కేవలార్థపరత్వముచే నేజర్మను కంపెనీవారికో అమ్మివేయ నొల్లక, హైందవవిజ్ఞానము సార్వజనీనము గాని యొకరిహక్కు గాదని ప్రకటించి, ప్రాచీనార్యమహర్షుల మర్యాదను గాపాడుచున్న బోసుపండితునివంటి ఋషిసంతతివా రీదేశమున నిప్పటికిని లేకపోలేదు. ఈ యర్థపరత్వము పాశ్చాత్య నాగరకతా వ్యామోహబలముచే పరిపోషింపబడుచున్నదని తెలిసికొనిన విద్యార్థులుగూడ నాయా దేశముల ప్రబలి యానాగరకతకు మూలములై, వారి యాదర్శముల కనుకూలములై బయలుదేరిన సంఘసంస్థలనుగూడ యథాస్థితంబుగ దెచ్చి యీదేశమున నెట్టవలయునని యత్నించి వానికై ప్రచారము సలుపుచుండుట కాలమహిమ యని తలంపవలసినదే గాని వేఱు కాదు. ఇట్టి వానిలో స్త్రీస్వాతంత్ర్యం బను దానిని గ్రహింతము. వ్యభిచారముచేయుట విషయములో సంఘమున పురుషులకు గల హక్కులు స్త్రీలకు లేనికారణమున స్త్రీలకు స్వాతంత్ర్యము తక్కువగా నున్న దనియు, కావున స్త్రీల పాతివ్రత్యవిషయక నియమములను సడలించి వారికి స్వేచ్ఛ నొసంగవలయుననియు, వివాహానంతరముగాని, తత్పూర్వముగాని, వారియిష్టానుసారముగా కని పారవేసిన యనాథశిశువులను పోషించుటకు సంఘము సంసిద్ధమై యుండవలసినదే యనియు, కావున ననాథశరణాలయస్థాపనోద్యమప్రచార మింకముందు జరుపవలసిన ప్రచారములలో నొకటిగా సూచింపబడుచున్నది. స్వాతంత్ర్యధ్వని శేషముగా ప్రబలుచున్న యీకాలమున నన్నివిషయముల నందరకు సంపూర్ణ స్వాతంత్ర్య మొసగవలయు ననుట సహజమే గాని, వ్యభిచారము గర్హితమనియే తలంపబడినచో, పురుషులకుగూడ స్త్రీలకు లేని ప్రత్యేకమైన హక్కును తీసివేయుటకేల సంఘమున కట్టుబా టొనరింప ప్రయత్నింపగూడదు? ఇచ్ఛాపరతంత్రత్వమునకే గాని వృత్తినిరోధమునకు, నింద్రియనిగ్రహమునకు నిది కాలము కాదు కాబోలును.

వెనుకటివలెనే యిప్పటిహిందూదేశ మన్యదేశసంపర్కము లేక విడిగా నిలిచియుండుట కవకాశ మీకాలమున లేదనుట నిశ్చయమే. దీనికి పరాధీనత సంభవించినమాట నిజమే. అర్థపరులగు పరరాజులు దీనిని పీల్చి పిప్పిచేయుచుండుటచే మనయార్థికస్థితిని బాగుపఱుచుకొను నుపాయముల నవలంబింపవలసి యుండుటయు నావశ్యకమే. స్వీయాభివృద్ధి కనుకూలమైనంతవరకు పాశ్చాత్య విజ్ఞానము నలవఱుచుకొని యుపయోగించుకొనవలయు ననుటయు నిరాక్షేపణీయమే. అంతేగాని పాశ్చాత్య సంస్థల నన్నిటిని దెచ్చి పెట్టుకొనినగాని మన మాజాతులతో దులతూగలే మనుతలంపుతో, క్షీణించి దుర్గతిని బొందియున్న దేశీయసంస్థలను సంస్కరించి పునరుజ్జీవితములగావించుటకు మారుగా వానిని కేవల మంతరింపజేసి, వానిస్థానముల పాశ్చాత్యసంస్థలను నాటయత్నించుట శ్రేయోదాయకం బగునా యనువిషయము మాత్రము విద్యార్థులందరు సావధానంబుగ విచారింప వలసి యున్నది.

పాశ్చాత్యసంస్థలలో నగ్రస్థానము నందియున్న యంత్రసహాయమున వస్తునిర్మాణముచేయు పద్ధతికంటె సాధ్యమైనంతవరకు చేతిపనుల నభివృద్ధిపఱుచుటయే యీ దేశమునకు శ్రేయోదాయకంబని యిటీవలికాలమున గుర్తింపబడుచున్నది. బహుళాంశంబులను నాధునికరాజకీయసంస్థలకంటె ప్రాచీనకాలమున నీదేశమున ప్రబలిన

గ్రామసంస్థలే దేశాభ్యుదయకారకములని తలంపబడుటచే నిప్పుడిప్పుడు గ్రామపునర్నిర్మాణ కార్యక్రమ మత్యాతురముతో నవలంబింప బడుచున్నది. విద్యావిషయమున గూడ నుపన్యాసపద్ధతి, పరీక్షాపద్ధతి మొదలగు నాధునికవిద్యాపద్ధతులు అమెరికా మొదలగు పాశ్చాత్యదేశములందే నిరసింపబడి యనేకములగు నూతనమార్గము లవలంబింపబడుచున్నవి. విషయవిమర్శనముచే జ్ఞానసంపాదనము చేయుట సుకరం బనుతలంపుతో విద్యాధికుడగు నొకపండితుని జ్ఞానమార్గమున నాయకుడు (leader), లేదా గురువుగా గ్రహించినయువజనవిద్యాసంఘములు (Adult Education Societies) బయలు దేరుచున్నవి. ఇట్టిస్థితిలో మనదేశమున ప్రాచీనహైందవ విద్యాపద్ధతుల నాధునికస్థితిగతులకు దగినరీతిని పునరుజ్జీవింప జేయుట దేశక్షేమమునకు దోడ్పడు నేమో యను విషయము మనము బాగుగా నాలోచింపవలసి యున్నది.

విద్యయొక్క ఆదర్శప్రయోజనముల విషయములో నే ప్రాచీనకాలమునకు నిప్పటికి విశేషభేద మున్నది. ఆదృష్టిపథము కొంతవరకైనను మారినగాని ప్రాచీనపద్ధతుల యుత్కృష్టతను మనము గమనింపలేము. ప్రాచీనకాలమున నీదేశమున విద్యకు పరమార్థజ్ఞాన సంపాదనమే ప్రధానఫలంబుగ తలంపబడినట్లు కనబడుచున్నది. బ్రహ్మచర్య గురుశుశ్రూష గురుకులవాసములే ప్రధానసాధనములుగ నుండెడివి. బాహ్యప్రకృతిని స్వాధీనపఱచుకొని మానవకోటి వాంఛాసంతర్పణంబున కుపయోగపడునట్లు చేసికొనుటకంటె, ఆంతరంగికశక్తుల నింద్రియనిగ్రహమూలముగా వికసింపజేసికొని యతీంద్రియజ్ఞాన సంపాదనమునం దత్యంతశ్రద్ధ వహించుటయే యవశ్యకర్తవ్యముగా నెంచబడినది. జనసామాన్యమున వృత్తివిద్యలు ప్రబలియుండి కులక్రమానుగతములై యుండుటచే వీరు జీవనోపాధికై తాపత్రయపడవలసిన యావశ్యకత కలిగెడిదికాదు. ఆ కాలమున నిరుద్యోగసమస్యయే లేదని చెప్పదగును. ఇది యాధునికయుగచిహ్నమే. విద్యాభ్యాసకాలము పండ్రెండు వత్సరములు మొదలుకొని నలుబదియెనిమిది వత్సరములవరకు వారివారి యిష్టానుసారముగా నుండెడిది. విద్య జీవనోపాధికి సాధనము కాదు. ఎంత వత్సరముగ పరీక్షలయందు కృతార్థతను బొంది ధనసంపాదనోద్యోగమున బ్రవృత్తుడగునో అంత ధన్యుడని తలంపబడురోజు లవి కావు. ఆ రోజులలో లక్ష్మీసరస్వతుల కిప్పటికంటె పోరాట మెక్కుడుగా నుండెడిది. సరస్వత్యుపాసకునకు లక్ష్మీకటాక్షము సామాన్యముగా గల్గెడిది కాదు. వీనివాంఛలు నల్పము లగుటచే వీ డద్దానిని లక్ష్యపెట్టెడువాడును గాడు. విద్యార్థులు గురుకులవాసము చేయుటయు, గురువు లాయావిద్యార్థుల మేధాసంపత్తికి దగినరీతిని విద్యాదానము చేయుచుండుటయు సంభవించెడిది. ఆవిద్య గ్రంథములనుండి గ్రహింపబడినది కాక, గురుముఖమున నుండి గ్రహింపబడి విద్యార్థుల మనఃఫలకములందే ముద్రితమై యుండెడిది. విద్యాభ్యాసకాలము చిత్తప్రశాంతిని, ఏకాగ్రతను పెంపొందించు బ్రాహ్మముహూర్తకాలము. కాలక్రమమున పెరుగుచువచ్చిన విజ్ఞానము సులభముగ బోధించుటకు, జ్ఞాపకముంచుకొనుటకు ననువగునట్లు సూత్రరచనాఫక్కి యవలంబింప బడినది. ఆవిద్య ధనసంపాదనకొఱకు గానట్లే శుష్కవాదముల కొఱకును, ఆత్మప్రశస్తిప్రకటనకొఱకును గూడ గాక, ఆశ్రమధర్మసంరక్షణము మూలముగా, ధర్మాచరణము మూలముగా, నాత్మజ్ఞానసాధనకొఱకే వినియోగపడుచుండెను. మహాప్రజ్ఞాసంపన్నుండగు గురువు అర్హతగల, లేదా అధికారియగు శిష్యునకు విద్యాదానమే గాక కేవల హస్తస్పర్శమూలముగా నతీంద్రియజ్ఞానశక్తులను గూడ బ్రసాదించెడివాడని పెద్దలు చెప్పుదురు. సమర్థుడగు గురువుయొక్క యుపదేశబలముచే నపూర్వజ్ఞానస్ఫురణము కలుగగల దనుట ఈ కాలమున మానసికశక్తులను గూర్చి జరుపబడుచున్న పరిశోధనల నించుక గమనించిన వారి కసంభవముగా దోపకూడదు. ఏలయన, మాంత్రికు డొకడు (mesmerist) తన మనోబలముచే నితరుల మనముల నాకర్షించి స్వాధీనముచేసికొని, యవ్యక్తస్థితిలో (sub-conscious state), లేదా స్వప్నావస్థలో నున్నయాతనికి దనమానసికవృత్తులను, భావములను, మాటలను బదిలీచేసి (transfer) తాను తలచినరీతిని మాట్లాడింపగలుగుచుండుటను మనము తరుచుగా చూచి యానందించుచుండగా, విశేషసాధనచే నతీంద్రియజ్ఞానశక్తులను బడసిన

మేధావంతుడగు గురువు తనశిష్యునకు విశేషజ్ఞానశక్తులను ప్రసాదించెనని మనము సందేహింపవలసిన పనియేమి? ఈ కాలమునందలి గురువులు, శిష్యులుగూడ నట్టి సాధన, నట్టి బ్రహ్మచర్యము చేయజాలని మలినబుద్ధి తత్త్వము కలవారై కాఫీగతిప్రాణులగుటచే మనకు ప్రత్యక్షనిదర్శనములు లేకపోవుట తటస్థించినది. మొన్న నీమధ్యనే ఇంగ్లండుదేశమున మాల్వరన్ (Malvern) అనుపట్టణమున విద్యావిషయక నూతనాదర్శములను గూర్చి (new ideals in education) జరుపబడిన యొక్క సభలో మారియాల్ (Prof. J. E. Mareault) అను పండితుడు స్మృతితప్పిన యవస్థలోనున్న మనసులయొక్క (unconscious mind) విశేషశక్తులను గూర్చి యుపన్యసించుచు, నాస్థితిలో నొకగదిలోనున్నవాడు మఱియొక గదిలోగాని, మఱియొక దేశములోగాని, జరుగుచున్న దానిని కని విని చెప్పగలడనియు, తన కత్యంతప్రియులగు వారియొద్దనుండి సందేశములుగూడ గ్రహింపగలడనియు చెప్పి, యిట్లు స్మృతితప్పిన స్థితిలోనున్న మనసుయొక్క శక్తు లిట్టివని చెప్పలేమనియు, వాని పరిమితిని మనము నిర్ణయింపనేరమనియు వాక్రుచ్చియున్నాడు. దివ్యదృష్టి దూరశ్రవణాదులు ప్రాచీనమహర్షులకు కరతలామలకము లని వింటిముకదా. నూతనపరిశోధనలు ప్రాతవిషయము లనే మరల పైకి దీయ యత్నించుచున్నట్లున్నవి. అయితే విద్యావిషయకమగు నాయాదర్శములు, ఆయుద్దేశములు, ఆసాధనలు, ఆమేధాశక్తులు, ధారణాశక్తులు ఆయాయుగములయందలి స్థితిగతులను బట్టి మార్పుజెందజొచ్చినవి.

బౌద్ధయుగమున ప్రతివ్యక్తియు మోక్షజ్ఞానమున కర్హుడను భావము వ్యాపించుటంజేసి యావద్ధర్మజ్ఞానము ధారణాశక్తి విశేషముగాలేని జనసామాన్యమున కంతకు గలుగజేయు నుద్దేశముతో, ధర్మగ్రంథములు వ్రాయబడి జనుల కంఠజేయబడుట తటస్థించినది. జనసామాన్యమునందు విద్యావ్యాపనము చేయవలయునను నుద్యమము, దానికై గ్రంథరచన అనునవి బౌద్ధయుగముననే ప్రారంభించినట్లగపడుచున్నది. కాలక్రమమున గ్రంథరచన పెరిగినది. మాతృకలకు ప్రతికలను వ్రాయించి గ్రంథములు ఖిలము గాకుండ గాపాడుట యొక పవిత్రధర్మముగానే వాని రాజులు, మహారాజులు నావ్రాతను ప్రోత్సహింప దొడంగిరి. వారియాస్థానమున నిట్టి గ్రంథసమితి పెరుగుటచే నచ్చట గ్రంథాలయము లేర్పడుచువచ్చినవి. తంజావూరునందలి సరస్వతీభాండారము మొదలగు గ్రంథాలయములే యిందుకు దార్కాణము. ప్రతివిద్యార్థియు దాను చదువు గ్రంథములను వ్రాసికొని చదువుకొనుచుండుటచే నందలివిషయము నంతయు మనోగతం బగుటయే గాక, లిఖితగ్రంథములును పెరుగుచువచ్చినవి. కాని యిటీవలికాలమున ముద్రణాసౌకర్యములు కలుగుటచే గ్రంథములను మనోగతము చేసికొనవలసిన యావశ్యకత తగ్గిపోయినట్లే గ్రంథములు సులభ్యంబులగుటచే విద్యాసంపాదనకు గురువుయొక్క యావశ్యకతయు తగ్గిపోయినది. ఈదేశమునకు పాశ్చాత్యనాగరకతాసంసర్గ మెక్కువయై పాశ్చాత్యప్రభుత్వము నెలకొనినకాలది విద్య యుద్యోగాధికారసంపాదనము తన్మూలమున ధనార్జనముచే పరమలక్ష్యంబులైనవి. ప్రాచీనకాలమున పండితు లగువారుకూడ నేరాజులనో యాశ్రయించి కుటుంబభరణమునకై ధనార్జనను చేయుచుండినవారే గాని జనసామాన్యమంతయు కులక్రమాగతములగు తమతమ వృత్తులను, వృత్తివిద్యలను విడిచి యుద్యోగాధికారసంపాదనలోలురై యితరవిద్యల నభ్యసించుట కేపట్టణములందో గుమిగూడినవారు కారు. ప్రస్తుత మీయాంత్రికయుగము యంత్రబలముపై నాధారపడినదగుటచే వృత్తివిద్యలను క్షీణింపజొచ్చినవి. ఇంతకు పూర్వము స్వస్వవృత్తులచే స్వతంత్రముగ జీవయాత్ర నడుపుచున్న జనమంతయు కూలిపనికి దిగవలసివచ్చినది. లేదా, రాజకీయవిద్య నభ్యసించి ఉద్యోగాధికారవ్యామోహ

*"In a state of trance, that which wenton in the next room or in another part of the world could be heard, and communications from those with whom we are linked with affection can come to us." "We cannot," he added, "measure the contents of the unconscious."

ముచే విదేశప్రభుత్వముపన్నిన బానిసత్వపుటురులలో దగుల్కొని సేవకవృత్తిచే మరియొకవిధమున నవలంబింపవలసినవారైరి. ఇట్లు యంత్రములకు దాసులు కొందరు, విదేశీయప్రభుత్వ యంత్రములకు దాసులు కొందరు, పాశ్చాత్యనాగరకతాభావమునకు దాసులు కొందరు నగుటచే మనదేశమున దాస్యము, భావదాస్యము నొండొంటికి సహాయంబై జనులను పీల్చి పిప్పిచేయుచున్నవి.

ఆర్థికవాతావరణం బిట్టి దగుటచే పాశ్చాత్యసంపర్గముచే రాజకీయ విషయమున ప్రజాస్వామికత్వభావములుగూడ వ్యాపించినవి. ధర్మము, మోక్షము పరమార్థము లైనపుడే 'ధర్మమార్గప్రవర్తకులగు రాజుల ప్రభుత్వము జరుగగలదుగాని, అర్థకామములు పరమార్థము లైనపుడు వ్యక్తిస్వాతంత్ర్యము, ఆత్మపరత్వము, ప్రజాస్వామికత్వభావములు చెలరేగక మానవు ప్రజాస్వామికము ప్రభుత్వం బైనతోడనే ప్రజాసామాన్యమునకు రాజకీయవిషయజ్ఞాన మావశ్యకం బగుచున్నది. ప్రతివ్యక్తియు దేశముయొక్క స్థితిగతులను దెలిసికొని దేశాభ్యుదయమునకు దోడ్పడగలవారై తనయొన్నిక శక్తిని సవ్యముగా వినియోగింపగలవారై యుండవలసిన యావశ్యకత కలుగుచున్నది. ప్రతివ్యక్తి నీవిధముగా దేశాభ్యుదయమునకు దోడ్పడగల పౌరునిగా జేయుటయే యాధునిక విద్యావిధానముయొక్క పరమలక్ష్యము. ఇట్టి మహోద్యమమున కీకాలానుగుణంబుగ యంత్రసహాయమున ముద్రితములగుచున్న గ్రంథసమితి విశేషోపకారకం బగు ననుటలో సందేహములేదు. జనసామాన్యమున విద్యను వ్యాపింపజేయుటకే గాక విద్యార్థియగువాడనేకవిధ విషయజ్ఞానమును సులభముగ సంపాదించుకొనుటకు గూడ నీగ్రంథసమితి, గ్రంథాలయములు తోడ్పడగలవు. అయితే, ఇంతకుపూర్వము వృత్తివిద్యల నభ్యసించినవారిప్పుడు యంత్రములకు దాసులైనట్లే యింతకాలము నుండి గురువునొద్ద విద్య నభ్యసించి జ్ఞానసంపాదనము చేసినవారిప్పుడు పుస్తకములకు దాసులై స్వీయప్రవర్తనను విశేషముగా దిద్దజాలని వివిధవిషయజ్ఞానమును మాత్రము విశేషముగా సంపాదింపగలిగిన వారగుచున్నారు. ధర్మమార్గప్రవర్తకుడగు గురునియొద్ద సక్రమశిక్షణములేక సాధనకు మొదటినుండియు నలవాటుపడకుండుటచే తరువాతికాలమున గ్రంథములమూలమున సంపాదించిన జ్ఞానమునకు చిన్ననాటినుండి యలవడిన ప్రవర్తనాపద్ధతికి సంబంధము కుదురక తీర్థమునకు తీర్థము ప్రసాదమునకు బ్రసాద మన్నట్లగుచున్నది. ఇప్పటి విద్యాబోధకు లగువారు కూడ నీనూతనపద్ధతులలో నారితేరినవారే గావున ధర్మమునందుకంటె నర్థమునందే యెక్కువ మక్కువ కలవారై, తాము నేర్చుకొనిన దానిని విద్యార్థులతో దినమున నొకటి రెండు గంటలు మాత్రమే కలసియుండి వత్సరాంతమున తరుముకొని వచ్చు పరీక్షల కుపయోగించునట్లుల నుపన్యసించి కృతార్థమ్మన్యు లగుచుండుటచే మరల వీరికొఱకై దినదినాభివృద్ధియగుచున్న పాఠశాలలలో నుపాధ్యాయపదవుల నాక్రమించు నీశిష్యులును వెనుకటిగురువుల బోలినవారే యగుచున్నారు. ఈ విషమపరివర్తనమునకు నిలుకడ యెట్లు గలుగునో తెలియకున్నది. విద్యావ్యాప్తికై యిట్లు చేయబడు ప్రయత్నములవలన పాశ్చాత్యసంఘములందు ప్రబలిన గుణములకంటె దోషములే మనకు విశేషముగా నబ్బుచున్నట్లున్నవి. ఆ పాశ్చాత్యుల విజ్ఞానము, ముఖ్యముగా వారు సాధించిన ప్రకృతిశాస్త్రజ్ఞానము, జనసామాన్యమున వ్యాపించి, దేశీయులజీవితమును శుభప్రదముగ జేయుటకు దగినయవకాశము కలుగుట లేదు. ప్రాచీనమహర్షుల విజ్ఞానము, అప్పటి సాంఘికనియమములు, ఆంతరంగికసాధనలు, శక్తులు కాలక్రమమున క్షీణించి గతించినవి. ఆధునికప్రకృతిశాస్త్రసాధనకును, ఆర్యమహర్షులవిజ్ఞానసాధనకును ప్రాప్యం బొక్కటియే యైనను మార్గములు భిన్నములుగా నున్నవి. కాని ప్రస్తుతమీ దేశమున నొకటి క్షీణించిపోవుటయు, రెండవది లభింపకుండుటయు దటస్థించుటచే దేశస్థితి యుభయభ్రష్టమైనట్లున్నది. కావున నాధునికప్రకృతిశాస్త్రవిజ్ఞానమునకును ప్రాచీనార్యమహర్షుల వైదికోపనిషద్విజ్ఞానమునకు సమన్వయము చూపుచు నాధునికప్రకృతిశాస్త్రజ్ఞానమును దేశమున వ్యాపింపజేయు గ్రంథసముదాయమును బయలుదేరదీసి, జనసామాన్యముయొక్క మనోనేత్ర

మర్థమునందుకంటె ధర్మమునందు లగ్నంబగునట్లు చేయు మార్గముల నన్వేషించి కృషిసల్పగలిగినచో నీగ్రంథాలయోద్యమము తప్పక దేశకల్యాణంబునకు దోడ్పడ గలిగియుండును

సామాన్యముగా నిపుడు గ్రామాదులలో బయలు దేరియున్న గ్రంథాలయములలోని గ్రంథములు చాలవరకు నవలలు, నాటకములు, కథలు మొదలగువానితో నిండి పోవుచున్నవి. ఆ ప్రదేశములందు చదువువారికిగూడ నిట్టి వానియందే యభిలాష మెండుగా నుండును. అర్థము కొఱకై యనేకులు గ్రంథవిక్రేత లిట్టి నిస్సారగ్రంథసమితిని (light literature) ముద్రించి ప్రకటించుచుండుటయు తటస్థించుచున్నది. జనసామాన్యమున చదువుటకు తీరికగలవారుగాని, అభిలాషగలవారుగాని, చదువగలిగినవారుగాని చాలతక్కువగా నుందురు. ప్రాథమికవిద్య నభ్యసించిన మాత్రమున పల్లెటూరిజనులు గ్రంథపఠనమునం దాసక్తికలవారగుదురని మనము తలంచుట కవకాశము లేదు. అట్టివారికి గ్రంథపఠనమునం దాసక్తి కలుగ జేయుట యొకపని. ఆ చదువువారికైనను విజ్ఞానాభివృద్ధికరములగు గ్రంథములు దొరకుట గాని, వానిని వారు చదువదలంచుట గాని సంభవించుటలేదు. అట్టి గ్రంథములను లభింపజేసి వానిని జేపట్టి చదువుటలో జనులకు రుచి పుట్టింపగలిగిన మార్గముల నన్వేషించుభార మీయుద్యమప్రచారకులపై నున్నది.

గ్రంథాలయముల సేవ కొన్ని గ్రంథము లున్నంత మాత్రమున గూడ ప్రయోజన ముండదు. ఆ గ్రంథములు తెరువబడకయే యుండవచ్చును. గ్రంథాలయములున్న గ్రామములలో గూడ కొన్నిటిలో జనులు దానియొద్ద చేరుటగాని, అందలి గ్రంథములను చదువుట గాని అరుదుగా సంభవించుచుండును. ప్రాచీనకాలమునందు జనులకు గల పురాణపఠనశ్రవణాదులయందలి శ్రద్ధ ఈ కాలమున నడుగంటినది. ధనికులకు ధనాభివృద్ధిమార్గముల నన్వేషించుటయందును, పేదలకు జీవనోపాధిమార్గముల నన్వేషించుకొనుటయందును కాలము సరిపోవుచున్నది. పరమార్థచింతకు, సత్కాలక్షేపమునకు, జ్ఞానాభివృద్ధిచేసి కొనుటకు కాలము దొరకుట దుర్లభమగుచున్నది. పట్టణములలో సేవిహారస్థలములందో, క్లబ్బులయందో, పలువురు కూడినపుడే రాజకీయవిషయములనుగూర్చియైనను చర్చలు సాగుచుండును. కాని పల్లెటూళ్లలో నెవరిపని వానిదే. సామాన్యముగా నొకచోట నలుగురు సమావేశమగుటయే కష్టము. ఒకవేళ కూడిరో, యే సంసారగోష్ఠియో, ఏ కుటుంబ కలహములో, ఏ వివాహసంబంధ విచారణమో, ఏబాకీవసూళ్లు వడ్డీవ్యాపారమో ధరవరలో, ఈ మొదలగువానిని గూర్చిన సంభాషణమే బయలుదేరును గాని, అంతకంటె నున్నతభావములను పురికొల్పు సంభాషణలు, చర్చలు, ధర్మవిచారణలు నీరోజులలో సామాన్యముగా గానవచ్చుచుండుటలేదు. ఇట్టి గ్రామములలో గ్రంథాలయములను నెలకొల్పినందువలనను విశేషలాభ ముండబోదు. ఈ ప్రదేశములలో నా గ్రంథాలయములను నడిపి వానిని ప్రచారములోనికి దెచ్చుకార్యదర్శి బహుసమర్థుడై యుండవలయును. పాశ్చాత్యవిజ్ఞానతత్త్వము నవగాహనము చేసికొని హైందవవిజ్ఞానమునం దభిమానము కలవాడై, సాధ్యమైనంతవరకు రెంటిని సమన్వయించుచు, గ్రామములయందలి పూర్వాచారపరాయణులను గాని, నవనాగరకతావాసన గలిగిన యువజనమును గాని, రెచ్చగొట్టక యొక్కొకవిషయమును గూర్చి యుపన్యాసరూపముననో, పురాణముగనో, హరికథారూపముగనో జనసామాన్యమునకు రంజకంబగునటుల బోధించి, వారి కా యా విషయముల గూర్చిన గ్రంథములను జదువుటయందు రుచి కలుగునట్లు చేయవలయును. సాహిత్యగ్రంథము లనేకము లిదివరకే కలవు గావున వివిధశాస్త్రవిజ్ఞానమును బోధించు గ్రంథములు సులభశైలిని పదములు, పాటలు, కథలు, వచన గ్రంథముల రూపముగా దేశభాషలో రచింపబడవలయును. గ్రామజనుల దృష్టి వీనిపై ప్రసరించునట్లు చేయుటకుగా మ్యాజిక్ లాంతరు ప్రదర్శనములతో గూడిన యుపన్యాసములు జరుపవలసియుండును. లేనిచో నర్థాకర్షణతంత్రములందు, కోర్టువ్యాపారములందు వ్యాపృతులైయున్న వీ రీగ్రంథాలయములపొంతకే పోరు. అర్థపరత్వము మాన్పి ధర్మపరత్వమునను, ఆముష్మికచింతయందును, నూతనజ్ఞానసంపాద

నాపరత్వమునను జనసామాన్యముయొక్క దృష్టి ప్రసరించునట్లు చేసి ధర్మతత్పరుడగు గ్రంథాలయ కార్యదర్శి వీరి కీకాలమున గురుస్థానము నాక్రమించి, సత్ప్రవర్తన మందువలె గ్రంథపఠనమునందు రుచిపుట్టింపవలయును. ఇట్టి కార్యమును సాధింపవలయుననిన కొంతవరకైనను ప్రాక్పశ్చిమవిద్యలయం దారితేరి లోకానుభవముగలిగిన వృద్ధులే కావలయును. అట్టివారు ప్రస్తుతస్థితిలో దొరకుట కొంతవరకు కష్టమే గాని, పట్టణములం దుద్యోగాదులం దుండి యుపకారవేతనముతో విరమించిన విద్యాధికు లగువారు, కళాశాలలయందలి యుపాధ్యాయులు నిట్టి పనులకు బూనినచో నీ దేశాభ్యుదయకార్యము సులభసాధ్యము కాగలదు. ఆ యా గ్రామములం దిట్టి గ్రంథాలయ కార్యదర్శియే గురుస్థానము నాక్రమింపగలడు. మఱియు నిట్టిపనిని సెలవులలో విశ్వవిద్యాలయములందలి విద్యార్థి బృందములు పూనుకొనినచో నుభయతారకంబై యుండును. పట్టభద్రుండైన ప్రతివిద్యార్థియు తనయభిమానశాస్త్రమున కళాశాలలో నేర్చిన విషయములను గొన్నిటిని గూర్చి గ్రామాదులలో గ్రంథాలయముల తరఫున గొన్ని యుపన్యాసముల నిచ్చితీరవలసినదిగా విశ్వవిద్యాలయాధికారు లొకనియామకము చేయుటయు, నిట్టివారిలో సమర్థు లగువారికి జిల్లాబోర్డులు తాలూకాబోర్డులు, గ్రామపంచాయతులు మొదలగు సంస్థలు, తగిన వేతన మిచ్చి వీరి నా యా గ్రామములలో గ్రంథాలయ ప్రచారకులుగ నియమించి పోషింప దొడంగుటయు సంభవించినచో, నీ గ్రంథాలయోద్యమము కొనసాగుటయే గాక నిరుద్యోగసమస్యకూడ కొంతవరకు సాధింపబడినదగును. ఇట్టి గ్రంథాలయకార్యదర్శియే ఆయా గ్రామపువరిం కార్యక్రమమును తగురీతి కొనసాగింపగలడు. గ్రంథాలయోద్యమప్రచారమునం దభిమానము కలవారీ విషయమును గమనించి యాచరణలోనికి దెచ్చుటకు యత్నింతురు గాక.

---

## మనజన్మభూమి

విద్వాన్ గరిమెళ్ల సోమన్న గారు, ఎం. ఏ., ఎల్. టి.

దసరాపద్యములు

శ్రీహిమాచలవింధ్యశిఖరోన్నతంబు
గౌతమీసింధు గంగాపావనంబు
చతురాయణసముద్రసంరక్షితంబు
బహుపుష్పఫలసస్యభవ్యవాసంబు
మనజన్మభూమి యీ మాన్య దేశంబు
వననదీనగరమ్యభరతఖండంబు.

అంగ వంగ ద్రావి డాంధ్ర కర్ణాట
కాశ్మీర కేరళ గాంధార మగధ
మాళవ నేపాళ మళయాళ చోళ
పాండ్య మత్స్య విదేహ వత్స పాంచాల
సౌరాష్ట్ర శక సింధు శబ రోత్కళాది
భూభాగ విస్తారము మన దేశమ్ము
మనజన్మభూమి యీ మాన్య దేశంబు
వననదీనగభవ్య భరతఖండంబు.

కాశీ కురుక్షేత్ర కాంచీ ప్రయాగ
మధు రోజ్జయిన్యాది మహనీయపురము
మనజన్మభూమి యీ మాన్య దేశంబు

వననదీనగరమ్య భరతఖండంబు.
వేద స్మృతి పురాణ వేదాంగ యోగ
సాంఖ్య మీమాం సార్థశాస్త్ర వేదాంత
శిల్ప నాటక కావ్య చిత్రరంజకము
మనజన్మభూమి యీ మాన్య దేశంబు
వననదీనగరమ్య భరతఖండంబు.

మను పృథు శ్రీరామ మాంధాతృ భరత
నల హరిశ్చంద్రాది నామపూతంబు
సావిత్ర్యరుంధతి జానకీప్రముఖ
సాధ్వీమతల్లికా చరితపావనము
మనజన్మభూమి యీ మాన్య దేశంబు
వననదీనగరమ్య భరతఖండంబు.

హర్ష వర్ధన కని ష్కాశోక మౌర్య
పృథ్వీరా జాక్బరు శ్రీకృష్ణరాయ
రాజరాజ శివాజి రంజీతుముఖ్య
రాజపుంగవకథా రారాజితంబు
మనజన్మభూమి యీ మాన్య దేశంబు
వననదీనగరమ్య భరతఖండంబు.

పద్మినీ రుద్రమాం బాహల్యబాయి
సుల్తాన రీజియా శూరచాంద్బీబి
ముఖ్య వీరాంగనాద్భుతవర్తనంబు
మనజన్మభూమి యీ మహిత దేశంబు
వననదీనగరమ్య భరతఖండంబు.

భూతదయామూర్తి బుద్ధకారుణ్య,
సర్వాత్మతాబోధ శంకరజ్ఞాన,
మాన్యభక్త్యదిత, రామానుజప్రేమ,
మహిత పూర్ణప్రజ్ఞ మధ్వవిజ్ఞాన
భాసురం బీ మన భరతఖండంబు.

మనజన్మభూమి యీ మాన్య దేశంబు
వననదీనగరమ్య భరతఖండంబు.

సత్యదయాధర్మ సంతతవ్రతులు
ప్రజ లుందు రిందు ముప్పదిమూడుకోట్లు.
వీరిలో బహుకోట్లు పేదలై యుంద్రు
వీరిలో బహుకోట్లు విద్య లేకుంద్రు
వీరిలో బహుకోట్లు వ్యాధిలో నుంద్రు
వీరిలో బహుకోట్లు వెలిబడి యుంద్రు
వీరు తేరఁగవలయు విగతబాధులయి
భారతీయులకెల్ల వలయు సౌఖ్యములు
భారతీయులు బ్రిటిష్ ప్రజలసఖ్యమున
గౌరవసందల్ గలిగి మనవలె.

అజ్ఞానమును బాపి నైకమత్య మిడి
విజ్ఞానవశవిత్తవిభవంబు నిచ్చి
జగమందు మాన్యతం జనునట్లు చేసి
భగవంతుఁ డోముత భరతఖండమును
భగవంతుఁ డోముత భరతఖండమును
జయ విజయీ భవ జయ భారతీయ
జయ నిజగౌరవం సంపదంచ జయ.

---

# ఉత్తరరామచరిత రసవిచారము

మల్లాది రామమూర్తిశాస్త్రిగారు

మహాశయులారా! శుక్లసంవత్సర ఆషాఢ శ్రావణమాస భారతీ సంచికలలో "ఉత్తరరామచరిత నాటకరసవిచారము" అను శీర్షికతో బ్రహ్మశ్రీ కొంపెల్ల సుబ్బారాయ శాస్త్రిగారు వ్రాసిన వ్యాసమును చదివితిని. అందలి విషయములు, పూర్వ పక్షములు, సిద్ధాంతములు సర్వతోముఖములుగా నుండి శ్రీశాస్త్రిలవారి సాహిత్యపటిమను ఆపాతతః వెదచల్లుచున్నవి. శ్రీవారు వ్యాసాంతమున "ఇట్లింతవరకు నాబుద్ధికొలది విచారింపగా నీయుత్తరరామచరిత నాటకము కరుణ విప్రలంభ శృంగారరసప్రధాన మనియే తోచుచున్నది. నేనీవ్యాసమును సాధ్యమైనంతవరకు సంక్షేపింప దలంచుటచే విస్తరించి వ్రాయ లేదు." అని వ్రాసినారు. ఈ వ్యాసమునందలి విషయమునంతను శ్రీశాస్త్రిగారు తమస్వంత బుద్ధితో నాలోచించినారట. ఎంతఆశ్చర్యము! నిజముగా నిది యంతయు శ్రీ శాస్త్రిగారి ప్రతిభ చేత నే వ్రాయంబడినచో వారు జగద్వంద్యులే; కాని శ్రీశాస్త్రిగారి పరమసాహసము గాని యిందు వీరి ప్రతిభావేశము గూడ కానంబడుటలేదని నేను తెలియజేయు చుంటిని. శ్రీకుమార తాతార్య విరచితంబైన "కల" యను వ్యాఖ్యానముతో ఉత్తరరామ చరిత నాటకము 1906 సంవత్సరమున ఆనందముద్రణాలయమున చెన్నపురిలో ముద్రింపబడి యున్నది. కాని యాగ్రంథము పునర్ముద్రితము కాకుండుటచే ప్రస్తుతమున విరళ ప్రచారము గలిగియున్నది. ఆవ్యాఖ్యాత యీ నాటకమందలి రసమును "ఏకో రసః కరుణఏవ" యను శ్లోకవ్యాఖ్యానమున విపులముగా చర్చించినాడు. అందలి విషయములనే తు, చా, లలో గూడ భేదములేకుండ శ్రీసుబ్బారాయశాస్త్రిగారు అంగీకరించినారు. సాహిత్య చక్రవర్తి యగు తాతార్యుని గ్రంథమునంతను భాషాంతరీకరించి, యవ్వానినామమునైనను స్పృశింపక, యిదియంతయు "నా బుద్ధికొలది విచారణ" యని వ్రాయుచుండిన శ్రీశాస్త్రిగారిస్వంతము సాహసము గాక ప్రతిభ యగునా? తాతార్యవ్యాఖ్యయందలి ఒక్కొక్క సంస్కృతవాక్యమునే తీసి యాంధ్రభాషలోనికి తర్జుమా చేసినచో శ్రీశాస్త్రిగారి వ్యాసము, తు, చాలు తప్పకుండా తయారగును. గ్రంథవిస్తర భీతిచే విరమించు చుంటిని. ఇటుల సాహసించుట అన్యాయ మనియు, పండితద్రోహ మనియు శ్రీశాస్త్రిగారికి తెలియజేయుచు, నాయభిప్రాయములను నంగీకరించి మహా పండిత తాతార్యునికి కృతజ్ఞులై, "నాబుద్ధికొలందిని" అని విడిచి, "తాతార్యవ్యాఖ్యానుసారము వ్రాసితిని" అని శ్రీ సుబ్బారాయశాస్త్రిగారు స్వయముగా తమ వ్యాసమును భారతిలో సవరింపజేసిన బాగుండునని కోరుచున్నాను.

---

# ఉత్తరరామ చరిత్ర: రసచర్చ

మున్నంగి లక్ష్మీనరసింహ శర్మ గారు

బ్రహ్మశ్రీ కొంపెల్ల సుబ్బారాయ శాస్త్రి గారు 'భారతి' [సంపుటము ౬, సంఖ్యలు ౭, ౮] శుక్ల సంవత్సర ఆషాఢ శ్రావణ మాసముల సంచికలలో ఉత్తరరామ చరిత నాటకమందలి రసమును విచారించుచు వ్రాసిన వ్యాసమును యథామతిఁ బరికించితిని. వీరు ఆ తమ వ్యాసాగ్రమున, "నా శక్తికొలఁదిం బ్రయత్నించి చూచినను సాహిత్య మీమాంసాపద్ధతిని సహృదయ హృదయ రంజకముగా సాధించు సదుపాయములు సంతృప్తికరముగా నిప్పటికిం జిక్కనందున నా విషయమున మందోత్సాహుఁడ నగుచుంటిని. కావున నీఁకఁ బరిశిష్టమగు కరుణ విప్రలంభ శృంగార రసమే యిప్పటికిఁ బ్రబలముగా నాకుఁ గనఁబడుచున్నది. దుర్దైవ వశమున ...... తలంచి యిందుఁ బొందుపఱుచుచున్నాఁడను." అనియు, "ఇట్లింతవఱకు నాబుద్ధికొలఁది విచారింపఁగా నీయుత్తర రామచరిత నాటకము కరుణవిప్రలంభ శృంగారరసప్రధాన మనియే తోఁచుచున్న" దనియుఁ దెలిపిరి. మఱియు, "కళా ప్రపూర్ణ మహోపాధ్యాయ బిరుదాంచితులును, యశఃకాయులు నగు బ్రహ్మశ్రీ వేదము వేంకట రాయశాస్త్రులవా రీ నాటకము నాంధ్రీకరించి దాని యుపోద్ఘాతమం దీనాటకము కరుణ విప్రలంభ శృంగారరస ప్రధానమని వివిధ విషయములను విపులముగఁ బరామర్శించి సిద్ధాంతముఁ గావించి రని నాకీవ్యాసము కొంతవఱకు ముద్రణ మైనపిమ్మటఁ దెలియవచ్చినది. దానిం జూచుభాగ్యము నాకింతవఱకుఁ గలుగలేదు. ......" అనియు వ్యాసమధ్యమున నుడివిరి. వీరు, ఉ. రా. చ. నాటకమందలి రసవిచారముం జేసి తన్నాటకము కరుణ విప్రలంభ శృంగార ప్రాధాన్యమని తేల్చితిమనిరి. ఇందునకుఁ దమ చిరపరిశ్రమయు, బుద్ధియు సాధనము లైన వనిరి. శ్రీ వేంకటరాయ శాస్త్రులవారు తమ ఉ. రా. చ. నాటక (తెనుఁగు) ముఖమునఁ జేసిన రసాదికచర్చఁ జూచుభాగ్యము తమకింతవఱకుఁ గలుగలేదని కొం. సు. శాస్త్రి గారు వగపుతో నమ్మఁబలికిరి. వారిమాట కాదననేల? శ్రీ వేంకటరాయ శాస్త్రులవారు సజీవులుగ నుండినపుడు ఈవ్యాసము వెలువడక ఇపుడు వెలువడెనే యని, వా రుండి దీనినిఁ జూచియుండిన నెట్లాదరించెడివారో కదా యని, నా కొకింత మనఃక్లేశము గలిగినమాట నిజము.

శ్రీ కొం. సు. శాస్త్రిగారు తమ వ్యాసమున 'దయాళుహృదయులు[1]', 'వైక్లబ్యవికారము[2]', 'వీలు[3]' అని వ్రాసిరి. 'నిర్దయ ఘోర

1. (భారతి) పు ౮, కలము ౧, పంక్తి ౧౫. 2. పు. ౧౪, కల. ౨, పం. ౧౫. 3. పెక్కుచోట్ల.

కృత్యము[4]' అని సమాసము. దీనిభావ మేమి యో! దయాఘోరకృత్యముగూడ నుండునా? "......విరమవిరమా......జానకీ విప్రయోగః" అనిన రాముని వాక్యము నుదాహరించుచు, "ఇది జానకీ వియోగమున 'కుప్రశుతి[5]'గా నున్నది" అనిరి. ఈయుప్రశుతి కిచట ప్రయో జన మగపడదు.

ఇంక నిందు, వాక్యరచనయందుఁ బ్రసాద గుణము కొఱవడి భావము వ్యక్తము గాని పట్టులు పెక్కులు గలవు. వే. వేం. శాస్త్రిల వారు సూత్రప్రాయముగఁజూపిన విషయములు కొం. సు. శాస్త్రి గారు విస్తరించిరి. వారి రస చర్చాదికమున సందర్భోచితముగ నుదాహృ తములైన ఆలంకారికప్రమాణములు పెక్కులు వీరి వ్యాసమునను గలవు. వీరు "కరుణవాదు లకుఁ 'జరితార్థ[6]' మగును" అనిరి. ఈచరితా ర్థమున కిట అర్థ మేమో! వీరి యీవ్యాసమున 'చరితార్థ' ప్రయోగము లనేకము. 'అనిష్ట[7]' శబ్దము వాడిరి; దీనికి 'కష్టము' అని యర్థముఁ బ్రతిపాదించిరి. అరిష్టమని యుద్దేశ్యము కాఁ బోలు! అనిష్టమునకు ఇష్టము లేమి అని అర్థము ప్రసిద్ధము. 'నీస్వహాస్తము', 'నా కాక్షేపించెను' అని యభీష్టముగఁ బ్రయోగించిరి. "'సర్వథా ఖలు ఋషయో విధాస్యన్తి' అని నటుఁ డనెను. ఇందువలనఁ బున స్సమాగమము సూచింపఁబడుట లేదా?[8]" అని వ్రాసిరి. మరల నింకొకచో "ఋషి దేవతానుగ్రహమువలన భావికాలమున శ్రేయస్సు కలుగఁగల దని కూడఁ దెలియనగును.[9]" అని రెట్టించిరి. ఈ పునరుక్తికిఁ గారణ మగపడదు.

దిక్ప్రదర్శన మాత్రముగఁ గొన్నిటినిఁ జూపితిని. భాషాభిజ్ఞు లింకను గనిపెట్టఁ గలరు.

ఇంక వేంకటరాయ శాస్త్రులవారి రస చర్చకును, ఈసుబ్బారాయ శాస్త్రిగారి రస విచారమునకును గల సన్నిహిత సంబంధము, వాని గుణభేదములను, తద్విమర్శక ప్రవణతను పరిశీలింపఁ బెద్దలు కర్తలు.

పదిసంవత్సరములనాఁడు వేదము వేంకట రాయశాస్త్రులవారు ఉత్తరరామచరిత నాట కము దెనిఁగించిరి. దానికి డెబ్బదిపుటల ఉపో ద్ఘాతము రచించిరి. ఇందు భవభూతి జీవిత వృత్తాంతములను వివరించిరి. ఆతనికాలమును, గురువును ఊహించిరి. ఆతని విద్యావిశేషము లను స్పష్టపఱచిరి. ఆతని కవనప్రశస్తిని కాళి దాసాదికవుల సూక్తులఁబడి కొని యాడిరి. ఆతని నాటకత్రయీరచనాక్రమమును విచారించిరి. ఆతని ప్రతిభాదికమందలి వైలక్షణ్యమును సాధించిరి. తన్నాటకత్రయమును విమర్శించిరి. మాలతీ మహావీర ఉత్తరరామచరితలం గూర్చిన భండారకార, మెక్డొనల్, కలే, కృష్ణ మాచార్యాది పండితుల అభిప్రాయముల నను

4. పు. ౧౧, కల. ౨, పం. ౭. 5. పు. ౮, కల. ౨. 6. పు. ౧౮, కల ౧, పం. ౨౫. 7. పు ౧౩, కల. ౨, కల. ౧౮; పు. ౧౮, కల. ౨, పం. ౬; పు. ౧౫, పం. ౧, పం. 3. 8. పు. ౧౩, కల. ౨, పం. ౨౦. 9. పు. ౧౫, కల. ౨, పం. ౧౬.

సంధించిరి. నాటకలక్షణ ప్రతిని బోధించిరి. ఉత్తరరామచరితకథను దెలిపిరి. కథలోని విపర్యాసములం దడవిరి. సీతా వివాసనము ధర్మ్యమా అధర్మ్యమా అని చర్చించి సాధువేయని నిశ్చయించిరి. అంతట రసచర్చకుం దొడంగిరి. ఈనాటకమున రసము ధర్మవీరమనియు, కరుణమనియు, విప్రలంభ శృంగారమనియుఁ జెప్పెడి భిన్నవాదములఁ జూపిరి. కథావస్తువును మథించిరి. ఆలంకారికమతముల నుద్ధరించిరి.

వేంకటరాయశాస్త్రులవారి యుపోద్ఘాతమందలి రసచర్చాభాగము సంగ్రహముగా నిం దుద్ధరింతును. 'భారతి'లోని కొం. సుబ్బారాయశాస్త్రిగారి వ్యాసమునందలి ఆయాయి పట్టులను అధోజ్ఞాపికగా సూచింతును. పరిశీలకు లా రెంటిని సవిమర్శముగఁ బోల్చి నిజము నారయుఁగాత.

## వేంకటరాయశాస్త్రులవారి రసచర్చ

ఈ నాటకమందు రసము ధర్మవీరమనియు, నాయకుఁడు ధర్మవీరుఁ డనియు వక్కాణించువారుం గలరు. అందులకు వారి యుపపాదనములు:—

"ఉత్సాహాత్మా భవే ద్వీరస్త్రేధా ధర్మాజిదానతః,
నాయకోఽత్రభవే త్సర్వైః శ్లాఘ్యై రనుగతోఽనుజైః."
—వాగ్భటః.

"ఉత్సాహాత్మా వీర స్స త్రేధా యుద్ధధర్మదానేషు,
నివ యేషు భవతి తస్మిన్నతిలోభో నాయకః ఖ్యాతః."
—రుద్రటః.

"ధర్మదానయుద్ధభేధా త్త్రిధా వీరః."—హేమచన్ద్రః.

"వీర శ్చతుర్ధా, దానదయాయుద్ధ ధర్మైః ప్రముపాధే రుత్సాహస్య చతుర్విధత్వాత్."—రసగఙ్గాధరః.

ఈనాటకమున నాయకునందు ధర్మవీరతా సాధకములయిన వాక్యములు:—

ఆముఖములో అపవాదప్రస్తావము. ప్రథమాంకమున:—అర్మిలినిగాని-పు. ౪ (పద్యము ౫); కట్టా! లోకులు ౫ (౭); పుత్త్రిలకు నిజ ౮ (౧౫); అకట సీతకు ౧౪ (౩౩)[1]; ఏకార్యముచే నైనను (౩౪); ఏసాధుబుద్ధ (౩౫); సీతలవ (౩౬)[2]; లోకులకు ౧౫ (౩౭); పిన్నతటి (౩౮)[3]; నేరనిముగుదా (౩౯)[4]; గోడుగుడుచు (౪౦)[5]; ఎదను ౧౬ (౪౨)[6].

ద్వితీయాంకమున:— కుడికరము ౨౨ (౧)[7]; వెలికి ౨౮ (౯)[8].

తృతీయాంకమున :— ఓయికఠోరరం (౨౧)[9]; గళిత ౪ం (౨౧)[10]; దేవి పాదికి ౪ (౨౬)[11]; నరవి ౪౬ (౩౭)[12]; ఎదట (౩౮)[13].

షష్ఠాంకమున:— మొదలనే ౮౧ (౨౪); విరతిశయంపు (౨౬); ఆకృతి ౮౨ (౩౧); అనుభావ ౮౩ (౩౪).

సప్తమాంకమున:—మహర్షులు ధర్మములను సాక్షాత్కరించినవారు ౮౪; బాల్యమున ౮౬ (౧౫); ఇమ్మయం దెల్లను ౮౭ (౬); మందు ౮౯ (౧౨).

---

1. (భారతి) పు. ౮, కల. ౨- "...విరమ విరమా...". 2. పు. ౯, క. ౧—"త్వయా జగన్తి...". 3. పు. ౯, క. ౧—"శైశవాత్ప్రభృతి...". 4. పు. ౯, క. ౧— "అపూర్వకర్మచణ్డాల...". 5. పు. ౯, క. ౨— "దుఃఖసంవేదనాయైవ...". 6. పు. ౯, క. ౨—"విప్రమ్యా దురసి...". 7. పు. ౧౦, క. ౨- "రే హస్త...". 8. పు. ౧౧, క. ౧—"అనిర్భిన్నో...". 9. పు ౧౧, క. ౨—"అయి కఠోర...". ౧౦. పు. ౧౧, క. ౨—"త్రైకహాయన...". 11. పు. ౧౨, క. ౧—"దేవ్యా శూన్యస్య...". 12. పు. ౧౨, క. ౧—"ఉపాయానామ్...". 13. పు. ౧౨, క. ౨—"వ్యర్థమ్ యత్ర...."

ఇందు సీతావిరహశోకోద్ధురతాపరము లైనవాక్యములు తత్కారణభూత ప్రజారంజన ధర్మైకాభినివేశ తాత్పర్యకములు. నాటకము ఆదిలోనే అపవాదమూలకము. అంతమున నిరపవాదకరణ పరము. లోకరంజనము ఆదిలో త్యాగముచేత, అంతమున తత్సమాకలనపూర్వక తత్ప్రీతిబోధనముచేత; పీఠికనుసారముగా *భరతవాక్యమందు "త్రియంగంకేపి యశుంబు" అను వాక్యము అపవాద నిరసనపూర్వక ధర్మనిర్వాహపరముగాను, "శ్రేయములి సందోహంబుం బొందించుతక్" అనుట సీతాపునఃప్రాప్తిపరముగాను గ్రాహ్యములు; కడమపద్యంబును అట్లె. ఈమతమున వీరరసమునకు అంగికి కరుణ విప్రలంభము అంగము, ధర్మాభినివేశ దార్ఢ్యబోధకము.

సీతాపునస్సంప్రాప్తికై వ్యాఖ్యలయందు చేయబడునట్టి బీజావ్యారంభాది ముఖాది సమన్వయముల నెల్ల నిరపవాదసాధనకై చేయవలయును.

## కరుణవిప్రలంభ సిద్ధాంతము

†ఈనాటకంబున కరుణరసము అంగి యని యొక మతము కలదు.—సాహిత్య దర్పణమందు నాటకలక్షణమున "ఏక ఏవ భవే దఙ్గీ శృఙ్గారో వీర ఏవ వా" అని రెండు ఏవ కారములతో నియమము నిబద్ధమై యుండఁగా, "శృఙ్గారో వీరో వేతి కథనం తు సముచిత రససూచనమ్. తేనో త్తరరామచరితే కరుణరసస్య, ప్రబోధచన్ద్రోదయే శాన్తస్య చాఙ్గిత్వ మవ్యాహతమ్." అని ముద్రకజ్ఞాపిక. ఈజ్ఞాపిక గ్రాహ్యముగా నుండ లేదు. ఎట్లన— ప్రబోధ చంద్రోదయమందు వీరరసమే అంగిగాని శాంతరసము గాదని మతాంతరము గలదు; అదే సాధువుగాఁ దోఁచుచున్నది. మఱి ఈ జ్ఞాపికచే ఏరూపకమందుఁగాని తత్తల్లక్షణోక్తరసమే ఉండవలయు ననునియమము జలలిపి యగును. మఱియు నీ జ్ఞాపిక కరుణ విప్రలంభ లక్షణమునకు విరుద్ధముగా నున్నది. ఎట్లన: సా. ద.—

"యూనో రేకతరస్మిన్
గతవతి లోకాన్తరం పునర్లభ్యే,
విమనాయతే యదైక
స్తదా భవేత్కరుణవిప్రలమ్భాఖ్యః."‡

"యథా కాదమ్బర్యాం పుణ్డరీక మహాశ్వేతావృత్తాన్తే. పునరలభ్యే శరీరాన్తరేణ వాలభ్యే తు కరుణాఖ్య ఏవరసః." అని తద్వృత్తి. సీత పునర్లభ్య యైనది గావున కరుణరసము గాదు. దీనిని మఱలం దడవెద.

కరుణశబ్దము గాని, కరుణాశబ్దముగాని (దీనిం గూడ సాధకముగాఁ గొనియున్నారు), అక్కడక్కడ నాటకమందు కనఁబడుట సాధకము గాదు. అగుచేని, మాలతియందును అంగి కరుణరసమే గావలయును. ఎట్లన— అందు ౯, ౧౦ అంకములలో ఈ ప్రయోగము లున్నవి: (సకరుణం నిశ్వస్య),—(సకరుణం పరివృత్యావలోక్య చ),—(సకరుణం విముచ్య),—(సోచ్ఛ్వాసం కరుణమ్),—(సకరుణం నిశ్వస్య),—(సకరుణం సాస్రమ్),—మఱియు "కరుణ వశేదరవదనాత్" ౧౦ (౧౮), "కరాళాయతనా చ్చాయ ముచ్చర త్కరుణధ్వనిః" ౫ (౨౧): ఇంతమాత్రకే మాలతియందు కరుణము అంగి యగునా? "ప్రకరణమందు శృంగారము అంగిగా నుండు"నని తల్లక్షణము గదా. మఱియు మాలతియందు—

"అకరుణ, వితరస్మితోజ్జ్వలామ్...." ౯ అం.

అను శ్లోకమున కరుణరస మని వ్యాఖ్య. అందువలన మాలతిలో కరుణరసమే అంగి యగునా? మఱియు,

"జనస్థానే శూన్యే......" ౧ (౨౮).

అను నుత్తర రామచరిత శ్లోకమున పూర్వరామచరితాంశము వర్ణితమై యున్నది. దానిం గూర్చి ఆర్యాసప్తశతిలో—

§"భవభూతే స్సంబన్ధా......రోదితి గ్రావా!"

అని యున్నది. ["కారుణ్యమ్ కరుణా ఘృణా".

* (భారతి) పు. ౧౩, క. ౨. † పు. ౨౧౧, క. ౧. ‡ పు. ౨౦౮, క. ౨; ౨౦౬, క. ౨.
§ పు. ౧౩, క. ౧.

అసంగ. కరుణము గాదు.] ఇంతనలన మహావీర చరిత్రలోఁ గూడ కరుణరసమే అంగి యగునా? శాకుంతలమున పంచమాంకములో—

"పత్నీశార్ఙ్గరవ, అనుగచ్ఛతీయం నః కరుణపరిదేవినీ శకుంతలా..." ఇందలి కరుణశబ్దముంబట్టి శాకుంతలమందును అంగి కరుణరసమే యగునా?

*కావున కరుణశబ్దప్రయోగము కరుణాంగికత్వ సాధకము గాదు. అట్లే "కరుణోర్మయః" ౪౯(౧౨); "రామస్య కరుణో రసః" ౨౮ (౧)—ఇవియు కరుణాంగికత్వ సాధకములు గావు. ఇందు కారుణ్యకరుణ రసశబ్దములు నిరుక్తకరుణరసపరములు గావు. ఏలన, రసము కథాపురుషులయందుఁ గాని నటులందుఁ గాని ఉండదు. అది సామాజికుల హృదయమునందు ఉద్బుద్ధమగును. మఱి "కరుణస్య మూర్తిరథవా శరీరిణీ, విరహవ్యథేవ వనమేతి జానకీ" ["కరుణమూర్తియో" ౩౦(౪)]—ఇదియు సాధకము గాదా? కానే కాదు. ఇట కరుణపదము నిరుక్తకరుణరసపరమే అని యంగీకరింతుమేనియు, ఉత్ప్రేక్షాప్రభావముచేత విరహవ్యథాతిరేకమును తెలుపుచున్నదే గాని, ఈ నాటకమందు కరుణరసము అంగి యని తెలకొల్పఁజాలదు; పైగా అంగి కాదనియే నిరూపించుచున్నది; దీని పర్యాయమే "శరీరిణి విరహవ్యథేవ" ["మెయిగొన్న విరహాభిరవిం." ౩౦(౪)].

మఱి "రామస్య కరుణో రసః" ["రాముని కరుణరసము" ౨౮(౧)] అనుచో కరుణశబ్దము నిరుక్తరసపరము గాదేని కవి దానిని రస మని వ్యవహరించినాఁడే, అది యెట్లు సంగత మగును? అందురేని, ఇట్టి స్థలములలో రసశబ్దము భావపరముగాని శృంగారాది రసపరిగణనాంతర్గత కరుణరసపరము గాదు. మాళవికయందలి యీ క్రింది ప్రయోగముం గనుఁడు:—

"అక్లైరస్తర్నిహిత వచనైః..."

ఇందులకు "రసేషు సాత్త్వికవ్యభిచారిభావేషు" అని శ్రీనివాస వ్యాఖ్య. "అత్ర రసశబ్దేన ఉపచారాత్ పరిపోషాతిశయవన్తో భావాః కథ్యన్తే ప్రకృతత్వాత్. రసే వ్యతిప్రసఙ్గాత్." అని కాటయవేమ వ్యాఖ్య.

"రసము రామాదులయం దుండదని మీరు చెప్పుచున్నారు. రామాదులయం దుండునని యిదె వరసరాజీయ వచనము:—

మ. 'రమణీయోల్బణతా సమేత మగు......'

ఇందుల కేమి చెప్పెదరు?" అని యాక్షేపమేని—నిరుక్తకరణరసము రామాది నిష్ఠము గాదని సిద్ధాంతము.—సా. ద. తృ. పరి. చూచునది.

"పారిమిత్యాల్లౌకికత్వాత్......"

మఱియు— "రామస్య కరుణో రసః" †ఇత్యాది వాక్యములందు కరుణపదము నిరుక్తకరుణరస పరమయేని కవికి నాయకునియందు రసమును స్వశబ్దముచేతనే చెప్పినదోషము సంభవించును. ఎట్లన — సా. ద. సప్తమపరిచ్ఛేదము—

"అథ రసదోషానాహ—రస స్యోక్తిః స్వశబ్దేన..."; "రసస్యస్య శబ్దో రసశబ్దః శృఙ్గారాది శబ్దశ్చ—క్రమేణ యథా—'తా ముద్వీక్ష్య—'."

అట్లయిన, "రామస్య కరుణో రసః" ఇత్యాది వ్యవహారములయందు ఆశబ్దమున కర్థ మేమన, దుర్భరవిరహవ్యథయే యర్థము; అదియే కరుణ విప్రలంభోద్బోధకము. అట్లే "ఏకో రసః కరుణ ఏవ నిమిత్తభేదాత్" ‡ అను వాక్యమున దుర్భర వియోగవ్యథయే విప్రలంభ శృంగారాది వివర్తములం జెందు నని భావము.

ఈ నాటకమున కరుణావిప్రలంభ మంగి గాని కేవల కరుణము అంగి గాదని సులువుగా తెలియుటకై కరుణ రస కరుణ విప్రలంభాది స్వరూపచర్చలను అభియుక్తకృతములం గొన్నిటి నుద్ధరించెద:—

"యూనో రేకతరస్మిన్......'అయి జీవితనాథ'ఇతి విప్రలంభశృఙ్గారస్య పూర్వానురాగ...తత్ర కరుణాత్మకత్వవ్యపదేశః."

*(భారతి) పుట ౧౩, క. ౨; ౧౪, ౧-౨; ౧౬, ౨. †పు. ౨౦౩, క. ౨. ‡పు. ౨౦౪, ౨౦౬, ౨౦౭, ౨౦౮.

"శోకస్య పరిపోషః కరుణః......శోకో దుఃఖమ్."—రసతరఙ్గిణీ.

"స్యాదేకతర పఞ్చత్వే...ఏవ సః."

"చతుర్థమాహ.* స్నిగ్ధయో రేకస్య పఞ్చత్వే మరణే...నితి గమ్యమ్....ఇత్థం చతుర్ష్వపి విప్రలమ్భేషు నాయికానాయక పరతయా ఉదాహరణద్వయం ప్రదర్శితమ్."—వాగ్భటాలఙ్కారః.

"అథ విప్రలమ్భనామా....కరుణాత్మక త్వేన."

వ్యాఖ్యా — కేచిద్ధి...కరుణవిప్రలమ్భశృఙ్గార ఏవ, యథా కాళిదాసస్య 'ప్రతిపద్య మనోహరం వపుః....

"కరుణ స్సవిప్రలమ్భో.....ప్రలపేత్."—రుద్రటః.

"కరుణ విప్రలమ్భస్తు కరుణ ఏవ. యథా—'హృదయే వససీతి' ఇత్యాది రతి ప్రలాపేషు."“విప్రలమ్భోఽనవచ్ఛిన్న ఏవ; నిరాశత్వేతు కరుణ ఏవ స్యాత్."—హేమచన్ద్రి కావ్యానుశాసనమ్.

"అభ్యఙ్గ నార్థత్వే...'దళతి హృదయమ్'—అత్ర రామాదేః దుఃఖేన చిత్త మభ్యజ్యతే."

"భావో యదా రతిర్నామ..."

"పూర్వానురాగపూర్వేషు..."

"మూర్ఛా విలాపౌ కురుతే..."

[ఇది కరుణ విప్రలంభముం గూర్చి చెప్పిన వ్యుత్పత్తి.]

"'మృతేతి ప్రేత్య...'

అత్ర స్థాయినో విభావానుభావవ్యభిచారి సంయోగాత్...కరుణానన్తర సంభోగశృఙ్గారాఖ్యాం లభతే."

"ఔపమానికీ యథా—'అపి జనకసుతాయాః...' సేయం సీతావిషయిణీ రతిః తదుపమానదర్శనేన రామం రమయతే."

"...విప్రలమ్భశృఙ్గారాఖ్యాం లభతే....

ఈ ప్రకరణములో — పూర్వానురాగము, మానము, ప్రవాసము అయిన తర్వాత నాలవదైన కరుణ విప్రలంభ స్వరూపము†:—సంగతియోరేకే నాన్యతరస్యాపాయే కరుణః—అథ సంభోగః...చతుర్భిరేవ విప్రలమ్భైః ప్రకర్ష మాపద్యతే."—[ఇవలుమ నాలిగింటికిని వరుసగా ఉదాహరణములు దత్తములు. అందు కుడిది!—"కరుణేవ యథా—

'న మర్త్యలోక స్త్రిదివా...'

[టీక:—మరణానన్తర జీవనం ప్రియజనస్య స్వర్గాదపి సుఖకర మితి భావః.]"

"కరుణానన్తర మాలిఙ్గనం యథా—

'వద్ధ్రాక్షీడం సా చ జగ్రాహ...ఇద్దం స్పృష్ట్వా సీనువేలేవ భేజే'."

"పుంస ఏవ ప్రవాస కరుణే యథా—

'సీతా వేశ్మ యతో...రోదితి.'"

"అవస్థాప నార్థత్వే.....మనోవస్థాప్యతే."

"అభ్యఙ్గ నార్థత్వే...,—'దళతి హృదయమ్...' ......చిత్త మభ్యజ్యతే."—ఈయుద్ధారము మాలతిలోని (౧౨) నం గలదు.

"కరుణానన్తరే అనుభావార్థో యథా—

'అనుమరణప్రస్థితయా...జాతమ్.'

అత్ర...అనుభూయతే."

"కరుణానన్తరే సమృద్ధో యథా—'తీర్థే తోయ...' అత్ర ఉత్తరార్థేన...ప్రతిపాద్యతే."—ఇదియు సమృద్ధిక్రింద పూర్వానురాగ మాన ప్రవాసముల వెంబడి చెప్పఁబడినది.

"సోఽయం కరుణధర్మ సమన్వయః తదనన్తరేఽపి సమాససామర్థ్య ద్ద్యుతి—విప్రలమ్భ శృఙ్గారాఖ్యాం లభతే,...కరుణశ్చ."

* (భారతి) పు. ౨౦౪, ౨౦౫. † పు. ౨౦౪, క. ౧.

అని యుపక్రమించి క్రమముగా ఆ మూటిని విశదీకరించి చతుర్థమైన కరుణ విప్రలంభమును చెప్పుట.

"సంగతయో... 'హృదయే వససీతి...' ఇహ అవగ్గమిష్యతే...ఇత్యాఖ్యాయతే"—

[ఇది ప్రవాసానంతరము అవ్యవహితోక్తము కరుణ విప్రలంభ విస్తరము.]

—సరస్వతీకణ్ఠాభరణమ్.

"ఇష్టనాశా దనిష్టాప్తౌ శోకాత్మా కరుణః*—
ఇష్టనాశాత్ కరుణో యథా,— 'అయిజీవితనాథ...'
ఇత్యాది...యథా రత్నావళ్యామ్."

మృతే త్వేకత్ర...ప్రత్యాపన్నే తు నేతరః.

యథేన్దుమతీమరణా దజస్య కరుణ ఏవ రఘువంశే.† కాదమ్బర్యాం తు ప్రథమం కరుణ, ఆకాశే సరస్వతీ వచనా దూర్ధ్వం ప్రవాస శృఙ్గార ఏవ.

'ఏకతో రోదితి...దోలాయితం హృదయమ్.'
ఇత్యాదౌ రత్యుత్సాహయోః (సమావేశః అని వాక్య శేషము) ... ... — అతో భర్తు స్సంగ్రామరసికతయా శౌర్యమేవ ‡ ప్రకాశయన్ ప్రియతమా కరుణో తీరమేవ పుష్ణాతి. —దశరూపమ్.

"పుత్త్రాది వియోగమరణాదిజన్మా వైక్లవ్యాఖ్యశ్చిత్తవృత్తివిశేషః శోకః......కరుణ విప్రలమ్భాఖ్య మిచ్ఛన్తి."

—రసగఙ్గాధరమ్.

"సవిప్రలమ్భో విజ్ఞేయః...ప్రవాస కరుణా వితి.
ద్వయో రేకస్య మరణే...కరుణే ఽపి ప్రవాసవత్.
యథా— 'అస్త మదనవధూ రుపప్లవాన్తమ్.'
......యత్ర సో ఽస్తి తత్ర విప్రలమ్భ ఏవ..."¶

—రసార్ణవసుధాకరః.

"యూనో రేకతరస్మిన్........భవే త్కరుణ విప్రలమ్భాఖ్యః.

యథా—కాదమ్బర్యాం పుణ్డరీక మహాశ్వేతా వృత్తాన్తేః......'మరణరూప విశేషసంభవ త్తద్భిన్న మేవ ఇతి మన్యన్తే."

యత్ర తు రతిః ప్రకృష్టా
నాభీష్ట ముపైతి విప్రలమ్భో ఽసౌ.||
అభీష్టం నాయకం నాయికాం వా.

సచ పూర్వరాగ మాన
ప్రవాస కరుణాత్మక శ్చతుర్ధా స్యాత్.§

[టీ.—ప్రకరణాదినా ప్రధానత్వం ప్రాప్తా-కరుణాదౌ శోకోద్దీపనతయా రతిసత్త్వేన తత్రాతివ్యాప్తి వారణాయ ప్రకృష్టేతి.]" —సాహిత్యదర్పణః.

"విప్రలమ్భాభిధానో ఽయం శృఙ్గారస్స్యా చ్చతుర్విధః
పూర్వానురాగమానాఖ్యప్రవాస కరుణాత్మనా.**
యత్రైకస్మిన్......నాయకః ...స్మృతో యథా.
కేషాఞ్చి త్కరుణభ్రాన్తిః కారుణ్యా దత్ర జాయతే.
...........................రతిమూలజామ్.
స్త్రీపుంసయోర్వ్యపదేశ...కరుణస్స్యాత్స నాన్యథా,
తస్మా ద్విప్రలమ్భశృఙ్గార......విరళం బుధైః."

శృఙ్గారతిలకః.

"కరుణః శోకప్రకృతిః...నాయక స్తత్ర."

—రుద్రటః.

"అత్ర హి రామవనవాసజనితశోకార్తస్య...
కరుణవిప్రలమ్భో ఽయ మాహ.
శోకస్థాయితయా...పునస్సంభోగహేతుకః."¶¶

—సాహిత్యదర్పణః.

"కరుణరసోదాహరణమ్—
యస్య భృత్యాశ్చ...మూలఫలా న్యయమ్." రామా.

‖ కరుణరసమున శోకస్థాయికేయూ......ఉత్తర రామచరితమం దెక్కడను జూచినను రతి స్థాయిగానే యున్నది. —కావ్యదీపికా.

*(భారతి) పు. ౧౩. †పు. ౨౦౯. ‡పు. ౨౧౦. ¶పు. ౨౦౯. ||పు. ౧౯. §పు. ౨౦౮. **పు ౨౦౬. ¶¶పు. ౨౦౮. ‖పు. ౧౯.

………పిమ్మట సీత మరల లభించినది. లభించుటకు రాముని విలాపము కరుణ విప్రలంభము. [ఇట దర్పణవాక్యముం గూర్చిన టీకావాక్యమున కర్థము— మరల లభింపనియెడల రతి నశించుటచేతను, ఉత్కట శోకము కలిమిచేతను కరుణరసము గాని విప్రలంభము గాదు.]

ఈ నాటకమున రతి నాశ మొందక ఉత్కటముగా నున్నందునను, ప్రత్యాశయు కలిగినందునను అంగి విప్రలంభ మయినది అని సిద్ధాంతము.

* * * * *

వే. వేం. శాస్త్రులవారి ఈ చర్చను, శాస్త్రిగారి ఉక్తరసవిచారమును రసజ్ఞులు పరికింతురుగాక. సత్యము గ్రహించుటకు ధర్మజ్ఞులు అధికారులు అని మఱియొకమారు మనవి.

---

## సుమార్చన

శ్రీ. శ్రీనివాసరావు గారు (కవితాసమితి)

నే జరియింతు నుజ్జ్వలవనీ రమణీయ వసంత వీథులన్
పూజకు కోర్కె నాయెద రవుల్కొను నింతట; నంతలో ప్రభా
భాజనమైన నాపసిడి పళ్లెము తాలిచి వృక్షవాటికా
రాజితమార్గగామి నయి రా గనుపట్టు లతాంతసంతతుల్.

మౌనమనోహరమ్ముగ సుమప్రతతుల్ నను పల్కరించి, పూ
జానవభాగ్యవాంఛనలు జాలుకొనన్ కను లింత విచ్చి ఆ
హ్వానములన్ రచించెను; మదంగుళు లించుక సంచలించగా
వానిని కోసి పోసికొని పళ్లెమునన్, పయనింతు మెల్లగన్.

ఈవిరిదోట దాటుచు బహిఃపథమందున కాలు పెట్టగా
బోవు ముహూర్తవేళ తలపోయగ బోని మహోత్సవమ్ముగా
నీ వొక రమ్యమూర్తి వయి నిల్తువు ముంగిట; నీపదద్వయిన్
పూవులపళ్లెరమ్ము దిగబోసి తలంకుదు నేను లజ్జచేన్.

చాల చలించు చూడ్కు లలసమ్ముగ తావక దివ్యమూర్తి నే
పీలుననో కనుంగొని అవేద్యమనోజ్ఞసుఖానుభూతులన్
తేలగ, నాయెడంద భవదీయపదానతభాగ్యరేఖలన్
వ్రాలు నవప్రఫుల్లసుమనస్సుమమాకృతి నర్చనారతిన్!

---




దాహము లేదు, తాగ నంటాడు

## దసరా: గిలకలు

కె. నారాయణాచార్యులు గారు (ఆంధ్రగీర్వాణ సాహిత్య పరిషత్తు)

ఆసమాన ప్రమదాదరంబున సముద్యన్మాలతీ మంజుల
ప్రసవాళిం గొని చెంత నుండు మనుజవ్రాతంబుపైఁ జిమ్మి ప
ద్య సమూహంబులఁ బాడుచున్ నగరరథ్యల్ మారు మ్రోయింపుచున్
దసరాపండుగలోన బాలురు మహానందాత్ములై యొప్పెడిన్.

రంగులచేత నెంతయు హొరంగగు బాణములం గ్రహించి క్రే
వం గలవారలం గుసుమవర్ణనిమగ్నులఁ జేసి హర్షతన్
బొంగుచు గెంతుచున్ బడుచుఁ బూవులకై కలహించుచున్న యు
ద్వ్యం గలబాలకావళుల రీతిఁ దలంపఁగఁ జోద్యమయ్యెడిన్.

పోడిమినూపె మన్మథుని బొల్పుగ నొక్కసి రుద్రుఁ డింకఁ దా
నేడకుఁ బోఁగలండనుచు నేచిన కిన్క రతీశ సృష్టి వే
జాడలఁ జేసె శౌరి యన జా నగు సూన శరాళిఁ గొంచు నే
వాడలఁ జూచినన్ భువి నవార్యగతిం జరియింత్రు డింభకుల్.

బాలకజాల సంపఠిత పద్యనికాయనినాద మెంతయున్
బాలకరాంచదంబక విభాసిత సూన పరీమళాగతో
ద్వేల మిళిందబృంద పృథుపేశలగాన నినాద లీనమై
లాలితవృత్తి నొప్పు సవిలాసముగా శరదుత్సవంబునన్.

పద్యములన్ బఠించిన నపార ముదంబున గేస్తు లిచ్చు ద్రా
క్షాద్యములైన ఖాద్యముల నాదటఁ బంచి గురుం డొసంగఁగా
హృద్యములౌట వాని భుజియించియు నన్యులచేత నుండు తత్
ఖాద్యనికాయమున్ బలిమిఁగాఁ గొని తిందురు ధూర్తడింభకుల్.

ప్రతిపురి శారదోత్సవ విభాసుర వేళలయందు గాయకేం
ద్రతతి మనోజ్ఞగాననినదంబులతో, ఘనవేదపాఠ సం
తతిరుతితోఁ గిశోరక సుధానిభపద్య జయస్వనంబుతో
నతులిత శోభతో నుతి మహా ప్రమదావహలీల నొప్పెడిన్.

---

# బెంగాలు కెమికల్స్‌వారి
# 3 దివ్యౌషధములు



## అక్వపిక్చోటిస్ కాంక్

అజీర్ణ వ్యాధి, మందాగ్ని మొదలైన ఉదర సంబంధమైన వ్యాధులకు దివ్యౌషధము. నిత్యము భోజనానంతరం సేవించిన కలరా రానీయకుండ కాపాడగలదు.



## పికోటిస్ బిళ్లలు

అక్వపికోటిస్ కాంక్ నకు బదులు తయారైనది. ఒకబిళ్ల సేవించినవెంటనే బాధ నివారణమగును.




## లిక్విడ్ ఎక్‌స్ట్రాక్ట్ ఆఫ్ కాల్‌మెగ్

లివర్ సంబంధమైన వ్యాధులకు గుణమివ్వగలదు. పెద్దలుకూడ సేవింపదగినది.

బెంగాల్ కెమికల్ వారిచే తయారైన ఔషధములనే కోరుడు. మట్టపురకం కొనకుడు.

## బెంగాల్ కెమికల్ అండ్
## ఫార్మక్యూటికల్ వర్క్సు లిమిటెడ్, కలకత్తా.



## తోడిదొంగలు*
(ఏకాంక నాటకము)

ముద్దా విశ్వనాథం గారు (కవితాసమితి)

[డేరాలో అలెగ్జాండరు ప్రభువు; సేనాదళము; చక్రవర్తియెదుట కాళ్లకు, చేతులకు సంకెలలు వేయబడిన భయంకరస్వరూపుడగు నొక ఖైదీ.]

అలెగ్జాండరు

ఓహో! కొల్లగొనుటలో ననమాన ప్రజ్ఞాధురీణు డని పేరు మ్రోగుచున్న థ్రేషియను దొంగలనాయకుడవు నీవేనా?

దొంగ

నేను థ్రేషియను దేశస్థుడను, వీరుడను.

అలెగ్జాండరు

వీరుడవా!—దొంగవు, దోపిడిగాడవు, హంతకుడవు! దేశమునకు పీడవు! నీ సాహసమునకు సంతసించితిని గాని, నీనేరములు కనిపెట్టి తగిన శిక్ష విధింపక తప్పదు.

దొంగ

నే నేమి చేసితినని నాపై నేరము మోపెదవు?

అలెగ్జాండరు

నా యధికారమును నీవు తృణీకరింపలేదా? దేశశాంతికి భంగము కలుగజేయలేదా? ప్రాణములు తీయుటలోను, ఆస్తుల కొల్లగొనుటలోను, నీజీవితము వినియోగింప లేదా?

దొంగ

అలెగ్జాండర్ ప్రభూ! నేను ఖైదీని. నీవు సెలవిచ్చినయంశములు నే నాలకించెదను. నీవు విధించుశిక్షకు పాత్రుడను. కాని సూక్ష్మశరీరమగు నా"యాత్మ" జయింపరానిది సుమా! నీవు నాపై మోపుఅపనిందలకు ప్రత్యుత్తర మియ్యవలసినచో, నేను "స్వతంత్రుడ"గనే జవాబిత్తును.

అలెగ్జాండరు

ధారాళముగ మాటలాడుము. నాకృపకు పాత్రులైనంతనే, ఎవ్వరినిగాని, నే నణచివైతునని తలపకుము.

దొంగ

అట్లైనచో ఎదురుప్రశ్నచే నీకు జవాబియ్యవలసియున్నది. నీజీవిత మెటుల గడపితివి?

అలెగ్జాండరు

వీరునివలె. "యశోదేవత" నడుగుము, ఆమెయే నీకు ప్రత్యుత్తర మియ్యగలదు. ధైర్యశాలులలో నే నగ్రగణ్యుడను—చక్రవర్తులలో కెల్ల పరాక్రమవంతుడను—దేశములను జయించుటలో మహాయోధుడను.

దొంగ

నన్ను గురించి మాత్రము పలుకదా, యశోదేవత? ఇంత సాహసమైన జట్టు, ఇట్టి ధైర్యశాలియగు నాయకుని క్రింద నిదివఱ కెవ్వరైన

*'Evenings at Home' నుండి.

నుండెనా? నిజముగ నుండెనా? — కాని ప్రజలు చెప్పుకొనుట నా కిష్టములేదు. నేను పట్టుపడుట అంత తేలికపని కాదని నీకు స్వానుభవమున తేటతెల్లమై గదా!

అలెగ్జాండరు

అయినప్పటికిని, నీవు దొంగవు గాక మరేమి? నీచుడవును, అయోగ్యుడవు నగు దొంగవు!

దొంగ

సరి, దేశములు జయించిన పరాక్రమశాలి యననేమి? అంతములేని రాజ్యకాంక్షచే, న్యాయము, ధర్మము విడిచి, జనులచంపి, దేశముల కొల్లగొని, ప్రశాంతి ధ్వంసము చేసి, క్షామదేవతను విడియించుచు, నీవు కూడ క్రూరరాక్షసుని వలె దేశము లన్నియు గ్రుమ్మరిలలేదా? వందమంది బలగముతో, కొద్దిప్రదేశములో నేను చేసినపనిని అనేకవేల మందితో రాజ్యము లన్నిటిని సంక్షోభింప చేయుటలో నీవు నిర్వహించితివి. జనసామాన్యమును నేను నాశనము చేసితిని; ప్రభువులను, రాజపుత్రులను నీవు నాశము గావించితివి. నేను కొలదిపల్లెలను తగులబెట్టితిని గాని, నీవు శృంగారమగు పట్టణములను, రాజ్యములను మట్టముచేసితివి. అట్టితరి, నీకును నాకును గలవ్యత్యాస మేమి? జన్మచే నీవు చక్రవర్తివి. నేను సామాన్య మానవుడను. అందుచే నీవు నాకంటె శక్తిమంతుడవగు దొంగ వైతివి.

అలెగ్జాండరు

నేను కొల్లగొనుటలో నెంత ప్రభుత్వాధికారము జూపితినో, తిరిగి దానము చేయుటలో నట్టికు మిక్కుటముగ క్షాత్రము వెలిబుచ్చితిని. కొన్ని రాజ్యములు తలక్రిందు చేసినప్పటికి, నంతకంటె గొప్పగ మరికొన్ని స్థాపించితిని వాణిజ్యముకళలు మున్నగువానినిపోషించితిని.

దొంగ

నేను కూడ ధనవంతులను దోచి, బీదలకు ధారాళముగ పంచిపెట్టితిని. మిక్కిలి భయంకరమగు మానవజాతులను తరిబీదు చేసి, క్రమమగు శిక్షలో నుంచితిని. శిష్టులను రక్షించుట కభయహస్త మొగ్గితిని. నీవు చెప్పు వేదాంతము నాకంతగ నర్థమగుట లేదు కాని, మొత్తముమీద నీవును నేనుకూడ ప్రపంచమునకు చేసిన ద్రోహమునకు పరిహార మెద్దియు లేదు.

అలెగ్జాండరు

ఇంతట విరమించుము. (సేవకులతో) ఈతని బంధవిముక్తుని జేసి, యిటుపై నెంతయు గౌరవింపుడు.

(దొంగ నిష్క్రమించును.)

(స్వ) ఆహా! మా యిరువురకు నింతపోలిక యున్నదా!!

(అందఱు నిష్క్రమింతురు.)

---

# రామచంద్ర ప్రభు శతకము

కూచి నరసింహము గారు

(వెనుకటి సంచిక తరువాయి)

నోగులొ నెత్తగు రెంకుఁబీటలపయి న్గూర్చుండ యత్నించినన్;
వగవా నిర్వుర స్వాములం గొలుచు దుర్భాగ్యంబు ప్రాప్తించినన్;
జగతి న్నీకు ధనాధిదేవతకు సర్వస్వము న్ముంకించినన్,
సుగము న్నే మఱి కోలుపోదు మిట నందు న్రామచంద్రప్రభూ!

తన కే దన్యులు చేయఁగావలయు నన్తాత్పర్యమో తాను దా
నిని జేయన్వలె వారి; కన్యు లిఁక దేనిం జేయఁ దా నొచ్చు దా
నిని జేయం దగ దెప్డు డన్యులకు—దీనిం బట్టి సాగించు జీ
వన మెవ్వాఁ డతఁడౌను రెంట సుఖి దేవా! రామచంద్రప్రభూ!

ఏ దెట్లుండును మ్రోల నద్దమె యటులే వీక్షింపనౌ స్వచ్ఛమౌ
నాదర్శంబున, నట్లె ద్రష్టలకుఁ జిత్తావస్థ యెట్లుండు న
ట్లే దృష్టంబగు లోక మెల్లఁ; గనుకన్ సృష్టిక్షితంబైన దో
షాదుల్మాయవియె, కావు దానివి, మహాత్మా రామచంద్రప్రభూ!

కోరన్రా దిహసౌఖ్య మేది నిను భక్తుం; డల్ల రాధాంగనా
పార ప్రేమయు నిస్పృహత్వ మెద దైవాఱంగ వాసోజలా
హారాదు ల్సకలంబు నీవె యనుచున్ ధ్యానింపనౌఁ; బ్రార్థనన్
జేరం బాడుట మాకుఁ గూడదు కృపాబ్ధీ! రామచంద్రప్రభూ!

శారీరామయపీడఁ బోవును మనః స్వాస్థ్యంబు; లోలాంబుకా
సారంబట్టులు చిత్త ముండునెడ ధ్వస్తంబౌను ధ్యానంబు, నిం
డారం భక్తిఫలంబు నిచ్చుట కవశ్యం బందుచేఁ బూర్ణ దే
హారోగ్యం బని పెద్ద లందురు రమేశా! రామచంద్రప్రభూ!

స్వాపాహారజలంబుల న్మరలఁ బుష్టంబయ్యెడు న్జీవన
వ్యాపారంబుల జీర్ణమై చెడిన దేహాంశంబు; లవ్వానిచే

నేఁపుం గాంచు మనంబుగూడఁ; గనుక న్స్వేయార్థ నిర్వృత్తికై
మాపంగూడదు భక్తసారము మహాత్మా! రామచంద్రప్రభూ!

సంతానార్థమె పెండ్లి కాని సురతేచ్ఛాతృప్తి సంభూతహా
సంతోషంబున కెప్డు గాదని శ్రుతు ల్శాస్త్రంబులు న్జెప్పఁగా,
గాంతాభోగపరాయణత్వము నణంగం ద్రొక్కి గేస్తుండు తా
శాంతి న్దాన్తి గడింపఁ జూడవలె, నీశా! రామచంద్రప్రభూ!

విమలాంతఃకరణంబు, దేహబలము, న్విఖ్యాతధీశక్తి, స్థై
ర్యము, విత్తాఢ్యత, నూత్నకల్పనసమర్థత్వంబు, దేశంబు, స
ర్వముఁ, గోల్పోవుటకుం గతం బరయ నార్యస్తుత్యసద్బ్రహ్మచ
ర్యము లేకుంటయె యంచుఁ దోఁచు రఘువీరా! రామచంద్రప్రభూ!

క్రిమిసందోహమువంటి సంతతి, కభుక్తి న్దేశమందెల్లఁ బ్రే
తముల ట్లుండెడువారికిం గొదవ యొకింత న్లేదు! సద్బ్రహ్మచ
ర్యము తర్వాత గృహస్థులై కనిన శౌర్యస్ఫీతు లావారు మా
త్రము కాన్పింపరు నిన్ను బోంట్లు మహితాత్మా! రామచంద్రప్రభూ!

వాసంబందునఁ బెద్దవారినడత, ల్వైవాహికాచారముల్,
గ్రాసంబందున లేమి నేమము,లసద్గ్రంథాదులు, స్రంతుకై
యోషాసంకల్పలఘుప్రసంగములు, నిత్యాదు ల్మఱెన్నో శమా
భ్యాసోద్యమప్రతిబంధకంబు లగు దేవా! రామచంద్రప్రభూ!

నీరాహార సుషుప్తి వాంఛల నెటు ల్నిర్జింపలేఁడో నరుం
డారీతి న్వనితాభిలాషయును దా నడ్డంగ లేఁడంట ని
స్సారాసత్యపుమాట కానియెడ, భీష్మప్రాయు లైనట్టి లో
కారాధ్యు ల్భువి నుంట సాధ్య మెపు డెట్లో? రామచంద్రప్రభూ!

హిందూదేశపుఁ బ్రస్తుతస్థితికి నెన్నేఁ గారణా లున్న; వి
కందు న్బాల్యవివాహము ల్కనఁగ మూలాధారము ల్పల్విప
త్సందోహంబుల కంచుఁ జెప్పెదరు పెద్ద ల్పెక్కు; రామాట ని
స్సందేహం బని నాకుఁ దోఁచెడు రమేశా! రామచంద్రప్రభూ!

తిను నాహారముఁ బట్టి యుండు మనము న్దేహంబు; జిహ్వేంద్రియం
బును స్వాధీనము చేసికొన్న నితరంబు ల్వశ్యమై యుండుఁ; గా
వున, నద్దానిని బ్రహ్మచర్య నియమంబు న్నిల్పుకోఁ జూచువాఁ
డు నిరోధించుక వర్తిల నవలయు నెప్డు న్రామచంద్రప్రభూ!

శమసంపత్తి, చిరాయు, వద్భుతమనీషాశక్తి, యారోగ్య తే
జముఁ, దత్సృష్టి రహస్యవేత్తృతయు, నిచ్ఛానత్వపుం బెంపు, స
త్యముగా నిన్ను నెఱుంగఁజాలు మహితత్వంబు, స్సదా బ్రహ్మచ
ర్యమునం గల్గు నమూల్య లాభములు దేవా! రామచంద్రప్రభూ!

విమలస్వాంతత నిన్నుఁ గొల్వనో, రుజావృద్ధత్వపీడార్తు లౌ
తమ వారిం బరిచర్యలం దనుపనో, దైన్యస్థమా నాత్మదే
శము సేవింపనో, పెండ్లి మానుకొని యిచ్ఛాపూర్వక బ్రహ్మచ
ర్యముతో నుందురు కొంద ఱుత్తములు దేవా! రామచంద్రప్రభూ!

త న్నట్లే సకలేతరోరుతర భూతవ్రాతముం జూచుకొం
చున్నం గష్టతమంపుఁ గృత్య మగుచో, నిం కన్యజీవాళియం
దు నైసర్గికవృత్తిమైఁ బొడము నా దుర్ద్వేషభావంబుతోఁ
దన్ను న్భక్తుఁడు చూచుకోవలయు సీతారామచంద్రప్రభూ!

వినయం బన్న సమస్తసద్గుణము లావిర్భూత మౌ; నద్ది భ
క్తున కావశ్యక మైనలక్షణము; తన్మూలంబుపై నిల్చుఁ ద
క్కిన యాధ్యాత్మికవృద్ధి యంతయును, ముక్తిం గూర్చు సామగ్రియుఁ;
ఘనసౌధంబు పునాదిపైనె నిలుచుంగా! రామచంద్రప్రభూ!

ధనవిద్యాదుల పెంపుచే నరున కౌద్ధత్యంబు రానున్నచోఁ
దనకంటె న్బలవత్తరుం దలఁచి డిందం జేయు నౌ దాని; నిం
కను గష్టంబులఁ గల్గుకుండు నడఁపంగా నౌఁ బ్రపంచంబులోఁ
దనకంటెం బ్రథుకష్టజీవిఁ గని; సీతారామచంద్రప్రభూ!

రానున్నట్టి విపత్తుల న్నరుఁడు నేరం డడ్డి యాఁపంగఁ దాఁ;
గాన, న్వానిని ధీరచిత్తతఁ దితిక్ష నైనఁచు కొం టొప్పు; నేఁ

జేని న్నీరధిఁ గూలి భీతధృతియై యిట్టట్టు తాఁ గొట్టుకో
కానీటం బడియున్నఁ, దేలి మను; నీశా! రామచంద్రప్రభూ!

శ్రమ మెంతెక్కువ యైన దానివెనుకం బ్రాప్తించుసౌఖ్యంబు గా
టమె యౌ నంతగ; నిన్నె నమ్ముకొనియుంటం గల్గుమోదంబుతో
సమమౌ మోదము లేమి, నద్ది యగుఁ గష్టం బందునే కానఁ, గ
ష్టములే భక్తులు కోరుకొందు రెపు డీశా! రామచంద్రప్రభూ!

ఎవఁడుం డాఁ దనచర్మచక్షువులతో, హృద్భావనాతీతమౌ,
రవికోటిద్యుతి మించు దీప్తి గలదౌ, బ్రహ్మాదిదేవార్చ్యమౌ
భవదీయాకృతిఁ జూడఁ లేఁ డని కృప న్భావించి యప్పప్పు డీ
వవతారంబుల నెత్తుచుందు పరమేశా! రామచంద్రప్రభూ!

"నీపాపంబులఁ బట్టి నీగతులు నిర్ణీతంబు లౌ" నందు వే,
నోప న్నే నిలువంగ నీయెదుట న్యాయోద్వృత్తికిన్! నీ విఁ కే
పాపౌఘుం బవలీల తూలిత మొనర్ప న్దక్షమౌ సత్కృపా
కూపారంబవు! నన్నుఁ బ్రోవ భర మొక్కో? రామచంద్రప్రభూ!

"నీకర్మం"బని కన్ను దుడ్చి చను, దంతే కాని, నీవే సదా
వాకు న్భావముఁ గర్వము న్నడపి సర్వప్రాణులం ద్రిప్పు దీ
లోకంబందున; నిద్ది దూషణముగా లో నెంచి కోపింప క
య్యా! కే ల్మోడ్చి నమస్కరింతుఁ బరమాత్మా! రామచంద్రప్రభూ!

వందనము సుందరాంగా!-వందన మపవర్గసౌఖ్య వరదాయి! ప్రభూ!
వందనము దేవదేవా!-వందన మో జానకీధవా! శ్రీరామా!

వందన మానందాత్మక!-వందన మో చిత్స్వరూప! వందన మభవా!
వందనము భక్తకల్పక!-వందన మఖిలప్రపంచపాలక! రామా!

శ్రీరామా! శ్రీరామా!-శ్రీరామా! రామ! రామ! శ్రీరఘురామ !
శ్రీరామా! శ్రీరామా!-శ్రీరామా! రామ! రామ! సీతారామా!

---




నేను పుట్టిన వేళావిశేష మేమోగాని, నాకు చిన్నప్పటినుంచీ కలహమంటేమహానందం. చిన్నప్పుడు నాతోడివాళ్లతో ఏ విషయాన్ని గురించి అయినా ఊరికే వాదిస్తూ వుండేవాణ్ణి. తర్వాతతర్వాత విద్యార్థిదశలో 'డిబేటింగ్ సొసైటీ'లో వాదన. ఒకళ్లు 'ఔ'నన్నది నేను 'కా'దనాలె; వాళ్లు 'కా' దన్నది నే 'నౌ' ననాలె—ఇది నాకు సహజస్వభావ మయింది. ఆతర్వాత మా ఆవిడతో కలహం. 'కలహ' మన్నపదాని కెన్ని అర్థా లున్నా నా'కలహా'నికి మాత్రం 'ప్రణయకలహ' మనే అర్థం. నే నొకళ్లజోలికి పోను. కాని మా ఆవిడతో 'కలహం' లేకుండా ఉండలేను. నాది "ప్రేమైక జీవన"మని నాభావన. అందుచేత నా మనోగత మేమిటంటే, ఏదో వకక్షుద్రకలహం అప్పుడప్పుడు లేకపోతే నాకు 'ప్రేమ'లోని రుచి రుచికరంగా ఉండడంలేదు. అందుచేత కారణం లేనిదే—(ప్రణయకలహానికి కారణమే లేకుంటుందా?") మా ఆవిడను కలహంలోకి దింపేవాణ్ణి. ఇది నాకు సహజస్వభావ మయింది. ఏమి చేసినా ఆ స్వభావం మారకుండా నున్నది. క్రమేణా అది నాలో వక పెద్దజాడ్యంగా పరిణమించింది. అది నాలో జీర్ణించి ఉండి ఏవారం రోజులకో, ఏపదిరోజులకో, ముఖ్యంగా నాకు సెలవు దినాల్లో, తలయెత్తేది. ఇది నాకొక వెఱ్ఱి—కాని ఎన్నో నెంబరు వెఱ్ఱో?

'ప్రేమ' అంటే నేమో నాకు తెలియదు. కాని నా భార్యను నేను ప్రేమిస్తున్నానని మాత్రం నాకు తెలుసును. ఎట్లా? ప్రేమ తత్త్వ మెటువంటిది? ఏమో! నాకు తెలిసిన ప్రేమ తత్త్వం వేరే! నాప్రేమతత్త్వం నాది! ఒకళ్ల అభిప్రాయంతో నే నేకీభవిస్తానో లేదో, నాతో నొకళ్లు ఏకీభవిస్తారో లేదో, నా కవసరం లేదు. నాతత్త్వం నాది. స్పష్టంగా చెబుతాను:

ప్రేమ యెల్లప్పుడూ జాగ్రతావస్థలో నుండాలె. దినదినాభివృద్ధి కావాలె. నిష్కళంకంగా వుండాలె. అందులో నేవిధమైన మిశ్రమమూ నుండగూడదు—అని.

కాని జాగ్రతావస్థలో నున్నదో లేదో యెట్లా తెలుసుకోవచ్చును? నిష్కారణ కలహాలవల్ల! నిర్బాధాకరమైన కలహాలవల్ల! అందులోనూ మితి ఉంది; ఆనంద ముంది. ఒక్క ఉదాహరణ మిస్తాను. మనము సర్దాగా

స్నానం చేయడానికి చెరువుకు పోతాము. చెరువులో నీళ్లు నిశ్చలంగా ఉంటుందామె. ఇంకా దాన్నిపక్కనే ఒక నది ప్రవహిస్తూ వున్నది. పైనుండి కెరటాలతో భయంకరంగా గర్జిస్తూ ప్రవాహం వస్తూవుంది. ఈ రెంటిని చూడండి. అప్పుడు నిశ్చయించుకోండి. చెరువులో స్నానం చేస్తామా, నదిలో స్నానం చేస్తామా? ఎందులో స్నానంచేయడాని కానందంగా వుంటుందో— ఉత్సాహంగా ఉంటుందో—

ఇంకొకటి— సర్కసులో పెద్ద పులులతోనూ సింహాలతోనూ ఆటలాడించే వాళ్లని చూడండి. పడుక్కున్న సింహాలతో ఆడతారా? లేపుతారు. వాటికి పౌరుషం, కోపం పుట్టించేలాగ పొడుస్తారు. అవి నోరు తెరచుకొని వాళ్లమీద దూకవస్తవి. అప్పుడు వాటిచేత అవి చేయవలసిన పనులు చేయిస్తారు.

మరొక్కటి— పాములవాడు పాముల బుట్ట తెరుస్తాడు. అందులో పాము పడుక్కొని వుంటుంది. దాన్ని ఆడించడ మెట్లా? దాన్ని బుర్రతోనో, చేత్తోనో పొడుస్తాడు. దానికి నొప్పి తగిలి 'భుస్' అంటూ వాడ్ని పొడవ వస్తుంది. అప్పుడు దాన్ని ఆడిస్తాడు.

ఈవుదాహరణాలు చాలు! ఇంక ఆలోచించండి— ప్రేమ సమంగా క్రమంగా సాగి పోతూవుంటే అందులో అందం, చందం, సారస్యం లేదు. ఆనందం లేదు. అది మాటికి మాటికీ 'బుస్ బుస్' అంటూ వుండాలె. ఎదురు తిరుగుతూ వుండాలె. ఉద్రేకం కలుగుతూ వుండాలె. అంతతో నది చల్లారుతూవుండాలె. ఇది నా ప్రేమ తత్త్వం! చిత్రం.

కాబట్టి వారంరోజుల కొక్కసారి అయినా నేను కలహం లేకుండా వుండలేను. నాకు తగ్గదే మా ఆవిడ. ముక్కుమీదనే వుంటుంది కోపం! చీదితేనే ముక్కూడిపోతుంది! అంచేత నాకు కలహానికి కారణం సులభంగా దొరికేది.

ఇంక యింతటితో నీ ఉపోద్ఘాతం చాలించి మొన్న మొన్న జరిగిన ఒకవిషయం చెబుతాను.

దసరా సమీపిస్తూన్నది. రేపు, ఎల్లుండి కూడా సెలవులు. ఇంట్లోనే వుంటాను. కాబట్టి కలహం వుండక తప్పదు. కాని, కారణ ముండవలె గదా! ఆలోచిస్తూన్నాను. ఒక్కదినమంతా ఆలోచించాను. అనేక కారణాలు పొడగట్టినాయి. కాని ఒక్కటైనా నచ్చలేదు. ఎంచేత నంటారేమో! మా యిద్దరి మధ్య కలహం మూడోవారికి తెలియకూడదు. మూడోవారి యెదుట మొహం చిట్లింపులు, మార్మోహాలు, అలుగులు ఉండగూడదు. ఎంతైనా లోలోపలనే కుళ్ళాలె—బయటికి మొహం మీద ఆనందం, ఉత్సాహం, సంతృప్తి, ఉల్లాసం, సుఖమయచిహ్నా లెన్నో అన్నీ కనబడుతూ వుండాలె. అట్లా లేకపోతే రాద్ధాంతం చేసేవాణ్ణి! ఇప్పుడు చాలాకాలానికి, మా పినతల్లికూతురు (అనగా—మా అక్కయ్య), ఆమెమగడు, ఆ రేండ్లకొడుకూ మాయింటికివచ్చి వున్నారు. పండక్కోసమని తీసుకొచ్చాము.

వాళ్ల యెదట మాకు కలహ మెట్లా? కాబట్టి యీమారు కలహం, ముఖ్యంగా మనోమనస్సాక్షిగా వుండి పోవాలె! ఆలోచిస్తూన్నాను. తప్పులు వెదుకుతున్నాను. వెదకేవాళ్లకు తప్పులే కనబడక పోతాయా? ఎంతటి క్షుద్రకారణ మైనా చాలు ననుకున్నాను.

ఆనాడు ఎప్పటిలాగా కోర్టుకు వెళ్లుతూన్నాను. నా కెదురుగా పోస్టుబంట్రోతు వచ్చాడు. నాకు ఉత్తరా లున్నాయా అని అడిగినాను. అందుమీాదట వాడు ఒక చిన్నపార్సలు (ఇన్సూరు చేసింది) చూపాడు. దానిమీాద మా ఆవిడపైవిలాసం ఉంది. ఆపార్సలు ఆవిడ అన్నగారు పంపారు. అందులో నేమున్నదో



నాకు తెలుసును. ఇంట్లో యిమ్మని బంట్రోతుతో చెప్పి నాతోవ నేను పట్టాను. కాని, నాలో నొకవిధమైన వికారం కలగ సాగింది. ఆ పార్సలు నా పేరిటికి రాక నా భార్యపేరిటికి వచ్చింది. అదే నాకు కలిగిన వికారానికి కారణం! అయినా, ఆవిడచుట్టాలు, అన్నదమ్ములు మొదలైనవారు ఆవిడపేరిటికే జాబులు వ్రాస్తూండేవారు సాధారణంగాను. నా పేరిటికెప్పుడో వకప్పుడు వ్రాసేవారు. జాబులు వ్రాయడమంటేనూ, వచ్చిన జాబులకు జబాబులు వ్రాయడమంటేనూ నాకు మహాచెడ్డ బద్ధకం! అందువల్ల మావాళ్లకుకూడా ఆవిడే జాబులు వ్రాస్తూవుండేది. ఇట్లున్నప్పటికిన్నీ ఆపార్సలు నాపేరిటికి రాలేదే అన్నకోపం— కించిత్కోపం—నాకు కలిగింది! ఈ కోపంతోటి—ఈ ఆందోళనతోటి కోర్టులో నే నేమేమి చేశానో నాకు జ్ఞాపకంలేదు. కాని, తప్పుపను లేమీా చేయలేదు సుమండీ! మామూలు వేళ కింటికి వచ్చాను. వస్తూవస్తూ తోవలో నేను పార్సలుసంగతి ఆవిడను అడగకూడదని మనసులో నిశ్చయంచేసుకొన్నాను. ఇంతమాత్రం నిజం.

ఇంటికొచ్చాను. మామూలుప్రకారంగా కాళ్లూ, చేతులూ, మొహం చన్నీళ్లతో కడుక్కొని, ఫలాహారంచేసి, 'టీ' తాగి, తమలపాకుల 'బీడీ' నములుతూ, 'సిజర్సు' కాలుస్తూ, మొననొన్న వచ్చిన 'భారతి' చదువుకుంటూ వాలుడుకుర్చీమీాద వాలి వున్నాను. మాబావతో ముచ్చట లాడుతున్నాను. మా

మేనల్లుడు—అనంతం—'భారతి' లోని బొమ్మలు చూపుమని 'మామా—మామా' అని నా చేతిలోని పుస్తకం లాక్కోవడానికి తంటాలుపడుతూన్నాడు. ఈ విసంగా సాయంత్రం గడచింది. రాత్రి యథాప్రకారంగా భోజనాలయినాయి. ఆ రాత్రిఅంతా మామూలుగానే గడచిపోయింది. విశేషా లేమీ లేవు. నేను పార్సెలు సంగతి ఆవిడను అడగనూ లేదు, ఆపె తనంతట నాతో నేమీ చెప్పనూ లేదు.



తెల్లవారింది. మా ఆవిడ యెప్పుడు నిద్రలేచిందో నాకు తెలీదు. ఆరు గంటలు కొట్టేటప్పటికి నన్ను నిద్రలేపింది. ఇంట్లో సందడిగా వుంది. తలంటుతాను లెమ్మన్నది నన్ను. అట్లాగే నని నేను ప్రాతఃకాల కృత్యాలు తీర్చుకుని తలంటి పోసుకున్నాను. చావడీలో మా బావకూ నాకూ రెండు పీటలు వేశారు. ఇద్దరూ చెరీ వకపీటమీద కూర్చున్నాము.

ముందుగా ఇడ్లెన్లు తెచ్చిపెట్టారు. మేమిద్దరమూ ఫలాహారం చేశాము. అంత మా ఆవిడ నాటకరంగం మీద కథానాయికలాగ సింగారించుకుని సొక్కుతూ సోలుతూ కులుకుతూ వచ్చింది. ఆ వచ్చీరావడం తోటే నాకంట మొట్టమొదట పడ్డది ఆవిడ చెవుల నున్న రవ్వాల 'కమ్మలు'. అదే నిన్నటిరోజున టపాబంట్రోతు తెచ్చియిచ్చిన పార్సెల్లో వచ్చింది. వాళ్ల అన్నయ్య ఆవిడకు 'దసరా కానుక' అని పంపాడు. అది నాకంట బడ్డది. నేనూ—ఆవిడ నిన్నటినుంచి నాతో చెప్పని కారణం చేత—చూచీచూడకుండా ఉండిపోయినాను. నాకప్పులో కాఫీ పోయాలెనని మా ఆవిడ వంగింది. కమ్మలు నాకు చూపాలె నని ఉద్దేశంతో కాబోలు—వేళ్లతో, తన బుగ్గమీద వాలే మోహనన్నట్లు, తడుచుకో పోయింది. ఆతొందరలో, ఆతబ్బిబ్బులో చేతిలోని 'కాఫీ'కూజా జారి నా 'కప్'మీద పడి క్రింద పడిపోయింది. నాకు నవ్వు వచ్చింది. మా ఆవిడకు సిగ్గొచ్చింది. మొహం యెఱ్ఱెట్లో అయిపోయింది. తూనీగవలె తుర్రున లోనికి పారిపోయింది. అర్ధగంటసేపు మేము 'కాఫీ' కోసం కనిపెట్టుకోవలసి వచ్చింది. మా బావ "పొరబాటున చేయి జారింది" అన్నాడు. నిజమైన కారణం నాకూ తెలుసు—ఆవిడకూ తెలుసు. కాని, మే మిద్దరమూ—ఇద్దర

మెక్కడ?— నేనుమాత్రమే — మా ఆవిడ లోపలికి పారిపోయిందికదా!—ఏమీ మాట్లాడలేదు. ఎంచేతనోగాని, నా కప్పుడు కోప మే మాత్రమూ రాలేదు. మరొక్కప్పు డీలాజరిగి వున్నట్లయితే మెట్లుండేదో. ఇప్పుడుమాత్ర మిది పొరబాటు కాదు, కష్టాలప్రభావ మని నే ననుకున్నాను. నవ్వుకున్నాను. ఊరుకున్నాను!

ఆ తర్వాత నేను పేపరు చదువుటలోను, మిత్రులను చూడడంలోనూ కాలం గడిపినాను. మధ్యాన్నం భోజనాలవేళ. ఈ లోపల ఆవిడ నాయెదుటికి నాలుగైదు సార్లు వచ్చింది. కాని, నే నట్టె లక్ష్యపెట్టలేదు. ఆవిడా యేదో పనుల సందట్లో వుండిపోయింది.

పన్నెండు గంటలు కొట్టారు. బావా, నేనూ, మా యిద్దరమధ్య మా అనంతం భోజనానికి పీటలమీద కూర్చున్నాము.

లోకాభిరామాయణంతోటి భోంచేస్తూ న్నాము. మధ్యమధ్య మా అనంతాన్ని నవ్విస్తూ, వాడి ముద్దుమాటలకు మేము నవ్వుతూ ఉన్నాము. మా ఆవిడ వడ్డన చేస్తున్నది. అక్కయ్య పాలపూరీలు చేస్తూన్నది. మా ఆవిడ సేమియాల పరమాన్నం గిన్నె తీసుకుని మా బావకు వడ్డించింది. అనంతానికి వడ్డించింది. నా కంచందగ్గరికి వచ్చింది. అంతలో నేమయిందో—ఉన్నట్టుండి తల వకమాదిరిగా విసిరింది. ఆ విసురుడువల్ల చేతిలోని గిన్నె జారింది—నా కంచంలో బోర్లాపడ్డది! మా ఆవిడ నా మొహం కేసి చూసింది. నే నావిడ మొహంకేసి చూశాను! బావా, అనంతం అట్టే చూస్తూన్నారు! ఏమి చేయను? ఒక్కవైపున నాకు నవ్వు వస్తూ వున్నది. ఒక్కవైపున కోపం! ఏమి అనడానికైనా తోచింది కాదు! ఎట్లాగైతేనేమి? "ఈవేళ చేతుల్లో నీరసం కలిగిం దెందుకో? ప్రొద్దున 'కాఫీ'కూజా, ఇప్పుడు పరమాన్నం గిన్నె! అన్నీ నేనే తాగాలెనని ఉంటే ఒక్కసారిగా పెద్ద గిన్నె గిన్నే నాముందు పెట్టరాదా? ఈ చిన్నగిన్నె నాకంచంలో బోల్తాపడేయక పోతే? ఈవేళ వాలక మేమీ బాగుండలేదు! కారణ మేమి చెపుమా!" అనిమాత్ర మన్నాను. "మామా, మామోయ్, అత్తయ్యే పరమాన్న మంతా నీకే పోచేచింది. నాకు జీడిపప్పూ, ద్రాచ్చా నేయనేలేదు. నేను జీడిపప్పు యేరుకోనా? అత్తయ్యకి దెయ్యం పట్టింది!" అన్నాడు. ఇందుకు అందరమూ నవ్వాము. ఆవిడ మొహం మాటుచేసుకుని వెళ్లిపోయింది! తర్వాత మా అక్కయ్యే వడ్డన్లు పూర్తిచేసింది. మా ఆవిడ మా యెదటికి రానేలేదు.

ఈపూట భోజనం కొంచెం బరువుగా వుండడంచేతా, రోజుటికన్నా వేళ కొంచెం మీరడంచేతానూ, భుక్తాయాసం తీర్చుకోవలెనని నేను నాగదిలోకి, మాబావ తనగదిలోకి వెళ్లిపోయినాము. నాకు పగటిపూట నిద్ర అలవాటు లేదు. అయినా కాస్తనే పూరక పడుక్కుందా మనిపించింది. అనంతం పళ్లెంలో తాంబూలపు 'బీడీలు' తెచ్చియిచ్చాడు. తాంబూల

చర్వణం చేస్తూ 'సిజర్సు' వకటి వెలిగించి నా మంచంమీద పడుకున్నాను. కొంచెం సే పయ్యేటప్పటికి ఎట్లా పట్టిందో కాని నాకు నిద్ర పట్టింది. సుమారు గంట రెండుగంటలసేపు నిద్ర పోయి వుంటానేమో! కండ్లు తెరచేటప్పటికి మాఆవిడ గదిలో బల్లమీది నిలువుటద్దము వైపుకు తిరిగి కుర్చీలో కూచొని అద్దంలో తన్ను చూచుకుంటూవున్నది. జడాగిడాఅంతా తయారైంది. కొర్నాటిచీర—'కిళి' 'కలర్' (చిలుకరంగు) చీర కట్టుకుంది. బెంగుళూరు అంచు పట్టుజరీ రవిక తొడిగింది! ఇంట్లో పెట్టెలో వున్న సొమ్ములు నాలుగూ తగిలించుకుంది. చెవులకు తగిలించుకున్న కొత్తకమ్మలు తీసింది. చూచింది. 'పాలిష్ లెదర్ 'తోటి తుడిచింది. చేతిరుమాలాతో చెవులు తుడుచుకుంది. కమ్మల చీల తీసింది. చెవులకు మళ్లీ పెట్టుకుంది. వెనక్కు తిరిగిచూచింది! నేనంత వరకూ అన్నీ చూస్తూనే వున్నాను. వెనక్కి తిరిగి చూచేటప్పటికి కండ్లు మూసుకున్నాను! నేను చూడాలెననుకుందో యేమో! నేను చూడలే దనుకుంది!

మెల్లగ లేచింది. నన్ను సమీపించింది. భుజం తట్టుతూ "ఈపూట 'టీ' అక్కర్లేదు కాబోలు? నాలుగున్నర వేళారు" అన్నది. నే నులిక్కిపడి లేచాను. ఆవిడను చూచి నవ్వాను. ఆవిడ పైకి ఉపచార మాత్రానికే మందస్మితం చేసింది. "ఏది 'టీ'?" అన్నాను. "తెచ్చియివ్వనా?" అని నేల చూపుతో నిలిచింది. నేను "ఊఁ" అన్నాను నవ్వుతూనే.

ఆవిడ వెనక్కు తిరిగి వెళ్లిపోయింది. ఆ నడకలో అప్పుడు ఆశాభంగమూ, అసంతృప్తీ, అసంతుష్టీ నాకు కనబడ్డవి! ఆవిడ వెళ్లిపోయిన తర్వాత "ఇప్పటికైనా యింకా నాతో చెప్పదు కదా!" అని అనుకున్నాను.

అంతలో ఆవిడ ఒక పళ్లెంలో రెండు మూడు పాలపూరీలు, రెండు ఆమవడలు పట్టుకొనివచ్చి నా ముందు పెట్టింది. నేను "బావ ఫలాహారం చేశాడా?" అన్నాను.



"ఆఁ. చేశారూ. జమ్మి పూజకు, పార్వేటకూ వెళ్లారు."

"ఆఁ? నేను లేనిదేకనన్ను నిద్ర లేపకపోయినావా?"

"నాకు తోచలేదు. ఎప్పుడూ లేని అలవాటు ఈ పూట అవుతుందని నాతో

నెవరూ చెప్పలేదు. అయినా నిద్రలేపుదామని రెండుమూడుసార్లు వచ్చాను; గాని, లేపడానికి మనస్కరించలేదు."

"ఏంచేత?"

"ఏమో—ఏం కోపం వస్తుందో. చాలా పనులతొందరలో ఉన్నారుకదా. నడుంగా నే నడ్డంవచ్చానని—"

"ఎవరు?—నేనా?"

"ఆఁ."

"ఏం తొందరపనిలో ఉన్నాను?"

"కుంభకర్ణుడికి జాబు—"

నాకు నవ్వు వచ్చింది. ఇంతవరకూ ఆవిడ మాట్లాడుతూనే ఉన్నది; కాని, మొహం మీద సహజంగా వుండవలసిన కళాకాంతులు లేవు. ఏమో, చెప్పలేను గాని, యెక్కడనో యేమో లోపం కనబడుతూన్నది.

"కుంభకర్ణుడికి జాబు—" అని యేమో ఆమె అంటూన్నప్పుడు నాకు నవ్వు వచ్చింది. ఆవిడకూ నవ్వు వచ్చింది. నేను మంచమ్మీద నుంచి చివాలున లేచాను. అంతలో మా అనంతం గదిలోకి పరుగున వచ్చి, "మామయ్యా, నన్ను పార్వేటకు తీసకెళ్లవూ? నాన్న నాతో చెప్పకుండానే వెళ్లిపొయ్యాడు." అని మారాము చేయసాగాడు. నేను వాణ్ణెత్తుకుని, "పోదాంలే. కాస్త 'టీ' తాగి మరీపోదా" మన్నాను. నేనూ వాడూ కలిసి ఫలాహారం పళ్లెం ఖాళీచేసి, 'టీ' తాగి, డ్రెస్సు (ఖద్దరు) వేసుకుని, దేవుడిపార్వేట చూడ వెళ్లిపోయినాము.

మే మింటికి వచ్చేటప్పటికి దీపాలు వెలిగించారు. అనంతం గిలకలు, 'టమా టమా బండీ' కొనుక్కునివచ్చి వాడితల్లికీ, అత్తకూ చూపుతూ పెద్దగోల చేస్తున్నాడు. మాబావ పూలపొట్లం పట్టుకుని యింటికి వచ్చాడు. కాస్తసేపు మేము పార్వేటసంబరంగూర్చి మాట్లాడుకున్నాము. అంతలో భోజనానికి కబురు వచ్చింది.

ఈపూట వంట పనులు, వడ్డనా మా అక్కయ్యే. మా ఆవిడ నేయి, మంచినీళ్లు, పెరుగు మొదలైన చిల్లరపదార్థాలు వడ్డించడానికి నేతిగిన్నె పట్టుకుని మాయెదటే నిలిచి వుంది. నే నప్పుడప్పుడు మా ఆవిడవైపు చూస్తున్నాను. అప్పు డావిడ చూపులు నేలవైపుకు తిరిగేవి.

నేను ప్రొద్దుటినుంచీ చేస్తున్న 'టక్కరి' తనంవల్ల మా ఆవిడకు కష్టం కలిగివుంటుందా? నేను కమ్మలు చూచీ చూడనట్లు ఉన్నాను! ఆవిడ నాకు చూపనూలేదు. అవి వచ్చినట్లు నాతో చెప్పనూలేదు. నేనై "యి దెక్కడిది? ఎప్పుడు వచ్చింది? బాగుంది." అని అడగాలెనని ఆవిడఉద్దేశం! నేనా, "ఈ కమ్మలు చూశారూ? మా అన్నయ్య పంపాడు. నిన్న టపాలో వచ్చింది. బాగుందా?" అని ఆవిడ అడగాలెనని అనుకుంటున్నాను. నే నడగను. ఆవిడ చెప్పదు! కానీ, యెప్పుడు చెప్పుతుందో-

అని ఈవిధంగా పరస్పరం ఎవరిమట్టుకు వాళ్లమట్లుండిపోయినాము. ఇంకా ఆవిడ మనస్సు నొప్పిస్తా మనుకున్నాను. కారణం సరియైంది కనబడలేదు. చూస్తున్నాను.

మా అక్కయ్య మా రన్నం వడ్డించ వచ్చింది. మా ఆవిడ మజ్జిగ గిన్నె చేతపట్టుకుని నిలబడివుంది. అక్కయ్య అన్నం నా కంచంలో వడ్డిస్తున్నది. అంతలో నేను "అక్కయ్యా, ఆటీకా యెప్పుడు చేయించారే? క్రొత్తదా? ఎంతయింది? కెంపులు బాగున్నాయి సుమా! చాలా బాగా ప్రకాశిస్తున్నాయి!" అంటూ మా ఆవిడ మొహం కేసి కుచ్ఛితంగా వోరచూపుతో చూచాను. మా ఆవిడకు ఈ బాణం చాలా చురుకుగా తగిలినట్లయింది కాబోలు! తల వాల్చింది! మా అక్కయ్య నా ప్రశ్నకు జబాబుగా "ఔను క్రొత్తదే— మా వూర్లో చేయించాము. ఎనభయిరూపాయలయింది. రాళ్లు బాగున్నాయి" అన్నది. మా ఆవిడ చురచురచూపులతో నాకేసిచూచింది.



అప్పుడు నేను "ఆః! కృతకృత్యుణ్ణయినాను" అని అనుకున్నాను. కలహ మిప్పుడు పెద్దమానయిందని నాలో నాకు తెలిసి రాసాగింది. అంతలో మేము భోజనందగ్గరనుంచి లేచి, కాస్తసే పామాటా ఈమాటా చెప్పుకుంటూ ఎవళ్లగదికి వాళ్లము వెళ్లిపోయినాము.

బల్లమీద తమలపాకుల 'బీడీ' లేదు. వచ్చి యిస్తుందేమో అనుకున్నాను. పది గంటలుకొట్టినప్పటికిని ఆవిడ రాలేదు. ఒకటిరెండుసార్లు పిలుద్దా మనుకున్నాను. కాని, బెట్టుసరి నన్ను పిలవనివ్వలేదు. మంచమ్మీద పరుండి 'సిజర్స్' కాలుస్తున్నాను.

పదకొండున్నర అయింది. నాగదితలుపు తెరచుకుని మా ఆవిడ లోనికి వచ్చింది. నేను కండ్లు మూసుకుని నిద్ర నటించాను. మంచందగ్గరకు వచ్చింది. నిలిచింది. లేపుదామా వద్దా అని ఆలోచించుకుంది కాబోలు! నిలిచి నిలిచి "నిద్రా?" అన్నది.

నేను మారుపలుకలేదు.

"నిజమైన నిద్ర అయితే పలుకుతారు. దొంగ నిద్రకు పలకరు" అన్నది.

ఈచమత్కారానికి నవ్వు రాకుండా ఉంటుందా? చెప్పండి? ఇటు మొహం అయినాను. అంతమాత్రానికే సంతోషమా? నానవ్వు కనిపెట్టింది.

"ఈ రోజుల్లో మనుష్యులకు కండ్లుండీ కూడా కనబడకపోవడం ఆశ్చర్యమే!" అన్నది.

ఇది నన్ను గురించిన 'సూటీపోటీ'! ఇదే మొదలు 'అంతఃపురోపన్యా'సానికి.

"పండగపూట తాంబూలం యివ్వడానికి మరచిపోతే ఆశ్చర్యం కాదూ?"అన్నాను నేను.

"పనులసందట్లో వుండిపోయినానేమో—అడిగితే తప్పా?" అని అన్నది. తాంబూలపు 'బీడి' నాచేత బెట్టింది. నములుతూ నేను 'సిజర్సు' వెలిగించాను. పొగ బయటి కూదుతూ, "మనుష్యులకు కనబడకపోయిన కండ్లు గుడ్డికండ్లు! నిజమే. నేను కాదనను. కాని, యీరోజున యేదో ప్రారంభించారే రాణీ గారు! పండగపూట సంతోషం, సంబరం పనికి రాదు కాబోలు! కొంచెం ఆవేశం పుట్టినట్లుంది! ఎంచేతనో ప్రొద్దుటినుంచీ ఆలోచిస్తున్నాను. కారణం కనబడలేదు"— అంటున్నాను.

"ఎందుకు కనబడుతుంది? చూడతలచుకోనప్పుడు కనబడదు. ఒకళ్ల మెళ్లో చీకట్లో ఎర్రరాళ్లుంటే అవి స్పష్టంగా బాగా కనబడతవి—"

"ఎవరిమెళ్లో? ఎవరికి కనబడతవి?" అని ఆశ్చర్యంతో అన్నాను.

"ఎవరికైనా! ఇష్టంకాని వస్తువు సూర్య కాంతిలాగ మెరస్తున్నా కనబడదు. బాగు చీకట్లో అయినా కనబడుతుంది."

"ఈపూట యీవిధంగా సాగించావేమీ? నీమాటలకు నాకు అర్థం బోధపడడం లేదు."

"ఆలోచించుకుంటే బోధపడుతుంది.బోధపడికూడా లేదంటే నాతప్పా? ఎవరి మెళ్లో ఎర్రరాళ్ల 'టీకా'—"

"ఉండుండు-ఎవరి మెళ్లో చెప్మా? ఆఁ-ఆఁ—మా అక్కయ్య మెళ్లో చూచాను—అయితే?దాని కేమిప్పుడు? బాగున్నది కాబట్టి అడిగాను—"

"అది కనబడ్డదే, కాని—"

"ఆఁ? ఇంకేమి కనబడాలె? ఇంకా యేమి వేసుకుంది అక్కయ్య? మరేమీ కన బడినట్లు లేదే? కొత్త దింకా యేమి—?"

"కొత్తది కనబడ్డది కాబట్టా? మీ కీ వేళ యేమీ కొత్తది కనబడనే లేదా? నిజం చెప్పండీ!"

"నిజంగా, నాకు కొత్తగా యేమీ కన బడలేదు. కాని, కాఫీకూజా చేయి జారి పడడం, పరమాన్నపు గిన్నె నా కంచంలో పడడం—ఇవేనా క్రొత్త? అవే అయితే బాగానే కన బడ్డవి." అంటూ నేను నవ్వాను.

"చాల్లేండి పరిహాసకం! ప్రొద్దుటినుంచీ చూస్తున్నాను—మనుష్యులకు కనబడుతుందా లేదా అని! ఊఁహూఁ. అన్యోన్యం ప్రేమిస్తూ వున్న భార్యాభర్తల్లో యేమాత్రం నూతనం వున్నా కనబడక మానదు."

"కాబట్టి? నీ వనే దేమిటీ?"

"ఏముందీ? నాకేసి చూస్తారేమో నని ప్రొద్దుటినుంచీ చూస్తున్నాను. కనుక్కుంటారో లేదో అని యెంతో సంతోషంతో కనిపెట్టుకున్నాను. కాని యేమి లాభం? నావంటి మీద యీనాడు విశేష మేమున్నదో తెలుసుకోలేకపోయారు కాదా?"

"ఏదీ? ఏముందీ!" అని అంటూ నేను మా రాణీగారి చేతులు చూచాను. మెళ్లో చూచాను—

"అక్కడే మున్నాయి? చెవులు చూస్తే తెలుస్తుంది." అని అన్న దామె.

మొహం పైకెత్తి చుబుకం పట్టుకొని



ఆవిడను చూశాను. "అరేరే! ఏమిది? ఈ కమ్మ లెక్కడివి? ఎప్పుడు చేయించావు? ఎంతవెల? ఛా! చాలా బాగుంది సుమీ! పుష్యరాగాలా, వజ్రాలా యివి? పుష్యరాగాల కింత మెరపుంటుందా? వజ్రాలే కాబోలు. ఇది నీ మొహానికెంతో చక్కదన మిస్తున్నది సుమా! ఆఁ-నాకు చెప్పవేమి! ఎప్పుడు చేయించావు చెప్పవూ?" అని అన్నాను మహదానందంతో.

"ఆఁ-ఇప్పుడు చెబితే కనబడ్డది కాబోలు. ఔను. మీకు నామీద యెంత ప్రేమ వుండేది యిందులోనే కనబడుతుంది."

"ప్రేమకూ దీనికీ సంబంధ మేముంది? నీ చెవులకు కమ్మలు తగిలించుకున్న సంగతి నాకేలాగ తెలియాలె? పోనీ! ఈ పూట కొత్తగా వున్నదా? ఎప్పుడైనా చెవులు ఖాళీగా వుందా! కమ్మ లెప్పుడూ నున్నవే."

"కాని, యెప్పుడూ నున్న కమ్మ లేవి? ఇదేనా? అది తెలియవద్దా?

"ఇదో-ఇంకేదో! పోనీ-చెప్పకూడదు?"

"ఏమని చెప్పవలె? నేను కాంగా 'కొత్తరవ్వల కమ్మలు వేసుకున్నాను. చూడండీ! బాగుందా? నే నిప్పు డెట్లా వున్నాను?' అని నే నడగాలనా? కాక 'ఓహో! కొత్తగా వుందే! ఏదీ? ఈ కమ్మ లెక్కడివి? బాగున్నది.' అని యెవరైన అడగాలెనా?"

"ఔను-సుమా! ఏదీ అంతజ్ఞాన మెక్కడిది మగవాళ్లకు? ఇది పాతదేనా, కొత్తదా అని గ్రహించే శక్తి మాకే వున్నట్లయితే— ఆఁ-ఔను. ఇప్పుడు జ్ఞప్తికి వస్తున్నది నా

కొంకొక్కటిగా! ఇందు కేకాబోలు-నాకు ప్రొద్దున కాఫీ లేక పోయింది! కూజా పగిలిపోయింది! నా కంచంలో పరమాన్నపు గిన్నె బోల్తా పడ్డది. ఆఁ-ఔను. అన్నట్లు మరిచా. నేను మధ్యాన్నం పడుక్కొని నిద్రపోతూన్నప్పుడు చెవులకమ్మలు చేతికి వచ్చినవి. మరల చక్కదనం చూచుకోవడ మయింది. అక్కడనుంచి, నేను చూచానో లేదో అని నావైపుకు చూచి, నేను చూడక పోవడంచేత నిరాశతో ముహం చిట్లించుకుని మళ్లీ చెవులలో కెక్కించుకున్నావు. ఔను - ఇవన్నీ నాకు తెలిసీ కూడా—"

"అప్పుడు నిద్రపోతున్నారు కదా? మరి—"

"ఔను. నిద్రే పోతున్నాను. పోతూనే చూశాను. అన్నీ నాకు తెలుసు."

"వేషం."

"దొంగవేషం! సొమ్ము తగిలించుకుని మగడు కనుక్కుంటాడో లేదో అని వేషం. కనుక్కో- లేదే చూపుదామని కూజా పడేసే వేషం!"

"చాల్లెండి!"

"చాలిస్తా.అన్ని వేషాలూ చెప్పి—"

"పోనిద్దురూ ఇప్పు డెందుకు? నిజంగానే కమ్మలు పొద్దుటినుంచి మీకు కనబడలేదా?"

"కనబడకపోవడ మెందుకు? కనబడ్డది—కాని, నీవు నాతో చెప్పావా?"

"లేదు—కనుక్కుంటారో లేదో అని."

"కనబడ్డది. అడగలేదా— నీవు చెబుతావో లేదో అని. సరికిసరి తీరిందీ?"

"వదినగారి మెళ్లో టీకా—"

"అదొకవేషం. నిన్ను ఉడికించాలె నన్న వేషం. నే ననుకున్నట్లే జరిగింది."

"ఏ మనుకున్నారు?"

"కమ్మలసంగతి నాతో చెప్పలేదు నీవు. కాబట్టి నేను నిన్ను అడగకుండా అక్కయ్యను టీకా సంగతి అడిగితే నీకు కుళ్లు కలుగుతుందని—"

"చాల్లెండి—మరీ—"

"ఉడుకు కలిగిందా లేదా అప్పుడు?"

"ఎవరైనా నవ్వుతారు—"

"ఎందుకు? నిజం చెపితేనా?"

"కాదు. పబ్లీకుగా సూర్యరశ్మిలాగ మెరుస్తున్న ఈరవ్వలకమ్మలవిషయం తెలియలేదే? మెళ్లో నాలుగుదండలసందున మెక్కడో నక్కివున్న టీకా యెట్లా కనబడ్డదా అని—"

"ఉలుకు కలిగింది! అంతేకదా! పోనీ—అసలుసంగతి చెప్తా. ఇప్పుడైనా చల్లారిందా? ఈకమ్మలసంగతి నాకు మొన్నటిరోజు నీకు 'పార్సెల్' వచ్చిన రోజే తెలుసును. కాబట్టి యిక్కడ యిప్పుడు కొత్త యేమీ లేదు. కాని నీకు ఉడుకుమోతుతనం—"

"ఆమా టనకండి. మన కెప్పుడూ వున్నదే—ఈలాటికలహం! ఈ వేళ సెలవుకాదూ? ఏనాడమ్మా, మీకు సెలవుల్లో కలహం లేకుండావున్నది?— ఇంక మరచిపోదాం."

# అధ్యాయాంతము

దువ్వూరి రామిరెడ్డి గారు

చివురుల కెంపు పెంపెసఁగఁ జేయు వసంతము వచ్చె; నెన్నఁడో
కవటలు మాని శుష్కరసకాండత నున్న రసాలశాఖపూ
ర్వ విధమునం గిసాలవిసరంబులఁ బూఁతల దర్శనీయమై
కవగొనె మాధవీలతను; గష్టములం గడఁదాఁక కుందునే.

చీఁకటియింటి కాఁపురపుఁ జీకు దొలంగెను; జల్లి వెన్నెలల్
ప్రాఁకి కుటీరకుడ్యముల రాత్రి దివంబుగ మార్చె; స్నేహధా
రా కలితంబు సెమ్మె; కనరావిఁక భావపిశాచ రూపముల్;
చేకుఱెఁ జిత్తశాంతి; విరచించెడి నూహలు భావిచిత్రముల్.

“గతము గతంబె, యెన్నటికిఁ గన్నులఁగట్టదు; వర్తమాన మే
నతత మవశ్య భోగ్యమగు సంపద”యన్న ఖయూము సూక్తులన్
మతి నిడి మల్లికాలతిక నాటితి దగ్ధగత స్మృతిన్, సుమ
ప్రతతుల సౌరభంబు పరిపాకము నొందఁగఁ బండు వెన్నెలన్.

అను నిమిషంబు జీవితమునందు నవీన దిగంచలంబులే
కనఁబడు; దుఃఖమున్ సుఖ మగాధత విస్తృతిఁ జూపు; రెండునున్
మనుజుని జ్ఞానవృద్ధికి సమానమె; యైన, నగాధతన్ వరిం
పను వెనుదీయుఁగా యుపరిమంథనలోల మనం బధీరతన్.

అంతంబొందె మదీయమా కృతివియోగాధ్యాయ మీనాఁడు చి
త్తాంతస్సాయమితానురాగ రసముల్ వ్యాపించె సేతుచ్యుతిం;
జింతాక్రాంతత యౌవనంబు వ్యయముం జేయంగ నేమాయె; నా
గింతున్ జీవితనందనంబున లతాంగీ దోహదక్రీడలన్.

చతురంబౌఁగద దైవకల్పనము! లాశాభంగముల్ గూర్చి దు
స్థితులం దేలిచి, లోఁతుపాఁతులఁ బరీక్షింపన్ వెతల్ గొల్పి, పై,
ధృతిహీనుం డగు మానవుం గని దయార్ద్రీభూతుఁడై సంస్కృతి
క్రతుకర్తం బొనరించు దేవుఁడు సుఖప్రాబల్య మేపారఁగన్.

---

# పతిపత్న్యనుగమనము

వేలాల సుబ్బారావు గారు

## ౧

ప్రస్తుతం గడుస్తూ ఉన్న ఆంగ్లేయయుగంలో ఆదివారం వస్తుందీ అంటే ఏదో ఒకవిధమైన ఆనందం గలిగి గులాంగిర్ల కందరికీ మనఃశల్యం వాసిపోయినట్లా గుంటుంది. ఆ ఒక్కనాడైనా నిరంకుశాధికారం జెల్లించే ఆఫీసర్ల ధిక్కరింపు చేతలనుంచీ, వారి కోత కూతలనుంచీ ముక్తినొంది, భగవంతుడు ప్రసాదించిన స్వేచ్ఛా వాతావరణంలో విహరిస్తూ, నిర్మలమైన వాయువును సేవిస్తూ ఆనందింపవచ్చును గదా అని దాస్యదేవతారాధన మొనరించువారందరూ సంతోషిస్తూ వుంటారు ఆదివార మంటేనే. శ ని వా రం నా డు మధ్యాహ్నానంతరం ఒకటి రెండుగంటలు దాటాయి అంటే చాలు, నరునాటిఛాయలు మీదబడి సేవాసదనా లనేఫ్యాక్టరీల్లో నుక్కతిరక్కుండా మెషీను చక్రాల్లాగు పనిచేస్తూ ఉండే దాసజనబృందాల పరితప్తహృదయాలకు చల్లని శాంతిని గలుగజేస్తూ ఉంటాయి. సర్కారు నౌకరీ వశాన్ని పరస్పరం వేర్వేరు గ్రామాల్లో దూరదూరంగా ఉండడం తటస్థించిన భార్యాభర్తలు ఆదివారానికే ఎదురుచూస్తూ ఉంటారు, అది ఎప్పుడు వస్తుందా, ఎప్పుడిద్దరం గలసి ఒకరికష్టసుఖము లొకరితో చెప్పుకొందుమా అని. సంవత్సరాల పర్యంతం ఇరుకైన అద్దెకొంపలే శరణాలయాలు కావడంవల్ల సాధారణోద్యోగస్తుల పరివారాలన్నీ ఆదివారాన్నే జపిస్తూ ఉంటాయి, ఆ నాడైనా యీగుహల్లోనుంచి వెలుపలికి దీసి బాహ్యప్రపంచం జూపిస్తారుగదా మావారనీ. ఇక నిద్రాలసలైన గృహలక్ష్ముల కందరికీ ఆదివారమంటే అట్లతద్దె వచ్చినట్లే. 8 లేక 8½ గంటలయ్యే సరికే ఏముక్కనో, నోటనో యిన్ని మెతుకులు కొట్టుకొని కచేరీలకు వేళకు హాజరు గాకపోయినదొరల మగల నౌకరీ లెక్కడ ఊడిపోతాయో అనే భయంచేత పాపం ప్రతిదినమూ తెల్లవారుగట్లే వస్తువెచ్చని పక్కల వదలవలసివచ్చేది వీరికి. ఆదివార మహాత్మ్యమా అంటూ యీలాటివాళ్లంతా ఆనాడు పొద్దు ఎంత ఎక్కిందీ తెలియకుండా గురకలు కొడుతూ ఉంటారు. ఇదానీం తన భారతీయపౌరజన, పౌర స్త్రీల స్థితిగతు లిట్లా ఉంటాయి, కొంచెం హెచ్చుతగ్గుగా. అందరికీ ఆదివార మంటే ప్రేమే.

ఇకముందు పౌరులు గాబోయ్యేవారూ, వారిని ఆపదవులకు తయార్యరుచేసే ఉపదేశికులమా టేమిటి? వారూ ఈవారాన్ని అభినందిస్తూనే ఉంటారు. ఎల్లుండి ఆదివార మనగానే పెద్దపెద్దమాస్టర్లకే పరమానందమై పోతుండంటే ఇక పిల్లకాయల సంగతి ఏం చెప్పాలి! స్కూలువాళ్లకు శుక్రవారపు సాయంకాలం మీదే వాలుతూ ఉంటాయి, ఆదివారపు శీతలచ్ఛాయలు. ఆదివారపు పేరు స్మరించుకొంటూ ఉపాధ్యాయులు కొందరు శుక్రవారంనాటి ఆఖరు పీరీడ్లకే తాంబూలం వేస్తూ ఉంటారు. ఇక కాలేజీల్లో చదివే యీడువచ్చిన విద్యార్థులఆనందానికి పారమే లేదు. సముద్రం అపార మంటారు; అదినట్టి అబద్ధము. ఏ మహాసముద్రాన్ని తీసుకొన్నా పారాలు తగులుతూనే ఉంటాయి. కాబట్టి అపారమైన దేదైనా ఉన్నదంటే అది కాలేజీస్టూడెంట్లకు గలుగు ఆదివారాగమన క్షేమజనిత మహానందసాగరమే. ఇతరేతరజాతిమైత్రి గల విద్యార్థులకు—అనగా విద్యార్థినుల సఖ్యముగల విద్యార్థులకూ, విద్యార్థుల సఖ్యముగల విద్యార్థినులకూ—శరీరాలు గగుర్పొడుస్తూ వుంటాయి, ఆదివార ప్పేరు వింటేనే. పరిజృంభమాణ సాహసోత్సాహపూరితములైన వీరి మనోనేత్రాల్లో గిర్రున దిరుగుతూ ఉంటాయి, లవ్ పార్కులూ, సినీమాలూ, థియేటర్లూ, సముద్రతీరాలూనూ. అందులో యెహోవా అనుగ్రహపాత్రుల భాగ్యమే భాగ్యం; దేవుడీ ఆదివారాన్ని దమకొరకే నిర్మించి ఉంటాడనే నిండు కృతజ్ఞతతో క్రైస్తవయువతీ యువకులు—

ముఖ్యంగా బరప్పురానుభాగం గలవారు, ఎంత నిశ్చలమైన, ఎంత నిష్కపటమైన, ఎంత నిర్మలమైన హృదయంతో వర్జిన్ మేరీని ప్రార్థిస్తూ ఉంటారో అంతటి శ్రద్ధాభక్తులతో నడుసుగడచిన పాదిరీసైతం ప్రార్థించజాల డనుకొంటాను. ఇట్టి మేరీ ధ్యానపరాయణులైన మిస్సమ్మల దయాధర్మముల మూలమున ఆనాడు నగం కడుపైనా నిండుతుందిగదా అని రెండుకాళ్ల రిక్షా గుర్రాలుగూడా గుటకలేస్తూనే ఉంటాయి, ఆదివారం వస్తూఉందీ అంటే. చర్చికి వెళ్లవలసినప్పుడు ధరించవలసిన డ్రెస్సు వగైరాల ఏర్పాట్లన్నీ ఒకటి రెండు రోజులు ముందుగనే నిష్కర్ష అయివుంటాయి. ఇందువల్లనే మంచి మంచివెల, పొడుగు దుస్తులను కొద్దిపాటి బాడుగల కిచ్చే చాకలవాళ్లకూ సంతోషమే ఆదివారం వస్తుందీ అంటే. ఇంతకూ మనగ్రహచారమనాలికాని వేరుకాదు. గీర్వాణం నిర్వాణ మందితే హూణహూణమై పోయింది గాని, యుగమంతా జగమంతా, లేకుంటే ఆదివారం మాహాత్మ్యమనే పురాణం వెలువడకపోయిందీ, ఈపాటి కేకశాగ్ర బుద్ధి ప్రయత్నంవల్లనైనా! ఆయుగాంతం యెహోవా ఆదివారంనా డీలాగే విశ్రాంతితీసుకొనుచుండుగాక.

ఈప్రకారం సమస్తమైనవారికీ ఆనందం సమకూర్చే రవివారం నూర్యాత్రపభిన్నులను చంద్రోదయంలాగు ఉదయమై సుమారు 7 గంటలు కావచ్చే సరికి మద్రాస్-బెజవాడా 22 నెంబరు డౌను పాసెంజరు పొగలు పొగలు జిమ్ముకుంటూ వంగోలు ప్లాట్‌ఫారం మీదికి వచ్చి ఆగింది. వెంటనే ఇండియన్ జంటిల్ మెన్ రిజర్వుడు వెహికిల్ (Indian gentlemen reserved vehicle)ఒకఫస్టుక్లాసుకుక్కిలోనుంచి మూటాముల్లె చేతబట్టుకొని అందరితోపాటు కిందికి దిగాడు ఒక పెద్దమనిషి. ఇతనిపేరు గోపాలరావు. మంచిరంగూ, రూపం—28 ఏండ్లవయసూ. దైన్యమిళితములైన శాంతపాఙ్గు దయాస్వభావా లీయనమొగంమీద ప్రత్యక్షమౌతూఉన్నాయి. కాని రవంత ఆనందాభాసంగూడా వుంది ఆమిశ్రణంలో. సర్కారునౌకరీలవల్ల వేర్వేరు ప్రదేశాల్లో వుండడం తటస్థించిన భార్యాభర్త లాదివారంకోసం నోరు తెరచుకొని చూస్తుంటారని వ్రాశానుగదా. ఈశ్రేణికి చెందినవాడు మనగోపాలరావు. ఈయన యం. యస్. యం. రైల్వేవారి హెడ్డాఫీసులోని ఆడిట్ విభాగంలో ఒక క్లర్కు. నలభైరూపాయల మాసికం. మద్రాసులోని సంపాదన అద్దెయిళ్లకూ, కాఫీ హోటళ్లకూ, పూటకూళ్లకూ సరిపోతే అసలు పల్లెనా ఆరోగ్యస్థితిలో నిలుపుకొనగలిగినవాళ్లను చాలా అదృష్టవంతులనే ఎంచవచ్చును.

ఆదాయంలో మూడోవంతు పెడితేనే గాని ఒక మాదిరికొంప దొరకదు. లోభించి యింతకు దక్కువకు తీసుకొన్నామా అంటే తతిమ్మామొత్తం యావత్తూ డాక్టరుగారి బిల్లులకు చెల్లుబడి అనుకోవలసిందే. కాబట్టి మద్రాసులో కాపురంపెట్టడానికి తాకత్తువాలక, ముందెప్పుడైనా జీతంలో ప్రమోషన్ అయితేగియితే చూచుకొందామని భార్యను ఇతడు స్వగ్రామంలోనే ఉంచి, వీలైనలాగు నెలకో, వారానికో వెళ్లి ఆమెను చూచి వస్తూ ఉంటాడు. కారణాంతరాలవల్ల గడచిన రెండు మూడు ఆదివారములకు వెళ్లడానికి వీలైందికాదు. ఇక నిప్పుడు కొంచెంసేపటిలో తనప్రేయసిని గలుసుకొంటాను గదా అని దాస్యదీనతాహతిమైన ముఖంమీద రవంతసంతోషరేఖ కనబడుతూ ఉంది.

౨

వంగోలుకు దూర్పుగా రెండు కోసులదూరంలో ఉన్న మలకలచెర్వుగ్రామం మన గోపాలరావు నివాసస్థలము. ఈ వూరికి వుత్తరంగా నాలుగైదుమైళ్ల వైశాల్యం గల పెద్దపంట చెరువు ఒకటి ఉంది. ఇది దక్షిణ హైదరాబాదుసిటీ-నుంచి నిజాంగారి ఫలక్‌నుమా మహలుకు వెళ్లే మార్గంలో ఉన్న మీరాలం సరోవరంలాగు మెలికలు మెలికలుగా ద్రవ్వబడివున్నందువలన చెరువు కట్టగూడా అదేమాదిరిగా ఉంటుంది. ఈకారణంచేత దానికి మలకలచెర్వనీ, దాన్నుంచి గ్రామానికి అదే పేరు వచ్చిందనీ జనపరంపరగా వస్తూవున్న ప్రవాదమొకటి ప్రసిద్ధమై ఉంది. కాని ఎపిగ్రాఫియా డిపార్టుమెంటువారికి ఏరాళ్లరప్పల ఆధారాలు దొరికాయో తెలియదు: పేరు, విజయనగరభాను డస్తమించిన తరువాత గోల్కొండవారి పతనాన్ని వచ్చిన తురకనవాబు

తెవరో దానిని ద్రవ్వించారనీ, వారు మలకలనే పేరును కలిగియుండినందున దాని కాపేరు వచ్చిందనీ ఒకకొత్త సిద్ధాంతం ప్రకటించారు. కానీండి! ఈ గొడవంతా మన కెందుకూ? ఉత్పత్తివిషయంలో అభిప్రాయభేదాలున్నా, చెరువుపేరూ, దానివలన గ్రామానికి పేరు రావడం-ఈ విషయాల్లో ఈ రెండు పక్షాలవారి మతం ఒక్కటే—అదే మనకు గావలసినది. ఇంత రెందుకూ, గ్రామానికి ఉత్తరంగా ఒకపెద్దచెరువువుందని జ్ఞాపకముంచుకొండి, అంతే చాలు. ఈ గ్రామంలో గోపాలరావుపూర్వులు కట్టించిన ఒక మంచి మిద్దె ఇల్లు వుంది. మద్రాసులో అద్దెకొంపల భరించడం కష్టం వకటే. రెండోది గ్రామంలోని యింటిని బొత్తిగా వదిలేస్తే ఎలుకలూ, పందికొక్కులూ ప్రవేశించి కిందా మీదా గుల్లచేసిపారేసిన సమయంలో వర్షం కురిసిందా అంటే కప్పునాల్గుమూలలనుంచీ సహస్రముఖాల ఆకాశగంగాధార లారంభమై చూస్తూచూస్తూ ఉండగానే యిల్లు నేలగూలి ఊరుకొంటుంది. కాపురముండి ఎవరైనా యింట్లో దీపంపెట్టుకొంటూ ఉంటే ఈ అనర్థాలన్నీ జరగవని ఒకటే—ఏకారణమైతేనేం, గోపాలరావుభార్య సీతమ్మ ఇంటిపట్టునే ఉంటూవచ్చింది. కాని ఎప్పుడు మగనికి కొంచెం ప్రమోషనవునా, ఎప్పుడు తనభాగ్యం పండునా అనేకోరిక ఈమెకు లేకపోలేదు. ఈకోరిక మరింత ప్రబలంకావడానికి కారణంగూడా ఒకటి కలిగింది కొత్తగా. వెనుక గోపాలరావుపనిచేసే ఆడిట్ విభాగానికంతా ప్రముఖుడుగా ఉండిన జాక్ సన్ ఆరోగ్యంతప్పి, సం॥ సెలవుపుచ్చుకొని ఇంగ్లండుకు వెళ్లుతూ, గోపాలరావంటే రవంత అభిమానం కావడంవల్ల తిరిగి రావడంతోటే కొంచెం జీతం ఎక్కువగాగల మరోపనిలోకి లాక్కుంటామని వాగ్దానమిచ్చి మరీవెళ్లారు. ఆ వాగ్దానం నెరవేరితే సీతను వెంటబెట్టుకొని వెళ్లి తనదగ్గర ఉంచుకొని స్వంత యింట్లో ఏగృహస్థునైనా బతిమాలుకొని ఉచితంగా ఉంచుదామనేఉద్దేశంతో పోయినతడువచ్చినపుడు భార్యకీవిషయాలన్నీ తెలిపి ఆమెను చాలాసంతోషపెట్టాడితను. మూడువారాల కిందటే దొరగారు వచ్చి చార్జీ పుచ్చుకోవలసింది కాని రాలేదు. వారు వచ్చినతరువాత కొత్తనౌకరీలో చేరి మరీ వెళ్లవచ్చునుగదా అని ఇంటికి గూడా వెళ్లలేదితను పోయిన రెండువారాల్లోనూ. తీరా మూడువారాలు గడిచే సరికి దొరగారు మరిమూడు నెలలు సెలవును అభివృద్ధిచేసుకొన్నారని తెలిసింది. అంతటితో ఆశలన్నీ పోయి ఇంటికి బయలుదేరాడు. పాపం సీత కేం తెలుసూ ఇదంతా. పెనిమిటి రాక ఆలస్యం చేస్తూవుంటే, అదంతా కొత్తపనిలో చేరి తను నిమిత్తం ఇంటిని లోనసువానిని ఏర్పాటుచేయడానికే అని నిశ్చయించుకొని, తన నిక దప్పకుండా వెంట బెట్టుకపోతారని మహాసంతోషంగా ఉందీ అమాయకురాలు.

గోపాలరావేలాగో డొక్కశుద్ధి గావించుకొని మద్రాసులో నౌకరీకి కుదిరాడుకాని, ఇతని తండ్రితాతలు షట్కర్మనిరతులు, సాధుస్వభావులు, విద్వాంసులునై గ్రామస్థులందరికీ పూజ్యులై ఉండినందున, వారిప్పుడు లేకపోయినప్పటికీ, ఊరివారుమాత్రం ఆకుటుంబం యెడల బూజ్యభావమే కలిగియుండిరి. ప్రస్తుతం దక్షిణ భారతములోని హిందూసంఘ వృక్షరాజమునకు వేరు పుర్వ్వనదగిన అబ్రాహ్మణ బ్రాహ్మణ కలహం అప్పటికి మొలకెత్తి ఉండలేదు. కాబట్టి గ్రామస్థులందరూ గోపాలరావును ఇంటిదగ్గరే ఉండమనీ, తండ్రి తాతల నాటివలె నేకాదన లేకుండా ఇంటిఖర్చులన్నీ జరుపుతామని చాలా పర్యాయాలు వేడుకొన్నారు. కాని ఉద్యోగం పురుషలక్షణమైనందువల్లా, క్రీస్తు వింశతి శతాబ్దంలో భారతీయుల కాఉద్యోగమనేది కేవలం సర్కారునౌకరీ కావడంవల్లా ఇతడు వారిమాటలను పాటించక రైలుఆఫీసులో గొలువుకు కుదిరాడు.

గ్రామస్థులందరూ సీతను సీతాదేవిగనే భావిస్తూ ఉంటారు. పతిభక్తి పరాయణులైన సాధ్వీమతల్లులు సూర్యచంద్రులనుగూడ స్వాధీనముచేసికొని యుండుట నిజమో కల్లో మనకు తెలియదు. కాని మలకలచెరువు వాసు లందరూ ఈమెసుగుణగణములకు వశీభూతులై అపరదేవియనియే భావిస్తూవుంటారు. మూర్తీభవించిన ప్రాచీన సతీనాచారాల సమ్మేళనం సీత. కావున ఇరు పక్షములవారికీ స్తుతిపాత్రయే యైన దీదేవి. ఈపరమా

త్ముని పవిత్రమందిర మీాభూతలమున జనించి పంచవింశతి శరత్తులు కడచిపోయినవి; కాని సర్వకాల సర్వావస్థలందు, ముఖ్యముగ నిజకాంతుని అనుపస్థితివేళలందు, స్వర్గీయఆనంద మాపాదించు నామె దానోపవాసవ్రతాది పుణ్యఫలముల ప్రోవు సంతానరత్న మొక్కటి కోమలగాత్ర సంస్పర్శనసౌఖ్య మీాలలనామణిపాణిపల్లవాల కింకనూ కలిగియుండలేదు. అట్టి కుమారబ్రువుని నక్కున నెత్తుకొని పాలుగారు లేతబుగ్గలరసము నాస్వాదింప పరితపిస్తూ ఉంటుంది ఈసతీ తిలకము నవసరోరుహ పరిమళయుక్తమైన ఓష్ఠయుగ్మము. కాని దైవానుగ్రహం లేని పసు మనుష్యవాంఛ లేమి చేయగలవు! కడచిన రెండు మూడువారాల్లో, మీాద నుదాహరించిన ప్రకారం, పెనిమిటి రానందున మరింత ఉత్కంఠాపూర్ణయై, తెల్లవారుగట్లే లేచి ఇంటి పనులన్నీ చక్కబెట్టుకొని సూర్యోదయమైంది మొదలుకొని ఏదేకధ్యానంతో పతినికొరకు ఎదురు చూస్తూఉం దీమె. సుమారు 8 గంటలు కావచ్చును. కూలివాడు మూట నెత్తుకొనిరాగా గ్రామం ప్రవేశించగానే కలిసిన మిత్రులతో మాట్లాడుకొంటూ వచ్చి గోపాలరావు యింటిగుమ్మ మెక్కగానే ఇతని జూచి యీామెముఖం ప్రభాతకాలకమల మైంది. మిత్రులతోపాటు నసారాలోని అరుగుమీాద వేసిఉన్న చాపమీాద నితడు కూచోగానే కాళ్లు కడుక్కోడానికి నీళ్లు తెచ్చిపెట్టి వెళ్లిపోయింది. అయిదారు నిముషాల పర్యంతకాలంలో మిత్రమండలివారి ఉభయకుశలప్రశ్నలయిపోయినాయి. కాళ్లు కడుక్కొనుటకు గోపాలరావు లేవడంతోటే మళ్లీవచ్చి కలుస్తామని చెబుతూ స్నేహితు లెవరిండ్లకు వారు వెళ్లారు. అంత నితడును పాదప్రక్షాళనం చేసుకొని లోపలికి వెళ్లగానే సీత ఎదురుగా వచ్చి, "పోయిన రెండువారాల్లో వచ్చారు గారేం?" అంది.

"నీవంటి దేవీసందర్శనం ఎల్లప్పుడూ చేసుకొనే భాగ్యం నాలాటి దరిద్రులకు ఉంటేకాదూ?"

అని అనగానే సిగ్గుచేత చప్పున దలవంచుకొని ఏమో అనబోతూవున్న భార్యను తన చేతుల్లోనికి లాక్కొని కృతజ్ఞతా జనితానందబాష్పముల నామెపై రాలుస్తూ "నిజం సీతా! నేనన్నది అబద్ధంకాదు. నీముఖపద్మం చూసేసరికి నామనోవ్యథలన్నీ పరుగెత్తిపోతాయి. నీసమక్షమే నాకు స్వర్గం. నీచెంత నున్నంతకాలమూ నాకు ఆఫీసులోని చర్యలూ, అధికార్ల కటువాక్యాలూ, నావంటివాళ్లకు గలిగే కలసంపులూ, అధోగతులూ, అసహాయస్థితులూ, ఈలాటివి ఏవీ జ్ఞాపకానికి రావు. నెలల పర్యంతం అనుభవింపక తప్పనియాతనలన్నీ నిన్ను జూడగానే పటాపంచలయిపోతాయి. నాపూర్వజన్మకృత పుణ్యఫలరాశివి నీవు లేకుంటే నాగతి యేమగునా యని పలుమారు తలపోసుకొంటూ వుంటాను. కాని సీతా! నిన్ను దీనికెళ్లి దగ్గిర పెట్టుకొని సౌఖ్యపడదామనే నాప్రయత్నాలన్నీ విఫలమే అవుతున్నాయి. ఈజన్మలో నెరవేరుతుందో నెరవేరదో ఆనాకోరిక—"

ఈమాటలను వినగానే ఆమెహృదయం కలుక్కుమన్నది. కొంచెం వెల్లబారిన ముఖంతో, "ఏమిా! సెలవు మీాద వెళ్లిన మీా హెడ్ ఆఫీసరుగారు ఈనెలలో వస్తారని చెప్పారుకాదూ? వారు రాలేదా ఏమిటి?"

"లేదు వారు రాకపోవడం అట్లా ఉండగా, ఇప్పుడు మాప్రాణాలు తీస్తూవున్న ఈకంటకుడే ఇంకా మూడునెలలవరకూ ఉంటాడట. దరిద్రులమైన మనవంటి యల్పుల సంకల్పాలకే ఎన్నో ప్రతిబంధకాలు గలుగుతూ వుంటాయి."

ఇందులకు జవాబుగా ఆమె ముఖంద్వారా నిరాశాపూర్ణమైన దైన్యాన్ని జూపించింది కాని నోటివెంట నేమియు పలుకలేదు. రెండునిముషాల పర్యంతం మౌనమూనియుండి అనంతర మీామె యాప్రసంగమును మార్చి, "కానీండి! స్నానం చేస్తురు గాని రం"డని పెరట్లోనికి దీసుకొని పోయింది.

మానవునకు ప్రయత్నావస్థలో గనుపించే సుఖం ఫలితావస్థలో గన్పించదు. నిద్రాహారాలకు తిలాంజలు లిచ్చి, రాత్రిందినము లనేవిభాగాలను సైతం మరచి, యూనివర్సిటీ డిగ్రీలనిమిత్తం నిరంతర ప్రయత్నాలు సలుపుతూ వుండే భారతీయవిద్యార్థుల కీవిషయమందలి నిజానిజాలు బాగా తెలిసివుంటాయి. దైవమిచ్చిన వరంలాగు ఆదివారం వస్తూఉంది, ఆనాడు తప్పకుండా ఆపని చేసి

తీరాలి, యీపని చేసి తీరాలి, అక్కడికి వెళ్లాలి, ఇక్కడికి వెళ్లాలి, వారిని చూడాలి, వీరిని చూడాలి అని లేనిపోని పనులను ఎన్నింటినో కల్పించుకొని దాని కోసం ఎదురుచూస్తూ ఉంటే, చివరకు రానేవచ్చి తెలియకుండా ఎగిరిపోతుంది ఏ నిద్రలోనో, ఏ ప్రసంగంలోనో, ఏ ఆలస్యంలోనో, లేక ముందు దలపెట్టని ఏ అవసర కార్యంలోనో. ఇక్కడ మరింతవిచిత్ర మేమిటంటే, పని తొక్కిళ్లక్రింద బడి నలుగుతూఉండడం మూలాన్ని లెక్కన వారాలన్నీ యీప్రకారంగా గడచిపోతున్నాయిగదా అని గోచరమైనా అవుతాయి. కాని ఈ ఆదివారం ఎటునుంచి వచ్చి ఎటు పోయిందీకూడా తెలియదు. గోపాలరావు ఎన్నెన్నో పనులను తలపెట్టుకొని వచ్చినాడు కాని ఆనాడు ఒక్కటీ జరిగిందికాదు, ఇతడు ఆలోచించుకొని వచ్చినప్రకారం. తమ మనోరథాలు నెరవేరకపోయెనే అని ఈదంపతులకు కలిగిన దుఃఖమే ఇందులకు కారణము. దినమంతా వీరికి ఒకరినొకరు ఓదార్చుకొనడం తోటే సరిపోయింది. మరునాటి సోమవారపు ఆఫీసు సింహంలాగు తలపులోనికి రావడం మొదలెట్టింది. సాయంకాలం ఆరుగంటలకు అక్కడినుంచి బయలుదేరితేనే కాని రాత్రి ఎనిమిదిగంటల రైలుమీద ఎక్కి తెల్లవారి ఏడుగంటలకు మద్రాసు చేరుకోలేడు. అప్పటి రయిళ్ల రాకపోకలు ఇప్పటిలాగు లేవు. తూర్పుతీరంగా మద్రాసునుంచి బెజవాడకు క్రొత్తగా లైను వేసిన రోజులవి. పెనిమిటి వెళ్లవలసిన సమయం సమీపిస్తున్న కొలదీ సీతమనసులో ఆరాటం ఎక్కువ గాసాగింది. భర్తతోగూడ వెళ్లి ఒకచోట కలిసివుందామని ఎన్నాళ్లనుంచో ఉవ్విళ్లూరుతూ ఉంటే మనసులోని కోరిక నెరవేరడానికి తగినసమయం చాలా దూరంగా ఉన్నా అంతచింత ఉండదు—కాని తీరా దగ్గిరికి వచ్చినట్లాగే వచ్చి చేతినుండి జారిపోయినందున ఈమెకు సహింపనలవికాని ఆవేదన ఆరంభమైనది. అయిదు గంటలు దాటినపిమ్మట ఏదోకొంచెం వయించిన మట్టుకు ఎంగిలిపడి, ఎవరినో మిత్రునిజూచి రావలెననీ, స్టేషనుకు పోవడానికి కూలీకి చెప్పివస్తానని గోపాలరావు వెలుపలికి వెళ్లాడు. ఇదివరలో ఇతడీలాగున రావడం వెళ్లడం ఎన్నిసార్లో జరిగాయి. కాని దైవవిచిత్ర మేమిటో తెలియదు, ఈపర్యాయ మీమెకు అసహ్యవేదన జనించింది. పెనిమిటి వెలుపలికి వెళ్లగానే అన్నమైనా తినక తనగదిలోనికి పోయి ఏడుస్తూ కూర్చున్నది. కొంచెం సేపట్లో గోపాలరావు తిరిగి వచ్చినాడు. ఇతని రాక ఈమె దుఃఖాగ్నికి ఇంధనము గా విలపిస్తూ లేచి నిలుచుంది. వెంటనే ఇతడామెను సమీపించి మంచం మీద తనప్రక్కను కూర్చుండబెట్టుకొని, మెల్లగా కంటినీరు తుడుస్తూ అనునయింపవలెనని ప్రయత్నంచేశాడు కాని, అట్లుగాక శోకావేగ మెక్కువై యతనివక్షఃస్థలము మీద బడి పిల్లలాగు ఏడువసాగింది. అంత నితడు ధైర్యము చిక్కబట్టుకొని,

"సీతా! నీవీలాగు చేస్తావని నే నెప్పుడూ అనుకోలేదు. ఇప్పటినీస్థితిని చూస్తే నాకు మతి పోతూఉంది. ధైర్య మాగడంలేదు. నీ విక్కడ ఏలాగో ఇంటిపట్టున సుఖంగా ఉన్నావనే సంతోషమే కాదూ, నన్నక్కడ సకలమైన వెట్టిచాకిరీ చేయిస్తూఉన్నది. ఈలాగు నీవు దుఃఖిస్తూ ఉంటే నాకు కాళ్లాడుతాయా? ఏమైనా చేయగలనా? నాకుమాత్రం నిన్ను వదలిపెట్టి ఉండాలని అభిలాషా? సీతా! దరిద్రులం మన మేమి చేయగలము? రెక్కలాడినగాని డొక్కలాడవు. ఇక్కడే వుందామంటే, అది నా కెంతమాత్రం మనసుకు నచ్చడం లేదు. మనయిద్దరి కేమీ తక్కువ లేకుండా వూరివాళ్లు జరుపుతారే అనుకో. ఆప్రకారం ఉండడం మనకు భావ్యమా? మనపూర్వులంటే కర్మనిష్ఠులై ఉండినందున వారివల్ల వీరికి పనిపడుతూ ఉండేది. కాబట్టి వీరివల్ల వారూ సహాయం పొందుతూవచ్చారు. నా కాలాటి విద్యలేమీ రావుగదా! ఊరక కూర్చుండి వీరినుండి తీసికోడానికి మనసొప్పక, ఏలాగో కొన్నాళ్లపర్యంతం ఇద్దరం కష్టపడితే తరువాత దైవ మనుగ్రహింపకపోతాడా అని ఈపనికి బూనుకొన్నాను గాని, నాప్రాణమా! నిన్ను వదలిపోయి దూరంగా ఎక్కడో ఉండవలసివచ్చినందున నే నెంతవిలపిస్తూ ఉంటానో పరమాత్మకే తెలుసు." నీకవన్నీ తెలియవూ? ఇదివర కెన్నోసార్లు నీవే నాకు ధైర్యం చెప్పావు. ఇవ్వాళ ఎందు కీలాగు అధైర్యపడడం? నిన్ను

ప్రకారం వదలిన బక్క— అదుగైనా నాకు ముందుకు పొనుకుందా?"

అని తన యుత్తరీయంతో ఆమె కన్నీళ్లు రద్దుచూ ఓదార్పుచూచినను ఉపశమింపక అదేవిధమున బాష్పములు విడుస్తూ,

"నా కన్నీళ్లు తెలుసును కాని ఏమి కారణమో ఇవ్వాళ మీరు బయలుదేరి వెళ్లిలా రనుకోగానే నాకు సహింపజాలనివేదన కలుగుతూ ఉంది. నాకు మళ్లీ మీదర్శనమౌతుందో కాదో అని భయం వేస్తున్నది. మంద భాగ్యను, నాగతి ఏం కానున్నదో నాథా! నన్ను మరచి పోకండేం! నన్ను మరచిపోవద్దు—మరచిపోవద్దు—" అని ఏడుస్తూ అతని పాదములమీద పడిపోయింది.

మొదలే శిథిలమైయున్న గోపాలరావుధైర్య మం తటితో ఎటు పోయిందో తెలియదు. కళ్లనీళ్ల పర్యంత ముగా నిత డామెను చప్పున లేవదీసి తన యంకతలమున కూర్చుండ బెట్టుకొని,

"సీతా! నీ వీశోకాన నామనస్సును చెదరగొట్టి నావు. దానిని కూడబట్టుకొన నాతరంగాదు. నన్ను వెళ్లమన్నావా? వద్దన్నావా?"

అని శోకిస్తూ యామె మీద వ్రాలిపోయ్యాడు. కొన్ని నిముషములవరకూ ఇద్దరకూ బాహ్యస్మృతి లేదు. చేతనారహితులవలె నట్లు మైమరచిపడియున్న తరుణమున కూలివాడు వచ్చి, "పంతులుగారు ప్రయాణానికి సిద్ధంగా ఉన్నారా?" అని పిలువ మొదలిడగా వీరికి మరల స్మృతి కలిగింది.

3

గోపాలరావు మద్రాసుకు మరలివచ్చి మూడు రోజులు గడచిపోయినాయి. శరీరం అమ్ముకొని ఉన్నందుకుగాన ఏలాగో ఒకలాగు అవయవసంచాలనం చేయక పోతే వీలులేదు. కాబట్టి యథాపూర్వం ఆఫీసుకు వెళ్లి తనద్యూటీని నెరవేరుస్తూవచ్చినాడు. కాని ఇతని ప్రస్తుతస్థితి పూర్వంలాగు లేదు. స్వగ్రామంనుంచి తాను బయలుదేరి వచ్చేసమయాన్ని ద్వారంలో నిలిచిచూస్తూ ఉండిన తనప్రియురాలి శోకపరీతదీనాకృతి ఇతని కను క్షణం ప్రత్యక్షమౌతూవచ్చింది. ఇదివరకెన్నడూ ఇతని కీలాటిదశ కలిగియుండ లేదు. ఎంత సమాధానపరచుకొన్నప్పటికీ శక్యంగాక మనస్సునకేదో విపరీతాందోళనం కలుగుతూవచ్చింది. సర్కారుపనినిదప్ప మరిదేనిని చేయడానికీ తోచదు. ఉత్సాహమెక్కడో పోయి దాని స్థానం విన్నదన మాక్రమించింది. ఎప్పటిలాగే గురువారం నాడు ఆఫీసుకువెళ్లాడు. నెలాఖరవడంవల్ల ఆఫీసులోని పని ఎక్కువకావడం ఆలా ఉండగా మరొక్క క్లార్కు సెలవుదీసికొని పోతే అతనిపనికూడా ఇతనిపైకి తిమీదే పడింది.

ఆపనిజేసితీరాలిగాని వల్లకాదనడానికి వీలులేదు. ఎదురాడినయెడల అసలు స్వంతనౌకరీకే ముప్పువస్తుం దనీ ఇష్టం ఉన్నాలేకపోయినా విసుక్కుంటూనో కసు క్కొంటూనో మీదపడిన పనినిజేస్తూనే ఉంటారు ఈ శ్రేణివారు. ఈలాటి ఎన్నిచాకిరీలనో చేస్తేనేగాని పై అధికార్ల హృదయాలు మెత్తబడవు. సుమారు పదీ, పదకొన్నరగంటలయ్యేసరికి ఇత డాసెలవుపుచ్చుకొనివెళ్లిన గుమాస్తాగారి కాగితాలనుగూడా పట్టుకొనివచ్చి తన బల్లమీద పడేసి కూచోవలెనని ఆలోచిస్తూవుండగానే టెలిగ్రాఫ్ జవా నొకడువచ్చి గోపాలరా వెవరని అడిగి తెలుసుకొని ఈయనను సమీపించి ఒక టెలిగ్రాంయిచ్చి వెళ్లిపోయ్యాడు. నిల్చున్నవాడు నిలుచున్న పాళంగానే కవరు చించి చూచేటప్పటి కేముంది?—

" Your wife attacked cholera; come atonce—" "నీభార్యకు కలరాతగిలింది. వెంటనేరావల సింది." అని వున్నది.

టెలిగ్రాం చూచేటప్పటికి ఇతనికాపాదమస్తకం శరీరంకంప మొందసాగి ముచ్చెమటలు గ్రమ్మాయి. నేత్రములవెంట అవిరళధార లుద్భవింప మతిహీనునివలె ఏడుస్తూ హెడ్‌క్లర్కుగారిగదిలోనికిబరువెత్తుకొనిపోయి ఆయనముం దా టెలిగ్రామును బడేసి, చేతులుజోడించుకొని,

# న మ్మ క మే

# పలుకుబడిని పొందుటకు హేతువైనది

మావద్ద కొను వేలకువేల ఖాతాదార్లు తమకు కావలసిన నాణ్యమైన సరకులకు, సొమ్ములకు మమ్ములను నమ్మియున్నారు. వారి కన్నివిధముల శ్రేయమును చేకూర్చుటయే మా విధియై యున్నది.

మా కంపెనీ మంచి మర్యాదను గాంచియున్నది. మొదటినుండియు ఒకేధరకు విక్ర యించుట యనుదానిని వదలకుండ నుండెను.

మట్టపురకం సరకును యిచ్చి మోసపుచ్చుటగాని, ఒకటిచెప్పి మరొకటి యిచ్చు టనునది ఎప్పుడు సంభవింపదు.

ఒకేధరగా నుండుటంబట్టి కాలాతీతమునకు వృథాశ్రమలకు తావులేదు.

మేము గ్యారంటీ యిచ్చిన వస్తువులు చెప్పిన ట్లుండనియెడల వాపసు పుచ్చుకొనుటకు సంసిద్ధులము.

మాతో లావాదేవి లాభసాటిగా పోస్టుద్వారా చేయవచ్చును.

మా సరుకులపైనను, మా నమ్మకముపైనను మీరు ఆధారపడి యుండవచ్చును. ఖాతాదారుల అక్కరలను మావిగానే గుర్తించి వర్తించెదము.

# సురాజ్‌మల్ లల్లూభాయ్ అండు కో.,

## డైమండువర్తకులు, జ్యూయలర్లు, బంగారు, వెండినగల వర్తకులు

## 313, ఎస్ప్లనేడ్, మద్రాసు

మా యితర ఆఫీసులు:

| బొంబాయి, | కలకత్తా, | రంగూన్, | తిరిచినాపల్లి. |
|---|---|---|---|
| 359, కల్బాదేవిరోడ్డు | 12, లాల్ బజారు వీధి | 184, మొగల్ వీధి | 185, బిగ్ బజారు వీధి |

"అయ్యా! నాయం దనుగ్రహముంచి నాకు సెలవిప్పించండి. నే నిప్పుడే బయలుదేరిపోయి 11½ గంటల రైలుమీద మా గ్రామం వెళ్లుతాను. నాభార్యకు కలరా తగిలిందట - కళ్లనైనా చూస్తానో చూడనో ప్రాణం ఉండగా; నాకు సెలవు దయచేయండి." అని మహా దీనంగా వేడుకొంటే,

"ఇంత అనాంతరంగా వచ్చి అడిగితే నే నేమి చేయగలను? మీకు తెలియదా? దొరగారి ఆర్డరు లేందే ఎవరికీ ఏం చేయడానికీ వీల్లేదని,—వారింకావరకు ఆఫీసుకు రాలేదు — మీరు వెళ్లి మీపనిని చూసుకోండి, దొరగారు రావడంతోటే వారి ఉత్తరువును పొంది వెళ్లవచ్చును."

"అయ్యో! అప్పటికి నాకీరైలు దొరుకుతుందా? అయ్యా! తగిలిన రోగం కలరా—ఇంకొకటి ఇంకొకటి కాదు. ఈరైలు తప్పితే సాయంకాలం దప్ప మరొకటి లేదు. నాయందు దయ ఉంచండి. నా ప్రార్థన మాలించండి. ఈదీనుని ఇల్లు నిల్పండి. మీచేతు లంటి వేడుకొంటాను. నాకీ భిక్ష పెట్టండి."
అని యతని చేతుల గ్రహింపబోవగా నిర్వక,

"ఏమి టీ అఘాయిత్యం—ఆపదానిలాగు ఏడుస్తూను! ఏదో కొంచెం వికారమైనా లైతే అక్కడివాళ్లు భయపడి నీకీ టెలిగ్రాం ఇచ్చివుంటారు. ఇంతమాత్రం ధైర్యం నిలుపుకోలేవేమిటి, దొరగారు వచ్చినతరువాత అడిగి పోవచ్చునయ్యా అంటేనూ?"

"అయ్యా! ఇంకో ఇంకో రోగం కాదు. ప్రాణాలు తీసుకొనిపొయ్యే రోగం. అబద్ధాలుకూడా ఈలాటి వాటికైనా యిస్తారా? నామనవి ఆలకించండి. నన్ను రక్షించండి! అయ్యా! నాయింటిదీపం నిల్పండి. మీ కాళ్లు పట్టుకొంటాను. నన్ను పోనివ్వండి."
అని ఏడుస్తూ కాళ్లమీద బడబోవగా వెనక్కులాక్కొని,

"దొరగారి అనుమతి లేందే నేనేమి చేయలేను; నిశ్చయం—పూర్వముండిన దొరైనా కాదు. ఇప్పటి వీరి స్వభావ మేలాటిదో అందరికీ తెలుసును. చూస్తూచూస్తూ నాకంతానికి ఉరిదెచ్చుకొనే మార్గం నేను చేసుకోజాలను. క్షమించండి."

అని కఠినముగా పలుక నిక చేయునది లేక ఏడుస్తూ ఇతడు తనచోటికి వచ్చినాడు. ఆహా! ఇంతకంటె ఘోరమైన దేదైనా ఉందా లోకంలో! తన భాగధేయమని, తన పాలిటిదేవి యని, తన సౌఖ్యమున కాలవాలమని, తననిధానమని, తన సర్వస్వమని నిరంతర మెవరిని తలచుకొనుచుండెనో, ఎవరి విషయమై యీతడన వచ్చిన నాటినుండి దుఃఖిస్తూ ఆమెకు సౌఖ్యారోగ్యముల బ్రసాదింపుమని ఈశ్వరుని ప్రార్థించుచుండెనో, ఎవరికి తనంతబాధ కలిగిన లోకమే మునిగెనని తలచునో అట్టి తన యర్ధాంగలక్ష్మి ప్రాణాంతకరోగమునకు గురియై ఎక్కడనో పడివుండి క్షణక్షణం తన్ను కలవరిస్తూ పలవరిస్తూఉంటే, తనదేవిని ఆవసానకాలమందైన చూచుకొనుటకు అవకాశమిచ్చింది కాదు ఈపాపిష్టి నౌకరి. తన ప్రాణపదమైన తన్వంగి ప్రాణనిర్యాణ వేళలందు చెంత నిలిచి గొంతుకలో నింత నీరు పోయుటకైన సెలవిచ్చింది కా దీదౌర్భాగ్యపు నౌకరి.

తనంతమాటలాడగలిగినది మొదలుకొని మనంచేసే ప్రయత్నాలన్ని ఈలాటి పాడునౌకరీలకొరకే. మన మనుభవించే యాతనలన్ని ఈలాటి దయాశూన్యమైన కటికనౌకరీలకే. ఇటువంటి అధికారివర్గముల అడుగుల కిందబడి నలుగుటకొరకే. వేలకొలది ద్రవ్యమును ఖర్చుపెట్టి తుదకు బికారు లయ్యేది ఈలాటిదాస్యపదవుల కొరకే. మనబలాన్ని, మన ఆరోగ్యాన్ని, తుదకు మన శరీరాన్ని బలియిచ్చేది ఈలాటి సేవాపర నామక దేవత కొరకే—అయ్యో! ఎంత శోచనీయమైన, ఎంత నీచమైన, ఎంత హేయమైనస్థితి మనభారతీయులది! గోపాలరావక్కడ ఏడుస్తూ పడివుండగానే గడియారం 11½ దాటిపోయింది; దానితో ఇతని ప్రాణాలుకూడా సగ మునిగిపోయాయి. స్వశరీరంమీద సహితం వెగటుపుట్టే ఈలాటి సమయంలో పనిచేయడ మేలాగును? కాని ఈ ఆఫీసుల్లో చేయక విధిలేదు. ఇచ్చినపనిని చేసితీరాలి, వచ్చితీరాలి. ఏదేవతానుగ్రహమైనా కలిగితే యమపాశాలనుంచికూడా

ముక్తి కలుగుతుంది కాని ఈ ఆఫీసుదయ్యాల పాశాలనుంచి విడిపించడానికి వారూ అసమర్థులే.

ఒక్కొక్కప్పుడతనికి దేహస్మృతి తప్పుతూవుంది; ఒక్కొక్కప్పుడు సర్వం అంధకారమయం. సుమారు మూడు గంటలవేళకు దొరగారు పత్నీసమేతులై మోటారుపై విచ్చేసి ఆఫీసు నలంకరించారు. దొరసాని గారు వారి పక్కనే సుఖాసీనుని గావించి తాను వేరేపని మీద వెళ్లిపోయింది. దాసానుదాసులందరు వందనా లర్పించుకోవడా లయిపోయినాయి. ముందుగత్యంగా దొరగారితో మనవిచేసికోవలసిన విన్నపములకు కొంతకాలం పట్టింది. అన్నీ అయినతరువాత హెడ్ గుమాస్తాగారు జడుస్తూజడుస్తూ చేతులను వెనకకు దీసికొని, కొంచెం ముందుకు వంగి దీనస్వరంతో గోపాలరావుసంగతి విన్నవింపగా, దొరగారు చీదరించుకొంటూ-

"You uxorious Indians; always concocting letters, telegrams and useless stuff of this kind only to go and play with your wives. Well sir, go and tell him that he cannot leave the office without finishing the work allotted to him."*—

"మీ హిందువులంతా అతిస్త్రీలోలులు. ఎప్పుడూ ఈలాటి వుత్తరాలనూ టెలిగ్రాములనూ, వెధవవంకలనూ కల్పిస్తూ వుంటారు, సెలవు దీసుకొనిపోయి భార్యలతో ఆడుకోడానికి. మంచిది, మీరు వెళ్లి ఈవేళ ఆయనపని పూర్తికానిదే ఆఫీసు వదలడానికి వీలుకాదని చెప్పండి."

ఇక మళ్లీ దొరగారి ముందు నోరెత్తడానికి వీరికి నుండెక్కడ? కిక్కురు మనకుండా అక్కడినుంచి బయటికి వచ్చి ఆసంగతిని తెలియజేశారు కాని ఈయనవల్లో నితడు పనిచేసేదేమిటి? అంత నితనికి సాయంచేయడానికి స్నేహితులైన కొందరు గుమాస్తాలు ముందుకురా పని కేదోవిధంగా సర్దుబాటైంది కాని దొరగారు కచేరీ వదిలేవరకూ ఇతని కాఫీసు వదలడానికి వీలుకాలేదు. దొరసానిగారు మోటారు తెస్తేనేకాని దొరగారికి వీలులేదు కచేరీవదలడానికి. గోపాలరావు దురదృష్టమో అంటూ ఆనాడు దొరసానిగారు తిరుగ రావడం పూర్వం ప్రతిదినం కంటే ఆలస్యమైంది. తుదకా విడగారు వేంచేసి దొరదొరసాను లిద్దరు వెడలిపోయిన తరువాత ఇత డాఫీసు వదలునప్పటికే 5 గంటలు కావచ్చింది. ఇద్దరు మిత్రులుకూడ వెంటరా వావుపరుగుతో వచ్చి సెంట్రల్ స్టేషనులో బడ్డాడు కాని లాభ మేముందీ! అయిదు నిముషాలకు పూర్వమే బండి బయలుదేరిపోయింది. తెగిన్నచెట్టులాగు ఇతడు భూమిమీద పడిపోయినాడు. వెంట నున్నవారు మధ్యనే పట్టుకొనబట్టిగాని లేకపోతే అప్పుడే ఇతని ప్రాణాలు పోయ్యేవి. ఈఘటనంతో నితనికి భార్యను చూడగలననే ఆశ భ్రాంతిగా పోయింది. మళ్లీ పట్నంలోకి పోకపోవడం అట్లావుండగా పచ్చిగంగైనా పుచ్చుకోలేదు. ఏడుపులతో, పెడబొబ్బలతో, కలవరింతలతో రాత్రంతా అక్కడే గడిపాడు. మర్నాడు తెల్లవారు గట్లే ఏలాగైతేనేం, అయిదుగంటల బండిలో పడేశారీ శరీరాన్ని మిత్రులందరూ గలిపి, గార్డుగారి పరంజేసి.

౪

శుక్రవారం మిట్టమధ్యాహ్నం పన్నెండుగంటలు దాటిపోయినాయి. ఆకాశంలో ఏటువేపు చూసినా తిలమాత్రం మబ్బుకూడా కనిపించడం లేదు. ఎండ నిర్ధూమధామంగా ఫెళ్లుమని కాస్తూఉంది. మలకలచెరువు గ్రామమంతా జనశూన్యం. ప్లేగుపడిన గ్రామంలాగు, నిప్పులు గురిపించే జ్వాలాముఖీపర్వతం క్రింది పట్టణంలాగు, రణక్షేత్రమధ్యమున చిక్కినపుటభేదనంలాగు, ఊరంతా కళావిహీనమై పాడుపడిన దానివలె గనబడుతూ ఉంది. ఇందులకు కారణ మేమిటంటారా?

* యూరోపునివాసుల కిట్టి దురభిప్రాయాలు కలుగుటకు కారణం హిందువులే. అందులో పరిపుష్టవేతనభోక్తలగు వొజ్జకనకయ్యలే స్వార్థసిద్ధికై యీలాటిదుర్వ్యవహారముల నవలంబించి ధనాఢ్యులగుటచేత నిరపాయంగానే గడతేరిపోతూ ఉంటారు; కాని యీ దుర్నీతుల పరిణామాలన్నీ సామాన్యగుమాస్తాలనెత్తినే పడుతూవుంటాయి.

రండి! పూర్వోదాహృతమైన చెరువు దగ్గరకు వెళ్లితే అన్నీ మీకే తెలుస్తాయి. అదిగో ఆచెరువుకట్టకు దానికి దిగువగానున్న సరిహద్దుల మధ్యమందున్న శ్మశానమంతా స్త్రీపురుషులతో కిటకిటలాడుతూ ఉంది చూడండి. వీరిలో విలపింపనివారు ఒక్కరూ కానరారు. గ్రామంలోని ఆబాలగోపాలం జనమంతా నిరభ్యంతరమైన తీవ్రాతపంలో తలలు మాడుతూఉంటే, క్రింద కాళ్లు కాలుతూ ఉంటే, దానిని గమనింపనైన గమనింపక, పొంగిపొంగివచ్చే దుఃఖావేశాన్ని అపుకోనజాలక కళ్ల వెంట నీరుగారుస్తూ, మధ్యమందలి కాష్ఠంమీద బరుండబెట్టబడి ఉన్న జీవరహితమైన సీతాశరీరమును జూసి చూసి గోలుగోలున ఏడుస్తున్నారు. గ్రామవాసుల కీర్తి ప్రతిష్ఠల కాలవాలమైన ఈసతీ తిలకముయొక్క పంచప్రాణమయమైన విహంగము నిన్న 11 గంటలకే ఎగిరి పోయింది. ఈపవిత్రశీలకు రోగ మారంభమైనది మొదలు కొని చుట్టుప్రక్కలనున్న స్త్రీ పురుషులందరూ దగ్గర కని పెట్టుకొని ఉండి లోపము నుపమాట లేకుండ సకలవిధములైన సేవలు, నుపచారములు గావించిరి గాని దైవము గ్రహింపలేదు. తెలివి ఉన్నంతవరకూ తన ప్రాణకాంతునే కలవరిస్తూ పోయింది. అప్పటినుండి ఇంతపర్యంతం కని పెట్టుకొనివుండి ఈదేహాన్ని కాపాడారు గ్రామస్థులందరూ, ఆనిర్భాగ్యుడు గోపాలరావు వచ్చి ఆఖరుచూపైనా చూసుకొంటాడనీ—తీరిచ్చిన టెలిగ్రాం చూసుకొని వెంటనే బయలుదేరినట్లయితే రాత్రి పదకొండుగంటలకే రావలసింది, రాలేదు. ఒకవేళ ఆబండితప్పిపోయి నప్పటికి సాయంకాలము రైలుమీద బయలుదేరితే తెల్లవారేసరికైనా రావచ్చు నని ఈ రెండో బండినికూడా చూశారు. ప్రొద్దుటి రైలుకూడా వెళ్లిపోయింది కాని గోపాలరావుజాడ లేమీ లేవు. ఇక చేసే దేమిటి? ఇంకా ఎంతసేపని చేస్తారీశవజాగరణం. బ్రతికి వున్నంతకాలం మంచిగంధపుతైలములతో, సువాసనా ద్రవ్యములతో, రంగురంగుల వస్త్రములతో, హృద్యములైన పదార్థములతో పోషించి పెంచిన ఈపాడుశరీరం, ఈపొమికలగూడు, ఈనరాలకుప్ప, ఈ ప్రేవుల ప్రోవు, ఈమాంసపుముద్ద, ఈ విణ్మూత్రములతొట్టి, ఈ తోలు తిత్తి, ఆకాస్త ప్రాణం ఎగిరిపోయిందా అంటే ఎందుకూ పనికిరాదు. కొన్నాళ్లపాటేమిటి? ఒక్కదినమైనా దగ్గర పెట్టుకోడానికి వీలులేదు. మర్నాటికే దుర్గంధ మారంభమై దగ్గిరికిగూడ రానివ్వదు, ఆత్మబంధువులైనా. ఆలాటిసంగతిలో ఇంకా ఎంతసేపని నిరీక్షిస్తారు పాపం వీరంతా. ఆఖరుకు ౧౧ గంటలకు జరిగింపవలసిన దంతువునంతా జరిగించి ఈ శ్మశానంలోనికి దీసికొని వచ్చారు. ఇక్కడకూడ అన్ని కార్యాలనూ విధ్యుక్తంగా నెరవేర్చి కాష్ఠారోహణం చేయించారు. సగోత్రులు కొందరు మండుకట్టెల నాలుగువైపుల నంటించారు గాని వెంటనే కాష్ఠం అంటుకోడానికి మారుగా మండేకట్టెలే ఆరిపోయినాయి. ఎందువల్లనో ఆరిపోయాయని ఈవలకు వచ్చి మరికొన్ని పెద్దకట్టెలను ఎగాదిగ మండేలాగు చేసి వాని సమాంతంగా దీసికొనిపోయి రగిలించారు కాని కాష్ఠం క్రింద పెట్టడమే తడవుగా అవన్నీ నిప్పున చుయ్యి మంటూ ఆరిపోయినాయి. ఏమిటే వింతయని వీరి తోచక, మరికొన్ని ఎండుకట్టెలనూ, చొప్పకట్టలనూ నాలుగువైపుల కాష్ఠమునకు చేర్పించి నేతిని పోయించి మండుతూవున్న కట్టెలనూ, చొప్పకట్టెలనూ పది పన్నెండుమంది ఒక్కమాటుగ చేతబుచ్చుకొని కాష్ఠం నాలుగువైపులా ఒక్కపర్యాయంగా అంటించారు. కాని ఏమి ఆశ్చర్యమో! ఒక్క పెట్టున కాష్ఠమంతా జ్వాలామయమై పోవడానికి మారుగా నీళ్లుపడినవాని లాగున అన్నియూ క్షణమాత్రంలో ఆరిపోయినవి. ఈ సారి ఎంతో ప్రయత్నంచేసి అగ్ని నంటించి నప్పటికి ఆరిపోవుటవలన అది ఏదో అమానుషిక విగ్రహమని అక్కడ ఉన్నవారందరి హృదయములలో భయభక్తులుప్పన్నములుగా కాళ్లుచేతులు కంపమొందసాగాయి. ఇందులో ఏదో మహత్తరమైన కారణమున్నదని అందరూ తలపోశారు. మిట్టమధ్యాహ్నం - ఎండ ఉచ్చియాడ్చి కొడుతూ వుంది. రివ్వురివ్వున వీచేగాలికా తక్కువ లేదు. కాష్ఠానికి నాలుగైదుగజాలదూరాన్ని ఎగాదిగా మండేకట్టెలు చితికి తాకింపడంతోటే నీళ్లలో ముంచినవానివలె ఆరిపోతూ ఉన్నాయి కాని ఎన్ని సార్లు ప్రయత్నించినా కాష్ఠాని కంటుకోవడం లేదు.

పెద్ద పెద్ద పట్నాల్లో సైతం ఈలాటి విచిత్రవార్త వ్యాపించడానికి ఆలస్యం పట్టదు. ఇక పల్లెటూళ్లలో లెక్కా? పదినిముషాల్లో ఈసమాచారం ఊరంతటా తెలిసిపోయింది. గ్రామంలోని స్త్రీపురుషులు ఎక్కడి పనులను అక్కడ ఉన్నవానిని ఉన్నట్లుగానే వదలి పెట్టి శ్మశానం ప్రవేశించేసరికి గ్రామం మసానంగా, మసానం గ్రామంగా మారిపోయింది. ఒకటి రెండుగంటల్లో చుట్టుపక్కల ఉన్న గ్రామాలకుగూడ ఈసంగతి తెలియగానే అనటివారలునూ తండోపతండములుగా రాగసాగినందున నక్కడేదో తిరుణాళ్ల జరుగుతూ ఉన్న లాగు గనుపించిందికాని దహనసంస్కారమని తోచలేదు. అంత ఈప్రకారం ఏతెంచిన జనబృందముల అవలోకనార్థం ఆసతీమణి సుకుమారగాత్రముపై అడ్డదిడ్డముగ పడివున్న కాష్ఠముల నన్నింటి తొలగింపగా సువాసినులు చల్లిన పసుపు కుంకుమలతో దోగియాడుతూ దేవీ విగ్రహంలాగు గనుబడుతూవుంది చితిమీది సీతా కళేబరము. మొగంమీద ప్రేతకళలకు మారు జీవకళ లుట్టిపడుతున్నాయి. ముకుళితనేత్రయైన తన మనోహరుడు ఎప్పుడు తనదగ్గిరికి వచ్చునాయని ప్రార్థిస్తున్న విధమున గన్పించిన దివ్యాంగిముఖపద్మం. ఏండ్లు గడచిన స్త్రీపురుషు లందరూ ఆదివ్యాకృతిని గాంచి ఏదో అవతార మనుతలంపున శ్రద్ధాభక్తులతో, "తల్లీ! మావల్ల నేవైన అపరాధాలు కలిగిన క్షమింపు"మని చేతులు జోడించుకొని ప్రార్థింపసాగారు. దుఃఖమునకు తోడుగా ఇప్పుడు వీరందరినీ భయవిస్మయోద్వేగాలాక్రమించాయి. ఈప్రకారం నాలుగైదుగంటలు గడిచి పోయాయి. ఇంకోగంటకు మద్రాసునుంచి రైలువస్తుంది. అందరిమనసులూ గోపాలరావుమీదికి పోయినాయి. ఒకవేళ ఇక్కడి ప్రస్తుతావస్థ ఏలాగున పరిణమిస్తుందా అని ఆలోచిస్తూ వున్నారు. ఎవరికీ ఏమీ పాలుపోవడం లేదు. సూర్యుడస్తమించడానికి ఇక ఎంతోసేపు పట్టదు. అప్పు డున్న టు లంకించి హఠాత్తుగ ప్రత్యక్షమైనాడు గోపాలరావు. ఏసమయాన్ని, ఏప్రకారం, ఎటునుంచి వచ్చిందీ ఎవరికీ గోచరించలేదు. వైఖరి చూస్తే స్టేషనుదగ్గిరనుంచే పరుగెత్తివచ్చినట్లు తోస్తుంది. కట్టుకొన్న ఏకవస్త్రం తప్ప ఒంటిమీద మరేమీ లేదు. అదీ శరీరమంతటా గారుతున్న చెమటతో తడిసిపోయివుంది. ఇతన్ని జూచిన తత్క్షణ మందరికీ ఒక్కపెట్టున శోక మువ్వెత్తివచ్చింది. కళ్లెత్తి ఒకరివైపు చూడనూ లేదు, ఒకరిని బలుకరించనూ లేదు. అడ్డంవచ్చిన గుంపులను తోసుకొంటూ శిరోన్మత్తుడై వేగమున పరుగెత్తుకొని వచ్చి కాష్ఠమును సమీపించి, చూపరులందరూ ఏమి చేయునో అని తలుస్తూ వుండగానే, "హా! సీతా" అని బిగ్గరగ కేకవేసి, చిటికవేసినంతమాత్రలో ఆశవంమీద బడిపోయినాడు. ఆక్షణమం దక్కడ వున్న స్థిరములైయున్న భిన్నభిన్న వ్యక్తిగతములైన ఆత్మలన్నీ ఏకత్వమాధుర్యాలను ఆవహించాయి. ఇట్లు కొన్ని క్షణములు గతించిపోయినాయి. తరువాత కొందరవిచారము తెలివివచ్చి చూస్తే భార్యకళేబరముపై ఇతని శరీరం పడి వది పడినలాగేవుంది. కదలదూ మెదలదూ. మరింతదగ్గరకు బోయి పరికించి చూస్తే, ఏమున్నదీ? వాత్సల్యపరిపూరితమైన పతియాత్మ పత్నియొక్క ఆత్మను అనుగమించి పోయినట్లు స్పష్టమైంది.

అప్పు డక్కడ వున్న వారందరికీ అవలంబింపదగిన మరోమార్గ మేది కలదు? భార్యాభర్తల శరీరముల రెండింటిని సమములుగా పెట్టించి, చెదరిపోయి ఉన్న కట్టెల నన్నింటిని బాగుగ జేర్పించి, విధ్యుక్తముగ సంసిద్ధము చేయబడిన అగ్నిని మరల దగిలింపగా—ఎంత విచిత్ర మన నవ్వును! ఒక్కపర్యాయముగ కాష్ఠము నాలుగువైపుల జ్వాల లుత్పన్నములుగా, ఖాండాహుతిదానంచేత పరితుష్టుడైన బాలునివలెను క్షణమాత్రంలో కబళించివేశాడు హవ్యవాహను డీపవిత్రాహుతిద్వయాన్ని.

---

# సాంధ్యగీత*

వేంకటకాళిదాసకవులు (ఆం. కీ. సా. ప.)

వ్రాసి పోయిన తెలిచీర మరల
చెదరసరుదుచుఁ గాఁపుచిన్నదియొకర్తు
పోవుచున్నది పాఁడి యావులను తోలు
కొనుచుఁ, జిరునవ్వుచిగురు చెక్కుల బిగింప.

పసపుఁ బచ్చఁగాఁ బండినపైరు పొలము
నడుమ కుచ్చెళ్లు జీరాడ కొడవలిఁ గొని
చేను కోయుచు వలపుల సీనుపాట
పాడుచున్నది పల్లియపడు చొకర్తు.

ఏటిదరి గడ్డి త్రవ్వెడు నీటుకత్తె
యొకతె రెల్లులోఁ దనదుప్రియుని కనుఁగొని
మోము ప్రక్కకు త్రిప్పి యెవ్వఁడును లేని
క్రొత్తరీతిగాఁ జిఱునవ్వు కొనుచునుండె.

గుమ్మపాల తెలుపుమబ్బు కొనలనుండి
పుప్పొడిని జల్లు వెన్నెలపూవుఁ జూచి
లేఁతజవరా లొకర్తు 'బలే' యటంచుఁ
జూచుచున్నది చిఱునవ్వు చూపుతోడ.

సంజకన్నెపై ముసుఁగును జార్చుచున్న
ప్రకృతిశోభను కనుఁగొంచుఁ బసుమగొల్ల
పిల్లయొక్కతె యావుపై విడిచియున్న
చేయి తీయుట మానెనేమో యెఱుఁగక.

కొండపై వెండిగుండు కన్గొనఁగ వేగ
నడచు చుండిన కవిని కన్యక యొకర్తు
చూపు నల్లకలువరేకు శోభచేత
ప్రేమపెంపొందఁగ నలంకరింపుచుండె.

పదియునొకయేఁడు నిండని బాల యొకతె
పరికిణీ జారుచుండఁగా సరుదుకొనుచు
తల్లి కోపించు నని యెదఁ దల్లడిలుచు
వెడలుచున్నది పెన్నెఱుల్ విప భుజాన.

దినదినము కూడ క్రొత్తఁగాఁ గనఁబడు సుమ
ప్రకృతిఁ గల్గెడు వింతసంపదలు, వాని
నీలలితమాధురీసుధా నిలయ మంజు
లేఖనిని జార్చవలెఁ దేనెలీల నింక
లెమ్ము నూతన స్వప్నడోలికలనూఁగి
వ్రాయవలయును క్రొత్తకావ్యము కుమార!

---

* సర్వస్వామ్యములు గ్రంథకర్తలవి.

# మహాశీలవ జాతకము

ఉభయభాషాప్రవీణ కానూరి వీరభద్రేశ్వరరావు గారు,
బి. యే., యల్. టి.

పూర్వము బ్రహ్మదత్తుఁడు కాశీరాజ్యమేలుచుండఁగా, బోధిసత్త్వుఁ డాతని పట్టపురాణి కడుపునఁ బుట్టెను. తండ్రి కుమారునికి శీలవకుమారుఁడని పేరుపెట్టెను. పదునాఱేండ్ల యీడుననే ఆ రాజకుమారుఁడు సకలవిద్యాపారంగతుఁ డయ్యె. తండ్రి స్వర్గస్థుఁడైన పిదప నతఁడు మహాశీలవుఁడను బిరుదు వహించి సింహాసన మెక్కెను. దైవమునందు భక్తి, ప్రజలయం దనురక్తి నుంచి ధర్మపరిపాలనఁ జేయుచుండెను. ప్రజాసౌఖ్యమే తనసౌఖ్యమని భావించుటచే రా జతిథి అభ్యాగతుల కొఱకై పురద్వారములందు నాలుగు మండపములును, ప్రాసాదద్వార భూమి నొకటియు, పురములోపల నొకటియు మొత్త మాఱు శాలలు నిర్మించెను. ఇట్లతఁ డర్థికోటిని దానముల చేతఁ దన్పుచు, నిజశీల రక్షణము గావించుకొనుచు, ఉపవాసవ్రత మనుష్ఠించుచు, సత్య దయాశౌచ గుణములు మూర్తీభవించెనో యన్నట్లు సర్వభూత దయాళువై మెలంగుచు తండ్రి బిడ్డలను పోషించురీతి ప్రజలను కాపాడెడివాఁడు.

కొన్నాళ్లకతని మంత్రి యొకఁ డంతఃపుర ద్రోహము గావించెను. వెంటనే రాజు న్యాయవిచారణచేసి మంత్రి దోషియని నిశ్చయించి, ఆతని రావించి, "ఓయీ! మదాంధుఁడవై కన్నులు గానక చేయరానిపని చేసితివి. నీ వింక నా రాజ్యమునం దుండఁతగవు. నీ భార్యాపుత్రులను గొని యెక్కడికైన పొమ్ము" అని పలికి దేశము వెడలఁ గొట్టెను. దేశాంతరగతుఁడైన మంత్రి కాశీరాజ్యము వీడి కోసలరాజు కొలువులోఁ బ్రవేశించి కాలక్రమమున ప్రభువిశ్వాసమునకుఁ బాత్రుఁ డయ్యెను. ఒకనాఁ డాతఁడు కోసలరాజుతో నిట్లనియె:

"దేవా! కాశీరాజ్య మీఁగలు లేని తేనెపట్టువలె నున్నది. రాజన్ననో మెత్తనిమనసు కలవాఁడు. కొలఁదిబలముతో దాడివెడలి రాజ్యశ్రీని కైవసముఁ జేసికొనవచ్చును."

రాజు, "కాశీరాజ్యము శత్రువుల కభేద్యము. ఇతఁడేమో చిన్న దండుతో గెలువవచ్చునని చెప్పుచున్నాఁడు. వీఁ డొకవేళ శత్రుపక్షపు గూఢచారియేమో?" అని తలంచి యిట్లనియె: "అసంభవము. నీవు చారునివలె అగపడుచున్నావు."

మంత్రి—"లేదు. దేవా! నేను గూఢచారుఁడను కాను. నిజము చెప్పుచున్నాను. మీకు నా మాటలందు నమ్మకము లేనిచో నెల్లనున్న పల్లెలను కొల్లగొట్టుటకై మనుష్యులనుఁ బంపుఁడు. అప్పుడు రా జేమి చేయునని ఎంచెదరు? వారికి ధన మిచ్చి పంపివేయును."

రాజు—(తనలో) "ఇతఁ డేమో గట్టిగాఁ జెప్పుచున్నాఁడు. అయినను నష్ట మేమి? పరీక్షించి చూచెదఁగాక!"

రా జిట్లు తలంచి మొదట సమీపగ్రామములు కొల్లగొట్టుటకై కొందఱిఁ బంపెను. దోఁపిడికాండ్రు పట్టుపడిరి. కాశీరాజు వారిని గాంచి, "ఈ హీనవృత్తి నవలంబించుటకు మీ కంతగతి యేమి పట్టినది?" అని యడిగెను.

దొంగలు—"దేవా, ఏమున్నది? పాడు పొట్ట కులేక—"

రాజు—"మీరు మూఢులవలె నున్నారు. అంత పొట్టకు జరుగనప్పుడు, ధర్మరాజ్యమైన మా కాశీకి రాకపోతిరా? మీకు కావలసినంత ధన మిచ్చియుందునే! సరే, ఇంతటనైన దొంగతనము మానుఁడు."

ఇట్లు బుద్ధిఁజెప్పి కాశీరాజు దొంగలకు ధన మిచ్చి పంపివేసెను. వారును తిరిగి వచ్చి తమ ప్రభువున కా సంగతి విన్నవించిరి.

కోసలరాజునకు కొంచెమైన ధైర్యము చిక్కలేదు. రాజ్యమధ్య మందున్న మండలమును కొల్లగొట్టునిమిత్తము మరల సేవకులను బంపించెను. కాశీరాజు వారికి మరల ధన మిచ్చి పంపివేసెను.

ఇప్పటికిని కోసలరాజు దాడివెడల సాహసింపఁడయ్యె. కాశీనగర వీథులలోని మనుష్యలను పట్టపగలే దోఁచుటకై సేవకులను బంపెను. కాశీరాజు మునుపటివలెనే వారికి ధన మిచ్చి పంపెను.

ఇన్ని తడవలు పరీక్షించి చూచినపిమ్మట కోసలరాజునకు ధైర్యము చిక్కెను. అంతరంగమిత్రుని మాట లిప్పుడు చెవికెక్కెను.

"ఈ రాజు నవనీతకోమల హృదయుఁడు. పరులు కష్టపడుటఁ జూచి సహింపలేఁడు. ఇది యే మంచి యదను. కాశీరాజ్యముపై దండెత్తితినా, గెలుపు సులభము" అని నిశ్చయించి సముద్రమువంటి సేనతో కోసలరాజు బయలుదేఱెను.

ఆ కాలమందు కాశీరాజు కొలువులో మెఱికెలవంటి వీరభటులు, అభేద్యవరశూరులు, యోధానుయోధులు వేయిమంది కలరు. పిఱికికండ లేని ఆ మహాప్రతాపవంతుల నెదిరింప నెవ్వరికిని సాధ్యముకాదు. వారు మదించిన యేనుఁగునైన డీకొను పోటుబంటులు. తల మీఁద ఫెళఫెళమని పిడుగు విఱిగిపడినను చలింపనిమేటిధీరులు. ఱేఁడు ముదలయిడినఁ జాలు, జంబూద్వీపములోని యే రాజ్యమునైన నవలీలఁ గబళింపఁజాలు ఉక్కుతునకలు. ప్రచండసైన్య సమేతుఁడై కోసలరాజు వచ్చుచుండెనని విని, ఆ శూరాగ్రేసరులు రాజు కడ కేఁగి, "దేవా! కోసలరాజు మన రాజ్యముపై దండెత్తి వచ్చుచున్నాఁడఁట. సెలవిండు, ఇప్పుడే వెళ్లి వాని నోడించి బందీకృతునిఁ జేయుదుము." అనిరి.

"మిత్రులారా! నా కొఱకు ఇతరులు వెతఁజెంద నేల? పాపము, రాజ్యార్థియై వచ్చిన యాతని యభిలాష తీరవలదా?" అని రాజు శాంతముగ వచించెను.

కోసలరాజు నిజసైన్యముతో పొలిమేర దాఁటి కాశీరాజ్యముఁ జొచ్చెను.

మంత్రులు రాజునొద్దకు వచ్చి మరల మొఱలిడిరి. మునుపటివలెనే రాజు వారిని వారించెను.

కోసలరాజు నగరమువెలుపల విడిసి పగతున కిట్లు వర్తమాన మంపెను: "రాజ్య మిచ్చినా సరే, యుద్ధము చేసినా సరే."

కాశీరాజది విని ఇట్లు ప్రత్యుత్తర మొసంగెను: "యుద్ధముచేయుట నా కిష్టము లేదు. వలయుచో రాజ్యమును గైకొనుము."

మంత్రులు రాజునొద్దకు వచ్చి మొత్తుకొనిరి:

"దేవా! కోసలరాజును పురములో నడుగుపెట్టనీయము. కనుతెప్పపాటులో నతని నోడించి చెఱనుంతుము. సెలవొసంగుఁడు."

వెనుకటివలెనే రాజు వారి యుత్సాహమును వారించెను.

మహాశీలవరాజంతట కోట తలుపులు తెఱచి, అమాత్య సహస్రము చుట్టు గొలువ, సభామండపమునందు రత్నసింహాసనాసీనుఁడై శత్రువురాకకై వేచియుండెను. ప్రతివీరుఁ డొక్కఁడును కానరానందున కోసలరాజు నిర్భయముగ నగరుఁ జొచ్చి నిరపరాధి యగు కాశీరాజు సమాత్య సహస్రముతో బంధింప నెంచి సేవకుల కిట్లాజ్ఞాపించెను: "ఓరీ భటులారా! ఈరాజును, మంత్రులను పెడతెక్కలు విఱిచికట్టి శ్మశానభూమిలో గోతులు త్రీసి కంఠము వఱకు పూడ్చిపెట్టుఁడు. చీఁకటి పడఁగానే నక్కలు వచ్చి వీరిపనిఁ బట్టఁగలవు."

చోరరాజు నాజ్ఞ భటు లౌదలఁ దాల్చి కాశీరాజును, అతని మంత్రులను ప్రేతభూమికిఁ గొంపోయిరి. అప్పటికిని శీలవరాజునకు చోరరాజుమీఁద లేశమాత్రమైన ద్వేషభావ ముదయింపలేదు. కాశీరాజు భటులు సుశిక్షితులైన శూరసైనికు లగుటచే బంధింపఁ బడునపుడు మాఱుమాటాడక, శౌర్యధైర్యస్థైర్యసంపన్నులయ్యును రాజాజ్ఞమీరక మిన్నకుండిరి.

కంఠము మునుగు గోతులలో రాజును, మంత్రులును పూడ్చిపెట్టఁబడిరి. నడుమ రాజు, చుట్టును మంత్రులు. గోతులను మట్టితోఁ బూడ్చి భటు లిండ్లకు వెళ్లిరి.

కాశీరాజు మంత్రుల కిట్లు ధైర్యము, జెప్పెను:

"మిత్రులారా! కోసలరాజు దుష్టుఁడని మీ రాగ్రహపడవలదు. సాటి మానవుఁడని యెంచి ప్రేమించుఁడు."

అర్ధరాత్ర మయ్యెను. మనుష్య మాంసము రుచిఁగొనఁదలంచి నక్కలువచ్చెను. వానిఁ జూచుటతోడనే రాజును, అతని మంత్రులును ఒక్కమాఱు బిగ్గఱగ నఱచిరి. ఆ యఱపునకు వెఱచికాఁబోలు, నక్కలు పిక్కబలిమిఁ జూపినవి. కొంతదవ్వేఁగి నక్కలు వెనుదిరిగి చూడ తమ్ము తఱుమువా రెవరును లేరని యెఱిఁగి తిరిగి వచ్చినవి. రాజును, మంత్రులును మఱల ఒక్కటే వెఱపుగొలుపు అఱపు అఱచిరి. నక్కలు పారిపోయెను.



చిత్రము ౭



చిత్రము ౮



చిత్రము ౯



చిత్రము ౧౦



చిత్రము ౧౧

# బౌద్ధశిల్పచిత్రములు*

భోపాలునగల సాంచిస్తూపశిథిలముల నున్నవి








* ఆర్టు, ఇండస్ట్రీ జర్నలునుండి.

కొంతవడికి నక్కలు తిరిగి చూచినవి. ఎవ్వరును తెలుపుటలేదు. వాటికి ధైర్యము వచ్చినది. "వీరు వధార్హులై యుందురు. కానిచో మన వెంటఁ బడ రేమి?" అని లోఁదలంచి నక్కలు పారిపోలేదు. నక్కలఱేఁడు రాజును సమీపించెను. తక్కినవి మంత్రులదరి కేఁగినవి. రాజు నక్కరాకఁ గని, యది మెడ కొఱుక యత్నించుచుండఁగా దానిని పండ్లతోఁ గఱచిపట్టి యంత్రమునందువలె నొక్కిపట్టియుంచెను. సింహపరాక్రముఁ డగురాజునోటిలోఁ జిక్కి కదలమెదలనేరక, పట్టు విడిపించుకొనలేక, ప్రాణముల మీఁది ఆశ వదలుకొని నక్కలఱేఁ డొక్కపెట్టున గీపెట్టెను. ఆ యార్తనాదము విని మిగిలిన నక్కలు ఏలిక చిక్కెనని యెంచి మంత్రులజోలి వీడి, 'బ్రదుకు జీవుఁడా' యని ఒక్క పరుగుతీసినవి. రాజుపండ్లలోఁ జిక్కిన నక్కమాత్రము బ్రదుకునాస వీడి విడిపించు కొనుటకై విలవిల తన్నుకొని రాజున్న గోతిలోని మట్టి నెగఁజిమ్మెను. రాజంత నక్కను విడిచిపుచ్చి, అటునిటు కదలి సడలిన రెండు చేతులను పైకి లాగుకొని, గోతిదరి నూఁతగై కొని, గాలిచేఁ గొట్టఁబడిన మబ్బుతునుక వలె నొక్క యూఁపున బయట వచ్చి పడెను.

ఉపాయకుశలుఁడగు రాజిట్లు స్వేచ్ఛఁ బొంది, మంత్రుల నూఱడించి, గోతులలో నుండి ఒక్కరొక్కరినే పైకి లాగెను. అనంతర మా శ్మశానసీమయందే చుట్టును మంత్రులు పరివేష్టించియుండ రాజు కొలువు దీరెను.

అదేతరుణమున కొందఱు శవమొండు గొనివచ్చి యక్షిణీద్వయము మధ్యనుంచి యేఁగిరి. శవవిభాగవిషయమున యక్షిణులకుఁ బొత్తు కుదుర లేదు. వా రిట్లనుకొనిరి: "ఈ శవమును మనము పంచుకొనలేము. సుశీల చరిత్రుఁడు మహాశీలవరా జిచ్చటనేయుండెఁగదా! ఆతని యొద్దకుఁ బోదము." వా రాశవ మీడ్చుకొనుచు పోయి రాజును సమీపించి, "ఓ దేవా! దీనిని మా కిద్దఱకును పంచిపెట్టుము."

"ఓ యక్షిణులారా! అట్లే పంచిపెట్టెదఁ గాని, అపరిశుద్ధుఁడ నగుట నే ముందు స్నానముఁ జేయవలయు"నని రాజు నుడివెను.

యక్షిణు లంత మంత్రశక్తిచేత చోర రాజునకై సిద్ధపఱిచిన పరిమళోదకముఁ దెచ్చి రాజు నెదుట నుంచిరి. రా జందు జలకమాడెను. యక్షిణులు పిదప చోరరాజు ధరించు చలువ మడతలు, గమగమనివలచు అత్తరువుల పెట్టె, మణితాళవృంతముల నుంచిన నానాసూనవితానములును దెచ్చి యిచ్చిరి. మహాశీలవరాజు రాజోచిత వేషము ధరించి, గంధలేపములు పూసికొని, కమ్మని వాసనలు చిమ్ము పూల నలంకరించుకొనియె.

"స్వామీ! ఇంక నేమి వలయు?" నని యక్షిణు లడిగిరి. ఆఁకలిగా నున్నదని రాజు సైగఁజేసెను. వా రంతఃపురముఁ జొచ్చి పంచ భక్ష్య పరమాన్నములు పట్టుకొని వచ్చిరి. రా జా రుచిరాహారము నారగించెను. యక్షిణి యొకతె బంగారుగిన్నెలో సుగంధ జలము

గొనిరా, రాజా నిర్మలోదకములఁ ద్రావి నోట పుక్కిలించి చేతులు కడుగుకొని పంచసుగంధ ద్రవ్యయుత కర్పూర తాంబూలము వేసికొనెను.

"స్వామీ! ఏమి సెలవు?"

"పోండి, కోసలస్వామి తలదిండు క్రింద నున్న నా మంగళఖడ్గము తెండి."

యక్షిణులా కత్తిని దెచ్చి యిచ్చిరి.

సత్త్వవంతుఁడైన రాజంత కత్తి దూసి నిలువఁబెట్టిన శవమును రెండు ముక్కలుగ నఱికి, ఇద్దఱకు సరిసమానముగఁ బంచి యిచ్చె. యక్షిణులా మానవశవము భుజించి తృప్తిఁ జెంది మోదంబున నిట్లనిరి: "దేవా! మేము మీ యాజ్ఞల శిరసావహింతుము. ఏమి చెప్పెదరు?"

రాజాలోచించెను. "ఓ యక్షిణులారా! మీ దివ్యశక్తి ప్రభావమున చోరరాజు పరుండిన గదిలోనికి నన్నుఁ జేర్పుఁడు. ఈ నా మంత్రులను వారివారియిండ్లలోఁ బ్రవేశపెట్టుఁడు" అని రాజు వచించెను.

"చిత్తము దేవా" అని యక్షిణులు చెప్పినట్లు చేసిరి. రమణీయాలంకృతమగు * శ్రీగర్భమందు చోరరాజు హంసతూలికా తల్పమున నిద్రించుచుండెను. ‡ శ్రీశయన పీఠమందు హాయిగ గుఱుకవెట్టుచున్న కోసలరాజును శీలవరాజు కత్తితో మెల్లగఁ దాఁకెను. కోసలరాజు వెంటనే మేల్కాంచి భయవిభ్రాంతుఁడయ్యెను. దీపపువెలుతురులోఁ గాశీరాజును గుర్తించి, శయ్యనుండి లేచి, ఒక్కింత ధైర్యమవలంబించి ఇట్లనియె: "ఓ మహారాజా! మీ రిచ్చటి కెట్లు రాఁగలిగితిరి? ఆశ్చర్య మాశ్చర్యము. గడియలు వేసి యున్నవి. తలుపులు మూసియున్నవి. ఈ ప్రాసాదముచుట్టు నాభటు లేమఱక కావలి గాయుచున్నారు. ఇత్తఱిపోతు టీఁగకైన నిందుఁ జొఱ నశక్యము. ఈ దివ్య రూపముతో, ఈ మంగళఖడ్గముతో, ఇట్టి అర్ధరాత్రమం దిచ్చటి కెట్లు వచ్చితిరి చెప్పుఁడు."

శీలవ రాజు జరిగిన దంతయు సవిస్తరముగఁ దెల్పెను. అది విని చోరరాజాందోళన పడి, "మహారాజా! క్షమించవలెను. నేను మానవమాత్రుఁడను. నీ గుణగణము లెఱుఁగనైతిని. రక్తమాంసాశనులు, భయంకరస్వరూపిణులు యక్షిణులు గ్రహించినంత, మనుష్యుఁడనైన నేను గ్రహింపలేకపోతిని. నరోత్తమా! ఇట్టి అద్భుతగుణరాశివని తెలియక నీతో విరోధము తెచ్చుకొంటిని. ఇప్పుడు బుద్ధి వచ్చినది. మన్నింప వేఁడెద. ఇదిగో కత్తి పట్టి శపథము చేయుచున్నాను. మీ పాదకమలము లాన! ఇఁక మీ జోలి కెన్నఁడును రాను" అని పలుక, శీలవరాజు ప్రసన్నుఁడయ్యె. శ్రీశయన పీఠమందు శీలవమహారాజును పరుండుమని తాను ప్రక్కనున్న చిన్న మంచము మీఁద నిద్రించి ఆ రేయి గడపెను.

* శ్రీగర్భము—రాజుగారు శయనించు మందిరము.

† శ్రీశయనపీఠము—రాజుపరుండు పడక.

మఱునాఁ డుదయము, కోసలరాజు పట్టణ మంతయుఁ జాటించి, సర్వవర్తక శ్రేణులను, రాజసభికులను, బ్రాహ్మణులను, గృహస్థులను అందఱిని రావించి సభఁ జేసెను.

ఆ సభలో శీలవరా జాకాశమునందలి పూర్ణచంద్రునివలె ప్రకాశించుచుండెను. కోసలరాజు నిండుసభలో శీలవరాజు సద్గుణగణములనుపొగడి తన్ను క్షమింపుమని వేఁడి, "ఓమహారాజా, ఇఁకనుండి దొంగలను శిక్షించుట నాపని. చల్లగ ప్రజాపరిపాలన మొనర్చుట నీ పని. నీ రాజ్యమును నీ వెప్పటివలె ఏలుము. రాజ్యరక్షణము నాకు వదలుము" అని పశ్చాత్తప్తమనస్కుఁడై పలికెను.

కోసలరా జంతట తనను పురిఁగొల్పిన కొండెగాని శిక్షించి నిజసైన్యమును వెంటఁగొని, వచ్చినత్రోవఁ బోయెను.

ఇట శీలవ మహారాజు రాజోచిత వేషములు దాల్చి శరభపాదాలంకృతమును, ధవళచ్ఛత్రవిరాజితంబునునగు రత్నసింహాసనము మీఁద నాసీనుఁడై సచివాగ్రణితో నిట్లనియె: "పట్టుదల యున్న నెట్టి కఠినకార్యమైనను సాధింపవచ్చును. ఈసభయం దీనాఁడు గన్పట్టు అద్వితీయ మైనశోభయును, నా వేయిమంది మంత్రుల రక్షణయును, నా పట్టుదల లేనిది సాధ్య మయ్యెడిదా? నష్టైశ్వర్యమును తిరిగి సంపాదించితిని. వీరందఱి ప్రాణములను కాపాడితిని. కష్టము లాసన్నమైనప్పు డధైర్యపడక పురుషయత్న మొనరింపవలయు. అప్పుడుగాని కష్టఫలము కాన్పింపదు." ఈ భావముచే నాతని హృదయము సంతోషతరంగిత మైనందున నీక్రిందిగీత మానందపారవశ్యముచే నిట్లు పాడెను:

గీ. "పట్టు వదలక యత్నించు వానికీర్తి
పరుల కుపకార మొనరించువానికృషియు
శౌర్యసాహస సత్త్వాది ధైర్యగుణము
భూరిఫలము నొసంగకపోవు టెట్లు?

"మానవుఁ డెల్లప్పుడును స్వయముగ కష్టించి కృషి సల్పవలెను. బుద్ధిమంతుఁడైనవాఁడు చేఁజిక్కిన తరుణమును వ్యర్థము చేయరాదు. నా విషయమున సర్వమును నే ననుకొనినట్లే జరిగినది."

బోధిసత్త్వుఁ డిట్లనుకొనెను:

"ఓహో! సచ్చరిత్రులు పట్టుదల వహించిరేని సఫలీకృత మనోరథు లగుట ధ్రువము."

శీలవమహారాజు జీవిత శేష మంతయుఁ బుణ్యకార్యములొనరించి పూర్వపుణ్యకర్మానుసారము జన్మాంతర మొందెను.

---

# దెబ్బతిన్న లేడి

కొడాలి ఆంజనేయులు గారు

౧

ఆ యటవీస్థలిన్ నునుదృణాంకురము ల్దిని కొండ వాఁగులన్
తీయని నీరు గ్రోలి పువుఁదీఁగల నీడల విశ్రమించు నే
నేయపకారి నైతి నని యీ నిశితాంబక మేసినావు! వీ
బోయల కేగతిన్ దెలియఁబోలును మామక సౌకుమార్యముల్.

౨

నేయియు పాయసమ్ము దిన నేర్చిన పెద్దలపాద సేవలన్
జేయఁగరాదె నీకుఁ గల చెట్టతనం బొకకొంత మాను — స్వ
ర్గీయలతానికుంజముల కిన్నరసానులు పోవు దారులన్
బోవెద నింక నాకు సెలవుం దయసేసి క్రుధం ద్యజింపుమీ!

౩

కాలము దప్పె, మాతబిసికన్నియ లక్కట! మద్వియోగమున్
దాళక నాకునై యెదురు దారులు సూతురు; బోయకాంత! యి
ల్లిల వృథా గుమారిలెదు! నీవయినం జని వార లందఱున్
బేలతనాన కంట తడిపెట్టకయుండఁగ నూరడింపుమీ!

౪

పేరిమి పూలు పెట్టి తినిపించి మరందము వోసి సంజలన్
జేరువఁ దీసియాడి యరచేతులఁ బెంచిన తాపసాంగనల్
లే రిట నాదు పాపము ఫలించిన యీయవసానపున్ సమా
చారము నంత్యబాష్పకణజాలముతో నయినన్ వచింపఁగన్

---

# మీనాక్షి

ఆండ్ర శేషగిరిరావుగారు, బి. ఏ. (సారస్వతసమాజము)

మీనాక్షి విజయరంగచొక్కనాథునిభార్య. ఈమె తండ్రి మంగమ్మ* పరమపదించిన పిమ్మట 1706 వ సంవత్సరమున మధుర ఆంధ్రనాయక రాజ్యమునకుఁ బాలకుఁడయ్యెను. ఇరువదియాఱు సంవత్సరములు రాజ్యమును బరిపాలించి విజయరంగచొక్కనాథుఁడు 1732 వ సంవత్సరమునందిహలోకమును వీడెను. పిమ్మట రాజ్యభారము వహించుట కీతనికిఁ బురుషసంతతి లేదు. అగుటచే రాజ్యనిర్వహణభారమంతయు చొక్కనాథుని పట్టపుదేవి మీనాక్షిపైఁ బడెను.

యథాశక్తిని ఆమె నాయకరాజ్యపరిపాలనము సాగింపదొరఁకొనెను. మధురనాయకరాజవంశముతో రక్తసంబంధముగల బంగారు తిరుమల యనువాని పుత్రునిదత్తతచేసికొనెను. ఇతనిపేరు విజయకుమారుఁడు. ఈదత్తస్వీకారమున మీనాక్షికి ఆమె సోదరుఁడు వెంకటపెరుమాళ్లు అమితసాహాయ్యము చేసెను.

కాని ఈదత్తస్వీకారము రాజ్యాభివృద్ధికి దోహదము చేయలేదు. పైపెచ్చు మధుర రాజ్య వినాశమునకును, మీనాక్షి ప్రాణత్యాగమునకును గారణభూత మాయెను. చేదోడువాదోడు కావలసిన బంధువులే మీనాక్షియెడ ద్రోహచింతను లయిరి. తనకుమారుని దత్తతచేసి కొన్నదని విశ్వాసమైన లేక బంగారుతిరుమలయ్య అప్పటి మధురదళవాయి అగు వెంకటాచార్యునితో లాలోచి అయి మీనాక్షిని సింహాసన భ్రష్టను చేయుటకుఁ బ్రయత్నము సల్పెను. తిరుచునాపల్లి కోటలోఁ జొఱఁబడి మీనాక్షిని వెడలనడుపవలయునను వారి ప్రథమ ప్రయత్నము భగ్న మయ్యెను. మధురనాయక రాజ్యమిట్లు 1734 వ సంవత్సరమున గృహచ్ఛిద్రములతో వేఁగిపోవుచుండఁగా, ఆర్కాటునవాబు తన కుమారుఁ డగు సఫదరాలిని, అల్లుఁడగు చాందాసాహేబును మధుర తంజావూరు రాజ్యములను జయించి కప్పము రాఁబట్టుటకై పంపెను. ఇట్లు మధురపై నెత్తివచ్చిన మహమ్మదీయులతో బంగారు తిరుమలయ్య చేతులు గలపెను. అతఁడు సఫదరాలికి ఎంచరాని లంచము లిచ్చెను. సందు దొరకినదికదా యని సఫదరాలి మీనాక్షిపైఁ గత్తిగట్టెను. అప్పుడు మీనాక్షి తిరుచునాపల్లి కోటలో ఠాణ్యము వేసికొని యుండెను; వేయికన్నులతోఁ గోటను రక్షించుచుండెను. ఇట్టిస్థితిలోఁ గోటను ముట్టడించి పట్టుకొనుటకలలోనివార్త యని అతఁడు నిశ్చయించి మోసము చేయఁ దలపెట్టెను. తిరుమలయ్య మీనాక్షియందున నడచుచున్న తగాదాఁ బరి

* ఈమె చరిత్రము భారతీ పాఠకులకు ఆషాఢమాసమున నివేదించియున్నాము. (Vol.v—No. 7.)

ష్కరించువాని వలె నటించుచు సఫదరాలి ఉభయుల వాదములు వినుటకని ఒకసభ సమావేశపఱిచెను.

మీనాక్షి తురకవాని మాటలు నమ్మలేదు. ఆసభతో నామె యెట్టి జోక్యమును బెట్టుకొనలేదు. లంచము తిన్న సఫదరాలి తీర్పు బంగారుతిరుమలయ్య పక్షమునఁ జేసెను. తీర్పుప్రకారము కార్యము నిర్వహించుభారము బావమఱఁది చాందాసాహేబున కప్పగించి యాతఁడు ఆర్కాటునకుఁ బోయెను. అప్పుడు మీనాక్షి చాందాసాహెబుతో రాయబారము నడపెను. సఫదరాలి చేసిన ఏర్పాటులు జరుగకుండ చూచినచో చాందాసాహేబున కామె కోటిరూపాయ లిచ్చుట కచ్చుకొనెను. చాందాసాహేబు వల్లె యనెను. ఏమైన సరే ఆమెను రక్షించుట కాతఁడు కొరాను నెత్తినిఁ బెట్టుకొని ప్రమాణముఁ జేసెను. అప్పుడు మీనాక్షి చాందాసాహెబును దనకోటలోనికి రావించి స్వాగతము చేసెను.

ఇంతలో మీనాక్షి తిరుమలయ్యతో సంధిఁ గావించుకొనెను. అగుటచే నామె తిరుమలయ్యను, విజయకుమారుని సురక్షితముగా మధురకుఁ జేర్చి వారికి చాందాసాహెబునుండి ఏవిధమైన ప్రమాదమును సంభవింపకుండ జాగ్రత్తగా నుంచెను. ప్రత్యర్థు లిరువురు సంధిఁ జేసికొని స్నేహముతో నున్న సంగతి సాహెబునకుఁ దెలిసినది. ఒకరితో నొకరిని డీ కొల్పి యధికారముఁ జలాయించుటకు సాహెబునకు వీలు చిక్కినది కాదు. మీనాక్షి మోసము చేసినదని భావించి, రోషము వహించి యాతఁడు ఆర్కాటునకుఁ బోయినాఁడు.

1736 వ సంవత్సరమునఁ దిరిగి చాందాసాహెబు మధురపై నెత్తివచ్చినాఁడు. మధురరాజ్యము నీతడవ జయించితీరవలెనని అతని కృతనిశ్చయము. తిన్నగాఁ బోయి తిరుచనాపల్లి కోటలోఁ బ్రవేశించి మీనాక్షికిఁ గల శత్రువుల నందఱిని సంహరింప నుద్యమించి నట్లు నటించెను. మీనాక్షి ఇది నిజమని నమ్మి చాందాసాహేబు చేతులలోఁ గీలుబొమ్మ ఆయెను. చూచీచూడని మఱపుతో నామె చాందాసాహేబు చేతల నంగీకరించుచుండెను. మధురనాయక రాజ్యపాలన మంతయు చాందాసాహేబు హస్తగత మయ్యెను. తిరుచనాపల్లి యందు సాహేబు పలుకుబడి విస్తరించెను. గోవిందయ్య, రవణయ్య అను మీనాక్షి దళవాయిల నిద్దఱిని ఆతఁడు ఎనుబదివేల అశ్వికదళముతోడను, మఱికొంత కాల్బలముతోడను దక్షిణాదికిఁ బంపెను. బంగారు తిరుమలయ్య చేతులలోనున్న దిండిగల్లుకోటను వారు పట్టుకొనిరి. చాందాసాహేబు సేనలు మధురాపట్టణముపైకిఁ బోయెను. అచ్చట తిరుమలయ్య కొంత రాణువతో సాహేబుసేనల నెదిర్చి పోరెను. కాని తుదకు ఓడి విజయకుమారునితోఁ గలసి పాఱిపోయెను.

మధురరాజ్య మంతయు మహమ్మదీయ సేనలకై వసమయ్యెను. చాందాసాహేబు

స్వతంత్రించి ప్రభుత్వము ప్రారంభించెను. అతఁడు చేసిన ద్రోహమంతయు మీనాక్షి కిప్పటికిఁ దెలియవచ్చినది. కాని కార్యములేదు. శ్రుతి మించి వచ్చినది. కొరాను శిరమునఁదాల్చి చేసిన ప్రమాణమును బూడిఁ గలపి చాందాసాహేబు ఉచ్ఛనీచములు లేక మీనాక్షినిఁ జెఱఁబెట్టెను. బ్రతికిచెడ్డది గావున కారాగారావాస మాయాంధ్రరమణీమణికి దుర్భర మనిపించినది. విషము ద్రాగి ఆమె ప్రాణములు త్యజించినది.

1539 వ సంవత్సరము మొదలు అవిచ్ఛిన్నముగా సాగుచుండిన మధుర ఆంధ్రనాయక రాజ్యము నాఁటితోఁ దుదముట్టినది.

అయితే మధుర ఆంధ్రనాయకరాజ్య వినాశనమునకు మీనాక్షి ఎంతవఱకుఁ గారకురాలు? నిమిత్తమాత్రము. అండయై యుండవలసిన ఆమె దళవాయి శత్రువులతో కుమ్మక్కు అయినాఁడు. రాజ్యక్షేమాభివృద్ధికిఁ దపస్సు ధారపోయవలసిన ఆమె దత్తపుత్రుఁడును, ఆతనితండ్రియు ద్రోహచింతనులై కొంపమీఁదికిఁ దెచ్చినారు. కొరాను శిరమునఁ దాల్చి చేసిన ప్రమాణములను చాందాసాహేబు గాలికి ఎగురఁగొట్టినాఁడు. అంతఃకలహములు, పరరాజుల దాడి-వీనియందు తగుల్కొని ఏ రాజ్యము ముందునకు వచ్చినది? పైఁగా, 'సర్వముం గదలంజేయు కాలమూర్తి' కూడ నామెకు ఎదురు తిరిగినాఁడు. ఇఁక నామె ఏమి చేయఁగలదు? కాలపురుషునకు దోసిలి యొగ్గి కారాగారమునవిషము ద్రాగి మీనాక్షి దుర్భరజీవితమును దుదముట్టించినది.

—'ఆంధ్రరమణీమణుల' నుండి.

---

## నిశీథము

యస్. వి. బి. శంకరరావుగారు

దూరదూరాన వణఁకు చేతోవిపత్తి
మిన్నునుండి వ్రాలునో యవి మన్నున కను
శంకఁ గల్పించుచు విహాయసంబునందు
వెలుఁగుచుండెను దారకావితతు లెల్ల.

పులుఁగుతండంబు లందందుఁ బొదలఁ బండె;
ననిలుఁ డలసటచే నేమొ యాఁగిపోయె;
శబ్దదేవత నిదురించు సరణి దోఁప
మర్త్యలోకంబు గాన్పించె మాటు మణఁగి.

ఏను నా నిశీథంబున నేకతమున
వేణుగానంబు సలిపెడి వేడ్కతోడ
హృదయపేటిక నెప్డుఁ బదిలపఱుచు
వేణువును గొని మఱచితి విశ్వమెల్ల.

---

# స్వప్న లీలలు

క్రొత్తపల్లి సూర్యారావు గారు

## లీలలకుఁ గారణము

ఎవరిమట్టుకు వారే యేదో ప్రసిద్ధిని బొంద వలయు నని యెంచుచుందురు. ఒక్కరి కొక్క విధముగా, నొక్కరి కొక్క రీతిగా, నొక్కరి కొక్కచొప్పున మార్గములు తోఁచుచుండును. ఊహాలు పుట్టుచుండును. తలంపులు తమలోనే యడంగి యుండును. ఉత్సాహ ముండును, సాహసము చాలకుండును. బరి తెగింతురు గాని కొందరకు నోరు, చేయి స్వాధీనములు కావు. మాటాడలేరు, అభిప్రాయములను దెలుపుటకుఁ దగినన్ని మాటలు భాషలోఁ గృషి చేయకపోవుటచే దొరకవు. భాషింతురు; అక్షరజ్ఞానము తక్కువగు కారణమున వ్రాసి పెట్టలేరు. ఎన్నెన్నో స్ఫురణాలు, పై కుబుకవు; ఉబికినను జెవి కింపుగా నుండవు. విషయప్రకటనమే ప్రధానము గాని, భాష, దాని యింపు మన కెందుకని యనేకులు—భాష యక్కఱ లేనివానికి విషయ మేల? విషయము కావలసిన సాలె చదువుకొనకుండఁగనే తన నేఁతపనిలో వన్నెగాంచుచున్నాఁడు. వ్యవసాయశాస్త్రము చదివియేనా కమ్మతగాండ్రు మనకుఁ గావలసిన నవధాన్యములును బండించి యిచ్చుచున్నారు? వారికిఁ జదువే రాదు. అక్కఱ లేదు. మంగలికిఁ గత్తి యిట్లు నూఱు మట్టు పట్టు మని యేపుస్తకములోని విషయము బోధించినది? పాకశాస్త్రము చదివిన ముదిత వండుటకుఁ ద్రాసు, కొలపాత్రలు సంగ్రహించుటకై యత్నించెనా, వంట యెంత సొంపుగానో వండును; అది యెంత రుచిగానో యుండును. కావలసినవారి కన్నియును గావలయును: విషయమును గావలయును; భాషయుఁ జక్కఁగ నుండవలయును. నీవేనా విషయమును లోకమునకు దెల్పువాఁడవు. నీ తలమీఁద నెగిరి పోయినవా రున్నారు. చక్కగా మాటలాడ లేనివాఁడవు విషయము నెంత చక్కఁగఁ దెల్పెదవో! పూర్వు లెన్ని శాస్త్రములు వ్రాసినారు! అందేమి తక్కువ? భాష, దాని మృదుత్వము, పరిశుద్ధత, విషయమును గ్రహింపవలయు నను నభిలాష చదువుచుండఁగనే పుట్టుట లేదా? అట్టిదిప్పుడు వ్రాయుశాస్త్రములలో నేదీ? భాష చక్కగా నేర్చినమీఁద వ్రాసినవిషయ మెవ్వరేది వ్రాసినను జనులకుఁ జదువ మనసు పుట్టును. మనస్సున కెక్కును. నే నేతరగతిలోనివాఁడనో నే నెఱుఁగను, గాని, ఉత్సాహము మెండైనది. విష్ణుమాయచేత నారదుఁడు కొలనిలో మునిఁగి స్త్రీయై పూర్వస్మృతి లేక యజ్ఞానియైనట్లు, నే నెవ్వరనో, నేను బదిమందిలోఁ బడవలయు నను నుత్సాహము పుట్టఁగానే నావృత్తాంతము నాకుఁ దెలియలేదు.

"తుంబాచార్య" లని నా కీపే రెట్లు వచ్చినదో ముందుగాఁ దెలిసికొన మనసు పుట్టినది.

కొందఱకుఁ దమతమ గ్రామముల చరిత్రము వ్రాయుటకుఁ, దమమండల భూగోళశాస్త్రము వ్రాయుటకుఁ, దమ దేశచరిత్రము వ్రాయుటకు నెఱుఁగని విషయములను—ఆవలించినఁ బ్రేవులు లెక్కపెట్టునట్లు—ఎవ్వరో చెప్పిన మాటలను బట్టికొని స్తనశల్యపరీక్ష చేయఁబోవుట, ఒకరియూహను దాను గాదనుట—ఆ కాదనుటయుఁ దన యూహా సహాయముననే—వాస్తవము నాకును వారికినిగూడఁ దెలియదు. కాని తన యూహయే మిన్న యనును. అందఱివి యూహలే, తనయూహకు లోక మెక్కుడు గౌరవము నీయవలయు ననునభిమానము—ఇట్లున్నది ప్రస్తుతలోకము. దేశ చరిత్రాదు లిపుడు సరిగాఁ దెలియరావు. ఏకచ్ఛత్రాధికారము చేసిన ప్రభువులకాలమే యొకప్పుడు సందేహముగా నగపడుచున్నది—రాజుపేరే కాని కొందఱికిప్పు డాతనికాల మక్కఱలేదని. కాళిదాసు నెఱుఁగనివారు లేరు. అతఁ డెప్పటివాఁడో యిప్పుడు కొందఱ కక్కఱ లేదు. కాని యాతఁడు "చల్లయోః వెల్ల కుక్కయోః" అన్నాఁడను నాధారముపైఁ దెనుఁగువాఁ డని వాదింప మాత్రము యోజించుచున్నారు. శ్రీ శంకరులు మళయాళ దేశమువాఁ డనుటకుఁ దెనుఁగువారు సిగ్గుపడుచున్నారు. నిజము తెలియువఱకుఁ గొంతయత్నము చేయ నాకుఁ దలఁపు పుట్టినమాట సత్యము. అది యెట్లు సమకూడును? నా యోజనలో రెండు కాకినాడలు, రెండు చెన్నపట్టణములు, ఇట్లు రెండేసిమూఁడేసి కనఁబడుచున్నవిగదా. చెందుర్తు లెన్ని యున్నవో యని మచ్చునకుఁ జిన్న పల్లెటూరిపైఁ బట్టించినాఁడను. బహువిధ ప్రయత్నములు గావించితిని, గాని, పేరు—దాని వ్యుత్పత్తి, సరిపడ లేదు: చెందు (చందు) లాల్ కట్టించినాఁడా? ఊరు, ఉర్, తుఱ్ఱు, తుర్తి మొదలైనవి గ్రామసంకేతములా? అట్టివి మొగలితుఱ్ఱు, కుంకుఱ్ఱు, వెల్దుర్తి వలె—అట్లయినఁ బూర్వము సుందరముగా నుండునట్లు—చెన్ను=సుందరము గనుక, చెన్ను, తుర్తి—రెండును సంధిలోఁ జెందుర్తి యైనదా? ఈయూరిపేరింటిపేరుగా నున్నవా రెవ్వరైనఁ గనబడియెదరా? వారి నడిగినఁ గొంత వృత్తాంతము దొరకును. వెదకఁగా వెదకఁగా, ఎర్నగూడెముప్రక్కను కృష్ణంపాలెములో చెందుర్తి వెంకమ్మ యను వృద్ధురాలున్నది. అమ్మా! మీ పెద్దలు తొల్లి యెందుండెడి వారు, మీ రిందు వచ్చుటకుఁ గారణ మేమని యడిగిన, నా కేమియుఁ దెలియ దన్నది. చెందుర్తిలో నిపు డాయమ్మ కులమువారు లేనే లేరు. ఈనడుమ, నామె, చరిత్ర సంశోధకులు విశేషముగా బైలుదేఱి సందేహస్థలములకుఁ దాము పోయి విశేషాంశములు కనుఁగొని మహోపకారము చేయువారి ప్రశ్నల కుత్తరము లీయఁకుండఁగనే, చరిత్రాత్మక మహాసముద్రములో సంశయనావ బుడుంగు మనుచు మునుఁగ, స్వర్గస్థురాలైనది.

పోనిమ్ము, గ్రామముల సంగతి మనము దెలిసికొనలేము. మండలములు, దేశముల సంగతి బొత్తిగాఁ దెలియఁజాలము. నా కీతుంబాచార్యులను పేరెట్లు వచ్చినదో. స్వవిషయ

నైన పరిశోధనమునైన చేయఁగలనా యనునది—నేనెవ్వఁడను? నాతండ్రి, తాత, ముత్తాత, వీరిని దెలిసికొనుటకె కష్టము. నే నేయూరి వాఁడనో యెఱుఁగను. చిన్నతనమందే తలిదండ్రులు మృతినొందిరి. పోనిండు, ఏతావున నైన నీపేరివా రున్నారా యని దేశాటనమునకు వెడలితిని. "ఇత్థపుణ్యు నింద్రద్యుమ్ను నెఱుఁగుదయ్య" అను భారతములోని కథ వలెఁ—దిరుగఁగా దిరుగఁగా, గోదావరీ మండలములోని పిఠాపురములో తుంబాచార్యుల కోనే యొకటి వినఁబడినది. నా యదృష్టమున నేయది కొందఱుమాత్ర మెఱిఁగియుండిరి. ఇంకఁ గొంతకాల ముపేక్షించితినా మాధవ పుష్కరిణి నే కాని తుంబాచార్యుల కోనే యనుంగ మను ప్రతీతి పుట్టిపోవును. ఈ పుష్కరిణి ద్రవ్వించిన తుంబాచార్యు లెవ్వరు, అని శంక మొదటనే చెప్పితిని. మనవారికి విషయ మక్కఱలేదు. చరిత్ర మక్కఱలేదు. వ్యవహారము జరిగినఁ జాలును. రాజు లేవిషయమును వ్రాయించువాఁడుక మన దేశములో లేదు. తక్కసజనుల కాశ్రద్ధ యెక్కడ? దీనిని దెలిసికొనుటకే యిరువదియైదేండ్ల ప్రాయమునఁ బిఠాపురముఁ జేరితిని. "యత్ర నోభయం తత్ర చోభయ"మ్మని విశృంఖలముగాఁ బరిశోధకవేషమునఁ దిరుగుటకు మొదలుపెట్టితిని. దిక్కులేనివానికి దేవుఁడే దిక్కు. సంతర్పణలు, సమారాధనలు, సప్తాహములు, లక్షపత్రి, కోటిపత్రిపూజలు, వివాహములు—సత్రభోజనము, మఠనిద్ర. సత్రములో భుజించి దేవాలయములో నిద్రించుచున్నాఁడను. తిన్న, నిద్ర, రెండును గుదిరినవి. పాదగయలో స్నానము, దాని దగ్గఱనున్న మండపములో జపము. రాజరాజేశ్వరిసత్రములో భోజనము. శ్రీరాముఁడు సోదరు లేదేశమునను దొరకుట దుర్లభమన్నాఁడు—గాని పిఠాపురములో నేను సోదరులు లేనివాఁడనైనను నీడపట్టునఁ గూర్చుండుటచే సోదరుండ నైతిని. తిరిగితిరిగి సోమరి నైతిని. పండుకొనుటయే—దీనిచే నా మొదటియత్నము మూలఁబడినది. కొన్ని నాళ్లకు, అయ్యో! నే నేమియుఁ జేయక మిన్నకున్నాఁడనే: జీవితము వ్యర్థముగదా యనుకొంటిని. దాఁపనేల! విచారించితిని. పశ్చాత్తాపము నొందితిని. ఏమిలాభము? ఆయుత్సాహము వెనుకపట్టినది. నేను గొన్నినాళ్లకుఁ బదిమందిలోఁ బండుకొనినచో నావలన నితరులకు నిద్రాభంగ మగుట తటస్థించెను. కాఁబట్టి రాత్రులు నన్నెవరును దరిఁ జేరనీయరైరి. ఏమి చేయుదును? వివిక్త ప్రదేశము నెదకికొనవలసి వచ్చినది. బట్టల వర్తకులు రాత్రివేళఁ దాళములు వేసికొని యిండ్లకుఁ బోఁగాఁ జూచి యే కొట్టరుఁగుమీఁదనో చేరువాఁడను. వారి సరకులకుఁ గాపుగా నుందునని యెవ్వరును నన్ను నివారింపలేదు. ఒక్కనాఁ డొక్కకొట్టుదగ్గఱఁ బవ్వళించువాఁడను. నిత్యము నొక్కరియరుఁగుమీఁదనే ప్రక్క వేసిన నీ కిది కాణాచియా యందురేమో—కొన్నినాళ్లకు నన్నందఱును "ఆచార్యులుగారికిఁ జక్కఁగ నిద్ర పట్టుచున్నదా"అని యడిగి, క్రమక్రమముగా నొక వర్తకుఁ డొక చాఁప,

యొక్క వ్యాపారి యొకమూటలు కట్టిన గోనె, దానము చేయఁజొచ్చిరి. దానితో నేను వారి గుమ్మములకడఁ బండుకొనుటకు సమ్మతించిరి గదాయని నిశ్చయించుకొని, నిర్భయముగ, నిరాలోచనముగఁ బడి దొరలువాఁడను. ఆనిరాలోచనమునకు మితిలేదు—నే నేల యిక్కడకు వచ్చితి ననుసంగతికూడ నాలోచనలోనుండి తొలఁగిపోయినది. ఆలోచన కెడ మేదీ? పప్పు దప్పళములు! ఒకనాఁటిరాత్రి— ఏతావునను లేక ఒక్క పిఠాపురములోమాత్రమే దొరకు రుచివస్తువు "ఖండమండీయుండలు" భోజనానంతరము రెండు దొరకినవి. మిగిల్చినఁ జీమలు పట్టును. దాఁచుకొనుటకుఁ బెట్టియా బేడయా! బైటఁ దావు లేనందున లోపల దాఁచితిని. ఇంక నిద్ర యెట్లు పట్టును? ఎన్ని యగస్త్యమంత్రములు! ఎన్ని వాతాపిజీర్ణస్తోత్రములు! చాల సేపు పనిచేయలేదు. సగమురాత్రికి నిద్ర పట్టినది. అందుఁ జిత్రమైన కల వచ్చినది. ఎక్కడికో పరుగెత్తివెళ్లుచున్నానఁట. ఇంతకడుపు! దానికిఁ దగినతిండి తిని యెట్లు పరువెత్తుచున్నానో నాకే వింత! ఎవ్వరో ముందుఁ బరుగెత్తుచున్నారు. వారివెనుక నెక్కడికి వెళ్లవలయునో—మార్గము తెలియక నేను—నన్నుఁ దఱిమికొనివచ్చుచున్నాఁడని యాయన భయమునఁ బరుగు—ఆయనఁగనఁబడకున్న దారి తెలియదే వాని వెంటనే పోవలయునని నేను బరుగు—కలలో నాలో నేనే పరుగెత్తుచు నవ్వుకొందును—నవ్వుతోఁ బరుగు జరుగునా! కలకుఁ దుద మొదలుఁ దెలియదు. "ఆహా దైవమా! యెంత చిత్రకథరా యిది! తెల్లవాఱునప్పటికి మఱతునేమో! మఱవకున్న నాకలలు వినుచుఁ గూర్చుండుట కెవ్వరున్నారు?"—ఇట్లు స్వప్నములోనే యనుకొనుచుండఁగా నొక్క సిద్ధయోగీశ్వరుఁడు కనఁబడి, "భయపడకుము, నీస్వప్నములు లోకు లాస్థతో వినునట్లు నేను గావింతును. పూర్వము వేదవ్యాసుఁడు సంజయునకు యుద్ధములో జరిగిన వృత్తాంతము తెలిసికొని వచ్చి ధృతరాష్ట్రునకుఁ జెప్పుటకై, నీవు చూచినను జూడకున్నను—ఏమూల నేవారి కెవ్వరితో యుద్ధము జరిగినది—ఎవ్వరి నెవ్వరు చంపినది—ఎవ్వరితో నెవ్వ రేమి మాటలాడినది తెలియునట్లు వరమిచ్చినాఁడు. అట్లు నీకు నీస్వప్నములో నేమి చూచితివో యది నీవు కొంతమఱచిపోయినను, దెల్లవాఱి లేచి తెల్ల కాగితముల పుస్తకము, సీసపుఁగణిక పుచ్చుకొని, తుంబాచార్లు కోనేటినడుమనున్న మండపములోఁ గూర్చుండితివా, జరిగినది, నీవు మఱచిపోయినది—అడుకులుకలుపుకొనుటకు స్వప్నములోఁ దోఁచకున్నను, గొన్నికొన్ని నీవు వెళ్లి చూడని ప్రదేశములలోనివి, నీ వెఱుఁగని పురుషులు, వారి వృత్తాంతములు తేటతెల్లముగాఁ దోఁచునట్లు వరమిచ్చెదను. ప్రతిదినమునకు స్వప్నములు వచ్చుటకుఁ గారణములగపడుచున్నవి. మీఁదుమిక్కిలి నీకేదైనఁ బనిచేసి లోకోపకారివని ప్రసిద్ధిపడయుట కుత్కంఠయున్నది కాఁబట్టి యీరాత్రి యేచిత్రకథ కలలోఁ దోఁచునో యను నుబలాట మొక్కటి పుట్టుచుండును. అందువలన నేదో కలయని

మాత్రము రాకపోదు. వచ్చినదానిని జమత్కరించి, లోకమునకు రుచిగా నుండునట్లు, నీవు పండితుఁడవు గాకున్నను—నీచదువు నేనెఱిఁగి యున్నను—నీకలమునుండి బైలువెడలినపొల్లు పలుకులైనను—నే నింతశ్రద్ధతో నిన్నుఁ బనుచుచున్నపుడు పొల్లుపలుకు లేల వచ్చును—పదిమంది మెచ్చుకొనునట్లు చేయఁగలను. నీవు మాత్రము శ్రద్ధగాఁ బ్రతిదినము నుదయమున వ్రాఁత ప్రారంభింపుము." అని యానతిచ్చి, నా స్వప్నముతో నా మహాత్ముఁ డంతర్ధానము నొందెను. నవ్వవలదు. నిరక్షరకుక్షి, కాళిదాసునకుఁ గాళికాదేవి నాల్కపై బీజాక్షరములు వ్రాసి యెట్లు పండితుని జేసినదో, అట్లే నన్ను సిద్ధుఁడు వర ప్రభావమున మాటలాడించుచున్నాఁడు. కాఁబట్టి నా పాండిత్య మిందేమియు నుండదు. యోగిప్రభావమే మిమ్ము నామూలమున సంతోషపఱుచును.

---

## శరన్మేఘము

దివాకర్ల వెంకటావధాని గారు

ఆకృతిఁ జూచి చూచి జనులందఱు ని న్రజతాద్రి వంచు న
ద్రేకముతో నుతించెద రదేమి పురాకృత పుణ్యవైభవ
ప్రాకటసిద్ధియో గద? కరంబును నీదగునున్కిఁ జేసి ము
ల్లోకములందు నెవ్వరికి రూఢిగ మోదము గల్గఁజాలదే.

ఎనలేని సంతోషమును దాల్చి పాడునే కవిబర్హిణంబు నిన్గని నుతింప
భవదాగమంబును వాంఛించి నిల్చునే యాచక చాతకం బహరహంబు
విపులమై సర్వదిగ్విశదమై వెలయునే శ్రితఘనస్తోత్రగర్జితము జగతి
ఆశాంతములదాఁక వ్యాపింపఁజాలునే యుదయించి కీర్తి విద్యుత్ప్రకాశ
మేమియును లేక బ్రతికెద వేమి బ్రతుకు-దానధారలు లేని లుబ్ధప్రసక్తి
గనిన నీవల్ల లోకోపకార మున్నె?-ఆకృతికి నేమి లే? శరదంబుదంబ!

సాధుజనాపకారమును సల్పినదానవె యేను మీకు నే
బాధ ఘటిల్లెనం చనిన భాసిలు నాశలఁ గప్పుచున్ జగ
న్నాథ దివాకరార్చుల ఘనంబగు తేజము నడ్డివైచునీ
బాధమవృత్తితో మెలఁగునట్టి భవచ్చరితంబు నచ్చునే?

---

# ప్రాచీన విశ్వవిద్యాలయ రాజమగు విక్రమశీల

పులవర్తి కమలావతీ దేవి గారు

పాశ్చాత్య సంపర్కానంతరమే హిందువులు విద్యావంతు లైరి యనువారి కీవ్యాసము చక్కని గుణపాఠమును నేర్పగలదు. చాలకాలమునుండి మన హిందూదేశము అన్ని విషయములయందు నాగరికతను వహించియుండెడిది. తొమ్మిదవ శతాబ్దమున ఈవిశ్వవిద్యాలయ రాజ మగు విక్రమశీల మగధ సామ్రాజ్యమునకు తలమానికమై విలసిల్లుచుండెడిది. ఇందు గల పుస్తకభాండాగార మప్పుడు ప్రపంచమున గల యన్ని పుస్తకభాండాగారములకన్న మిన్న. అట్టి అపూర్వమైన పుస్తకభాండాగారమును మహమ్మదీయులు బీహారు దేశమును జయించినపుడు దగ్ధముగావించుట కడు శోచనీయమైన విషయము. నలందా విశ్వవిద్యాలయక్షీణత యారంభమైనపిమ్మటనే యీ విక్రమశీల యభివృద్ధి నందినది. దీని కీనామము వచ్చుట కక్కడి స్థలపురాణవేత్తలీక్రిందికథను దెల్పుదురు. విక్రమశీలు డను యక్షుడొక డాపురవాసులను కడు కష్టపెట్టెడివాడు. వానిని అతిశు డనుశూరు డుక్కడంచి ప్రజల బాధలను బాపెను. అందువలన దానికి విక్రమశీల యని పేరు గల్గెనట. ఈ విక్రమశీలా విశ్వవిద్యాలయరాజమును గుఱించి త్రివిష్టప వాసుల గ్రంథమునం దీకథ గానవచ్చెడిని. తొల్లి ఆచార్యకాంపిల్యు డను బౌద్ధుడొకడు గలడు. అతడు తన తపోబలముచే అణిమాద్యష్టసిద్ధులను బొందెను. మహాముద్రమంత్రశాస్త్ర మతనికి కరగత మైనది. ఆమహానుభావు డొకనాడు గంగాతీరమున నొక కొండ సమీపమున నున్న యీపావన రామణీయకతను గాంచి యిచ్చట విశ్వవిద్యాలయము వెలసిన బాగుండునని తలంచెను. అంతియగాక అయ్యది సంఘారామమున కనువగు స్థలమని యతడెంచెను. మహారాజులు పూనుకొనినచో నిట్టి గార్యములు త్వరితముగ నభివృద్ధి చెందునని యాబౌద్ధు డెఱుంగును. కాలచక్రపరిభ్రమణమున కాంపిల్యుడు తన కోరిక సిద్ధింపకయే మృతినంది ధర్మపాలమహారాజై జన్మించెను. పరమసౌగత, పరమేశ్వర, పరమ భట్టారక, మహారాజాధిరాజ ధర్మపాలచక్రవర్తియే యీ విశ్వవిద్యాలయరాజమగు విక్రమశీలను స్థాపించెను. అయ్యది క్రీ. వె. 810 సంవత్సరమున నిర్మింపబడెను. ఆయన పరిశీలనక్రింద 10౮ గురు ఉద్దండ పండితులు పిల్లలకు బోధజేసెడివారు. ముగ్గురు తనిఖీదారులుండిరి. ఇంకను హోమాదు లొనరించుటకు కొందరాచార్యులుండిరి. రాజాదరణక్రింద నా విశ్వవిద్యాలయరాజమగు విక్రమశీల నాలుగు శతాబ్దములు దివ్యముగ కొనసాగినది. పరీక్షలో కృతార్థు లైనవారికి పండితపట్టముల

నొసగెడివారు. ఆపట్టమున రాజే సంతకమొనరించెడివాడు. వీరిలో రత్నవజ్ర యనువాడు పండితబిరుద మొసగబడి ద్వారపండితుడుగ నియమింపబడెను. అతనిది కాశ్మీర దేశము. విక్రమశీలకు ఆరుద్వారములు గలవు. ఆచార్య జితేరి మరియొక ద్వారమునకు మహీపాలు అను రాజువలన ద్వారపండితుడుగ నియమింపబడెను.

ఆకాలమున మిగుల ప్రసిద్ధికెక్కిన ద్వీపంకరు డను మారుపేరు గల అతీశు డితని శిష్యుడే. రత్నకీర్తి, జ్ఞానశ్రీమిత్రుడు, రత్నాకరశాంతి, నరసిద్ధి మొదలగువారు మిగత ద్వారపండితులు. విశ్వవిద్యాలయమునకు విద్యకై వచ్చువారి నీ పండితులు పరీక్షించి ఆయా తరగతులలో చేర్చుకొనుచుండిరి.

అప్పటి యుపాధ్యాయులు లోకమును త్యజించి భగవానుని సేవయందే నిమగ్నులై యుండిన బుద్ధసన్యాసులు. వారెల్లరు బ్రహ్మచారులు. విద్యార్థులే వారి బిడ్డలు. విద్యార్థుల బాగోగులే వారి సంతోషసంతాప కారణములు. వారెల్లరు నీతినియమబద్ధులు. తమ చక్కటి నడతవలన వారు శిష్యుల కాదర్శప్రాయులై యుండిరి. గురుకులపద్ధతిని విద్యాదానము జరిగెడిది. విద్యార్థులు ధన మీయ నక్కరలేదు. ప్రజలును, మహారాజులు విద్యాలయములను తమ దానములచే నడుపుచుండిరి. విద్యార్థులెల్లరు నుదయస్నానము గావించి యుదయించుచున్న సూర్యభగవానునికి నమస్కరించి పదునొకండుగంటలవరకే విద్యాభ్యాసము చేసెడివారు. ఆకాలమున విద్య మనసునకు బట్టినట్లు ఎండవెక్కినపిదప నీయుష్ణదేశమున విద్య మనసునకు బట్టదు. స్వల్పఖర్చులతో నిరాడంబరముగ వారు విద్యాలయముల నడుపగలుగుచుండిరి. భరతమాత తొల్లిటి యున్నతస్థితి నెప్పుడు పొందునో గదా?

---

# మోహనోదయము

పెమ్మరాజు లక్ష్మీపతి గారు

రమణీయారుణకాంతి సంయుతము నిద్రాముద్రితార్యక్షమా
రమణీధ్యాననిమీలితాక్షియుగళీప్రారంభసంవీక్షణో
ద్యమశోభాసముపేత మార్యజనస్వాతంత్ర్యార్క-బింబ ప్రభా
గమ సంసూచకమై విభాసిలు నుషఃకాలంబు గీర్తించెదన్.

దాస్యనీలాంబుదధ్వాంత విదారణ కారణంబైన క్రొక్కారుమెరుము
జీవనంబింకింపజేయు గ్రీష్మము తుది రాజిల్లు శుభమృగశిరా ప్రవేశ
మచిరభావిఫలోదయశ్రీ విరాజిల్ల నునుదీవతలను విచ్చిన సుమంబు
రాజపర్యటన వార్తాంకితారావ విస్ఫారమై తగు చోపుదారి కేక
యన, పురాసుకృత ఫలాకారమై భావి-విజయచిహ్న మగుచు విస్తరిల్లి
సర్వపర్వసమయసారసంయుతము-నై గాంధిమాని జనన కాల మొప్ప.

అది యఖండంబౌ మహాంబుధిలోన నగాధ పాతాళ లోకంబు దరిని
మోగనిద్రారతి నున్న భూలోక కల్యాణసంధాయకంబైన తేజ
మున విభాసిల్లు నపూర్వమహాశాంతమణి; దాని యత్న నైపుణి వెలుంగ
పదిలంబుగా పైకి కదలించి యల్లన తేలించి తేలించి తెచ్చితెచ్చి
పుణ్యతమమయ్యు ప్రబలతమోవిమోహి-తంబు నపహృత స్వాత్మతేజంబు నగుచు
గమలు నీకర్మభూమి తీరమున నిల్పి-నట్టికాలతరంగము నభినుతింతు.

అది కలశార్ణవం బమృత మార్యజగంబు ప్రపంచశాంతి కా
స్పదమగు చంద్రబింబ మది చల్లనిదైవము గాంధి, యార్యభూ
హృదయము, దాన దోచి రచియించుచు నున్నది జ్యోత్స్న; భూమి నె
ల్లదిశల, భారతావని కళానిలయంబుగ మారిపోవగాన్.

అది మహాశక్తి ప్రేమమయైకమూర్తి-ఆత్మబలరాజితంబు కల్యావశిష్ట
మైన యా దేహదర్పణమందు ప్రతిఫ-లించుచున్నది ఆర్య ప్రపంచలక్ష్మి.

అంచితుల్ ఋషులు వెల్గించిన యజ్ఞకుండాగ్ని చల్లారకుండగ రగిల్చి
స్వస్తి పాడిన బుద్ధభగవాను 'ప్రణయపల్లవి' వెండి హృదయవల్లకిని మీటి
నృపులు కొల్చెడు దండనీతికి ప్రేమ పరంబైన దివ్యభాష్యంబు వ్రాసి
బాహ్యాంతరరివర్గభంజనోపాయమౌ నభినవ సంప్రదాయము సృజించి

అరయ బృందావనంబునయందె కాక-క్రోధఘూర్ణితమగు రణక్షోణిగూడ
ప్రేమసంశీరనంబు వర్షించుచున్న-మోహనుం డెన్నగా జగన్మోహనుండె.

ఆరసాతలగతమై యున్న యార్య విజ్ఞానమున్ దేల్చు మత్స్యం బతండు
ధర్మసముద్రమథనమున కాధారమై నిల్చినట్టి కూర్మం బతండు
దారిద్ర్యపంక దిగ్ధార్యభూమర్త్యసంఘోద్ధరణము జేయు ఘోణి యతడు
కఠిన నియమ ముక్కు-కంబమైనను బగిల్చియు బైటపడు నరసింహు డతడు
హ్రస్వతనుడయ్యు ఖండఖండాంతరములు-నిండి వ్యాపించగల వామనుం డతండు
అప్రియత దాల్పకయును రణప్రియులగు-రాజులను గెల్చు భార్గవరాము డతడు.
ధర్మసంస్థాపనోత్సాహియై, యేకభార్యావ్రతుండైన శ్రీరామమూర్తి
నవనాగరక మనగరంబు గంగలో గలుపజాలినయట్టి హాలధరుండు
భువి 'నహింసా పరమో ధర్మ' యనుచు గొంతెత్తి చాటెడు బుద్ధదేవు డతడు
భారతమాన వైభవము రక్షించెడు నారాయణుడు తంతుకారహాని
యనపరాధి తా నయ్యును సాపరాధు-లైన జనముల పాపఫలంబులెల్ల
తాను భుజియించి హార్ద్రాశ్రుధార లొలుక-సిలువపై నిల్చి చూచెడు 'జీస' సతడు.

నవయుగ సందేశంబన-నవయోగము దెలియబలికినా డదిరా యీ
నవజీవన బీజము మా-నవహృదయక్షేత్రమందు నాటుకొనంగన్.

ఆయత కర్మయోగ నియమాభ్యసనంబున, దేశనామహా
రాయణ పూర్వకంబుగ నిరంతర భక్తి మతిన్ దరిద్ర నా
రాయణుఁ గొల్చి, సర్వము పరాత్పరునం దిడ నేర్చు టొక్క-టే
ధ్యేయముగాగ దెల్పిన యతీంద్రుని గాంధిమహాత్ము గొల్చెదన్.

ఆహాలాహల మట్లు దేశముల నాహారించు పాశ్చాత్త్యవ్యా
మోహాగ్నిం గడిశేసి క్రింగెగడ శంభుప్రక్రియన్ లోక మో
హోహో యంచు నుతించుచున్నయది; యయ్యో నేటికింగూడ నం
దేహాత్ముల్ కల రందు రేని యిక ముక్తిం జెంద రేనాటికిన్.

భస్మమును మంత్రమహిమ బావనము జేసి-దయ్యము వదల్చునట్టి విధంబు దోప
రాజకీయంబు యోగతంత్రముగ మార్చు-మంత్రసిద్ధున కేను నమస్కరింతు.

మంగళము నీ యశమునకు-మంగళ మీ నవమహోద్యమంబున కుద్య
న్మంగళము భరతమాతకు-మంగళ మగుగాక భువి సమస్తంబునకున్.

---

విదేశీయ రచనాపద్ధతులను, విలాసములను విడనాడి, కేవలము జాతీయమయిన స్వదేశీయపద్ధతుల ననుసరించు కొనెను. బుద్ధ విగ్రహములను గ్రీసురూపరేఖావిలాసము తొలఁగింపఁబడి హిందూత్వ మొసంగఁబడినది. అనఁగా, హైందవ జాతీయభావానుగుణముగ బుద్ధవిగ్రహము నిర్మింపఁబడఁజొచ్చెను. అంతే కాదు; శిల్పమునకు పాత్రమగు వస్తువిషయముల పరిధి విపులమయ్యెను. దేవతానీకము మాత్రమే కేంద్రస్థానము నలంకరించుట లేదు. ఆధ్యాత్మిక చింతయే సర్వమును క్రమ్మివేయలేదు. మతావేశమునందే శిల్పము కొట్టుకొని పోలేదు. శిల్పి దేవతారూపములను, పురాణకథలను, జాతకములను చెక్కుటయందు మాత్రమే తనదృష్టిని నిలుపలేదు. మానవలోకము వైపునకును దృష్టిని ప్రసరింపఁజేసెను. అందలి జీవ భావ విలాసములందును, మనోధర్మ ప్రవృత్తియందును నిమగ్నుఁడయ్యెను. ఈయుగమున శిల్పరచనము వైదుష్య విజ్ఞాన సంపన్నంబై మున్నెన్నఁడు గాంచని నవికాగళప్రాభవము (power of expressiveness) గనెను. అక్కాలమున, శిల్పము రూపముయొక్క స్పష్టత, రేఖలయొక్క దృఢత, అంగాంగ సన్నివేశసక్రమత, ఔచిత్యము, పాండిత్య మున్నగు జ్ఞానగుణములను ప్రకాశింపఁజేయును. మానవాకృతులను నిర్మించుటయందు శిల్పి బాహ్యసౌందర్యమును మాత్రమే కనుఁగొనలేదు; అంతరంగియున్న మానసికాధ్యాత్మిక గుణసంపత్తిని ప్రకాశింపఁజేసెను. ఈయుగమున తలయెత్తిన యావిజ్ఞానమానవత్వములు (intellectualism and humanism) హైందవ శిల్పచరిత్రమునం దపూర్వము. ఇందు స్ఫురించు ఉత్కృష్ట సంప్రదాయములు, ఉన్నతాదర్శములు గుప్తయుగమునకు తర్వాత మరల తలయెత్తలేదు. క్రమక్రమముగ ఆర్యుల రక్తము పలుచఁబారి తొల్లిటి విజ్ఞానవిచారము (rationalism) అంతరించుటచేత, జీవితపథమునకునో లేక కవితకును, శిల్పమునకునుగూడ శాస్త్రముయొక్క శాసనబంధములు గట్టిపడుటచే సహజవిలాస సంపన్నంబైన కావ్యకళారచనము (spontaneous creation) అంతర్ధానమయ్యెను.

ఈవిజ్ఞానము, మానవత్వము అజంతాశిల్ప చిత్రములందు సదృశమైన ప్రాభవముతో నలరారుచున్నది. అజంతాశిల్పులు వాస్తవజీవలోకముయొక్క ప్రవృత్తిని, జీవితస్పందనమును, మానవహృదయపూరితమగు స్త్రీపురుష లోకమును ప్రదర్శించుటయందు తమ యసమాన ప్రతిభా ప్రావీణ్యములను గనఁబఱచిరి. అజంతాచిత్తరువులు జీవితముయొక్క దర్పణములు. అమర్త్యబింబముల సౌందర్యము, వానిరూపరేఖా విలాసము, అభంగముల సుకృతము, జీవకళను స్ఫురింపఁజేయు రేఖాలాలిత్యము ( " the vital flowing lines of their forms " ) అజంతాశిల్పులకు మానవ విగ్రహమునందుఁ గల ఉన్నతావేశమును వ్యక్తపఱచెడిని. ఈశిల్పమునందంతటను ద్రావిడులవలన వచ్చిన మనోహరాలంకారవైభవము పరివేష్టించియున్నది. దానికంతకును వెనుకను గ్రీసుల కన్నఁడును గోచరింపని ఆధ్యాత్మికభూమిక (spiritual backround) ప్రస్ఫురించుచుండును. "రాతియందునవలె రంగులందును భావస్ఫురణము నిపుణముగఁ జూపింపఁబడినది. ప్రేమ, ఆశ, అసూయ, ఈర్ష్య, స్పర్ధ, కామము, మోహము, దుఃఖము, సంతోషము లోనగు భావసంపత్తియందు అజంతాశిల్పులు చూపఁగొనని విలాస మొక్కటియు లేదు." *

గుప్తయుగగ్రంథమున ఆధ్యాత్మికము విజ్ఞానము ననఁగఁ ద్రొక్కలేదు. బౌద్ధమతము ప్రాచీన బౌద్ధసంఘముతో, ధర్మప్రచారముతో సంతుష్టి పడయలేదు. ధర్మజిజ్ఞాసయందును, తత్త్వబోధయందును చిత్తశాంతి చేకూరదు. అంతరాత్మ కోరునట్టి నిశ్శ్రేయసము, ప్రశాంతము, చిదానందము ధర్మపథమునందు లేవు; అది తత్త్వబోధ యీయఁజాలదు. కాన, జీవన్ముక్తిని, ఆత్మాభిరతిని, చిత్తశాంతిని బౌద్ధమతము గుహాలయములందు శిల్ప చిత్రలేఖనముల గాంచఁగోరెను. బౌద్ధశిల్పమునందు మనము కాంచునట్టి యాఆధ్యాత్మిక కళావిలాసము, క్రైస్తవులశిల్పమునందుఁ గన్పట్టునట్టి చిత్తశాంతిలేని, పీడా మనసునం దాందోళనముతో కొట్టుకొను, పాపభీతాత్మకమైన యాధ్యాత్మికపిపాసవంటిది గాదు; అశాంతి విలాససౌందర్యము మానవస్వాస్థ్యమును కాంక్షించునట్టియు, ఆహం

* St. Nihal Singh—Modern Review, May,1923.

కారపూరితమైన మహితత్వము వ్యక్తపఱచునట్టియు గ్రీకుశిల్పమువంటిదియుఁగాదు. అది దివ్యశాంతివిలాసమయము, దివ్యకారుణ్య ప్రభాసితము; విశ్వసజాతీయమును, విశ్వవ్యాపకమునగు పరతత్త్వమును ధ్యానించుటచేఁ గల్గు ఆత్మారామము, ఆత్మప్రశాంతి, నిర్వాణము. అట్లని చెప్పి అజంతా శిల్పసౌభాగ్యమంతయు నివృత్తిభావముచేఁ గప్పివేయఁబడియున్నదని తలంపరాదు. ఆధ్యాత్మికవిలాస మెప్పుడు నక్కడ నుండనే యున్నది, పైకిఁ గనఁబడకున్నను. కాని, అజంతాశిల్పులు ముసుఁగునుండి జీవితముకేసి దృష్టిని ప్రసరింపలేదు. జీవితమును గన్నులార స్పష్టముగ సంపూర్ణముగఁ జూచి యానందించిరి. మానవ సౌందర్యమునందును, తామున్న జగత్తునందును నిమగ్నులై యానందము ననుభవించిరి. తాము చూచిన దానిని, యనుభవించిన దానిని శిల్పరూపమున వ్యక్తపఱచుటయందు ప్రమోదమగ్నమానసులైరి. *

భారతజాతీయ శిల్పకళాభ్యుదయోన్నతి, విజ్ఞానమయమయినది, యీయుగముతో సరి. ఆవిజ్ఞాన భాస్కరోదయము అవతికాలములోనే యస్తమించెను. అదాన సర్వమే హైందవ సాంఘిక జీవితమునుండి వినిర్గతము లయ్యెను. హైందవరాజ్యశ్రీతోపాటు సకల కళాశ్రీలు సంహరించెను. అంతనుండియు దేశమునం దల్లిన ముక్తికాంతి నిజమైన యాధ్యాత్మికసంపదను గోల్పోయి, హృదంతరమున తిమిరాంధకార పరివృతమై, నిశాకాంత వలె, తన భవిష్యమార్గమును బర్వ, జీవితసర్వము నిరమింప, జీవిత లేఖయేమి, కావ్యము లేమి, కళలేమి, తిమిరమయములు గాక, సర్వమయము లెట్లగును?

---

## పూజకు

పురిపండా అప్పలస్వామిగారు (కవితాసమితి)

శుభసమయ మయ్యె: పూజాప్రసూన మేర్చి
నచ్చెలీ, తీసికొనిరమ్ము; నిర్మలాంబు
వులను స్వర్ణకుంభముల నింపుము రయాన;
నిలువదో యేమొ తొలిమల నిండుసొబగు,
లేతవలపుల నే నివాళించువరకు.

నలుదెసల మ్రోగుచున్నది నిలిచి నిలిచి
నవ్యమధురమ్ము విహగవీణాస్వనమ్ము;
పొదల నునుమంచు కరగి పోవుటకు మున్నె
బయలుదేరుము పూజాప్రపత్తి కొరకు.

---

* It is the spirituality of Buddhism which seeks to glorify the mind and spirit in one. The spirit which these figures of the Buddha and the Bodhisattvas breathe, is the spirit of divine compassion and divine peace—not the human tranquility, the self-sufficient majesty of Greek art, but the peace of heart and intellect which come from the contemplation of the Infinite. We must be careful, however, not to overestimate, not to lay too much emphasis on the spiritual side of this art. Spirituality is always there, always some-where beneath the surface, but the artists of Ajanta did not look at life from beneath a cowl. They saw life clearly and they saw it whole. They gloried in the beauty of humanity, they gloried in the world around them, and they gloried in their own power to interpret what they saw and what they felt.

SIR JOHN MARSHALL.



# పిట్టకథలు

మన భరతఖండంబున ఉజ్జయినీనగరంబను పురవరం బొండు గలదు. ఈపురంబునకు వెలుపల రమారమి రెండుక్రోసులుదూరంబున నొక ప్రమదావనం బలరారుచుండు. ఇయ్యది యతిరమణీయంబై పుష్పఫల సంయుతంబై నందన వనంబువలె నయనానందకరంబయి యొప్పుచుండు.

ఈప్రమదావనంబున సుందరతర మగు హర్మ్యం బొకటి యుండెను. అందు మధుర వాణి యను నొక వేశ్యాంగన నివాసము చేయుచుండెను. ఆయువతి నిరుపమాన సౌందర్యరాశి. సంగీతసాహిత్యనృత్యకళల యందసమానమైన ప్రజ్ఞగలది. కావున విట పురుషు లెందఱో ఆమె పంచంజేరి అదనునకై వేచి యుందురు. అందుచే ననుదిన మా వారవనిత యింటికి వచ్చుచు బోవుచుండు వారల లెక్కించుట కష్టసాధ్యముగ నుండెను.

ఇట్లుండ నీ ప్రమదావనంబు చెంత దేవదత్తుండను నొక సన్యాసి వాసము చేయుచుండెను. ఇతడు సర్వసంగపరిత్యాగంబు చేసి జప తపములతో కాలము గడుపుచు వేశ్యా గృహంబునకు పోవు విటుల జూచినపు డెల్ల నొక్కొక్కరాయి నొకచోట వేయుచుండెను. కొంతకాలంబున కీ రాళ్లన్నియు నొక పెద్ద గుట్ట యయ్యెను.

ఒకనాటి సాయంకాలమున నీ మధుర వాణి యుద్యానవనంబున నచ్చట విహరించుచు సన్యాసియుండు పర్ణశాలకడ కేతెంచి చెంగట నుండు రాళ్లగుట్టంజూచి దేవదత్తుని సమీపించి ఆతనికిం బ్రణమిల్లి, "మహాత్మా, నా సందేహమును దీర్చెదరా"యని విన్నదనముతో నడిగెను. "ఆహా అందులకు సందియ మేల" యని మహాత్ముడు బదులు చెప్ప, "స్వామీ! మీ ప్రక్క యీ రాళ్లదిబ్బ యేల చేరినదో సెలవిం"డని యావారవనిత యడిగెను.

"యువతీ, ఏమని చెప్పుదు! నీ వొనరించు ఘోర కార్యముల కేమైన మితి యున్నదా? చూడుము: నీ వెందరసంసారముల పాడుచేసి ఫకీరులం జేసితివో" యనుచు నా రాళ్లగుట్టం జూపెను. నే నింతపాతకం బొనర్చితినా" యనుచు మధురవాణి దిగ్భ్రమ జెంది నేలంబడి ప్రాణం

బుల విడిచె. దేవదత్తుండును చింతాక్రాంతుడై కొంత కాలంబునకు విగతజీవుండయ్యె.

మరణానంతర మీతని యమకింకరులు బంధించి నరకంబునకుం గొంపోవుచుండిరి. దారిలో స్వర్గసుఖముల ననుభవించుచున్న యమ్మధురవాణిం జూచి దేవదత్తు డాశ్చర్యము నొంది, "యమకింకరులారా! యేమి యీ వైపరీత్యము, ఎన్నియో కొంపలం గూల్చి, యెందరుస్త్రీలనో పలుబాధల పాలుచేసిన యీమధురవాణి స్వర్గసుఖముల ననుభవించుటయా? సర్వసంగ పరిత్యాగంబు చేసి, జపతపాదులచే కాలంబుగడుపుచుండిన నాకు నరక బాధయా?" యని ప్రశ్నించెను. అంత యమదూత లాతని చిత్రగుప్తునొద్దకు దీసికొనిపోవ, "ఓరీ! నీసన్యాసంబుకూడ ఏమి సన్యాసమురా నీది? నీవు సన్యసించితినని చెప్పుకొనుటయే కాని నిజముగా సన్యసించితివా? నిజమైనసన్యాసి యితరుల లోపముల లెక్కించుచుండునా? మధురవాణి యింటికి పోవుచుండు విటుల లెక్కించుట యందే మనసు నిల్పియుండిన నీ వెక్కడ? నిజమైనసన్యాస మెక్కడ? తెలిసియో తెలియకయో పాప మొనర్చి, పాపమని యెరిగినతోడనే పశ్చాత్తాపము నొంది ప్రాణముల బాసిన మధురవాణి పుణ్యలోకమునకు దగును. కాని కపటసన్యాసివై యితరుల లోపముల లెక్కించుచుండిన యధముడవగు నీకు నరకప్రాప్తి గాక మరి యేమగు"నని చిత్రగుప్తుండు చెప్పుచుండ యమకింకరు లా దేవదత్తుని నరకమునకీడ్చుకొనిపోయిరి.

'ఒ క రు'

---

## తెలుగు వారికి

ఎప్పటినుంచో పరంపరగా వస్తూ ఇప్పటికీ మన వృద్ధులచేత చెప్పబడే పిట్టకథలవల్ల మనవారి సనాతనము లైన విశ్వాసాలూ, జాతీయమనోవిశ్వాసాలూ అనేక యథార్థముగా బోధపడుతవి. ఇవి మనము స్థిరముగా కాపాడుకోవలసిన జాతీయ సారస్వత సంపద. ఇటువంటివే మన పాతవి పదాలూ, పాటలూ కూడాను. కాబట్టి సదరు విశేషాలు సొంత కల్పనలు చొప్పకుండా, పరిశుద్ధముగా,—దొరికినవి దొరికినట్టు, విన్నవి విన్నట్టు—పంపినవారికి 'భారతి' కృతజ్ఞత చూపుతూ, అవి క్రమముగా ప్రకటిస్తూ ఉంటుంది. ఇప్పటి వృద్ధులతరము గడచిపోతే, తర్వాత అవి దక్కడము కష్టమై, విస్మృతవాఙ్మయములో చేరిపోవడము నిశ్చయము.

—సంపాదకుడు.

---

# బ్రౌను దొరవారి జీవితము
## (౧౭౯౮ - ౧౮౮౪)

నిడుదవోలు వేంకటరావుగారు, బి.ఏ.

కడచిన శతాబ్దారంభమున నాంధ్రభాషా వాఙ్మయము నుద్ధరించి, నిరుపమానమగు భాషాసేవ నొనరించి, యాంధ్ర మహాజనులకెల్లఁ జిరస్మరణీయులైన బ్రౌనుదొరవారు క్రీ. శ. ౧౭౯౮ సంవత్సరమున కలకత్తా నగరమున జన్మించిరి. వీరి తండ్రి డేవిడు బ్రౌను (David Brown) దొరవా రాకాలమున నచ్చట క్రైస్తవమతాచార్యులలో నొకరుగ నుండెడివారు. బ్రౌను దొరవారు తొలుత కలకత్తాయందు విద్యాభ్యాస మొనరించి, యావెనుక నింగ్లండునకేగి, యచట Haileybury యను చోట విద్యాభ్యాసముఁ బూర్తిగావించిరి. వీరు క్రీ. శ. ౧౮౨౦ సంవత్సరమున, అనఁగా తమ యిరువదిరెండవయేట, రాజకీయోద్యోగిగా చెన్నపురమునకు వచ్చిరి. ఆ కాలమున సర్ థామసుమన్రో (Sir Thomas Munro) దొరవారు రాజధాని పరిపాలకులుగా నుండిరి. వారు బ్రౌను దొరవారిని తెలుఁగు మండలములం దుద్యోగము సేయ నియమించిరి. వారు క్రీ.శ.౧౮౨౦ నుండి ౧౮౩౨ వఱకును పండ్రెండేండ్లకాలము తెలుఁగు మండలములందే యధికారము నిర్వహించిరి. ఇచ్చట పనిచేయుటచే నాంధ్రభాషను వారు నేర్చుకొనవలసి వచ్చెను. కావున నిదియే వీరి యాంధ్రభాషాభ్యాసమునకు బీజ మయ్యెను. వీ రేకారణమున తెలుఁగు నేర్చుకొనవలసి వచ్చినదియు, నెట్లు నేర్చినదియు తాము క్రీ. శ. ౧౮౫౨ వ సంవత్సరమునఁ బ్రకటించిన నిఘంటువునం దిట్లు వ్రాసినారు:—

"The present dictionary was written to assist myself in learning the Telugu language. On leaving the college in the year 1820, I was sent by Sir Thomas Munro, then Governor to Telugu Districts and was obliged to learn the language of the populace. I was employed for more than twelve years, chiefly as a magistrate among the Telugus and soon began to frame a vocabulary of the expressions which daily occurred in conversation or correspondence. I had intercourse with all classes, from the learned Pandit or Raja to the illeterate prosecutor or prisoner. Tradesmen, doctors, hunters and sailors, poets and painters, all became my instructors as they fell in my way. Gradually I was encouraged to study the easier authors and subsequently the better poets. In their writings, I obtained solution of many difficulties in grammar and idiom; and though the task occupied several years, I think the object was worth the trouble of attainment."

బ్రౌనుదొరవారు తాము తెలుఁగు నేర్చుకొను నప్పుడు సహాయముగా నుండుటకై నిఘంటువును రచించితి మనియు, క్రీ. శ. ౧౮౨౧ లో కళాశాలను విడిచిన తోడనే ఆకాలమున గవర్నరుగా నుండిన సర్ థామసు మన్రోదొరవారు వీరిని తెలుఁగు మండలమున నుద్యోగము చేయ నియమించిరనియు, నందుచే తెలుఁగుభాష నేర్చుకొనవలసి వచ్చెననియు, తాము పండ్రెండేండ్లకు పైకాలము తెలుఁగు మండలములయం దీ దండనాధికారిగను, న్యాయాధిపతిగను వ్యవహరించుటఁ జేసి తొలుదొలుత సంభాషణయందును, వ్యవహారమునందును నిత్య ముపయోగించెడి పదములఁ గూర్చి వాని నేర్చితిమనియు, మహారాజు మొదలుగ బాలవానివఱకును, పండితుఁడు మొదలు పామరుని వఱకును గల సకల జనులతోడను, సకల వ్యవహర్తలతోడను నిరంతర పరిచయము గలిగినకతన, ఏవరు తమకు సమాగమమైన రెండల వారితోడనే ప్రసం

గించుచుండిరనియు, వారే తమకు గురువు లైరనియు, నీవిధముగ భాష నేర్చి, తొలుత సులభ గ్రంథములను బఠించితిమనియు, వావెనుక మహాకవికృత గ్రంథముల చదివితిమనియు, నవి చదువునప్పుడు ఛందోవ్యాకరణ విషయికసంశయము లెన్నియో వీడినవనియు, నిట్లెన్నియో సంవత్సరములు పరిశ్రమించినదియు, అట్టి పరిశ్రమ తగిన ఫల మొసంగుటచే నది సార్థక మైనట్లును పైయాంగ్లేయ వాక్యములు తేటపఱుచుచున్నవి.

ఈవిధముగ తెలుఁగుభాషా పాండిత్యము సంపాదించి, క్రీ. శ. ౧౮౩౫ సంవత్సరమున స్వదేశమున కేఁగిరి. ఆకాలమున హిందూదేశకార్యస్థానమున (India Office) తెలుఁగు గ్రంథములు కొన్ని కలవనియు, వానిని తూర్పిండియా సంఘమువారు Lyden (లైడను) దొరవారివద్ద కొనిరనియు వాడుక యుండెను. కాని హిందూదేశము నుండి వచ్చిన రాజకీయోద్యోగులుగాని, ఇంగ్లండులో నున్నవారుగాని వీనింగూర్చి శ్రద్ధ వహింపలేదు. ఇది యంతయుఁ దెలిసికొని బ్రౌనుదొరవారు క్రీ. శ. ౧౮౩౫ సంవత్సరమున, తాము స్వదేశమున కేఁగిన కొలఁదికాలము నకే యాకార్యాలయమున కేగి పరీక్షింప, నందు రమారమి మూఁడునందల గ్రంథములు కానవచ్చెనఁట. బ్రౌనుదొరవారు గ్రంథములన్నిటిఁ బరీక్షించి, యా గ్రంథములన్నిటిని చెన్నపురి సాహిత్యసంఘము (Madras Literary Society) వారికి పంపు నేర్పాటు చేయఁ బ్రభుత్వము వారితో సంప్రతించిరి. బ్రౌను దొరవారు రాజకీయోద్యోగులును, వాంగ్లేయులు ననుటచేత నా గ్రంథములన్నియు క్రీ. శ. ౧౮౪౫ సంవత్సరమున పైసంఘమువారికి ప్రభుత్వమువారు పంపివేసిరి. ఈ గ్రంథములే బ్రౌనుదొరవారు పనిసేయుట కాధారము లైనవి.

బ్రౌను దొరవారు క్రీ. శ. ౧౮౪౧ లో హిందూదేశమునకుఁ దిరిగివచ్చి, పై గ్రంథములు వచ్చినతోడనే భాషాసేవ కారంభించిరి. పలుతావులనుండి పండితులతో నుత్తరప్రత్యుత్తరములు జరిపియు, పండితులను రావించియు, ప్రకటింపఁబడని గ్రంథములఁ బ్రకటించియు, శీర్ణములైన మాతృకలకుఁ బ్రతికలు వ్రాయించియు, మనుచరిత్రాద్యుత్తమ కావ్యములకుఁ టీకలు రచియింపించియు, స్వయముగా తాము గ్రంథములను ముద్రించుటకు ద్రవ్యసహాయ మొనర్చియు, ననేక గ్రంథములను గూర్చి యాకాలపుఁ బత్రికలయందు వివరణములు వ్రాసియు, బాలురకు, విద్యార్థులకు నుపయోగకరములగు వాచకాదులు రచియించియు, బ్రౌనుదొరవా రాకాలమున నెంతయేని భాషాసేవ యొనరించిరి. ఆ కాలమున వారు జరిపిన యుత్తరప్రత్యుత్తరములు రమారమి పది సంపుటములు గలవు. ఆయుత్తరములలో కొన్ని ముక్క్యాల నుండి వెలువడిన "సరస్వతి" పత్రికలో ప్రకటింపఁబడినవి. వానివలన వారి భాషాభిమాన మెంతయో విశదమగుచున్నది. జూలూరి అప్పయ్య, అప్పన్నాత్మ మహాసంబంధయను వల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి, రావిపాటి గురుమూర్తిశాస్త్రి, మచ్చ గంగయ్య, మామిడి వెంకయ్య మొదలగువారెందఱో బ్రౌనుదొరవారి యాస్థానపండితులై వారి సహాయమునఁ గీర్తి గాంచిరి. శ్రీ జూలూరి అప్పయ్య పండితులు ప్రసిద్ధులు.

వీరు మనుచరిత్రమునకును, విజయవిలాసము మొదలగువానికి వ్యాఖ్యానములు వ్రాసిరి. వీరు వ్రాసిన యదుసంశోధూషణ శతకము, రామపంచాశత్తు, శ్రీనివాసతారావళి గ్రంథములను వైజయంతిపత్రికలో విద్యావినోదిపనప్పాకము ఆనందాచార్యులవారు ప్రకటించినారు. రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు వ్యాకరణము, విక్రమార్కుని కథలు మొదలగునవి వ్రాసినారు. మచ్చ గంగయ్య శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన పశ్చరిత్ర ప్రణేతయగు మచ్చ వేంకటకవి జనకుఁడు. ఈతఁ డాంధ్రపండితుఁడు. మామిడి వేంకయ్య బందరునివాసి. ఈతఁడు రచించిన 'యాంధ్రదీపిక' బ్రౌనుదొరవారు తమ నిఘంటువునం దుదాహరించిరి. ఈతని పౌత్రుఁడు సారంగపాణి మచిలీ బందరు చరిత్రమును రచించి, ౧౮౬౫ లోఁ బ్రకటించెను. ఇట్టి పండితులు నింక ననేకులు బ్రౌనుదొరవారి కాలమునఁ బ్రసిద్ధి గాంచిరి.

ఈకాలమున బ్రౌనుదొరవారు రాజకీయోద్యోగములనేకములను నిర్వహించిరి. కొంతకాలము ప్రభు

గాన మాలింపక కన్నుమూయని రాజు అంబకౌఁగిటి పంజరంబు చిలుక
కొదమకండలు చేరుకొనుపిల్ల వస్తాదు ఊయేల దిగని భాగ్యోన్నతుండు
"ఉ, ఊ,"లు నేర్చిన యొకవింతచదువరి పతిని పుట్టిననాఁటిసాంబమూర్తి
గర్భగండము లెల్ల గడచిన పరదేశి తనయింటి క్రొత్తపెత్తనపుదారి
ఏమి పనిమీఁద, భూమికి నేఁగినాఁడొ-నడువ నేర్చిన పిమ్మట నడుగవలయు
ఏండ్లు గడచిన, ముందుముం దేమొ కాని-యిప్పటికిమాత్ర మేపాప మెఱుఁగఁ డితఁడు.

ఊయేలతొట్టి యే మపదేశ మిచ్చునో కొసరి యొంటరిగ నూకొట్టుకొనును
అంబతో తన కెట్టి సంబంధ మున్నదో యేడ్చి యూడిగము సేయించుకొనును
పరమేశ్వరుం డేమి వరసంబు లాడునో బిట్టుగా కేకిప ల్గొట్టుకొనును
మూనాళ్ల లోన నెవ్వడు నేర్పుకొనియెనో "పా"మ్మన్న చో చిన్నఁబుచ్చుకొనును
ముక్కుపచ్చలారిపోయి ప్రాయము వచ్చి-చదువు సంధ్య నేర్చి బ్రదుకునపుడు
"నాదు పసిఁడికొన్న, నారత్న"మని తల్లి-పలుకు పలుకు లితఁడు నిలుపుకొనునె.

నవమాసములు భోజనము నీర మెఱుఁగక పయనించు పురిటింటి బాటసారి
చిక్కు-చీఁకటిఁ జిమ్ము జేనేఁడుపొట్టలో నిద్రించి లేచిన నిర్గుణుండు
నునుజెక్కు-ళుల బోసినోటినవ్వులలోన ముద్దులు చిత్రించు మోహనుండు
అక్షయంబైన మాతృక్షీరమధుధార అన్నంబుగా తెచ్చుకొన్న యతిథి
బట్ట గట్టఁడు బిడియాన పట్టువడఁడు-ధారుణీపాఠశాలలోఁ జేరినాఁడు
వార మాయెనొ! లేదొ! మాప్రకృతికాంత-కఱపియున్నది వీని కాఁకలియు నిద్ర.

తనచేతి గిలకపండునకు ముచ్చటఁ జెప్పు పలుకలేదనుచుఁ గోపంబు సేయు
పొరుగింటియిల్లాలి సరస చీఁదఱఁ జెంది పరు లన్న భేదభావంబు నూపు
మకరందమునకు సమ్మతిఁ జూపి నోరూర దరిఁ జేరి రుచుల భేదములు దెలియు
ప్రతిశబ్ద మీను నుగ్రధ్వాన మాలించి కంపించి తల్లినిఁ గౌఁగిలించు
దాయ లార్గురు నొకరు నిద్దఱును దప్ప-చేరుకొన్నార లితని చిత్తవీథి
జగతిపై వీని జాతకచక్రమందు-పొంచియుండున దపయశంబో, యశంబొ!

---

# విజయనగరదసామ్రాజ్యవు

డాక్టరు యస్. వెంకటరమణయ్య గారు,
యం. ఏ., పి-హెచ్. డి.

చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున "విజయనగరద సామ్రాజ్యవు" అను ౧౯-౧-౫౯ నెంబరుగల 'కడిత' మొక్కటి కలదు. బొగ్గుతో కలిపిన మసిని పరిమి పుస్తకరూపమున మడిచి వ్రాతకై యుపయోగపడు నొక వస్త్ర సంపుటమునకే 'కడితా' మని పేరు. అట్టి పుస్తకములపై సుద్దబలపములతో వ్రాసెడి *వారు. పూర్వము విజయనగర ప్రభువుల కాలమున కడితములను లెక్కలు వ్రాయుటకు జనులు తరచుగ వాడుచుండెడి వారు. సర్కారు కచ్చేరిలందును కడితములమీదనే లెక్కపద్దులను వ్రాయుచుండినట్లు తెలియుచున్నది. "విజయనగరద సామ్రాజ్యవు" అనునది రెండవ వెంకటపతిరాయల సంస్థానమునకు సంబంధించిన ఒక లెక్కలకడితపుస్తకము. లైబ్రరీలోని పుస్తకముల జాబితాలో పైపేరున్నను పుస్తకపుట్టమీద మాత్రము "కృష్ణదేవరాయరు ఆళిదవివరవు" అను పేరున్నది. ఒక కృష్ణదేవరాయలనుగురించియే కాక రెండవ వెంకటపతిరాయల కాలమువరకును ప్రభుత్వము సల్పిన రాజులందరినిగూర్చి కొంచెముగనో గొప్పగనో వ్రాయబడియుండుటచేత దీనికి "కృష్ణదేవరాయరు ఆళిద వివరవు" అను పేరునకంటె "విజయనగరద సామ్రాజ్యవు" అను పేరే చక్కగ సరిపోవుచున్నది.

## భాష; లిపి

ఇందలి భాష తెలుగు, లిపి కన్నడము. విజయనగరపురాజుల నగరి లెక్కలనేకము లిట్లే తెలుగు భాషలో కన్నడలిపితో వ్రాయబడి యున్నవి.

## విషయము

ఈ పుస్తకమున రెండవ వెంకటపతిరాయల రాజధాని నగరమునందలి కోటలు, పేటలు, పాళ్యములు మొదలగువాని విస్తీర్ణము వర్ణింపబడియున్నది. రాజధాని నగరము పేరీపుస్తకమునందు వచింపబడియుండలేదు. ఇంచుమించుగా నాకాలమున రాజధానులుగనుండిన పురములు మూడు: పెనుగొండ, వేలూరు, చంద్రగిరి. ఈ లెక్క వ్రాయబడినప్పుడు మొదటి రెండుపట్టణములును రాజధానులుగ నుండె ననుటకు వీలులేదు. ఏలన, పాళ్యములను లెక్కవేయు సందర్భమున పెనుగొండయు, వేలూరును చేర్కొనబడినవి. ఇక మిగిలియుండునది చంద్రగిరియొక్కటియే. కావున నదియే రాయలరాజధానిగ నుండెనని తెలియుచున్నది.

## సమయము; సందర్భము

ఇది సదరు పుస్తకమునందే ఇట్లు వివరింపబడియున్నది: "పూర్వమందు తమ వంశీకులైన కృష్ణదేవరాయలచేత యియ్యబడిన డెబ్భైయేడు పాళ్యగాళ్లకు అన్యోన్యఘర్షణ వచ్చి నగరికి నగరు రాకుండా ఘర్షణ చేస్తూవుండేది. శాలివాహనశకం ౧౫౨౮ చెల్లిన వర్తమానం పరాభవసంవత్సరమందు తమదగ్గిరవుండిన అకవణీ ప్రతికర్తలను పిలిపించి పూర్వమందు డెబ్భైయేడు పాళ్యగాండ్లకు యిచ్చిన భూమివివరం పాతిలెఖలు తెమ్మని చెప్పి(ప్పే)నరకు అపుడు అకవణీప్రతికర్తలు భూమిక్రిలిచి పాళ్యగాండ్లకు యిచ్చినది పూర్వం లెఖలు తెచ్చి శ్రీవీరవేంకటపతిదేవరాయలకు వినిపించ్చిన భూమివివరం". ఇందువల్ల ఈకడితము శకం ౧౫౨౮ లో రాయలవారి యాజ్ఞప్రకారము నగరిఅకవణీ ప్రతికర్తలువ్రాసిన కొలత లెక్క యని తెలియుచున్నది. తెలుగుదేశమున లభించు పురాతనలిఖితపుస్తకముల సంపుటములలో నిది యొకటి. దీనిని వ్రాసి యిప్పటికి రమారమి ౩౨౮ సంవత్సరములైనది.

* "ఘట్టించిన నీలపటపు లెక్కల పుస్తకము." శ. ర.

## దీనివిలువ

పుస్తకము చిన్నదైనప్పటికిని ఇది చరిత్రరచయితల కత్యంతోపయుక్తమైనది. కృష్ణరాయల ప్రభుత్వములో నడచినకార్యములను నిర్ణయించుటకు ఈకడితము మిక్కిలియు తోడ్పడగలదు. ఇంతేకాక, శకం ౧౪౫౨ మొదలు ౧౫౦౮ వఱకును కర్ణాటరాజ్యమును పాలించినరాజులను, వారిరాజ్యకాలములను దెల్పుచున్నది. రెండవ వెంకటపతిరాయలకాలములో విజయనగరమునకు గప్పము గట్టుచుండిన సామంతుల నామములను, తురుష్కరాజ్యములతోడను, పాశ్చాత్యవర్తక సంఘములతోడను రాయలకుగల సంబంధమును గొంతవఱకు దెలిసికొనగలము.

## ఇందలి చరిత్రాంశములు

౧. "శాలివాహనశకం ౧౪౩౨ అగు నేటి శుక్ల సంవత్సరం ఆవణిమాసం శ్రీజయంతినాడు కృష్ణదేవరాయ మహారాయలు విజయనగరమందు పట్టాభిషిక్తుడై వేంచేశిరి." హంపి విరూపాక్షేశ్వరుని గుడియందలి శాసనములో, కృష్ణరాయల పట్టాభిషేకమహోత్సవము గతించిన ౧౪౩౧ వ శకం, శుక్లవర్షమాఘ శు ౧౪ నాడు జరిగినట్లు వచింపంబడియున్నది.[1]

ఈ రెండురికార్డులకును శుక్ల నామసంవత్సరము సామాన్యము. హంపిశాసనములోని శకవర్షము గతించిన ౧౪౩౧. అనగా అప్పటికి శకం ౧౪౩౧ వర్షము చెల్లినది. ౧౪౩౨ వ వర్షము నడచుచుండినది. మనకడితములోని శకవర్షము వర్తమానవర్షము అని "శాలివాహనశకం ౧౪౩౨ అగు నేటి శుక్లవర్షము" అన్నవాక్యమువల్ల స్పష్టము. మఱియు ౧౪౩౨ గతించిన శకవర్షమై యుండిన, "౧౫౨౭ చెల్లిన, వర్తమానం పరాభవసంవత్సరం" అని యీ కడితమున మఱియొకసందర్భమున అకవణీ ప్రతికర్త చెప్పినట్లు, ఇచ్చటను "చెల్లిన" లేక "గతించిన" అని చెప్పియే యుండును. కావున ౧౪౩౨ వర్తమాన శకవర్షమనియే పరిగణించుట యుక్తము. శకం గడచిన ౧౪౩౨ కానేరదు. ఏలన, శుక్లవర్షము ౧౪౩౨ తోనే సమాప్తమగుచున్నది. ఇందువల్ల, హంపిశాసనములోను, కడితపుస్తకములోను నమూదుచేయబడిన శకవర్షము ఒక్కటియే అని తేలుచున్నది. ఆవణిమాసం శ్రీజయంతి పట్టాభిషేకమహోత్సవము నడిచినదినము కాదు. పట్టాభిషేకానంతరము కృష్ణరాయలు విజయనగరపురమునకు ప్రథమమున ప్రవేశించిన దివసమది. అనగా, కృష్ణరాయల రాజ్యాభిషేకము శక ౧౪౩౨ శుక్ల ఆవణి శ్రీజయంతికి (క్రీ. శ. ౧౫౦౯ అగష్టు తే ౮ ది మంగళవారమునకు) కొన్ని రోజులకు పూర్వము నడచియుండవలయును.

౨. "ప్రజోత్పత్తి సంవత్సరం తయి మాసం ౧౨ తేది కుతుప్పశాహ నిజాంశాహ మీదికి కూచీ చేసి వెలిగుడారంవేసి తిర్గిపోయిరి."

(a) ఇందు మొదట గమనింపదగిన విషయము దండయాత్ర నడచినకాలము. ప్రజోత్పత్తి సంవత్సరం తయి మాసం తే ౧౨ దిన, అనగా క్రీ. శ. ౧౫౧౨వ సం. జనవరి తే ౯ ది శుక్రవారం నాడు, రాయలు దండుతరలెను. కృష్ణరాయలు తురకలపై తన రాజ్యారంభకాలమున దాడివెడలినట్లు ఇతరత్ర చెప్పబడియున్నను సదరుదాడి నడచినకాలమును నిర్ధారణచేసి చెప్పుటకు దగు నాధారము లెవ్వియు లేకుండెను. క్రీ. శ. ౧౫౧౨వ సంవత్సరమున నొక్కపర్యాయమును, క్రీ. శ. ౧౫౨౦వ సంవత్సరమున నొక్కపర్యాయమును కృష్ణరాయలు బిజాపురరాజ్యముపై దండు వెడలి రాయచూరిదుర్గమును ముట్టడించి స్వాధీనపరచుకొన్నట్లు ఫెరిస్తా వ్రాసియున్నాడు.[2] న్యూనిజు ౧౫౧౨ వ సంవత్సరపు ముట్టడిని తలపెట్టలేదు. ౧౫౨౦ వ సంవత్సరపు ముట్టడిని మాత్రము విపులముగ వర్ణించియున్నాడు.[3] "ఈ రిరువురిలో నెవ్వరివ్రాత నిజమో నిర్ణయింపజాలము" అని స్యూయలు వచించెను.[4] ఈ అంశమును కె. వి. లక్ష్మణరావు పంతులుగారు కొంతవఱకు చర్చించి, ఫెరిస్తాయే నిజమును బల్కుచున్నాడని సిద్ధాంతము చేసినారు.

1. Arch. Rep. 1908-9, p. 174. 2. Sewell: Forgotten Empire—p. 127. 3. Ibid 4. Ibid.

"ఇట్లు నన్నిజు మతమున ౧౫౨౦ లో నొక్కసారి మాత్రమును, ఫెరిస్తామతమున ౧౫౧౭ లో నొక్కసారియు, ౧౫౨౦ లో రెండవసారియు రాయలకును శాహసైన్యములకును యుద్ధము జరిగి విజయలక్ష్మి రాయలనే వరించెను.

"ఆలోచించిచూడగా ఫెరిస్తామాటయే నిజమని తోచుచున్నది."[1]

ఫెరిస్తా చెప్పినట్లు ౧౫౧౭ లో కృష్ణరాయలు ఆదిల్ శహామీదికి దండువెడలినది నిశ్చయమని యీ కడితము రుజువు సేయుచున్నది.

(b) రెండవవిషయము దండయాత్ర చరిత్రవర్ణన. ఈ దండయాత్ర చరిత్రను పరిశోధకు లనేకులు వర్ణింపదలపెట్టరైరి. తలపెట్టిన వారు సైతము దానిని సంపూర్ణముగ వర్ణింపక విడిచిరి. తత్కారణమున దాని చరిత్ర నిచ్చట గొంచెము విపులముగ వ్రాయుచున్నాడను. పైనుదాహరింపబడిన కడితపుస్తకములో రాయలవారు "కుతుప్షాహ, నిజాంశాహల మీదికి కూచీ చేసి" నట్లు చెప్పబడియున్నను, "మూడు సంస్తానాల వారిమీద కార్యం చేసి", "మూడు సంస్తానాలవారివద్ద పగుడీ తీసుకొని" అను వాక్యములచే రాయలతో యుద్ధము చేసిన రాజులు మువ్వురని స్పష్టమగుచున్నది. కుతుప్షాహనిజాముశాహులు గాక, రాయలతో కార్యముజేసిన మూడవ ప్రభువు ఏదులశాహయని రాయవాచకము, కృష్ణరాయ విజయమువల్ల దెలియుచున్నది.

కృష్ణరాయలు యుద్ధయాత్రకు వెడలునని కొందఱుమంత్రులు 'యేదుల వాహుతో' జెప్పగా, సతివారి యొకుట నతడు కృష్ణరాయల పరాక్రమమును దృఢీకరించెను. లోపల కళవళపడుచు ఇతరతురుష్క ప్రభువులకు ఉత్తరములు వ్రాయించి వారి "సౌహార్దము"ను సంపాదించుకొనెను.

తే. "అనుచు బ్రజ మెచ్చగాగ బాహ్యమున బలికి
యంతరంగంబులో జాల నళుక జెంది
బెగ్గడిల్లుచు జాబు లంపించె గోల
కొండకు నిజాముశాహునకు న్మహీశ.

శా. "ఆ యూసిండ్లదు సీలు శేకమును సౌ
హార్దంబుతో దావకీ
నామేయస్థిర కార్యనిర్వహణ శౌ
ర్యాద్యాఢి విన్నంతనే
నీ మీద దుర్గములందు గోటలును వి
స్తీర్ణస్థితి ధావ్యపుల్
సామగ్రు ల్పనుకూర్చ నెంచిరి నితాం
తస్వాంతచాంచల్యులై.[2]

రాయవాచకమునందుగూడ పైవిషయమే చెప్పబడియున్నది.—

"యెదుల శాహవారితోను యీపర్యాయములు యెటుకకాయగా ఆగ్రహపడి"—"కర్ణాటకంవారు తుంగభద్ర దాటివచ్చిరా యీవరకున్ను యీశ్వరనాయకుడున్ను, నరసనాయకుండున్ను, వీరనరసింహరాయలవారున్ను యేలినంతుకన్నా కృష్ణరాయలవారు యేలేది యేమున్నది" అని అన్నందులకు దొండోపంతులు మొదలైనవారు "రాజనీతి" అని మొనకురాదు. గనక వుండే ప్రయత్నములు వుండగా దైవసహాయం యేతీరో తెలియదు గనక నిజాంశాహువారున్ను కుతపనములకవారున్ను విజయనగరానుండి కాగితములు వ్రాసి వచ్చినది విని ఆలోచనపరులై యిక్కడికి కాకితములు అంపి తమతమపరుదు స్థలములు పదిలపరుచుకొని యేదిహెచ్చరికలతో వున్నారు."[3]

తురుష్కరాజులపై కృష్ణరాయలు ప్రత్యేకముగ దండయాత్ర బయలువెడలలేదు. క్రీ. శ. ౧౫౧౭ కు పూర్వమే రాయల దిగ్విజయయాత్రకు బయలువెడలెను. మొదట తిరుగుబాటుచేసిన ఉమ్మత్తూరుగంగరాజుపై దండువెడలెను. కుమారధూర్జటి యీప్రథమ విజయములకు సంగ్రహముగ నిట్లు వర్ణించియున్నాడు: "అనంతరం బొక్కహూరుమత్తున ఉమ్మత్తూరు శివసముద్ర స్థలం

1. లక్ష్మ. వ్యాసా. పుట ౩౭. 2. కృష్ణ రా. వి. [ద్వి. ఆ. ౧౨౦-౧౨౧]. 3. Andhra Academy Journal, III—p. 37.

బలసైసంగ గంగరాజు నొడయల నోడించి తదీయస్థలంబుల నా(?తా)క్రాంబులు బలియించి, శ్రీరంగపట్టణంబునిరీక్షించి యక్కడినుండి గ్రక్కున నెక్కటిమూకల వెక్కసపు బరాక్రమక్రీడల దిక్కులు గ్రక్కదల సంకులపరంథ సైన్యనాయకుండగు సంకులనాయకునిం గటాక్షించి దంచత్ప్రతాపంబు మెఱయ రయంబున విజాపురంబు గడి దుర్గంబుల చాయం జనుదెంచునవసరంబున".1

కృష్ణరాయలు ౧౫౧౭ సంవత్సరమున శివసముద్రమున నున్నట్లు పెనుగొండరాజ్యములోని బుక్కపట్టణమునందుండు నొకశిలాశాసనమువల్ల దెలియుచున్నది. కావున తత్పూర్వమే ఉమ్మత్తూరు దుర్గము గొనియుండవలయును. శివసముద్రపు ప్రభువును గెలిచిన పిమ్మట బిజాపురగడిదుర్గంబులను సమీపించువఱకు రాయల నెదుర్కొను శత్రు వెవ్వడును లేడు. కావున నాసంవత్సరమే బిజాపురరాజ్యపుగడిదుర్గములను చేరెననుటయందసంభవ మేమియును లేదు.

## తురుష్కప్రభువులతోడి యుద్ధము :

ఇక్కడినుండి స్వసైన్యముతో రాయలు విజాపురపు సరిహద్దులపై నడచెను. "సరిహద్దులాల వుండిన గురిమనుష్యులనున్ను దుర్గాలవుండే రాణువనున్ను నిర్వహింపలేక విడిచి పారిపోసాగిరి." అప్పుడు రాయలవారు రాయచూరు, ముదికల్లు, అద్దంకి, ఆదవని మొదలగు దుర్గములను సాధించి, వానియందు తాణ్యముల నుంచి దిన మొక్కటిగా సాగి గోలకొండ సరిహద్దులకై నడచెను. ఇచ్చట తురుష్కప్రభువులతో గొప్పసంగ్రామము సంఘటిల్లెను. 3

కృష్ణదేవరాయలు దిగ్విజయ ప్రయత్నములను సల్పుచున్నాడని తెలిసి యేదులఖానుడు గోలకొండ కుతుపనమల్కనకును, అహమదానగరపు నిజామశాహకును ఉత్తరములు వ్రాసి వారిసాహార్దమును బడసెనని యింతకు పూర్వమే వ్రాసియున్నాము. ఇప్పటికి ఆసాహార్దము ఐకమత్యముగ మారుటచే ముగ్గురు తురుష్కరాజులును కలిసి స్వసైన్యములతో రాయలను నిర్జించుటకై కృష్ణను దాటివచ్చిరి. వారిసైన్యమునందు లక్షగుఱ్ఱములును, వేయిరేనుగులును ఉండెను.

## తురకల దుష్కృత్యములు :

"వారి సీమలో మన తెగలవార్లు లోజొచ్చి మాడామడలకు మాడామడవుండే గ్రామాదుల కొళ్లపెట్టేదిన్ని పాతరలు శోధించి ధాన్యరసములు తెత్తేదిన్ని గృహస్థులయిండ్లలో జొచ్చిపోయి ముందు పెనక దాచియుంచిన చందాన నిక్షేపములు తెత్తేదిన్ని పూర్లపల్లెలు కాల్చేదిన్ని పసలం, ప్రాయలు, మేకలు, గొర్రెలు, గుర్రాలున్ను పట్టుకవచ్చి కాసుకు ఒకటిగా అమ్మేదిన్ని"4 అని వేగులు రాయలవారితో విన్నపము చేసిరి.

అప్పుడు రాయలవారు చాల ఆగ్రహపడి, "ఛీ ఛీ! తురుష్కతతి చెంతకు చేరిన యంత వచ్చె నే' కలగితోలంగి పోయెదరుగాక మదీయబలంబుముందర"5 నని హుంకరించెను.

## సమరసభ:

తత్క్షణమే కార్యము తెలిసి నిర్ధారణసేయుటకు దండనాయకులను రప్పించి రాయ లోకసభను గూర్చెను.

తే. "అపుడు కొలువయి కొలిచిన యమరనాయ
కులను మన్నీల నందఱ బిలువనంపి
సకలబహుమానము లొనర్చి జనవరేణ్యు
డల్లతురకల వృత్తాంత మెల్ల దెలుప", 6

ఈ సభయందు పేరు గల నాయకులందఱును గూడిరి. అందు ఆర్వేటివారు, తొరగంటివారు, గొబ్బూరివారు, నందేలవారు, అవుకువారు, వెలుగోటివారు, రాచెలవారు, తుళువదొరలును, బోయలును ఉండిరి.7 అట్లు కూడిన సేనాప్రముఖులతో రాయలు తురుష్కప్రభువులు కృష్ణ దాటివచ్చిరని చెప్పి, "వారలలో పెమ్మసాని రామలింగనాయణ్ణి పిలిచి, "తురకలు కృష్ణ

---

1. కృ రా. వి-ఆ. 3: 6. 2. Rep. of Epi. 1913. B 180. 3. Jr. Andhra Academy, Vol. III. 4. I bid. 5. కృ. రా. వి. 3: 12. 6. I bid. 3: 13. 7. కృ. రా.వి. 3: 58 - 59.

వేణ్ణి దాంటివచ్చి డెరిజావేశి పాళ్యం దిగినారట యిందులకు యేరీతుల నడువవలెనో," అని యడిగెను. అందుకు రామలింగ నాయ డిచ్చిన జవాబు: "తురకల కార్యమనంగా యెంతమాత్రం. దేవరవారి ప్రతాపమువల్ల డెరిజా తాళ్లు తెగకోసేను. అప్పుడు భేరితాడనం శేశి వడిస్తేను తురకలు మూడుతెగలవారున్ను పటాపంచలై విరిగి యథాయథలై తమతమస్థలాలకు పొయ్యేటట్టు శేశేను. యిదిగాకాక యీగ్రీష్మకాలాన దగదప్పలకు తాళివాండ్లు నిలువలేరు."1

రాయ లందుకు సంతసించి అతనికి "పట్టేలు యిచ్చి" అంపెను. అటుపిమ్మట రామలింగనాయుడు తననివిరమునకు పోయి తన యనుచరులగు కమ్మకొరలను బిలిపించి, రాయలవారు తనకు వీరతాంబూలము నిచ్చిన వార్తను తెలిపి, "కమ్మకులంవారికి బ్రతుకులును ప్రతిష్టలున్ను కీర్తిమాటవాసులు" కలుగజేయుడని ప్రోత్సాహ పరిచెను. అప్పుడు "ఆయన పంతరించిన యెవత్తైవేల చివ్వలవారున్ను రణపెండ్లికొనుకులై అని మీది దృష్టిచేత రామలింగనాయని వెంబడిని" 2 నడచిరి.

## తురకల ప్రయత్నములు:

తురకలు రామలింగనాయుడు కంమ్మ సర్దారులతో తమపాళ్యముపై నడచుచున్నాడని యెఱిగి, "డెరిజావద్ద పంజ్జోగంత్తో విత్ప్లకత్తుల రౌతులు అరవై వేలున్ను వారిని చుట్టుకనిండు పంజ్జోకంగుర్రాలు పదివేలున్ను వార్లను అనుభవించుకవుండె మనహత్తులు వెయ్యింటికిన్ని యీరీతిని డెరిజావద్ద వుంచి మూడుతెగల తురకలున్ను తమతమ పాళ్యములో ఆయత్తపాటుతో జాగ్రత కలిగి యుండి"రి. 3

## యుద్ధము:

మొదట కొంతకాలము తుములయుద్ధము నడచెను. అప్పుడు "ఒక్కమొంగి రక్కసు లవంసగిన వెక్కసపు మొక్కలపు తురుష్కులు ధామమ్క కాళలం బడరం" 4 జనుదెంచిరి. అనగా, తురుష్కుల ధాటి కోర్వలేక యీ తుముల సంగరమున హిందువులు విరుగగా, వారిని వెన్నంటి తరుముచు, రాయలపాళ్యమువంక తురకల దళము సత్వరముగ వచ్చుచుండెను. వారిని జూచి రామలింగనాయుడు రాయలతో నిట్లనెను:—

"పరాకు రాకు రాకు మంచు బారసీకభూపతుల్
చిరాకు మీర దట్టమైన కింగిణీలకోరులన్
జిరాగు రాల వేసి దాసి చిల్లుపాల్లు జేయుచున్
నిరాకరించి మించి వచ్చు నేర్పు జూచితే నృపా."5

అని వారిని చూపి, "నేను యీ తురక మూకలో జొచ్చి, సైన్యమును తునకలు తునకలుగా నరికి డేరా త్రాళ్లు తెంచెదను. అప్పుడు మీరు జయభేరి వేయించి, మన సైన్యముతో తరిమినడచిన, తురకలు చెల్లాచెదరై తమ సీమలకు చేరుదురు" అనిచెప్పి రామలింగనాయడు బల్లెమును గేలబూని, పదివేలకంమ్మబల్లెమువారు వెంటనడువ తురకలసైన్యముపై కురికెను. ఘోరమైనసంగరము నడచెను. కడపట రామలింగనాయడు తురకలడెరిజా త్రాళ్లను తెగగోసెను. దానిని జూచి కృష్ణరాయలు పెద్ద యేనుగు నెక్కి జయభేరి వేయించి, ౬౫,౦౦౦ గుఱ్ఱములతోను ౬,౦౦,౦౦౦ పదాతివర్గంబుతోను, ౩౦౦ ఘంటల యేనుంగులతోను నొక్కపెట్టున మహమ్మదీయ సైన్యముపై బడిరి.6 తురకదండు విరిగి చెదరి పారజొచ్చెను. ఇంతలోనె కృష్ణానది నిండి పారనారంభించెను. తురుకసైన్యము రాయలసేనావాహినికిని, కృష్ణావాహినికిని మధ్య దిగులొక్కని హడకొత్తులోని పక్కవలె చిదిగెను. 7 హతశేషులు దళద్రిశల బారిపోయిరి. ఈవిధమున కృష్ణదేవరాయలు, సంయుక్తతురుష్క త్రైరాజ్యబలములను వధించి జయమును గైకొనెను. ఇది రాయల జయములలో మహాముఖ్యమైనదని తలపవలసి యున్నది.

ఈసందర్భమున నొకవిషయమును గూర్చి యించుక చింతించవలసియున్నది. ఆముక్తమాల్యదలో కృష్ణరాయలు దా నొకయేదులఖానుని వధించినట్లు చెప్పుకొనియున్నాడు:

1. Jr. Andhra Academy, Vol. III. 2. Ibid. 3. Ibid. 4. కృ. రా. వి. 2: 29. 5. Ibid. 3: 30. 6. కృ. రా. వి. 3: 37. 7. I bid. 3: 31.

మ. "అలుక న్ఘోటకధట్టికా ఖురపుటీ
హల్య స్థరాసాని పు
చ్ఛలునో దున్ని చలచ్ఛయాగజపుడా
సారప్లుతిన్ గీర్తిపు
ష్కలసస్యం బిడి యేకథాటి భళిరా
కట్టించి తౌ దృష్టి కే
దులఖానో గ్రకపాల మర్ధపహారి
ద్యాఘాంగల్ శ్రేణికిన్."

ఇందు కృష్ణరాయనిచే వధింపబడిన యేసులఖానెవ్వడు? కృష్ణరాయల రాజ్యకాలములో, అనగా క్రీ. శ. ౧౫౦౯, ౧౫౩౦ల మధ్య, బిజాపురమున నిద్దరు సుల్తానులు ప్రభుత్వము నల్పినట్లు ఫెరిస్తా గ్రంథమువలన దెలియుచున్నది:

యూసుఫ్ ఆదిల్ ఖాను—౧౪౮౯ మొదలు ౧౫౧౦ వఱకు.

ఇస్మాయల్ అదిల్ శాహ—౧౫౧౦ మొదలు ౧౫౩౪ వఱకు.

ఇస్మాయల్ అదిల్ శాహ కృష్ణరాయలచే ౧౫౨౧ లో పరాజితు డయ్యెనే గాని చంపబడలేదు. అతడు క్రీ. శ. ౧౫౩౪ వఱకు, అనగా రాయలు మరణానంతరము ౫ సంవత్సరములవఱకు, జీవించియుండెను. యూసుఫ్ ఆదిల్ ఖాను ౧౫౧౦ లో మృతినందినట్లు ఫెరిస్తా వ్రాసియున్నాడు. కృష్ణరాయలు క్రీ. శ. ౧౫౧౨ వఱకు దండయాత్ర వెడలలేదు. ఇతడు సింహాసనము నధిష్టించినది ౧౫౦౯ వ ఆగష్టు తే ౮ దికి ఇంచుక పూర్వమున. రాజ్యాభిషేకానంతరము ఒకటిన్నర సంవత్సరమువఱకు రాజకార్యముల నరయుచు రాయలు విజయనగరమునం దున్నట్లు నూనిస్ వ్రాసియున్నాడు.1 అనగా ౧౫౧౦ వ సంవత్సరము కడపటివఱకు రాయలు విజయనగరమున నుండెను. తరువాత దనపై తిరుగబడిన ఉమ్మత్తూరు గంగరాయలపై దాడివెడలెను. ౧౫౧౧ లో నతడు శివసముద్ర ప్రాంతముల నున్నట్లు శాసనములు పల్కుచున్నవి. శివసముద్రమునుండి శ్రీరంగపట్టణమునకును, అచ్చటినుండి యిక్కేరి మీదుగా బిజాపుర పరరాష్ట్రప్రదేశములకును రాయలదండు నడచెను. అప్పటికి ౧౫౧౧ వ సంవత్సరము చెల్లెను. ౧౫౧౨ వ సంవత్సరము జనవరిలో కృష్ణరాయలు విజయనగరమునకు వచ్చి ఆనెల ౯ తేది నాడే మరల స్వసైన్యమును గలకికొనుటకై పురము వెడలిపోయెను.

ఇందువల్ల రాయలపర్యటనము దెలియుచున్నది. ౧౫౦౯ ఆగష్టు ౮ తేది మొదలు, ౧౫౧౨ జనవరి ౯ తేది వఱకు రాయలు యూసఫ్ ఆదిల్ ఖానుతో పోరాడుట కవకాశము లేదనుట స్పష్టము. అందువల్ల, అతడు ఫెరిస్తా చెప్పినట్లు ౧౫౧౦ లోనే మృతినందుట నిజమేని కృష్ణరాయలతో యుద్ధములో మృతినందుట పొసగదు. కృష్ణరాయలు డంబమునకై ఆదిల్ ఖానుని చంపితినని తన గ్రంథమున వ్రాసి అందఱికిని జూపె ననువిషయము నమ్మదగినది కాదు. మఱియు, కే. వి. లక్ష్మణరావు పంతులుగా రన్నట్లు కృష్ణరాయలు వధించినది ఆదిల్ ఖానునేగాని ఆదిల్ శాహను గాదు. యూసప్ ఆదిల్ ఖానుడు "౧౪౮౯ లో స్వతంత్రుడై 'యూసప్ ఆదిల్ శహ' యన్న బిరుదమును ధరించెను. కాని యింకను బహమనిసుల్తానులు పేరునకైనను నుండుటవలనను, కృష్ణరాయలు వారికి సాయము చేయువలయునని తలంచుచున్నందునను, స్వామిద్రోహియైన యూసప్ ఆదిల్ ఖానుని 'శాహ'గా, ననగా నొకస్వతంత్రరాజుగా, నొప్పుకొనక ఒకానొక ఖానుగా నెన్నుటయే రాజనీతియనుటకు సందేహము లేదు." 2 కావున కృష్ణరాయలు తనగ్రంథమున పేర్కొనిన "యేదులఖానుడు" యూసప్ ఆదిల్ ఖానుటయే సమంజసము. నిజాముశాహుల చరిత్రకారుడగు అజీజ్ అల్లా తబాతబాయ్ తన "బుర్హాన్ ఇ మ ఆసీర్" అను గ్రంథమున పలుమారు బిజాపురరాజ్యస్థాపకుని "యూసుఫ్ అదిల్ ఖా"ననియే పేర్కొనియున్నాడు.3 కావున, అతడు "ఆదిల్ శాహ" యను పేరు మార్చుకొనినను సమకాలికు లతనిని "ఆదిల్ ఖా"ననియే పిలుచుచువచ్చినట్లు దోచుచున్నది. ఈకారణములవలన, రాయ

1. Sewell: Forgotten Empire—p. 316. 2. లక్ష్మ. వ్యాసా. పేజి 39. 3. Ind. Ant. XLIX.

లచే జంపబడిన యేదులఖానుకు బిజాపురరాజ్యస్థాపకుడగు యూసఫ్ఆదిల్ ఖానే యని మానమ్మకము. ఇందుకు ఒక ఆక్షేపము కలదు. యూసఫ్ ౧౫౧౦ లో కృష్ణరాయనిచే యుద్ధములో నిహతుడైన అతడు ౧౫౧౦లో మృతినందినట్లు ఫెరిస్తా వ్రాయుట యెట్లు సంభవించును? ఈ ప్రశ్నకు తగు సమాధానము లక్ష్మణరావుగారే యిచ్చియున్నారు: "అతడు మహమ్మదీయ పక్షపాతి. కావున నొకమహమ్మదీయసుల్తాను హిందూరాజుచే జచ్చెననుట యాతనికి నప్రియమైనపని."[1] కావుననే యూసఫ్ ఆదిల్ ఖానుడు వాస్తవముగ ౧౫౧౦ లో కృష్ణరాయలతోడి దురమున మడిసినను, దానిని గప్పిపుచ్చుటకై యాతడు ౧౫౧౧ లోనే మృతినొందెనని వ్రాసినాడు. ఫెరిస్తా వ్రాసిన యబద్ధపువ్రాతలలో యీ యబద్ధ మంతగ పరిగణింపదగినది కాదు.

3. "కలంబరిగెవద్ద విజయస్తంభం వేయించి." కృష్ణరాయలు కలంబరిగెను జయించినవిషయము మన చరిత్రలోను ఆముక్తమాల్యదయందును వచింపబడి యున్నది. కృష్ణరాయవిజయమందును ఈ దండయాత్ర ప్రస్తావము గలదు:

తే. "కల్యరగికోటమీద లగ్గలకు నెక్కి
కార్య మొనరించి జయలక్ష్మి గాంచి యచట
నుండి తనరాజ్యమున గల్గు నోరపుమీాలు
మంచిదేశస్థలంబు లీక్షింప నెంచె."[2]

ఇది రాయలు ప్రతాపరుద్రగజపతి కూతును వివాహమైన పిమ్మట జరిగినట్లు కృష్ణరాయవిజయము చెప్పుచున్నది. కాని యిది పొరబాటు. రాయవాచకంలో కలంబరిగె దండయాత్రను గూర్చి యిట్లు చెప్పబడి యున్నది:—

"కృష్ణరాయలవారు ఉత్తరాదితురకలకార్యం జయంచేసుకొని క్షేమకై తిరిగి తిరుపతికి రాంగా కల్యాణ కలంబరిగె కోటలవారు గర్వితులై కోటమీాదనుండి కూతలింగా ఆవార్తలు రాయలవారు విని యెదిరి తెగ వారిది అడుగగా మ్లేచ్ఛులలెగవారు వున్నారు గనుక కోటమీాదికై అంగ్దులనుగడించమని కలుబరిగెకోట లగ్గ బెట్టించి మూడుముక్కాలు ఘడియలలో కోట సాధించి ఆ కోటలోవున్న యజమానుణ్ణి చేపట్టుగా పట్టుకొని ఆరువేల గుర్రాలవారినిన్ని గుర్రాలనున్ను ఏకవాగగా బట్టుకొని ఆ కోటకు తాణ్యం గుజ్జరి కల్యాణరావును వుంచి తిరుపతికి వచ్చి..."[3]

కలంబరిగె దండయాత్ర, యూసఫ్ ఆదిల్ ఖానుని చంపిన దండయాత్రలో చేరినదేకాని, వేరుదండయాత్ర కాదు. ఈ విషయము, "మూడుయేండ్లు దండు చేసి మూడుసంస్థానాల వారిమీాద కార్యంచేసి కలబరిగెవద్ద విజయస్తంభం వేయించి మూడుసంస్థానాల వారివద్ద పగుడీ తీసుకొని మరు...లిప్పించుకొని విజయనగరపట్టణం ప్రవేశించి" యను కడితములోని వాక్యముల వల్ల తెలియుచున్నది.

రాయలవారు తిరుపతికి పోవుటకు పూర్వము ఈ దండయాత్ర నడిచెను. రాయలు తిరుపతికి వెళ్లినది క్రీ. శ. ౧౫౧౪[4] లో. కావున కలంబరిగె అంతకుమూందే గెల్వబడెను. మన కడితపుస్తకములో తురకలపై యుద్ధమును ముగించుకొని, "శ్రీముఖ సంవత్సరం చిత్రిమాసం శ్రీరామదశమివరకు" విజయనగరమందు ఉండి, ఆ దినము గజపతిమీాదికి దండుచెవలినట్లు చెప్పబడియున్నది. శ్రీముఖ సంవత్సరం క్రీ.శ. ౧౫౧౩ తో పరిపోవుచున్నది. ఇంతకుపూర్వమే కలంబరిగెను రాయలు స్వాధీనము చేసుకొని యుండవలెను. కలంబరిగె స్వాధీనము చేసుకొని విజయనగరము వచ్చుటకు పూర్వము అతడు మూడుసంవత్సరములు దండుచేసెను. అనగా రాయల ప్రథమ దండయాత్ర ౧౫౧౦ లో ఆరంభమై ౧౫౧౩ లో ముగిసినట్లు తోచుచున్నది. తత్క్షణమే పూర్వ దిగ్విజయయాత్ర ఆరంభమాయెను.

కలంబరిగెను రాయలు గెలిచె నన్నవిషయ మొక్కటి దక్క, ఈ దండయాత్రనుగురించి మన కేమియును

1. లక్ష్మ. వ్యా. పుట 89. 2. కృ. రా. వి. 4: 140. 3. Jr. Andhra Academy, Vol. III.
4. 153 to 55 of 1889.

ఇంతవఱకు తెలియకుండెను. కలుబరిగెకడ రాయల నెదిరించిన శత్రువు నిజాముశాహా యనియు, ఘోరమైన సంగ్రామ మైనవెనుక, ఆంధ్రవీరుల మహాపరాక్రమ ప్రదర్శనమువలన, విజయలక్ష్మి రాయలను వరించెననియు, రాయలు సైన్యపుటగ్రభాగమున నిలిచి శత్రువులతో గయ్యము నేయువాడనియు, యుద్ధరంగమున తన సైనికుల బాధల నరసి వారిసౌకర్యములకు నలయు నేర్పాటులను సర్వదా చేయుచుండు వాడనియు మన మీ క్రింది కలుబరిగె యుద్ధవర్ణనవల్ల తెలిసికొనుచున్నారము:

"[1]కొన్ని దినములకు కల్యాణం కలబరిగె మీద యుద్ధసన్నద్ధులై సమస్తమైన జహాగీరుదార్లను పిలిపించగా కడవకోలనుగ్రామంలో వున్న ముశిలి చన్నమనాయను తన జమీయ్యతుతోకూడా విజయనగరానకు కృష్ణరాయలవారి సముఖానకు పోయిన తదనంతరం రాయలవారు సైన్యముతోకూడా ప్రయాణమై కలుబరిగెమీదికి వెళ్లగా సమస్తమైన నిజాములు ఆకలుబరిగె దగ్గిరికి భారీఫౌజులు స్తోమంగా కూడివున్నందున రాయలవారు సమస్తమైన వారిని పిలిపించి యీ యుద్ధమందు వెనుకకు తిరుగక లడాయిచేశి శత్రుపలాయనం చేస్తే మీకు సకల బహుమానాలు యిప్పిస్తున్నారము అని వీర కంకణాలు తాంబూలాలు యిచ్చినంతలోగా లడాయికి షురుషు అయి యుద్ధము శేయుగా అప్పుడు బహుమంది సర్దారులు మెసా ముశిలి చన్నమనాయడు సొన్నలాపురం వాండేవారు యింకాపాశీలవారు సహా యేకస్తులై యుద్ధానకు నడచినంతలో అగాధయుద్ధప్రవరిణి అయి కృష్ణరాయలవారిఫౌజు విరిగినందున రాయలవారు చెయ్యెత్తి ఘుల్లున కూశి యీసమయమందు యెవ్వరు యెదురెక్కి శత్రుపలాయనం చేస్తూవున్నారో వారికి సకలబహుమానాలు బిరుదులు యిప్పిస్తున్నామని చెప్పినందున ముశిలిచన్నమనాయడు యింకా కొంతమంది సరదార్లతో కూడా తురుష్కులవారి లష్కరుమీదికి యెదురెక్కి తిరుముకొని వస్తూవుండిన నిజామాది ఫౌజులమీదికి దూరి చిత్తాస్వాతి సంధించినట్టుగా యుద్ధముచేసి ఇందటికో వ్విరుగకొట్టినందున యావత్తౌజు యేకరాశిన దూరగా నిజాములఫౌజు విరిగి నానాహతమై పోయినందున కలబరిగెలో పరాహస్వజమెత్తించి జయభేరి వేయించి ఆమీదట సమస్తమయిన జాగీరుదారులను సరదార్లను పిలిపించి వొప్పుదప్పులు విచారించి జఖముపట్టియిచ్చి ముశిలి చన్నమనాయణ్ణి విచారించగా భారీగాయములతో యుద్ధాంతరమందు పడివుండగా ఖాసాకృష్ణరాయలువారు పోయి జఖములు కట్టించి తమడేరాదగ్గిరనే డేరావేయించి కాపాడి స్వస్థమైనమీదట ఫౌజుతో కూడా విజయనగరానకు పోయి సకలమైనవారికి శెలవుయిచ్చి కడవకోలను మెసా ముశిలి చన్నమనాయణ్ణి చూచి పాలకీ, వుభయచామరాలు, ఖాసా పట్టుకుగుల్లాం, కల్కితురాయి, వుడాసు, సానదా, గండపెండేరం, నిశాని, ఒంటెమీద నగారా మొదలయినబిరుదులుఅయినవత్తారు మండలీకరగండ, పూర్వసింహాసనాధీశ్వర అనే పేరు యిచ్చి కడవకోలను గ్రామపర్యంత్రం వుండే అరణ్యం యిచ్చి పంపించినందున చన్నమనాయడు అప్పణతీసుకొని గ్రామానకు వచ్చెను."[2]

౮. (A) జగపతి గజపతి యనుదానికి అక్షరవ్యత్యాసమువల్ల ఏర్పడిన రూపము. గజపతిరాజ్యముపై రాయలుచేసిన దండయాత్ర సుప్రసిద్ధము. అయినను ఆదండయాత్ర విజయనగరమునుంచి బయలుదేరిన తారీఖు ఇంతవఱకు మనకు తెలియదు. ఆవిషయము ఇప్పుడీకడితమువలన దెలియుచున్నది. అది శ్రీముఖసంవత్సరం చిత్రమాసం శ్రీరామదశమియట. శ్రీరామదశమియనుట వింత! శ్రీముఖ సంవత్సరం శకం ౧౪౩౬, క్రీ. శ. ౧౫౧౪ నకు సరిపోవుచున్నది. కావున కృష్ణరాయల పూర్వదిగ్విజయయాత్ర ఆసంవత్సరముననే ఆరంభమైనది.

1. దీనిని లోకలురికార్డ్సునుండి తమ యుపయోగార్థము వ్రాసి తెచ్చుకొని యున్నను, నాకు అడుగగనే సంతసముతో నా ప్రియమిత్రులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఇచ్చిరి. కావున, వారికి వందనములను సమర్పించుచున్నాడను. 2. L. R. 39—p.12.

(B) "గజపతికుమార్తె లక్ష్మీదేవమ్మవారిని వివాహాలాచేసుకొని" అన్న మాటవల్ల కృష్ణరాయలు వివాహము చేసుకొనిన గజపతికుమార్తె పేరు లక్ష్మీదేవియని స్పష్టముగా దెలియుచున్నది. ఆమెపేరు వాదప్రతివాదముల కాస్పదమై యున్నది. తుఖ్ఖాయని కుమారధూర్జటి! మోహనాంగియని రాయవాచకము. నాదిండ్ల గోపమంత్రియొక్క "భద్రాం సుభద్రా మివ పాండవేయః" అన్న వాక్యము నాధారముచేసుకొని కొందరు ఆమెపేరు "భద్ర" యనుచున్నారు. మనకడితములో ఆయమ్మపేరు లక్ష్మీదేవియని యున్నది. సర్వవిషయముల యందు విశ్వసనీయమగు నీకడితము కృష్ణరాయలు వివాహమాడిన గజపతికుమార్తెపేరును గూర్చి తప్పు వల్కునా?

౫. కృష్ణరాయలు శకం ౧౪౩౨ శుక్ల సంవత్సరం ఆవణి మొదలు, శకం ౧౪౫౨ "విరోధిసంవత్సరం కార్తికి నెలపరియంత్రం ౨౧ సంవత్సరం ప్రభుత్వం చేశెను." అనగా రాయలు క్రీ. శ. ౧౫౦౯-౧౦ మొదలు ౧౫౨౯-౩౦ వఱకు రాజ్యముచేసెను. కడితమునందలి రాయలరాజ్యకాలము శాసనములను పరిశోధించి పండితులేర్పఱచిన కాలమునకు ఇంచుకంతయు భేదములేక చక్కగ సరిపోవుచున్నది. ఇదియే దీనివిశ్వాసపాత్రత కొకగొప్పనిదర్శనము.

౬. కృష్ణరాయల మరణానంతరము విజయనగర రాజ్యము నేలిన రాజులనుగూర్చియు నిందొక చిన్నపట్టిక గలదు.—

[1]అచ్యుతరాయలు యేలినయేండ్లు ౧౨ (౧౫౩౦-౪౨)
సలికె తిమ్మరాజు యేలిన నెలలు ౮ (౧౫౪౨-౪౩)
సదాశివరాయణ్ణి ముందర బెట్టి రామరాజు యేలిన యేండ్లు— ౨౨ (౧౫౪౩-౧౫౬౫)

పంచపాదుశాహులతో రామరాజు పరాజితుడై స్వర్గస్థుడు ఆయెను గనుక ఆ సమయమందు అవాంతరం యేండ్లు— ౫ (౧౫౬౫-౧౫౭౦)

తిరుమలరాయలు పెనుగొండలో పట్టముగట్టుకొని యేలిన యేడు— ౧ (౧౫౭౦-౭౧)
శ్రీరంగరాయలుయేలినయేండ్లు ౧౪ (౧౫౭౧-౮౫)

దీని, శాసనపరిశోధకులపట్టికతో బోల్చి చూతము:

కృష్ణదేవరాయలు ౨౧ (౧౫౦౯-౧౫౩౦)
అచ్యుతరాయలు ౧౨ (౧౫౩౦-౧౫౪౨)
మొదటివెంకటపతిరాయలు ౬ నెలలు—౧౫౪౨
సదాశివరాయలు(రామరాజు)౨౨(౧౫౪౩-౧౫౬౫)
సదాశివరాయలు(తిరుమలరాజు)౫(౧౫౬౫-౧౫౭౦)
తిరుమలరాజు — నెలలు ౧౧ (౧౫౭౦-౧౫౭౧)
మొదటి శ్రీరంగరాయలు ౧౪ (౧౫౭౧-౧౫౮౫)

ఈ రెండుపట్టికలలోని రాజులయొక్క వరుసక్రమమును, వారిరాజ్యకాలమును ఇంచుక భేదములతో సరిపోవుచున్నవి. ఈ యందు భేదములు రెండు, చక్కగ యోచించిన నవి భేదములు కావని యంచ రెలుంగ గలరు. మొదటిపట్టికలో సలకం తిమ్మరాజు ఏలిన నెలలు ౮ అని యుండగా దానికిప్రతి రెండవపట్టికలో మొదటి వెంకటపతిరాయలు ఏలిన నెలలు ౬ అని యున్నది. అచ్యుతరాయలపుత్రుడు మొదటి వెంకటపతి. తండ్రి మరణకాలమున నతడు పసివాడు. తత్కారణమున నతని మేనమామయగు సలకము తిమ్మయ వెంకటపతిరాయలకు ప్రతిగ రాజ్యము సేయుచుండెను. కొన్ని నెలలు గడచినపిమ్మట సలకం తిమ్మయ తన మేనల్లుని హత్యజేసి తానే రాజ్యము నాక్రమించుకొనెను. తరువాత అళియ రామరాజు ప్రభృతులు తిమ్మయపై తిరుగుబాటుచేసి యాతని వధించి సదాశివరాయలను రాజుగా జేసిరి. అచ్యుతరాయల మరణకాలము మొదలు సదాశివరాయల రాజ్యారంభమువఱకు వాస్తవముగ రాజ్యము నేలినవాడు సలకము తిమ్మయ యగుటచేతను, వెంకటపతిరాయలవధ యనంతరము అతడే రాజుగుటకు ప్రయత్నములు సల్పుచు కొన్ని రోజులు రాజ్యము సేయుటచేతను, సలకముతిమ్మరాజు రాజ్యకాలముగ అచ్యుతరాయ సదాశివరాయల మధ్యకాలము పరిగణింపబడెను. ఇక కాలపరిమితి యొక్క భేద

[1] బ్రాకెట్ల నడుమను చేయబడిన తారీఖులు నేను వేసినవి.

మంతగ పాటింపదగినది కాదు, అచ్యుతరాయల మరణానంతరము వెంకటపతిరాయలు ౬ నెలలే రాజ్యము చేసియుండవచ్చును. అతని వధానంతరము తిమ్మరాజు ౨ నెలలు రాజ్యము జేసియుండవచ్చును. శాసనములను బట్టి అచ్యుతరాయల రాజ్యాంతమునకును, సదాశివరాయల రాజ్యారంభమునకును మధ్యమున్న యెడము ౬ నెలలే యని నిష్కర్ష చేసి చెప్పుటకు వీలు లేదు.

రెండవభేద మేమనగా— మొదటి పట్టికలో తిరుమలరాయలు ౧ సంవత్సరము ప్రభుత్వము చేసినట్లు చెప్పియుండగా దానికి ప్రతి రెండవపట్టికలో ౧౧ నెలలే రాజ్యము చేసినట్లు చెప్పబడియున్నది. ఈ రెండవపట్టికలోని కాలమున కుండు భేద మత్యల్పము. రెండవపట్టికలోని ౧౧ నెలలున్న లోకలురికార్డ్సును బట్టి నిర్ధారింపబడినవి. లోకల్ రికార్డ్సుకంటె ప్రస్తుతపు కడితమే యెక్కుడు విశ్వసనీయమని మా యభిప్రాయము.

౩. "పార్థివ సంవత్సరమందు... శ్రీ వీరవెంకటపతిరాయలు రాజ్యాభిషిక్తుడై" రాజ్యము సేయనారంభించెను. శకవర్షము చెప్పబడలేదు. అయినప్పటికిని లెక్క వేసి సులభముగ గనుగొనవచ్చును. ఈ కడితమును రాయలయాజ్ఞ ప్రకారము వ్రాసినది "శకం ౧౫౦౬ చెల్లిన వర్తమాన పరాభవసంవత్సరమందు," అనగా పరాభవ సంవత్సరంలో శకం ౧౫౦౮ వ సంవత్సరం నడుచుచుండెను. ఈ పరాభవకు ముందున్న పార్థివలో వెంకటపతిరాయల రాజ్యాభిషేకము జరిగెను. అది శకం ౧౫౦౬ వరకు, అనగా క్రీ. శ. ౧౫౮౪-౫ వరకు సరిపోవుచున్నది. శాసనముల ప్రకారము వెంకటపతిరాయలు రాజ్యమునకు వచ్చినది క్రీ. శ. ౧౫౮౫ లో.

౪. ఈ కడితమున ౭౨ పాళ్యములు పేర్కొనబడినవి. వానిని మొదట కృష్ణదేవరాయలు ఏర్పరచిరట. ఈ సందర్భమున పాళ్యమనగా నేమో మొదట మనము కనుగొనవలసి యున్నది. 'పాళెము' అనుమాటకు శబ్దరత్నాకరములో 'కావలి', 'పాళెగాని పట్టణము', 'చిన్నపట్టణము', 'దండు', 'దండువిడియుచోటు' అను నైదు అర్థములు వ్రాయబడి యున్నవి. వీనియందే యర్థమును ఇప్పటి పాళ్యమునకు సరిపోదు. ఇవి రాజధాని నగరములోని భాగములు. పాళ్యగాండ్రు రాజధానికి వచ్చినప్పుడు వారుండు స్థలములె పాళ్యములను కొంద మన్న నదియును సరిపోవుట లేదు. ఏలన—

తిరుమలతాతాచార్యులపాళ్యం
రాయలపాళ్యం
కుదపశాహువారిపాళ్యం
నిజాముశాహువారిపాళ్యం
యేదులశాహువారిపాళ్యం
కలపరిగెవారిపాళ్యం
ఫరంగివారిపాళ్యం
వలందవారిపాళ్యం
ఇంగిలీసువారిపాళ్యం
యేనుగులపాళ్యం
కంసలపాళ్యం

ఇత్యాదులవల్ల పాళ్యమన, 'పాళ్యగాడు రాజధానికి వచ్చినప్పు డాతడుండు ఉనికిపట్టు' అని యర్థముచెప్పుకొనుట సరికాదని తెలియుచున్నది. కుతుబ్శహా, నిజాము శహాలును, ఫరంగీ, యింగిలీసులును రాయలకు కప్పముకట్టుచుండిన పాళెగాండ్రు కారు. గొల్లపాళ్యం, కంసాలపాళ్యంలోనివారలును ఈతరగతిలోనికి చేర్పదగినవారు. కావున ఈకడితమున 'పాళ్యం' అనుమాట 'ఉనికిపట్టు' 'బస' అన్నయర్థమునం దుపయోగింపబడినదనుట నిశ్చయము. సామంతప్రభువులు, పరరాజ్యములనుండి వచ్చు రాయబారులు, విదేశవర్తకులు, రాజగురువులు, కంసల మంగల మొదలగు కార్మికజనులు, తాత్కాలికముగనో, శాశ్వతముగనో ఉండుస్థలమునకే గాక, రాయలవారి యునికిపట్టునకు గూడ 'పాళ్యము' అనుమాట చెల్లుచున్నది.

## మూలము

శాలివాహనశకం ౧౪౩౧ అగు నేటి శుక్ల సంవత్సరం ఆవణిమాసం శ్రీ జయంతినాడు కృష్ణదేవరాయ మహారాయలు విజయ

నగరమందు పట్టాభిషిక్తుడై వేంచేశిరి. ప్రజోత్పత్తి సంవత్సరం తయిమాసం తె ౧౨ ది కుతప్పశాహ నిజాంశాహమీదికి కూచీ చేశి వెలిగుడారం వేశి తర్లి పోయిరి. మూడుయేండ్లు దండుచేశి మూడుసంస్థానాలమీద కార్యంచేశి కలబరిగెవద్ద విజయస్తంభం వేయించి మూడు సంస్థానాలవారివద్ద పగుసీ తీసుకొని ముగ్గు.. తో(?) లిపించ్చుకొని విజయనగరపట్టణం ప్రవేశించ్చి వుండ్డి శ్రీముఖసంవత్సరం చైత్రమాసం శ్రీరామదెశమి జగపతిమీద దండ్డుయెత్తి తర్లిపోయి జగపతికుమార్తె లక్ష్మీ దేవమ్మ వారిని హవాలాచేసుకొని విజయనగర పట్టణానకు వచ్చి రాజ్యప్రతిపాలనం చేశిన వివరం.

*   *   *   *

యేకఛత్రాధీశ్వరుండయి శుక్ల సంవత్సరదారభ్యం విరోధిసంవత్సర కార్తిక నెల పరియంత్రం ౨౧ సంవత్సరం ప్రభుత్వంచేశిరి. అసంత్తరమంద్దు వికృతిసంవత్సర మారభ్యం పార్థివ సంవత్సరంవరకు యేండ్లు...కు యేలిన రాయపట్టాలు...కు వివరం:—

అచ్యుతరాయలు యేలిన యేండ్లు ౧౨
సలికెతిమ్మరాజు యేలిన నెలలు ౬
సదాశివరాయణ్ని ముందర బెట్టి రామరాజు
  యేలిన యేండ్లు ౨౨
పంచపాదుశాహులతో రామరాజు పరా
  జితులై స్వర్గస్తుడు ఆయనుగనుక ఆ
  సమయమందు అవాంత్తరం యేండ్లు ౫
తిరుమలరాయలు పెనుగొండ్డలో పట్టము
  గట్టుకొని యేలిన యేడు ౧
శ్రీరంగరాయలు యేలినయేండ్లు ౧౪

పార్థివసంవత్సరమంద్దు శ్రీమన్మహామండ్డలేశ్వర రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీవీర వెంక్కటపతి దేవరాయలు పట్టాభిషిక్తుడై పృథివీ రాజ్యాధిపత్యంయేలుతూ వుండగా

*   *   *   *

పూర్వమంద్దు తమ వంశీకులయిన కృష్ణరాయలవారిచేత యియ్యబడిన డేభై యేను పాళ్యగాళ్లకు అన్యోన్యఘర్షణ వచ్చి నగరికి నగరు రాకుండా ఘర్షణ చేస్తూ వుండేది. శాలివాహనశకం ౧౫౨౮ చెల్లిన వర్తమానం పరాభవసంత్సరమంద్దు తమ దగ్గిర వుండిన అతవణీప్రతికర్తలను పిలిపించ్చి పూర్వమంద్దు డేభై యేనుపాళెగాండ్లకు యిచ్చిన భూమి వివరం పాతలెఖలు తెంమ్మని చెప్పి (ప్పే) వరకు అపుడు అతవణీప్రతికర్తలు భూమి కొలిచి పాళ్యగాండ్లకుయిచ్చినది పూర్వం లెఖలు తెచ్చి శ్రీవీర వెంక్కటపతి దేవరాయలకువినిపించ్చిన భూమి వివరం:—

౪౪ అడుగులగడను కొలత యీనలభై నాలుగు అడుగుల గడను.

పడమరకోట పెనుగొండ గెవుది (ని?) సహా—— గుంటలు ౫౦౦ కు వివర(ం):—

| | |
|---|---|
| నడభావి ౧ కు | గుంటలు ౨౦ |
| చాదభావులు ౯ కు | గుంటలు ౧౨ |
| అంతుభావులు ౧౦ కు | గుంటలు ౩౨ |
| యిండ్ల అడుగులు | గుంటలు ౪౩౬ |
| అంతు | గుంటలు ౫౦౦. |

నడిమికోట పదకొండోపట్టం యిమ్మడివర లింగయాదనల్లు(?) కటించ్చిన పాతకోట ౧ కు గుంటలు ౨౧౦.

తపశీలు:—

| | | |
|---|---|---|
| కోనేరున(?)కు | గుంటలు | ౪౦ |
| వెంకటపతిరాయలు కట్టించినవుపరిగెకు | గుంటలు | ౭౦ |
| చిన్న వుప్పరిగెకు | గుంటలు | ౨౦ |
| నడభావులు ౨ కు | గుంటలు | ౧౬ |
| చాదభావులు ౩౨ కు | గుంటలు | ౭౦ |
| సోమేశ్వరునిగుడి ౧ కు ప్రాకారంసహా | గుంటలు | ౪౫ |
| యిండ్ల అడుగుల | గుంటలు | ౭౬ |
| అంతు | గుంటలు | ౧౨౦౦. |

తూర్పు కోటకు గుంటలు ౨౫౦౦.

తపశీలు:—

| | | |
|---|---|---|
| ముత్తావారిగు(?)డిదగ్గర కృష్ణస్వామి గుడిప్రాకారం సహా | గుంటలు | ౬౦ |
| దక్షిణామూర్తిగుడి౧కు | గుంటలు | ౧౦ |
| కేశవస్వామిపెరుమాళ్లుగుడి ౧ కు | గుంటలు | ౧౫ |
| చంద్రశేఖర యీశ్వరుని గుడి ౧ కు | గుంటలు | ౪౫ |
| వినాయక దేవళం ౧ కు | గుంటలు | ౧౦ |
| కాళికాదేవిదేవళం ౧ కు | గుంటలు | ౧౨ |
| నడభావులు ౩ కు | గుంటలు | ౩౨ |
| చాదభావులు ౨౫ కు | గుంటలు | ౧౧౧ |
| యిండ్ల అడుగులు | గుంటలు | ౨౨౦౬ |
| అంత్తు | గుంటలు | ౨౫౦౦ |
| అంత్తుకోటలు ౩ కు | గుంటలు | ౪౨౦౮. |

| | | |
|---|---|---|
| దుర్గంమీద యీశ్వరుని దేవళం ౧కు | గుంటలు | ౨ |
| గోపీనాథస్వామి ౧ కు | గుంటలు | ౫ |
| అగస్త్రీశ్వర దేవళం ౧ కు | గుంటలు | ౫ |
| కన్యకల దేవళం ౧ కు | గుంటలు | ౩ |
| దుర్గాదేవి దేవళం ౧ కు | గుంటలు | ౪ |
| కోట అగడత | గుంటలు | ౮౧౯ |
| అంతుసహా | గుంటలు | ౫౦౧౯. |

పేటలు:—

| | | |
|---|---|---|
| రాయపేట ౧ కు | గుంటలు | ౩౫౦ |
| కృష్ణాజంమ్మపేట ౧ కు | గుంటలు | ౫౦౦ |
| వోబాజింమ్మపేట ౧ కు | గుంటలు | ౩౮౦ |
| వెంగళాజంమ్మపేట ౧ కు | గుంటలు | ౫౫౦ |
| వెంకమ్మపేట ౧ కు | గుంటలు | ౫౭౦ |
| దళవాయిపేట ౧ కు | గుంటలు | ౫౨౦ |
| చిక్కరాయలపేట ౧ కు | గుంటలు | ౬౩౦ |
| చిన్ననాయకునిపేట ౧ కు | గుంటలు | ౩౭౦ |
| నడిమిపేట ౧ కు | గుంటలు | ౩౮౦ |
| రంగపతిరాజు పేట ౧ కు | గుంటలు | ౮౫౦ |
| గుంమడికాయిపేట ౧ కు | గుంటలు | ౧౮౦ |
| గోపిదేవి పేట ౧ కు | గుంటలు | ౨౧౦ |
| అంతుపేటలు ౧౨ కు | గుంటలు | ౫౪౯౦ |

పాళ్యాల వివరం:—

| | | |
|---|---|---|
| వెలుగోటివారిపాళ్యం ౧ కు | గుంటలు | ౧౨౦౦ |
| దామర్ల వారిపాళ్యం ౧ కు | గుంటలు | ౧౩౦౦ |
| అండెవారిపాళ్యం ౧ కు | గుంటలు | ౧౧౦౦ |
| పాదరవారిపాళ్యం ౧ కు | గుంటలు | ౧౨౫౦ |
| అవుకువారిపాళ్యం ౧ కు | గుంటలు | ౧౧౮౦ |
| రావిళ్ల వారి పాళ్యం ౧ కు | గుంటలు | ౧౨౬౦ |

కూరపాడి అయ్యప్పనాయని వారి
పాళ్యం ౧ కు గుంట ౩౧౦
పెమ్మసానివారిపాళ్యం౧కు గుంటలు ౧౨౪౦
మాకరాజువారిపాళ్యం ౧ కు గుంటలు ౮౹౦
మల్లువారిపాళ్యం ౧ కు గుంటలు ౧౧౦౦
జిల్లెళ్ళవోబిరాజుపాళ్యం ౧ కు గుంటలు ౯౪౦
జగదేవవారిపాళ్యం ౧ కు గుంటలు ౮౨౦
చిరిరాయలపాళ్యం ౧ కు గుంటలు ౭౯౦
తిరుమల తాతాచార్యులవారి పాళ్యం
౧ కు గుంటలు ౧౪౯౦
రాయలవారిపాళ్యం ౧ కు గుంటలు ౨౬౹౦
కుదపశాహువారిపాళ్యం ౧ కు గుంట ౧౨౧౦
నిజాముశాహువారి పాళ్యం ౧ కు
గుంటలు ౧౩౹౦
యేదులశాహువారిపాళ్య౧కుగుంటలు ౧౧౬౦
పొత్తరాజు తిమ్మరాజుపాళ్యం
౧ కు గుంటలు ౩౬౦
మహారాడిగహాజిరాజాపాళ్యం ౧ కు
గుంటలు ౨౦౦
గొబ్బూరివారిపాళ్యం ౧ కు గుంటలు ౩౹౦
వాగతీ వెంగమరాజు పాళ్యం ౧ కు
గుంటలు ౩౪౦
రాచవేడినాయకుని పాళ్యం ౧ కు
గుంటలు ౨౪౦
చెంజీవరదప్పనాయనిపాళ్యం ౧ కు
గుంట ౭౨౦
తంజావూరివారిపాళ్యం ౧ కు గుంటలు ౭౩౦
మదిరవారిపాళ్యం ౧ కు గుంటలు ౬౭౦
చివరంవారిపాళ్యం ౧ కు గుంటలు ౬౹౦
కాకంటివారిపాళ్యం ౧ కు గుంటలు ౭౫౦
సరహా(?)నాయకునిపాళ్యం ౧ కు
గుంటలు ౧౨౦
కలపరిగెవారిపాళ్యం ౧ కు గుంటలు ౨౧౦
ఫరంగివారిపాళ్యం ౧ కు గుంటలు ౩౬౦
వలందవారి పాళ్యం ౧ కు గుంటలు ౧౫౦
యింగిలీసువారిపాళ్యం ౧ కు గుంటలు ౨౧౦
శాయపనాయకునిపాళ్యం ౧ కు గుంటలు ౨౫౦
కొండ్రారెడ్డితిమ్మానాయని పాళ్యం
౧ కు గుంటలు ౭౩౦
వినుగొండవెంగమనాయని పాళ్యం
౧ కు గుంటలు ౨౪౦
కందనూలు గోపాలరాజు పాళ్యం
౧ కు గుంటలు ౧౧౦
పెనుగొండ కోనేటినాయని పాళ్యం
౧ కు గుంటలు ౪౧౦
చిత్రకంటివారిపాళ్యం ౧ కు గుంటలు ౨౹౦
రత్నగిరివారిపాళ్యం ౧ కు గుంటలు ౨౬౦
పాపానాయనిపాళ్యం ౧ కు గుంటలు ౨౭౦
తిరుగొండ రామానాయనిపాళ్యం
౧ కు గుంటలు ౩౧౦
వీరలేటి అక్కప్పనాయని పాళ్యం
౧ కు గుంటలు ౪౫౦
యిక్కేరివారిపాళ్యం ౧ కు గుంటలు ౩౫౦
మయిసూరివారిపాళ్యం ౧ కు గుంటలు ౪౨౦
శ్రీపత్తిరాజువారిపాళ్యం ౧ కు గుంటలు ౩౫౦
వేలూరుబొమ్మినాయనిపాళ్యం ౧ కు
గుంటలు ౩౬౦

వెదురుగొండ రంగపనాయని పాళ్యం ౧ కు గుంటలు ౧౭౦
కృష్ణగిరివారిపాళ్యం ౧ కు గుంటలు ౩౧౦
యిదువారిపాళ్యం ౧ కు గుంటలు ౫౫౦
పాళాలబసవరాజువారిపాళ్యం ౧ కు గుంటలు ౩౮౦
గుమ్మినాయని కరికబోయిని పాళ్యం ౧ కు గుంటలు ౨౬౦
వెకదొళరాల త్రిమ్మానాయని పాళ్యం ౧ కు గుంటలు ౧౮౦
బాదికొండమనాయనిపాళ్య౧కుగుంటలు ౧౬౦
కరికనంబాడివారిపాళ్యం ౧కు గుంటలు ౧౫౧
వెటగిరికృష్ణపనాయని పాళ్యం ౧ కు గుంటలు ౩౫౦
బురగాలకృష్ణపనాయనిపాళ్యం ౧ కు గుంటలు ౨౭౦
అవచిగోవిందదాసుపాళ్యం౧కుగుంటలు ౨౧౦
కోటపాళ్యం ౧ కు గుంటలు ౬౮౦
బండ్లపాళ్యం ౧ కు గుంటలు ౩౦౦
మొనుగులపాళ్యం ౧ కు గుంటలు ౧౨౦
బెస్తపాళ్యం ౧ కు గుంటలు ౩౩౦
తాళ్లపాళ్యం ౧ కు గుంటలు ౧౨౦
కురత్తిపాళ్యం ౧ కు గుంటలు ౧౬౦
గొల్లపాళ్యం ౧ కు గుంటలు ౧౮౧
సోతప్పనిపాళ్యం ౧ కు గుంటలు ౩౦౦
కంసలపాళ్యం ౧ కు గుంటలు ౧౫౦
మంగలపాళ్యం ౧ కు గుంటలు ౧౬౦
తుమ్మలపాళ్యం ౧ కు గుంటలు ౩౦౦
సుంకపాళ్యం ౧ కు గుంటలు ౨౧౦
అంచులపాళ్యం ౧ కు గుంటలు ౩౦౦
కుమ్మరపాళ్యం ౧ కు గుంటలు ౨౪౦
మేదరపాళ్యం ౧ కు గుంటలు ౧౮౧
దివిటిపాళ్యం ౧ కు గుంటలు ౧౨౦
తొట్టిగొర్రెలపాళ్యం ౧ కు గుంటలు ౪౭౦
గోసంగులపాళ్యం ౧ కు గుంటలు ౪౫౦
అంత్తుపాళ్యాలు ౭౭ కు గుంటలు ౪౦౧౫౦.
అంత్తుకోటలు, అగ్రహ్ర, పేటలు, పాళ్యాలు సహా గుంటలు ౫౦౬౫౯.

---

## నిస్పృహ

తన్నీరు కృష్ణమూర్తి గారు

ఎవ్వారో మీర లిది యేల యీ విషాద
భాజనంబైన జీవిత ప్రాంగణమున
పిలిచియున్నారు, ఆశల నింపుకొన్న
హృదయములతోడ- దేశమెయ్యదియొ మీది-
నాకు తెలిసినది- ఈభవనాన నిలువ
వచ్చియున్నారు శాబోలు;—

ఎవ్వ రంపిరి మిమ్మిట కీవిషాద
వనధిగర్భోజ్వల ద్భడబాగ్నిలోన
కఠినలోకమ్ము విడనాడి కట్టుకొన్న
నాదు జీవిత సౌధమ్మునకు మహాత్మ
లెవ్వ రంపిరి—
మరణ మన్నను నాకు సంబరము గాన
భస్మ మయ్యెద నీ బడబాగ్నిశిఖల.

---




తెలివితక్కువ ప్రశ్నలు

# ఆకస్మికచ్ఛాయాచిత్రములు

(SNAP SHOTS)



౨. హుగ్లీనదిమీద తెప్పలతో కట్టబడినవంతెన



3. హుగ్లీనది-కలకత్తా

శ్రీ అల్లూరి నారాయణరాజుగారి చిత్రములు.



౧. 'ఆంధ్రపత్రిక ఆరుకానులు, భారతి పదిఅణాలు' (మొదటి బహుమానము)



౪. సావాసకాండ్రు
(రెండవ బహుమానము)
శ్రీ అబ్బూరి వెంకటఅప్పారావుగారి చిత్రము.



౫. వానలో
(మూడవ బహుమానము)
శ్రీ బొడ్డు బాపిరాజుగారి చిత్రము.



౬. మొదటికట్టడము
శ్రీ వి. ఆర్. చిత్రాగారి చిత్రము.



౭. కుర్తాళం జలపాతము
శ్రీ కె. సుబ్రహ్మణ్యంగారి చిత్రము.

# "నన్ను మఱచినను దేశమును మఱవవద్దు"

## (కీ. శే. అన్నపూర్ణాదేవి చరిత్ర)

డ్రోణంరాజు లక్ష్మీబాయమ్మ గారు

అసమాన దేశభక్తి, అద్భుతత్యాగము, అసాధారణకార్యదీక్ష, వివిధభాషాపాండిత్యము అల్పవయసునందే చూపి ఆంధ్రదేశమునకే కాక యావద్భారతదేశమునకు నత్యంత ప్రశంసాపాత్రురాలయి, శ్రీ మహాత్మ గాంధీగారిచేతఁ గూడ హిందూదేశమునందు తనకుఁ గల పుత్రికారత్నములలో యువతీయువకుల కనుకరణీయమగు జీవితాదర్శములు గలదని శ్లాఘింపబడిన అత్యుత్తమురాలు, కీ. శే. మాగంటి అన్నపూర్ణాదేవి.

**జననము**

అన్నపూర్ణాదేవి ౧౯౧౧. సం. మార్చి ౩వ తేదిని ఏలూరువాస్తవ్యులగు శ్రీ కలగర రామస్వామిచౌదరి గారికిని, శ్రీ పిచ్చమ్మగారికిని ఏకపుత్రికయై జన్మించెను. నేఁ డది మనకు పండుగదినము. అన్నపూర్ణ జీవితము చెప్పు ముందు ఆమె తలిదండ్రులనుగూర్చి చెప్పుట అప్రస్తుతము గాదు. సామాన్యముగా తలిదండ్రులే బిడ్డల కీర్త్యున్నతులకు కారణులని మనలో ననుశ్రుతమైన వాడుక. ఏమహోత్కృష్ట చారిత్రమును దిలకించినను ఇది కొంత సత్యముగా కన్పట్టకమానదు. అట్టి యుత్తములలో నీదంపతు లొకరు. వారు తొలుతనుండి స్త్రీ విద్యదే, శోన్నతి, నిమ్నజాత్యుద్ధరణము మొదలగు విషయములం దధికాదరముగల సంస్కారప్రియులు, క్రియాపరులు, వివేకశీలురు. అందుచే నాఁడుపిల్ల యనిన అయ్యో యనుకొను తలిదండ్రులవలెఁగాక, వీరు తమ గారాబుబిడ్డను గొప్పవిద్యావతిగాఁ జేసి, స్త్రీజన్మ ఎంత ఉత్కృష్టమో నిరూపింప నీశ్వరుఁ డవకాశ మిచ్చెనని యానందించిరి. వీరివలె మాతాపితృధర్మమును శ్రేష్ఠముగ నిర్వర్తించువా రరుదు.

**విద్యాభ్యాసము**

అన్నపూర్ణ తలిదండ్రుల యుత్తమవిద్యాశిక్షణమున ఏలూరులో శిశుతరగతులు ముగించి, గుంటూరు మిషన్ బాలికాపాఠశాలలో రెండేండ్లు చదివెను. పిమ్మట మిత్రుల ప్రోత్సాహముచే వారామెను కలకత్తాకుఁ బంప నిశ్చయించిరి. కాని రామస్వామిగారు భాగ్యవంతులు గారు. అన్నపూర్ణ తాత లుభయులు లక్షాధికారులే. రామస్వామిగారు ప్రాజ్ఞులగుటకే వారి సంపద పూర్వాపహతమైనది. అయినను స్వతంత్రజీవనాభిలాషు లగుట వ్యాపారముచే రు ౧౧ లు తండ్రియు, కుట్టుమిషన్ పనిచే రు ౫ లు తల్లియు నిచ్చి పూర్ణాదేవి విద్యాపూర్తి చేయనిశ్చయించిరి. ౧౯౧౧ లో కలకత్తా గొంపోయి సుప్రసిద్ధ బ్రాహ్మమతప్రచారకు లగు శ్రీ హేమచంద్ర సర్కారుగారి "బ్రాహ్మబాలికాపాఠశాల"లో మొదటిఫారములో చేర్చిరి. ఆకాలమున నట ఆంధ్రవిద్యార్థినులు లేరు: సర్కారుగారికి దత్తపుత్రివలె నున్న శకుంతలాదేవియే తోడి తెలుఁగుబాలిక.

అన్నపూర్ణ అక్కడ ౫ వ ఫారంవఱకు చదివి మంచి పాండిత్యము, విజ్ఞానము నార్జించెను. ఆమెకు ఉగ్గుపాలతో నలవడిన దేశభక్తి మహావృక్షము కాఁజొచ్చెను. ప్రాచీన భారతౌన్నత్యము నాలించి తన్మయత నొందెడిది. దేశమునకు ఆత్మత్యాగులయిన ధీరులకు ప్రాంజలి నల్పెడిది. ప్రకృతదురవస్థకు కన్నీరు గురిసెడిది. పాశ్చాత్యుల యౌన్నత్యమునకు ముద మందెడిది. మహామహుల చరిత్రలు సదా పఠనీయములు. దేశమునకు తన ప్రాణ మర్పింపఁగలదో, లేదో, ఆత్మపరీక్ష గావించుకొనెడిది.

ఇంతలో ననారోగ్యము ప్రారంభించినందున నింటికి తిరిగివచ్చెను. పిమ్మట చెన్నపురిలో ప్రయివేటుగ

చదివి స్కూలుఫయినలుపరీక్ష నిచ్చెను. స్వతంత్రగ్రంథ రచనచే ధనార్జనచేసి విద్యాప్రాప్తి గావింపఁగోరి, ౧౯౧౮ లో "సీతారామము" అను రామాయణసంగ్రహము సర్వశ్రేష్ఠముగ విరచించెను. అది హైస్కూలు తరగతులకు పఠనీయ మైనది. "నవ-వర్ష స్వప్నము" సరళాదేవి కృత పాంఫ్లెటునకలను వంగభాషనుండి ఆంధ్రీకరించెను. సర్వజనసులభముగ శ్రీ విధుశేఖరశాస్త్రి గారిచే విరచింపఁబడిన "వివాహమంగళము" ననువదించెను.

## వివాహము

౧౯౨౧ సం. లో మేనమామయగు శ్రీ మాగంటి బాపినీడు, బి. ఏ. గారికి శ్రీ అన్నపూర్ణాదేవిగారికి మహావైభవముతో ఏలూరున వివాహము జరిగినది. సంఘ సంస్కారులకు మార్గదర్శకముగా స్వయంవర పద్ధతిని నీవివాహము జరుపఁబడెను. మంత్రములు తెలుఁగులో. పురోహితులు బ్రాహ్మణేతర ప్రముఖులగు శ్రీ కామరి వేంకటాచలపతయ్యగారు. ప్రేక్షకులు శ్రీ పాలపర్తి నరసింహము, ఆదిపూడి సోమనాథరావు, వంగబ్రాహ్మ ప్రముఖులగు శ్రీ ఉమేశచంద్రవిద్యారత్న మహాశయ ప్రభృతులు. ప్రాచీనభారత స్వతంత్ర స్వయంవరలక్ష్మి మరల కనులపండువు గావించెను. సముజ్జ్వలమగు నొక యుదాత్తస్పృహ సర్వాంగీణముగ నెల్లర మస్తిష్కముల నొనర్చి, హర్ష ప్రఫుల్లమానసముల జయజయధ్వానము సల్పించినది. "శ్రీయును, కులమును, రూపముఁ, బ్రాయము శుభలక్షణంబు, బాంధవవిద్యా శ్రేయముగల," పరస్పరానురాగము గల అనుకూలదాంపత్య మెవ్వరికి ముదావహము గాదు?

అన్నపూర్ణాదేవి యున్నతికి తలిదండ్రులవలెనే బాపినీడుగారును ముఖ్యులు. భర్తృధర్మమును శ్రేష్ఠముగ నిర్వర్తించిన యోగ్యులు. వారామె స్వాతంత్ర్యేచ్ఛల నెన్నఁడు నడ్డంతరపఱుప లేదు. ఆమెయు నా గౌరవమును ఉచితముగ దక్కించుకొనెను.

వివాహానంతరము కొలఁది దినములకే బాపినీడుగారు వ్యవసాయశాస్త్రముఁ జదివి దేశసేవ చేయవలెనని అమెరికాకుఁ బయనమైరి. నిజమునకు పాశ్చాత్యులు మనకన్న నెన్నియో విషయముల నభివృద్ధిలో నున్నమాట వాస్తవము. వారికడ మనము నేర్చుకోవలసిన వెన్నియో యున్నవి. ముఖ్యముగ దేశభక్తి, ఐకమత్యము వారి సొమ్ము. అది నేఁడు మనము మఱచి పోయినాము.

పాశ్చాత్యవిద్యావంతగము మనమును పాశ్చాత్యులముగా మారిపోక హిందువులమని జ్ఞాపకముంచుకొనిన ఖండాంతరవిద్య అనుపయోగము కాదు. కాని కొలంబో దాటఁగనే భారతవర్షమును మఱచినచో ఆ విజ్ఞానము నేర్వకుండుటయే ఎంతయో మేలు!

### "నన్ను మఱచినను దేశమును మఱవవలదు"

అని భర్తగారికడ దేవి వరముఁ గైకొని వారిని విదేశయాత్రకుఁ బంపెను. అది నరమే గాదు: హెచ్చరిక! శపథము!! ఆజ్ఞ!!! పిమ్మట నున్నతవిద్య నందుటకై తానును నరుగఁదలంచి, ౧,౨౧౧ వెలగల దుస్తుల కొని, ౨౫౧-ఓడటిక్కెట్టుకు డిపాజిట్టుచేసి, పాశ్చాత్యదేశసంచారమునకు ముందు నేర్వవలసినదిగ లెటుంగ శ్రీమతి సరోజినిదేవిగారి గృహమున ౩ మాసము లుండెను.

### అసహాయోద్యమము

అది ౧౯౨౧ సంవత్సరము. హిందూదేశచరిత్రలో నూతనశకారంభము. దిగంతములు ప్రతిధ్వనించునట్లు శ్రీ గాంధీమహాత్ముఁడు అసహాయదుందుభి నొక్కసారిగ మ్రోగించెను. స్వరాజ్యతృష్ణ, స్వాతంత్ర్యేచ్ఛ గలవారెల్ల రండని ఎలుఁగెత్తి చాటెను. దేవి కిది ప్రత్యేకాహ్వాన మయ్యెను. చదువా? దేశస్వాతంత్ర్యమా? ఏది ముందు? స్వేచ్ఛాభిధానల దందహ్యమానయగు నామెకీప్రశ్న ప్రత్యుత్తరమునకునూడ వ్యవధి కోర లేదు. ఆధీరసాధ్వి తత్క్షణమే శ్రీ గాంధీమహాత్ముని నాయకత్వమున స్వరాజ్యసైన్యములో చేరెను.

ఇంతనుండి ఆమె జీవితమున సేవాత్యాగప్రదర్శనమే. తేజోదరిద్రాణమైయున్న భారతభూమి కా దేవి చేసినసేవ నిరుపమానము. ఆ కుసుమకోమలి ఖద్దరుమూటల భుజములఁ దాల్చి, ఇల్లిల్లు, ఊరూరు, వీథివీథి కాలి

నడకను దిరిగి విక్రయించుచు మహాత్మునిసందేశము ప్రబోధించెను. పల్లెత్తి మాటాడనేరని ముగ్ధ కేసరివలె విజృంభించి సభావేదికలనుండి గర్జించెను. దానమిచ్చుటకే కాని చేయి చాఁచని యా మంజులకరములు చాఁచి "భవతి భిక్షాం దేహి" యని స్వరాజ్యభిక్ష నర్థించెను.

౧౯౨౧ లో అసహాయోగము చాటుచు మహాత్ముఁడు కావించిన ఆంధ్రదేశపర్యటనము మఱవఁజాలము. ఆ సంవత్సరము చాల పవిత్రమైనది. కొలఁది దినములక్రిందట ఆ మహాత్ముఁడే మరల నాంధ్రదేశమును సంచరించి పావన మొనర్చెను. కాని ఆ రోజులు లేవు. ఆదేవియు లేదు. ఆయుత్సాహము, ఉద్రేకము, అభిమానము ఉప్పెనవలె దేశము నొక్కమారు ముంచి వేసినది. అందు దేశముక్తికి సర్వత్యాగము చేసి ప్రాణ మర్పించినవారు కొందఱే. వారు సదా ధన్యులే.

ఆ సంవత్సరము ఖైదులు పెండ్లిఇండ్లవలె నుండెడివి. ఒకరు శిక్షపడిన వానివెనుక నలుగురు, ఆవెనుక పదిమంది, ఆవెనుక నిరువదిమంది, ఇట్లు మహోత్సాహముతో సన్నద్ధులగుచుండిరి. బ్రిటిషువారును తబ్బిబ్బులై రను టతిశయోక్తి కాదు. పాటలు, పద్యాలు, భజనలు, జయధ్వనులు, ఊరేఁగింపులు, ఖైదు కేఁగినవారి సన్మానాలు, కీర్తిగానములు — ఆహా! ఆ యుద్యమము మళ్లీ ప్రజ్వరిల్లిన స్వరాజ్యము దూరమా? ఇప్పుడో, ఆ దేశమేనా యిది?

మహాత్ముని ఆగమనమున బెజవాడలో గొప్ప సభలు జరిగినవి. మహిళాసభను ఖద్దరుదీక్షతో శాంతముగ నడుపుచు అన్నపూర్ణాదేవి మహాత్మ నాకర్షించెను. ఆయన స్వరాజ్యనిధికి స్త్రీలను ధనము కోరినపుడు ఆమె ఆ పవిత్రమూర్తి దివ్యపాదపద్మముల పరమభక్తితో తన నగల నర్పించెను. "నీ తలిదండ్రుల నడిగితివా" యని యాయన ప్రశ్నింప, "నా తలిదండ్రులు నన్నడ్డు పెట్టరు. నా యిష్టానుసారమే గావింతురు" అని ప్రత్యుత్తరమిచ్చెను. నాఁటినుండి మహాత్మునికామె ప్రియపుత్రి యైనది. మహాత్మునాజ్ఞ ననుసరించి చీనిచీనాంబరములకు, విదేశీయందలి వెలగల పెండ్లిచీరలకు, విదేశయాత్రదుస్తులకు నిప్పు ముట్టించెను. ౨,౧౧౧ వెలగల చీరలు ఆర్మీనియా స్త్రీలకుఁ బంచెను.

ఆమెకు విశ్వాసము ఆచరణ ఒకటే. ఆత్మవిశ్వాసమును క్రియారూప మొనర్చ ఏలూరు, హైదరాబాదు, భీమవరం మున్నగుచోట్ల రు 3,౧౧౧ లు వసూలుచేసి ఏలూరులో "శ్రీ మోహనదాసు ఖద్దరు పరిశ్రమాలయము" స్థాపించెను. ఆమె స్వాతంత్ర్యసాధనమునకు, కార్యనిర్వహణశక్తికి అది తార్కాణమై యలరారుచున్నది. బ్రహ్మాండముగ నిట్లొకవంక దేశసేవ చేయుచు, నొకవంక భర్తృశ్రేయమునకు సదా ఆత్మజపము, ఈశ్వరధ్యానము నాచరించెడిది. ఆమె గృహనిర్వాహకమునం దంతయు నప్రమత్త. రాజకీయ వ్యవహారములయం దతినిపుణ. ఆమె మహోత్సాహముతో నహమ్మదాబాదు కాంగ్రెసునకు వెడలెను.

"మనుజుని జీవితంపు పరిమాణము నేఁడులచేతఁ గాక చేసినయట్టి కార్యసంచయముచేతఁ గణింపఁగఁ జెల్లు నెప్పుడున్."

ఈ సుభాషితమును తమ దివ్యజీవితముచే సార్థకపఱచి ధన్యులయినవారితో నన్నపూర్ణాదేవియు గౌరవస్థానము నలంకరించుచున్నది. ఎక్కడనో శాఖాంతరముల నదృశ్యయై, వసంతవాయువులు వీచినంతనే యవ్యక్తకలస్వనము నెత్తి కీర్తించి దేవమానవుల దృగ్భ్రమ నొందించి, కాలపరివర్తనమున ఱెక్కలు విదిర్చి ఎగసి మాయమయిపోయిన కోకిల అన్నపూర్ణాసతి జీవితము స్మరణకు తెచ్చుచున్నది. ఇరువదేండ్లయిన నిండక మున్నే స్వాతంత్ర్యసంపాదనమునకు సమరోత్సాహమున నడుము బిగించి సత్యాదేవివలె రణరంగమున వీరప్రతాపము చూపించిన యన్నపూర్ణాదేవి అసామాన్య మానవతి, మహాయోధ యనుట నిస్సంశయము. పదునెన్మిదవ శతాబ్దమున శౌర్యసాహసములను, ప్రజాపాలనమునను నద్వితీయప్రతిభాశాలినియై, బ్రిటిషుసింహము వీసముల పట్టి యుఱ్ఱూఁత లూఁగించి సంగ్రామరంగమున వీరశయనముఁ జూఱగొన్న "మహారాణీ ఝాన్సీ లక్ష్మీబాయి"వలెనే ఈవీరనారియు జాతీయమహాసమరమున నసహాయశస్త్రధారిణియై, బ్రిటిషుసింగమును యుద్ధరంగమున నెదుర్కొని,

ప్రజాసేవకు ప్రాణముల నర్పింప మహాత్యాగినియై, తుద కాపోరాటమున తిన్న గాయములనుండి మఱి కోలుకో లేకపోయెను.

అన్నపూర్ణ కేవల వీరాంగనయే కాదు. సర్వ విధముల నేర్చుకోఁదగిన జీవితాదర్శములుగల సద్గుణముల ప్రోవు. హాస్యమునకైన ననృతమాడని సత్యవ్రత; దీనుల కొఱకు కటకటంబడు దయా కారుణ్యములు, గురుజనభక్తి, వినయవివేకములు, సర్వసమత్వము గల ఉత్తమభక్తిపరు రాలు; స్వధర్మనిరత; సాధుచరిత; పతివ్రత; అత్యంత సహనశీల: ఇత్యాదిసుగుణము లామెకు పెట్టని సొమ్ములు. ఇన్నిటికి మించిన నిరాడంబరత్వము. ఎంత భోగినియో అంత త్యాగిని యైనది. కనుకనే మహాత్ముఁడు "భారత పురంధ్రులలో నాకుఁ గల పుత్రికారత్నములలో నత్యుత్త మురా"లని పొగడినాఁడు. సదా స్మరింపఁదగిన యోగ్య తాపత్రముగదా యది ?

౧౯౨౩ లో శ్రీ బాపినీడుగారు చదువు ముగించి స్వదేశమునకు వచ్చిరి. అప్పు డామె ఓడవఱకు స్వదేశీ దుస్తులు గొంపోయి, అటనే పతికి ఖద్దరుదీక్ష నిచ్చి విదేశీసూట్లు, బూట్లు, హాట్లు అన్నియు సాగరమునఁ గలిపించెను. భర్తలకు త్యాగదీక్ష నిచ్చు భారతసాధ్వుల వలన ధన్యమైనది మాతృభూమి ! !

భార్యాభర్తలు చిరవియోగ సమావేశసౌఖ్యము కొంతయైన ననుభవింపకమున్నె ఆమెకు మరల జబ్బు చేసెను. అప్పు డా దంపతులు కలకత్తా వెళ్లిరి. ౧౯౨౪ లో ఆమెకు కుమారుఁడు కలిగెను. పుత్రోత్సవ మతి వైభవముగఁ జేసిరి. అందఱు "ఛోటాగాంధీ" యనిరి. మహాత్మ కూడ స్వయముగ వచ్చి ఖద్దరు కానుక పంపి దీవించెను. కాని దేవుఁడు తన భక్తురాలి ధైర్యస్థైర్యములఁ బరీక్షింపఁ గాఁబోలు, ౨౩ వ రోజుననే తా నిచ్చిన బిడ్డను తానే గైకొనెను. పుత్రశోకము గలంచుచున్నను ఆమె కర్తవ్యము నేమఱలేదు. కాని మఱల జబ్బు చేసెను. ౧౯౨౩లో వారు ఆరోగ్యార్థము పశ్చిమతీర్థాదియాత్రలకు వెళ్లిరి.

అపుడు నామె "శ్రీ రామకృష్ణ పరమహంస లీలామృతము" ౩ భాగములు వంగభాషనుండి అనువదించెను. "నారి" యను స్వతంత్ర గ్రంథరచనకుఁ బూని, భారతవర్షమున "స్త్రీస్థానము, స్త్రీల విలువ" నత్యుత్కృష్టముగ నిరూపించుచుఁ గొంత వ్రాసెను. "హృదయోచ్ఛ్వాస" మను గ్రంథ మనువదించెను. ఆరోగ్యము కొంచెము బాగుపడినది.

౧౯౨౮ సం. మార్చి ౧ తేది దేవీనీడుల చిర తపః ఫలముగ "ఝాన్సీ లక్ష్మిబాయి" యుదయించినది. మాతృసౌఖ్యము మనసార నొందకమున్నె పాండురోగము మరల విజృంభించె. ఎందఱో వైద్యులు! ఎన్నెన్నో దివ్యచికిత్సలు! తలిదండ్రులు, భర్తగారు ఆమె కిచ్చిన స్వేచ్ఛతో చేసిన సేవయు నిరుపమానము! కాని తుదకు మృత్యువే గెలిచినది. ౯-౧౧-౨౮ తేది ఉదయము ౬ గంటలకు (ప్రభవ సంవత్సరము ఆశ్వయుజ బ. చతుర్థి) అవివాళిమును ఆదేవి పవిత్రాత్మ నశ్వరలోకము వీడి పరమప్రియుఁడగు పరమేశ్వరునిఁ జేరెను.

ఆ బాల్యవీర నారీమణి, ఆ దీనబాంధవి ఆత్మదేశము కొఱకు ఆత్మత్యాగ మొనర్చినది. అది నిజముగా పర్వ దినము. ఆదేవి అభీష్టము లతిలోకసాధారణములు. ఆ ధీర సాధ్వి ఉత్తమాశయములు మహోన్నతమైనవి.

ఉన్నత స్త్రీ విద్యాలయనిర్మాణము, శిశుపాఠ శాల, అనాథశరణాలయ స్థాపనము, బీదలపెన్నిధి యను ఖాదీప్రతిష్ఠ, నిమ్నజాత్యుద్ధరణము, వివాహసంస్కారము, స్వరాజ్యసంపాదన—వ్రాయుటకు చిన్న సమాసము లే కాని నిర్వహణమున కెందఱిసార్థత్యాగుల నిర్మల జీవితములు బలిదానము కావలయునో! ఎందఱి దేశ భక్తుల పవిత్రరుధిరముచే జన్మభూమి ప్లావితము కావల యునో! ఎందఱి యుదార చరితుల పూజ్యదేహములచే స్వరాజ్యసౌధప్రాకారములు నిర్మింపఁబడవలయునో!

ధీరసాధ్వీమణులయం దగ్రేసరయై, బాలికలకు బాల్యత్వము, సతులకు సాధ్వీత్వము, వీరులకు శౌర్య తత్వము, కార్యశూరులకు క్రియాపరత్వము, కీర్తికాము లకు నిష్కామత్వము అధికముగ ప్రదర్శించి, ఆదర్శరూపి

తురాలై, తన యశూనజీవితకుసుమమును మాతృపాదారవిందములఁ సమర్పణముఁ జేసి, స్వరాజ్యస్వతంత్రసౌధమునకు పునాది యైచిన అన్నపూర్ణాదేవి నమస్కరాలు.

పరమభక్తవతంసుఁడగు ప్రహ్లాదుఁడు సర్వము హరిమయ మెనర్చెను. అఖిలదేశారాధక చూడామణి యగు అన్నపూర్ణాదేవి హరియే మహాత్ముఁడనియు, మహాత్ముఁడే దేశమనియు, దేశసేవయే విష్ణుసేవయనియు నాచరించి, "మహాత్మగాంధీ" తారకపఠనమున ముక్తి నందినది.

మహాత్ముని నిర్మాణకార్యక్రమమున ప్రధానమగు ఖద్దరుసేవకే ఆ యుదారశీల పవిత్రజీవయాత్ర పరిసమాప్తి నొందినది. ఆమె రెండవకోర్కె "ఉన్నత స్త్రీవిద్యాలయము." అందుల కాయమ సంస్థాపకురాలై నిర్వహించుమహాభాగ్య మీదేశాగ్యాంధ్రదేశమున కభాగ్యమైనది. ఆ భార మిప్పు డెవ్వరిది? కర్తవ్యపరాయణులగు నాంధ్రులందఱిది కాదా?

## "అన్నపూర్ణాదేవి జాతీయ పాఠశాల"
## (ఏలూరు)

దేవి స్మారకచిహ్నముగా గృహవిద్య, పరిశ్రమలు, జాతీయపాఠశాలలు నెలకొల్పఁదలంచిన స్మారకసంఘము వారు ఏలూరున పైపాఠశాలను స్థాపించినారు. అది ఈశ్వరాశీర్వాదమును, నిర్వాహకుల కార్యదీక్షయు, అభిమానుల సహాయబలమును తోడయి, వర్ధిల్లి చిరస్థాయిని యగుఁగాక!

## మహాత్ముని ప్రశంసావాక్యములు

'౧౯౨౧ వ సంవత్సరమున బెజవాడలో జరిగిన మహిళాసమావేశమున ఖద్దరువస్త్రధారిణియై సభాధ్యక్షపీఠమును నుత్సాహముతోడను, దీక్షతోడను, శాంతముగ నడపుచు తోడ్పడుచున్న సమయమున అన్నపూర్ణను ప్రథమమున సందర్శించితిని. ఆనాటి సమావేశమున ఖద్దరు ధరించిన దామె యొక్కతెయే. నాకు జ్ఞాపక మున్నంతవరకు తన యాభరణములను, చేతిగాజులను, హారములను మొట్టమొదట నర్పించిన దామెయే. "మీ తలిదండ్రుల యనుమతి నొందితివా" యని యాభరణములను దీసియిచ్చు సమయమున నామె నడిగితిని. "నా తలిదండ్రులు నన్నెపుడు నడ్డుపెట్టరు. నా యిచ్ఛవచ్చినట్లు చేయనిత్తురు," అని యామె బదులుచెప్పెను. అన్నపూర్ణాదేవి ఆంగ్లమున ధారాళముగ ప్రసంగించెను. ఆమె కలకత్తా బ్రహ్మ బాలికా శిక్షాలయమున విద్యాభ్యాసము గావించెను. ఆ మహాసమావేశమున నామె వాల్గనమూలల కేగి, ఆభరణములను, కానుకలను ప్రోగుచేసుకొని తెచ్చెను. నాటనుండి అసహాయోద్యమమున పాల్గొనుచు, తుట్టతుదకు తదర్థమై ఆత్మసమర్పణము గావించెను.

'ఆమెమరణమువలన భర్తరాలినే గాదు, కేవలము పుత్రికను గోల్పోయినట్లు భావించుచున్నాను. భారతపురంధ్రులలో పవేకులను నాపుత్రికలనుగా భావించుకొనగల భాగ్యము నాకు కలదు. వారందఱిలో నీమెయే నత్యుత్తమురాలు. ఆమె నిశ్చలభక్తితో, ఫలాపేక్ష వదలి, దేశసేవ గావించెను. ఆమెవలె భారతనారీమణులెల్లరును పవిత్రహృదయలై, పతివ్రతలై, అనురాగబలమునచే తమభర్తల ననుకూలురుగను, సన్మార్గవర్తులుగను గావింపవలయునని నాయభిమతము. నా యాదేశము ననుసరించి దేశసేవాకారణముననే యామె తన శరీరము శుష్కింపచేసికొనెనని బాపినీడుగారు నాపై మోపిన నింద సమంజసముగనే యున్నది. ఆమెవలె యువతీయువకు లనేకులు దేశారాధనమునందు ప్రాణసమర్పణము కావించిన గాని భారతదేశము మరల పూర్వమువలె పవిత్రమై, స్వతంత్రము కానేరదనుట నిస్సంశయము. అంత ధైర్యము, అంత చిత్తశుద్ధి, అంత దేశభక్తి కనబరిచిన అన్నపూర్ణాదేవికి స్థానికముగ స్మరణచిహ్నము నేర్పరచుట విధాయకమనుట నిర్వివాదము.'

---

# పెద్దవాళ్ల పిచ్చిమాటలు

పి. వేణుగోపాలు గారు

రెండుగా వంగిన శరీరము, ముడుతలుపడిన మొగము, మొగముపయి వ్రేలాడు పీచువంటి తెల్లని వెండ్రుకలు, చేతిలో తనకంటె కొంచెము పొడవైన కఱ్ఱ కలిగి, రాలనున్న పచ్చనిపండుటాకు ఆమె. ఊరిచివర నొక గుడిసెలో కాపురము. ఇంటిలో తాను, చిన్న మనుమరాలు.

ఊరికి పడమట నొకకొండ యున్నది.

సాయంకాలపు లేత యెండ. చేతికఱ్ఱ పట్టుకొని, మీది మెట్టుకు శిరస్సు తగులునో అన్నట్లు వంగినశరీరముతో ముదుసలి గబగబ కొండపయికి ప్రాకుచున్నది. ఇరుప్రక్కల నున్న వృక్షముల రామణీయకముగానీ, పక్షులకలకలముగాని ఆమెనాకర్షించుటలేదు. మధ్య మధ్య శిరస్సు నెత్తి యింకెంత దూరమో యని చూచును. పయికి పోవుకొలది సూర్యరశ్మి స్వేదసిక్తములయిన ఆమె తెల్లని వెండ్రుకలపయి బడుటచే హిమవత్పర్వత శిఖరమువలె అవి తళతళ ప్రకాశించుచుండెను. పయికి పోయి నలువంకల చూడకయే దక్షిణముగాపోయి ఆమెయొక బండవద్ద నిలిచెను. తన నేత్రములను బండదగ్గఱకు చేర్చి, పోగొట్టుకొనిన సూదిని వెదకినట్లు బండనంతయు మరల మరల పరిశోధించి, పడమటవైపు తిరిగి ప్రొద్దు జూచి గృహోన్ముఖురాలాయెను.

ఈమె యిట్లు బండచుట్టు ఏమో వెదకుట ఒక దినము ఆప్రాంతమున గొఱ్ఱెలు మేపుకొను బాలురు చూచి, ఆమె వెళ్లినతర్వాత యేమైనా దాచిపెట్టినదని బండచుట్టు త్రవ్వి చూచిరి కాని యేమీ అగపడలేదు. మరుసటి దినముకూడ ఆ వృద్ధురాలు అట్లు వచ్చి వెదకుట చూచి బాలురు ఆమెచుట్టు మూగి, "ఏమిటవ్వా, వెదుకుచున్నావు దినాను" అని అడిగిరి. ఆమె ఉత్తరము యివ్వక వెళ్లిపోన చూచె కానీ బాలురు ఆమెను పోనివ్వక బలవంతపెట్టిరి. అంత ఆమె "ఏమీ లేదు. నాయనా వినండి. మా తండ్రి మృత్యుకాలమునందు నన్ను దగ్గఱకు పిలిచి, 'అమ్మా! మన ఊరికి పడమటివైపునుండు కొండపయి దక్షిణ భాగమునందు ఒక పెద్దబండ ఉన్నది. దానిపయి ఎప్పుడు రక్తబిందువులు పడునో ఆరాత్రి పెద్దప్రళయము వచ్చి యీ ఊరు కొట్టుకొనిపోవును. మీరు లేచి పోవలయును. జాగ్రత్త' అని చెప్పెను. మాతండ్రిగారికి వారి తండ్రి చెప్పెనట. ఇట్లు ఎన్ని తరములనుండియో వచ్చుచున్నది. అందుచేత ప్రతిదినము సాయంత్రము నేను వచ్చి యీ బండను చూచిపోవుచున్నాను" అని చెప్పెను. బాలురందరు గొల్లున నవ్వుచుండ, ఆమె వినిపించుకొనకుండ తిరిగిపోయెను.

బాలురకు ఆమెను తమాషాచేయవలెనని పుట్టినది. మరుసటి దినము ఆమె వచ్చువేళకు ఉచ్చులువేసి కొన్ని పిట్టలను పట్టి తెచ్చి, వానిమెడలు విఱిచి—తమ తప్పిదము ఏమో ఆ పిట్టల కేమి తెలియును, ఎట్టి తప్పులకు అట్టి శిక్ష విధించెనో ప్రేమస్వరూపుడగు భగవంతుడు—బండనంతయు రక్తసిక్తము చేసిరి. తాము ఒకమూల దాగిరి.

ఎప్పటివలె ముసలిది వచ్చెను. బండ రక్తమయమై ఉండుట చూచెను. ఆమెగుండె అదిరెను. శరీరము కంపమెత్తెను. ఇంక అక్కడ నిలువలేదు. ఒక్క-విసరున ఇంటికి మరలినది. గుండె బాదుకొనుచు, యేడ్చుచు, 'ప్రళయము వస్తుంది. ఊరంతా లేచిపోండి' అని అఱచుచు, పిచ్చియెత్తినదానివలె ఇంటికి పరుగెత్తి, కుండ చట్టి మూటకట్టి నెత్తిన పెట్టుకొని, మనుమరాలిని తీసుకొని, ప్రళయము తన్ను వెన్నంటి వచ్చుచున్నట్లే పరుగెత్తెను. 'ప్రళయము, లేచిపోండి' అన్నమాట తప్పితే యితరులకు నిలిచి జవాబు కూడ చెప్పలేదు. ఊరి ప్రక్కన కొండపైనున్న శిథిలమంటపము చేరిన తర్వాత ఆమెమనస్సు స్తిమితపడెను.

బాలురు తమ యత్నము సఫలమైనందుకు గర్వపడిరి. బాలుర తెలివిని మెచ్చుకొను పెద్దమనుష్యులు కొందఱు; 'బలే తమాషా' అని కొందఱు; 'పాపము' అని పశ్చాత్తాపము చెందువారు కొందఱు. ఇరుగు పొరుగు వారు భుజించి వెన్నెలబయట పండుకొని, ముసలిదానికై వగచి తెల్లవాఱే ఆమెను పిలిచికొని రావలెనని అనుకొనిరి. ఊరంతయు ఆమె ప్రసంగమే చేయుచు, పిండి ఆరపోసినట్లు వెన్నెల కాయుచుండగా, పడుకొని నిద్రపోయిరి.

అర్ధరాత్రమయినది. చంద్రుడు మఱుగుపడి, చిమ్మచీకట్లు కమ్మినవి. పెనుగాలి వీచెను. దుమ్మురుమారము రేగెను. ఇండ్లకప్పులు ఎగిరిపోయెను. అందఱు 'గీ, గా' అని అఱచిరి. ఆకాశము గర్జించినది. మెఱసినది. కుంభవర్షము కురిసినది. ఇండ్లు వాకిళ్లు కూలినవి. ప్రవాహములో కొట్టుకొని పోయినవి.

వృద్ధురాలుకూడ ఊరిలో అఱపులు వినెను.

(జపాను మ్యాగజైను నుండి)



## తెలుఁగు కావ్యాదర్శము
## వివరించి వ్రాయవలదా?

సంగ్రహముగను, విస్తరముగను వ్రాసి విషయమును బోధించుట యనెడి సంప్రదాయము చిరకాలమునుండి యుండినట్లున్నది. తైత్తిరీయోపనిషత్తునందు మంత్ర బ్రాహ్మణరూపమునఁ జెప్పఁబడినవని భాష్యకర్తలు వ్రాయు సందర్భములు సంక్షేపవిస్తర రూపములుగనే పొడకట్టుచున్నవి. వివరించిచెప్పఁబడిన యంశమును "తదేష శ్లోకో భవతి" అని యుపనిషత్తు సంగ్రహించుచుండును.

మీమాంసాసూత్రములు, న్యాయవైశేషికసూత్రములు, పాతంజల యోగసూత్రములు, పాణినిసూత్రములు మున్నగు సూత్రగ్రంథము లన్నియు సంగ్రహకథనమునకే యేర్పడినవి. తర్వాత భాష్యకర్తలయు, వ్యాఖ్యాతలయు వాఙ్మయమంతయు విస్తరీకరించి చెప్పుటకే ప్రబలినది.

అలంకార శాస్త్రమునం గూడ ధనంజయుఁడు శ్లోకములను సంగ్రహముగ వ్రాసిన, ధనికుఁ డొకింత విస్తరీకరించి వ్రాసెను. ఆనందవర్ధనాచార్యులవారు అనుష్టుప్ శ్లోకములతో సంక్షేపముగ వ్రాసినదానిని ఆలోకమున వివరించిరి. తర్వాత వ్యాఖ్యారూపమున నభినవగుప్తపాదాచార్యులవారు మఱింత పెంచిరి. కావ్యప్రకాశాదులు నిట్లే యేర్పడె. వామనుఁడు సూత్రములు వ్రాసె. వ్యాఖ్యాతలు విపులముగ వ్రాసిరి. దండి మహాకవి కావ్యాదర్శమును సంక్షేపముగ వ్రాసినవాఁ డగు మూలకర్తలకు మార్గదర్శి యగు. దానికి వ్యాఖ్యాతలు చర్చలు సేయుచు వ్యాఖ్యానములు సవిస్తరముగ వ్రాసి లోకోపకార మొనర్చియున్నారు.

తెలుఁగున ననువదించుపట్టునఁ గూడ మన వారు విషయములనైనను సంగ్రహవిస్తరరూపములతోఁ బ్రసంచించుకొనుటయే యుపయోగకారిగఁ గన్పట్టెను. సంగ్రహగ్రంథములను సంగ్రహముగను, విస్తరముగ వ్రాసిన గ్రంథములను విస్తరముగను ఆంధ్రీకరించుకొనుటచే, సంస్కృతమునందువలెనే మూలగ్రంథములును, వ్యాఖ్యాపసంతతులును తెలుఁగు వాఙ్మయమునంగూడ వెల్లివిరిసి గ్రహణధారణలకు సులభమగు మార్గము విద్యార్థులకు సమకూడును.

వ్యాఖ్యానములు వ్రాయువారికి విపులముగ వ్రాయుట యెట్లు విధియో, మూలములు వ్రాయువారికి సంక్షేపముగ వ్రాయుటయు నట్లే విధి కావచ్చును.

## సంస్కృతములోని శబ్దములనే యేల వాడవలెను?

మూలకర్తల మాటలకు వ్యాఖ్యాతలు పలువురు పలువిధముల నర్థములు వ్రాయుపట్టున, భాషాంతరీకర్త యేయర్థమును బురస్కరించుకొని భాషాంతరీకరింపవలెను?

మూలకర్త మాటకు బహ్వర్థస్ఫూర్తి యుండినప్పుడును, సుప్రసిద్ధార్థములు గాని మూలపదములు వచ్చినప్పుడును భాషాంతరీకరణ మెట్లుండవలెను? అనువిట్టివి కొన్ని భాషాంతరీకర్త లందఱకును సమపదమును దగులుచుండెడివి. ఇట్టి చోటుల మూలకర్తమాటలనే తత్సమములుగనో, వీలయినఁ దద్భవములుగనో చేసి వాడినచో, భాషాంతరీకర్త వ్యాఖ్యాతల కందఱకు సమమాలుఁడై, మూలకర్త హృదయము ప్రకటితమగుట కడ్డము గలుగఁ జేయనివాఁడై, యుపకారి యనిపించుకొనఁ జనుకొనియెడు. అట్టి మాటల కర్థము సుబోధము కాదనెడి యాక్షేపణ

మొకటి కల్గవచ్చు. కాని వ్యాఖ్యానాపేక్షములగు శాస్త్ర గ్రంథముల యర్థము గ్రహించుటకు వ్యాఖ్యానముల సహాయము గావలసినదే యుండును. కాన ఆ యిబ్బందిని వ్యాఖ్యాతలు దీర్చవలసినవారై యుందురు. వ్యాఖ్యాతలు చేయవలసినవిపుల వర్చలన్నియు మూలకర్తలచేఁగాని, మూలాంధ్రీకర్తలచేఁగాని చేయఁబడవలెననుట న్యాయ్యము కాదు.

యతిప్రాసనియమములను బాటించుట కలవాటు పడియుండు వా రాంధ్రీకరించునపు డొక్కొక చోఁ గొంచెము క్లిష్టముగ నర్థస్ఫూర్తి యగుచుండును. ఒక బాసలోని యంశము నొక బాసలోనికి ఛందోబద్ధముగ యతిప్రాసములతోఁ దీసికొనిరావలెనన్న, మహాకవు లెవరికో తప్ప, సాధారణకవుల కెల్లరకు నీచిక్కు తప్పదేమో! గ్రంథము మొత్తముమీఁద లాతిపద్యరచన లన్నిటికంటెఁ గఠినమగుట లోపమగు. "సంస్కృతము సుగమము. దాని తెలుఁగు దుర్గమము." అను టెట్లు? సంస్కృతముఁ దెలిసికొనలేనివారి యుపయోగముకై తెలుఁగు సేయఁబడినది. అట్టివారికి సంస్కృత మెంత సులభముగ నున్నను దుర్గమమే కదా. అట్టివారే యీ తెలుఁగును జూచి మూలకర్త హృదయమును దెలిసికొనవలసినవారు. క్లిష్టముగ నున్న నొకించుక పరిశ్రమ మొనర్చి తెలిసికొందురు. అపరిచితములగు విభక్తులు, అవ్యయములు మున్నగువానిచే నించుకయు క్లేశము గాకున్న సంస్కృతములోని యాశయము తత్సమతద్భవాదిరూపముననున్న తెలుఁగులో నిముడుటు సాహిత్యాదులచేతనైన నాంధ్రుఁ డగువానికి సంస్కృతమునందువలె దుర్గ్రాహ్యము కాదు కదా.

## యతిప్రాస నియమములను బాటించి విషయమును దుర్గ్రహముఁ జేయ నేల?

వాడఁబడిన వర్ణములే మరల వచ్చుచుండుటయు, సదృశాక్షరములు వచ్చుచుంటయు నందమని తొల్లిఁటివారి యాశయము. అది యతిప్రాసనియమముచేఁ గొంత కాపాడఁబడునని వా రనుకొనిరి. అయ్యనుప్రాస రసికు లిప్పుడును గొందఱుండవచ్చు. యతిప్రాసములు ధారణ కొకింత పనికిరావచ్చు. శిథిలపత్రములఁ జేరి స్వరూపనాశముఁ బొందక యుక్తులలోఁ బద్యముల కీనియమ మొక్కప్పుడు జీవాతువు కావచ్చును. ఈయలవాటు విడఁజాలని వా రనేకులఁ దొల్లింటిజాణలు సుగమములగు గ్రంథములు వ్రాసిరి. ఇప్పు డట్టియలవాటు అర్థసౌలభ్యమునకుఁ బ్రతిబంధకమగునేని "యత్నతస్సంపరిక్షేయా తాః శబ్దార్థమహోర్మయః" అని చెప్పఁబడెడి యత్నమునకుఁ గొఱగాని రచయిత కాపాడింప వలసివచ్చును.

—అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి.

---

# పరిదేవనము

అల్లంరాజు రంగనాయకులు గారు

నాఁటి నడిరేయి వెన్నెలపాట తేనె
సోనల మునింగిపోవు నా శూన్యపుటెద,
నృత్య మొనరించు నీపాద నీరజములఁ
గొలిచి, తనివోని కౌఁగిలింతల నొకింత
మైమఱచి యుండ, లోలోన మామకీన
హృదయసరసిఁ గలంచి న న్నీవియోగ
వేదనానలజ్వాలల వేఁగిపోవ
వదలి యెట కేఁగితోయి, దేవా! హృదీశ!
అది మొదలు మూలమూలల నొదిఁగియున్న
మూఁగతలఁపులు బ్రతుకెల్ల ముసరుకొనఁగ
మరిగిమరిగి దుఃఖించి సామై కృశించి
క్రుంగిపోతి నిందాఁక; నెబ్బంగి నింక
మోతు నెడఁబాటుబరువు, నా మోడు టెడఁదఁ
గారుచిచ్చులఁ గాలు నెడారిదారి?

---

# శ్రీ గాంధి దంపతులు



శ్రీమతి కస్తూరిబాయి



మోహన్‌దాస్ కరంచంద్ గాంధి

# గాంధీమహాత్ముని షష్టిపూర్తి మహోత్సవము

భారతదేశమునం దంతటను అక్టోబరు 2-వ తేదీని జరుపబడెను.

——:o:——

## మోహనదాసు కరంచందు గాంధీజీ జీవితసంగ్రహము

### కుటుంబము

గాంధి కుటుంబమువారు మొదట పచారుదినుసులను అనగా కిరాణా సామగ్రులను విక్రయించుచుండి యుందురు. ఈ వస్తువుల నమ్మెడువారిని గుజరాతులోను, కాఠియవాడులోను గాంధులందురు. మహాత్ముని ప్రపితామహుడును అతని పితృపితామహులును కాఠియవాడులో కొన్ని సంస్థానములలో మంత్రులుగానుండిరి. మహాత్ముని పితామహుని పేరు ఉత్తమచందు గాంధి. అది వాడుకలో ఓతా గాంధిగా పరిణమించినది. ఇతడు రాజకీయకుట్రలవలన పోరుబందరు దివానుపనినివదలి జూనాఘడు సంస్థానమున కేగెను. అచట నవాబునకు ఎడమ చేతితో సలాము చేసెను. అటులేల చేసితివనగా కుడిచేయి యిదివరకే పోరుబందరుకు సమర్పింపబడెననెను. ఓతా గాంధికి ప్రథమ కళత్రమువలన నలుగురుపుత్రులు కలిగిరి. ఆమె చనిపోయిన పిమ్మట నతడు మరల వివాహము చేసుకొనెను. ఆమెవలన నిద్దరు పుత్రులు కలిగిరి. వీరారుగురిలో నైదవ వాడగు కరంచందుగాంధి (కబా గాంధి)యును, ఆరవ వాడగు తులసిదాసుగాంధియును ఒకరి తరువాత నొకరు పోరుబందరుసంస్థానమున ప్రధానామాత్యులుగా నుండిరి.

### మహాత్ముని తండ్రి

మహాత్ముని జనకుడు కబా గాంధి రాజకోటలో రాజుల తగవులను పరిష్కరించునట్టి రాజస్థానిక న్యాయస్థానమున నొక విచారణకర్తగానుండెను. కొంతకాలము రాజకోటలోను, పిమ్మట వాంకనేరులోను దివానుగానుండెను. చనిపోవునరకును రాజకోట వారాయనకు పింఛను నిచ్చుచునే యుండిరి. ఇతడు నాలుగు మారులు పెండ్లి యాడెను. ప్రథమ ద్వితీయ కళత్రములకు చెరియొక కుమార్తెయును, నాల్గవ భార్యయగు పుత్తలీబాయికి ఒక కుమార్తెయును, ముగ్గురు కొడుకులును పుట్టిరి. ఈమెయే మహాత్ముని జనని. మహాత్ముడీమెకనిష్ఠపుత్రుడు. మహాత్ముని తండ్రి కులాభిమాని, సత్యప్రియుడు, శూరుడు, ఉదారుడు గాని కోపిష్ఠి; లంచగొండి కాడు. ఇంటను, బయటనుగూడ నిష్పక్షపాతియగు న్యాయశీలుడు. సంస్థానముపై గాఢమగు నభిమానము కలవాడు. ఒకసారి పొలిటికల్ ఏజెంటు రాజకోటసంస్థానాధిపతి నవమానింపగా కబాగాంధి ఆ విదేశీయు నెదిరించెను. అతడు క్షమాపణ కోరుమనగా నిరాకరించెను. అతడు కొన్నిగంటలసేపు కబా గాంధిని కారాగారమున నుంచినను చలింపలేదు. చివర కాపాశ్చాత్యుడు కబాగాంధిని వదలివేసెను. ఆయనకు భగవద్భక్తి మెండు.

### మహాత్ముని జనని

పుత్తలీబాయి పరమసాధ్వి. మిగుల దైవచింత కలది. పూజచేయకుండ నొకనాడును భుజించియెరుగదు. నిత్యమును విష్ణ్వాలయమునకు పోవుట ఆమెకు వ్రతము. చాతుర్మాస్యవ్రతమును దీక్షగా యావజ్జీవమును సలిపెను. పెక్కునోములను నిర్విఘ్నముగా నోచినది. జబ్బుచేసినను ఆమె చాంద్రాయణవ్రతమును విడువలేదు. రెండుమూడు రోజులుగూడ ఆమె సులభముగా కృచ్ఛ్రోపవాసము లాచరించుచుండెను. ఏకభుక్తములు, ధారణాపారణలు, సూర్యుని జూడకుండ భుజింపకపోవుట మున్నగు పెక్కునియమముల నామె పట్టుదలతో నెరవేర్చెను. ఆమెకు వ్యవహారజ్ఞానము మెండు. సంస్థానవిషయము లన్నియునుగూడ నామెకు తెలియును. రాణులు మున్నగువారుగూడ నామెను ప్రశంసించుచుండిరి. ఆమె తనతో మహాత్మునిగూడ రాజాంతఃపురమునకు తరుచుగా గొనిపోవుచుండెను.

## జననము

సుదామపురి అను పేరుగల పోరుబందరున శుక్ల సంవత్సర భాద్రపద బహుళద్వాదశీ శనివారము 2-10-1869 నాడు మహాత్ముడు జనించెను.

## బాల్యదశ

ఏడేండ్లవరకును మహాత్ముడు పోరుబందరులోనే పెరిగెను. పిమ్మట, తండ్రికి రాజకోటసంస్థానమందు ఉద్యోగమైనది. మహాత్మునట నొకప్రైమరిస్కూలులో చదువవేసిరి. అట నుండి సబర్బనుస్కూలునందును పిమ్మట హైస్కూలునందును అతడు చదివెను. హైస్కూలుకు వెళ్లునప్పటికి మహాత్మునికి పండ్రెండేండ్ల వయసుండెను. మొదటినుండియు మహాత్ముడు సత్యనిరతుడే. బిడియమధికమగుటచే నితరులతో కలియువాడు గాడు. ఇల్లు, పాఠశాలతప్ప నితరస్థలముల నెరుగడు. ఇతరులతో మాటలాడవలసివచ్చునేమో యని యతడు పరుగిడుటయేగాని యెన్నడును నడుచుట లేనే లేదు. ఒకసారి పరీక్షలో దగ్గరనున్న బాలునిపలకను చూచి వ్రాయుమని ఉపాధ్యాయుడు సన్న చేసినను గూడ మహాత్ముడు సమ్మతింపలేదు. అటులని అతడు అవిధేయుడు గాడు. పెద్దలపట్ల చాలభక్తి గౌరవములు కలవాడు. వారిదోషము లతనిచెవుల బడినను వెంటనే మరచిపోవును. పఠనీయగ్రంథములను తప్ప ఇతర గ్రంథముల నెన్నడును చదువువాడు గాడు.

## వివాహము

1881-లో మహాత్మునకు పదమూడవయేటనే శ్రీమతి కస్తూరిబాయిగారినిచ్చి పెండ్లి చేసిరి. తత్పూర్వము రెండుసారులు ప్రధానము లైనవిగాని పెండ్లిజరుగక మునుపే ఆకన్యలిరువురును మృతినొందిరి. మూడవ ప్రధానము ఏడవయేటను, పెండ్లి పదమూడవయేటను జరిగెను. మహాత్మున కిద్దరన్న లున్నారని యిదివరకే తెలుపబడెను. పెద్దవాని కదివరకే పెండ్లియైనది. రెండవ అన్నకును, మహాత్మునకును, మహాత్ముని పెదతండ్రి కొడుకునకును ఏకముహూర్తమున వివాహములు నిశ్చయింపబడెను. శతవృద్ధులగు మహాత్ముని పెదతాతలు (తండ్రికి పెత్తండ్రులు) చూడగోరుటవలననే యీ మూడు వివాహములు నేకకాలమున జరుపబడెను. వివాహము పోరుబందరులో జరిగినది. రాజకోటనుండి అంచెగుఱ్ఱములబండిలో మహాత్ముని తండ్రి పోరబందరునకు వచ్చుచుండగా బండి బోల్తాపడి చాల గాయములు తగిలెను. కాని వివాహము ఆపబడలేదు. మహాత్ముడును శ్రీమతి కస్తూరిబాయిగారును సమవయస్కులు.

## గార్హస్థ్యము

మహాత్మునకు భార్యపై నత్యధికముగు ప్రేమగలదు. కస్తూరిబాయిగారికి చదువురాదు, అమాయిక, స్వతంత్ర, పట్టుదలకలది. మహాత్ముడే ఆమెకు విద్యనేర్పెను. పవిత్రనిష్ఠగల వానిని భగవంతుడే కాపాడు ననువిషయము మహాత్ముని జీవితమున నిరంతరమును నిదర్శనమగుచునేయుండెను. తలిదండ్రులకు సేవజేయవలెనను కోరిక మహాత్ముని కత్యధికముగా నుండెను. బాల్యమున నితడు సంస్కృతమునుగూడ కృష్ణశంకరపాండ్యా గారియొద్ద నభ్యసించెను.

## పితృనిర్యాణము

మహాత్మునికి పదునారవయేట పితృనిర్యాణము కలిగెను. అపుడు మహాత్ము డధికభక్తితో పితృసేవచేసెను. ఆయేడే శ్రీమతి కస్తూరీబాయి తొలిమారు గర్భవతియయ్యెను.

## సీమకు ప్రయాణము

మహాత్ముడు 1887 లో మెట్రిక్యులేషను పరీక్షలో నెగ్గెను. పిమ్మట భావనగరమున శ్యామలదాసుకాలేజిలో ప్రవేశించెను. కాని త్వరలోనే దానిని విరమించి బారిష్టరు పరీక్షకు చదువుటకు 4-9-1888 వ తేదీని బొంబాయినుండి స్టీమరులో మహాత్ముడు ఆంగ్లదేశమునకు బయలుదేరెను. ఆంగ్లదేశమునందుకూడ మహాత్ముడు శాకాహార వ్రతమును భద్రముగా కాపాడుకొనెను. బ్రహ్మచర్యమును, ఏకపత్నీవ్రతమును నిలుపుకొనగలిగెను. అచట లండను యూనివర్సిటీలోను, ఇన్నరు టెంపిలులోను చదివెను.

## బారిస్టరు పట్టము

10-6-1891 వ తేదీని మహాత్మునకు బారిష్టరు పట్టము నొసగబడెను. 11 వ తేదీని ఇంగ్లండు హైకోర్టులో పేరు నమోదు చేయబడెను. 12 వ తేదీని మహాత్ముడు ఆంగ్లదేశమునుండి బయలుదేరెను.

## మాతృవియోగము

మహాత్ముడు ఆంగ్లదేశమునం దుండగానే మాతృవియోగము కలిగెను. కాని అతడు బొంబాయి చేరువరకు నతని కా విషయము తెలియదు. అప్పుడచట అతని జ్యేష్ఠసోదరు డెరిగించెను. పిమ్మట 1891-లోనే మహాత్ముడు బొంబాయిలో న్యాయవాదిగా పనిచేయ నారంభించెను. పిమ్మట రాజకోటలో కొంతకాలము న్యాయవాదిగా నుండెను.

## దక్షిణాఫ్రికాకు వెళ్లుట

దాదా అబ్దుల్లాకంపెనీవారిచే నియమింపబడి 1893లో మహాత్ముడు దక్షిణాఫ్రికాకు వెళ్లెను. అచట నెటాలుకు ముఖ్యపట్టణమగు దర్బనులో స్టీమరు దిగినవాడే భారతీయులపట్ల తెల్లవారు చూపుచున్న నిరసనము మహాత్మున కవగతమయ్యెను. అచట భారతీయులను కూలీలని పిలిచెదరు. భారతీయ వర్తకులను కూలి వర్తకులందురు గాన మహాత్మునకు కూలి బారిష్టరను బిరుదులభించినది. అచట తలపాగ తగవుకూడ కలిగెనుగాని మహాత్ముడు దక్షిణాఫ్రికాలో నున్నంతకాలమును తలపాగనె ధరించుచుండెను. దర్బనునుండి ప్రిటోరియా వెళ్లునపుడు రైళ్లలోను, హోటలులలోను నల్లవారికిని తెల్లవారికిని గల భేదము మరింత స్పష్టమైనది. మహాత్ముడు చాల కష్టకష్టములకు పాలైనను చలింపకుండ నిలిచి భారతీయులగౌరవమును నిలువబెట్టుటకు పూనుకొని కృతకృత్యుడయ్యెను. భగవదనుగ్రహమున మహాత్ముడు రాజీమార్గమున అబ్దుల్లానేటుగారి దావాను గూడ పరిష్కరింపగలిగెను. పిమ్మట 1894-లో నచటి భారతీయుల కోరికపైని మహాత్మును భారతీయుల హక్కులకై పోరాడ నారంభించెను. మహాత్ముడు నెటాలుకోర్టులో న్యాయవాదిగా పనిచేయుటకు సుప్రీముకోర్టువారి అనుమతిని వేడగా నచటి పాశ్చాత్యులు తీవ్రముగా ప్రతిఘటించినను గూడ సుప్రీముకోర్టువా రనుమతినొసంగిరి. ఆసం॥వందే మహాత్ముడచట నెటాలు యిండియను కాంగ్రెసు నేర్పరచెను. దానికి కొన్ని యేండ్లపాటు కార్యదర్శిగా నుండెను. నెటాలులో మంచి ప్రాక్టీసు యేర్పడెను. 1896 వ సంవత్సరమున మహాత్ముడు మరల భారతదేశమునకు వచ్చెను. భారతదేశమున దక్షిణాఫ్రికాలోని భారతీయులనుగూర్చి అధికమును ప్రచారము గావించెను. బొంబాయిలో ఫిరోజిషా మెహతాగారిని దర్శించెను. అచట బహిరంగసభలో నుపన్యసించెను. పూనాలో లోకమాన్యుని, గోపాలకృష్ణుని (గోఖలే) సందర్శించెను. మదరాసులో జి. సుబ్రహ్మణ్యయ్యరు, డాక్టరు సుబ్రహ్మణ్యయ్యరుగార్లతో ముచ్చటించెను. కలకత్తాలో సురేంద్రనాథు, సర్ ప్యారీమోహన ముకర్జీ, మహారాజా టాగోరుగార్లు మున్నగువారిని, పత్రికాధిపతులను సందర్శించెను. పిమ్మట ఆలుబిడ్డలతో మరల దక్షిణాఫ్రికాకు బయలుదేరెను. 18-12-1896 వ మహాత్ముడు కుటుంబముతో డర్బనుచేరెను. అపుడే తెల్లవారతనిపట్ల చాల దౌర్జన్యమును చూపిరి. మూడు నాలుగు రోజులవరకును పోలీసువారు మహాత్ముని కాపాడవలసివచ్చెను. ధైర్యసాహసములు గల పోలీసు సూపరింటెండెంటు భార్యయే అపుడు మహాత్ముని ప్రాణములను కాపాడెను. దక్షిణాఫ్రికాలో మహాత్మున కిద్దరు పుత్రులు జనించిరి. 1901 వ సంవత్సరమునుండి మహాత్మకు స్వదారారతినిగూడ పరిత్యజించి బ్రహ్మచర్య మవలంబించెను.

## బోయరుయుద్ధమున గాయములు తగిలినవారికి సేవచేయుట

1899లో బోయరులకును బ్రిటిషువారికిని యుద్ధము సాగినపుడు మహాత్ముడు ఇండియా అంబ్యులెన్సుకోరు నేర్పరచి తోడ్పడెను. అపుడు దొరతనమువారు మహాత్ముని గౌరవించిరి.

## స్వదేశాగమనము

1901లో మహాత్ముడు నెటాలునుండి బయలుదేరగోరినపుడు అచటి భారతీయులు చాలనగలను కానుకగా నిచ్చిరి. వానినన్నిటిని మహాత్ముడు ప్రజాసేవకే వినియోగించెను. పిమ్మట కలకత్తాలో జరిగిన కాంగ్రెసుమహాసభలో దక్షిణాఫ్రికా భారతీయులను గూర్చిన తీర్మానము నుపపాదించెను, అది ఆమోదింపబడెను. పిమ్మట గోఖలేగారితో కలకత్తాలో నెలదినములుండెను.

## మరల దక్షిణాఫ్రికా వెళ్లుట

మహాత్ముడు మరల బొంబాయిలో ప్రాక్టీసుచేయ నారంభించెను గాని వెంటనే మరల దక్షిణాఫ్రికాకు పోవలసివచ్చెను. 1903 లో మహాత్ముడు ట్రాన్సువాలు బ్రిటిషు

ఇండియను అసోసియేషను నేర్పరచెను. ట్రాన్సువాలు సుప్రీముకోర్టులో అటార్నీగా పనిచేయ నారంభించెను. ఆవత్సరమే అనట ఇండియను ఒపీనియను అను పత్రికను ప్రారంభించెను. 1904 లో ఫోనిక్సు ఆశ్రమమును నెలకొల్పెను. 1906 లో జూలూలు తిరుగబడినపుడు గూడ మహాత్ముడు డోలీవాహక దళము నేర్పరచి బ్రిటిషువారికి తోడ్పడెను. 11-9-1906 వ తేదీని ఆంగ్ల దేశమున కేగి ఆంటీ ఆసియాటిక లీగును గూర్చిన చట్టమును రద్దుచేయవలెనని అధినివేశముల మంత్రినికోరి సఫలుడయ్యెను.

## సాత్విక నిరోధము

అప్పుడే సాత్వికనిరోధ మనబడు ప్రారంభింపబడెను. ఆనటి భారతీయులు దానిని ఎనిమిదేండ్లపాటు జయప్రదముగా కొనసాగించిరి.

1907 లో మహాత్ముడు మున్నగువారు అరెస్టుచేయబడిరి. ఆరునెలలు కఠినశిక్ష పడెను. పిమ్మటనె స్మట్సు-గాంధీ ఒడంబడిక జరిగెను. మరి రెండుసారులుగూడ నటుల మహాత్ముడు చెరసాల కేగెను. 1909 లో మహాత్ముడు ఆంగ్ల దేశమునకేగి ప్రచార మొనరించెను. 1912 లో గోఖ్లేగారు దక్షిణాఫ్రికాకు వెళ్లిరి. కాని అచటి పాశ్చాత్యులు 1913 లో మరల వాగ్దానమును భంగపరచుటచే 1913 సెప్టెంబరులో మహాత్ముడు మరల సాత్విక నిరోధమును ప్రారంభించెను. పిమ్మట 1914 లో మహాత్ముడు సతీసమేతుడై ఆంగ్ల దేశమున కేగి ఐరోపా మహాసంగ్రామమున బ్రిటిషువారికి సహాయము చేయుటకు ఇండియను వలంటీరు అంబులెన్సుకోరును లండనులో నేర్పాటుచేసెను. కాని మహాత్మునకు తీవ్రముగ వ్యాధికలుగుటచే 1915 ప్రారంభమున భారతదేశమునకు వచ్చెను. 1915 జనవరి మొదటి తేదిని సార్వభౌముడు మహాత్మునకు కేసరీ హిందూస్వర్ణపతకము నొసగెను.

## సత్యాగ్రహాశ్రమము

అహమదాబాదులో సత్యాగ్రహాశ్రమము నేర్పరచెను. భారతదేశమునందంతటను సంచారముగావించెను. చాంపరాను లో తోటలవారి నిరంకుశత్వము నంతరింపజేసెను. 1917 డిశంబరులో బీహారుశాసనసభలో దీనిని గూర్చిన చట్టము గూడ ఆమోదింపబడెను. 1918లో రాజప్రతినిధి జరిపిన యుద్ధసభకు వెళ్లి పిమ్మట ఖైడాలో ఐరోపా మహాసంగ్రామమునకు సైనికులను సమకూర్చెను. రౌలటుచట్టములను నిరసించుచు, 28-2-1919 ని మహాత్ము డొక ప్రకటనచేసెను. దేశమునందంతటను సత్యాగ్రహసంఘము లేర్పరుపబడెను. 10-4-1919 వ తేదీ ఉదయమున మహాత్ముడు ఢిల్లీకి వెళ్లుచుండగా కోశివద్ద అరెస్టు చేసి 11 వ తేదీ మధ్యాహ్నము బొంబాయికిగొనివచ్చి వదలివేసిరి. కాంగ్రెసు వారిచే నియమింపబడిన పంజాబు దౌర్జన్యముల విచారణ సంఘమున పాల్గొనెను. ఖిలాఫతు ఆందోళనమున మహమ్మదీయులకు తోడ్పడెను. 1919 లో జరిగిన అమృతసరు కాంగ్రెసులో చాలమంది ప్రతికూలురుగా నున్నను మాంటేగుఫర్డు రాజకీయ సంస్కరణములను కొనసాగింపవలెనని పట్టుపట్టి కృతకృత్యుడయ్యెను. 14-6-1920 వ తేదీని రాజప్రతినిధికి అసహాయోద్యమమును గూర్చి వ్రాసెను.

## అసహాయోద్యమము

1-8-20 వ తేదీని కేసరీ హింద పతకములను త్యజించి మరల ప్రభుత్వమునకు పంపివేసెను. 1920 సెప్టెంబరులో కలకత్తాలో జరిగిన స్పెషలుకాంగ్రెసులో మహాత్ము డుపపాదించిన అసహాయోద్యమ తీర్మాన మామోదింపబడెను. 1921 మేనెలలో రీడింగు ప్రభువుతో సంభాషించెను. 17-11-1921 ని యువరాజుగారు బొంబాయి వచ్చినపుడు ప్రజలు దౌర్జన్య మొనరింపగా మహాత్ముడు నిరశనదీక్ష బూనెను. యువరాజు సన్మానించుటలో దేశీయులు పాల్గొన గూడదని మహాత్ముడు ప్రకటించుటచే దేశమునందంతటను హర్తాళులు జయప్రదముగా జరుపబడెను.

## అరెస్టు - శిక్ష

మహాత్ముడు బార్డోలీలో సార్వజనిక శాసనోల్లంఘనమును ప్రారంభింపనుండగా 14-2-22 వ తేదీని చౌరీచౌరా దురంతములు జరుగుటచే మహాత్ముడు శాసనోల్లంఘనమును విరమించెను. 10-3-22 న మహాత్ముని బ్యాంకరుగారిని అరెస్టు చేసిరి. 8-3-22 శనివారమునాడు అహమదాబాదు సెషన్సు కోర్టులో విచారణ జరిగినది. 53 వ ఏట మహాత్మునకు ఆరేండ్లు శిక్ష వేయబడెను.

## స్వరాజ్యపక్షము

మహాత్ముడు చెరసాలలో నుండగా, శాసనసభాప్రవేశమునుగూర్చి దేశబంధు దాసు పక్షమువారు 1922 డిశంబరులో గయలో జరిగిన కాంగ్రెసుమహాసభలో నుపపాదించిన తీర్మానము నెగ్గలేదు. అంతట వారు స్వరాజ్యపక్షము నేర్పరచిరి. 15-9-23 వ ఢిల్లీలో జరిగిన స్పెషలు కాంగ్రెసులో మౌలానా మహమ్మదాలీగారి సూచనప్రకారము శాసనసభాప్రవేశమున కనుమతి యియ్యబడెను. 1923 లో కాకినాడలో జరిగిన కాంగ్రెసుమహాసభలో ఆతీర్మానము స్థిరపరుపబడెను. 1924 జనవరిలో వారు శాసనసభలలో ప్రవేశించిరి.

## మహాత్ముని అస్వస్థత - విడుదల

ఎరవాడ చెరసాలలో మహాత్మునకు అపెండిసైటిసు అను వ్యాధి కలిగిన దనువార్త 13-1-1924 వ తేదిని వెల్లడియైనందున దేశముట్టుడికిన ట్టుడికినది. పూనాలోని సాసూను వైద్యశాలకు మహాత్ముని పంపించిరి. అచట కర్నలు మాడకుగారు శస్త్రచికిత్స గావించిరి. ఈవ్యాధి కలిగిన దనుకారణముననే ఆరేండ్లును పూర్తికాకపోయినను ఎట్టిషరతులను కోరకుండనే దొరతనమువారు మహాత్ముని విడుదలచేసిరి. 10-3-24 వ తేదీని మహాత్ముడు వైద్యశాలను వదలి బొంబాయికి చేరువనున్న జుహూ అను ఆరోగ్యస్థానమునకు వెళ్లెను. అచట మూడునెల లుండెను. అచటనుండగానే మరల ఎంగుయిండియా నవజీవన్ పత్రికలకు వ్యాసములను వ్రాయ నారంభించెను. తాను చెరసాలలో నుండగా దేశమునందు కలిగిన మార్పు లంతవరకును మహాత్మునకు తెలియవు. అపుడు మహాత్ముడు ఈ మార్పులకు చాల చింతించెనుగాని మరల అసహాయోద్యమమును నిర్మాణవిధానమును గూర్చియే పట్టుదలతో వ్రాయసాగెను. కాని దాసు పక్షమువారి ప్రయత్నముల కట్టి నిరోధమును కలిగింపలేదు. 1924 జూను నెలలో అహమదాబాదులో భారత కాంగ్రెసు స్థాయిసంఘసభ జరిగినది. ఆసభలో మహాత్ముని తీర్మానములే ఆమోదింపబడెను. కాని ప్రజాభిప్రాయము ప్రతికూలముగా నున్నదని మహాత్ముడు గ్రహించి స్వరాజ్య పక్షముతో రాజీ పూర్వకముగ తీర్మానమును మరల నామోదింపవలెనని సభవారిని కోరగా ఆతీర్మాన మామోదింపబడెను. సభ్యులలో చాలమంది దౌర్జన్యరాహిత్యమును గూడ నామోదించుట లేదని ఆసభలో వెల్లడియగుటచే మహాత్మునకు అధికమగు సంతాపము కలిగెను. క్రమముగా కాంగ్రెసు రాజకీయములను త్యజించి ఖద్దరు విషయమున పనిచేయ నారంభించెను.

## రక్తపుపోటు

పూనాప్రాంతమున సంచారము జరుగుచుండగా రక్తపుపోటువలన మహాత్మున కాకస్మికముగా ప్రబలమగు నస్వస్థత కలిగినది. అపుడు మహాత్ముడు అందు సంస్థానాధిపతిచే సత్కృతుడై కొద్దిరోజు లచట నివసించెను. పిమ్మట మైసూరు సంస్థానమువారి సపర్యల గైకొని కొన్ని నెలలపాటు నంది కొండలపైని పిమ్మట బెంగుళూరులోను నివసించెను.

## 21 రోజులు ఉపవాసము

దేశమున హిందూమహమ్మదీయ కలహములు ప్రబలుటచే నైకమత్యమును కలిగించుటకొరకు 18-9-24 మొదలు ఢిల్లీలో 21 రోజులు మహాత్ముడు నిరశనదీక్ష బూనెను.

## అసహాయోద్యమమును విరమించుట

23-10-24 న రీడింగుప్రభువు రౌలటుచట్టమును మరల ప్రయోగించెను. సుభాషుచంద్రబోసుగారు మున్నగువారిని అరెస్టుచేసిరి. అపుడు మహాత్మునకును స్వరాజ్యపక్షమునకును ఒడంబడిక జరిగినది. ఈ ఒడంబడిక తీర్మానము 1924 డిశంబరులో మహాత్ముని అధ్యక్షతక్రింద బెల్గాములో జరిగిన కాంగ్రెసుమహాసభలో స్థిరపరుపబడెను. కాంగ్రెసుసంఘములు స్వరాజ్యపక్షమునకు వశపరుపబడెను. 16-6-25 వ దేశబంధు దాసుగారు మృతినొందిరి. స్వరాజ్యపక్షమున రెండు చీలిక లేర్పడెను. తురుష్కుల విజయముతో ఖిలాఫతు సమస్య పరిష్కరింపబడెను.

## అధినివేశస్వాతంత్ర్యము

1928 డిశంబరులో కలకత్తాలో పండిత మోతీలాలు నెహ్రూగారి అధ్యక్షతక్రింద జరిగిన 43 వ కాంగ్రెసుమహాసభలో నెహ్రూ నివేదిక ఆమోదింపబడుటకు మహాత్ముని పలుకుబడియే ముఖ్యకారణము. మహాత్ముడు మరల రాజకీయములందు ప్రవేశించి అధినివేశ స్వాతంత్ర్య తీర్మానము నుపపాదించెను. దీనిని బ్రిటీషువారు 31-12-29 వ తేదీలోగా నెరవే

ర్పనిచో 1-1-30 వ తేదీని సంపూర్ణస్వాతంత్ర్యవాది నని ప్రకటించెదనని శపథముచేసెనుగాన నాతీర్మానమును, నెహ్రూ నివేదికయునుగూడ నామోదింపబడెను.

## సత్యాగ్రహము ఆచరణలోనికి వచ్చుట

పంజాబులో గురుద్వారముల కొరకు అకాలీసిక్కులు సత్యాగ్రహమొనరించిరి. తిరువాన్కూరులో వైకమునందును, గుజరాతులో బోర్సదుతాలూకాలోను, మధ్యరాష్ట్రములలోను, నాగపూరులోను వంగరాష్ట్రమున పటుకాలీలోను సత్యాగ్రహము ఆచరణలోనికి తేబడెను.

## బార్డోలీ సత్యాగ్రహము

మహాత్ముని ముఖ్యశిష్యులలో ప్రధానులగు సర్దారు వల్లభాయి పటేలుగారు మహాత్ముని సలహా ప్రకారము నాయకత్వము వహించి బార్డోలీ సత్యాగ్రహమును జయప్రదముగా నెరవేర్చిరి.

## అఖిలభారత తంతుకారక సంఘము

1925 లో మహాత్ముడు అ. భా. తంతుకారక సంఘము నేర్పరచెను. దేశమునందంతటను శాఖాసంఘము లేర్పరుపబడెను. ఖద్దరు కత్యధికముగ అభివృద్ధికలిగెను. ఈ సందర్భమున మహాత్ముడు దేశమునందంతటను సంచారముచేసి ధనమును సమకూర్చుచున్నాడు.

బర్మా సింహళ ద్రవిడ ఆంధ్రరాష్ట్రములందు మహాత్ముడు సంచారముగావించెను. మైసూరు రాష్ట్రమునందుగూడ సంచార మొనరించెను. ఇపుడు సంయుక్తరాష్ట్రములందు సంచార మొనరించుచు కాన్పూరు కాశీనగరముల కేగి కాశీనగరమునుండి 28-9-29 ని జరిగిన భారతకాంగ్రెసు స్థాయిసంఘసభ కొరకు లక్నో వెళ్లెను.

## లాహోరుకాంగ్రెసు మహాసభాధ్యక్షత

1929 డిశంబరులో లాహోరులో జరుగనున్న మహాసభకు రాష్ట్రీయసంఘములును, సన్మానసంఘమునుగూడ మహాత్మునే అధ్యక్షునిగా నెన్నుకొనెనుగాని మహాత్ము డంగీకరింపలేదు. 28 తేదిని లక్నోలో జరిగిన భా. కాం. స్థాయిసంఘసభలో గూడ మహాత్ము డంగీకరింపనందున పండిత జవహరలాలు నెహ్రూగారిని అధ్యక్షునిగా స్థాయిసంఘమువా రెన్నుకొనిరి.

## షష్టిపూర్తి దినము

2-10-29 తేది నాడు మహాత్ముడు కాశీనగరమున బాబూ భగవాన్ దాస్‌గారి ఆతిథ్యమున నుండిరి. దేశమంతటను సభలు జరుపబడి షష్టిపూర్త్యుత్సవము సందర్భమున వారి దీర్ఘాయుస్సు కొఱకు ప్రార్థనలు గావింపబడెను.

---

## రాట్నము

కవిరాజ శ్రీ రాజా వత్సవాయ వేంకటనీలాద్రి రాజుగారు

రాట్నమా యిది కాదు రాజకీయాశయోత్తుంగ భారత కామధేనువు గాని
యేకులా యివి గావు హిందూజనానూన కామధుక్స్తన చూచుకములు గాని
వడుకుటా యిది గాదు వర్ణ్యమానవకామ నైచికీ నవదోహనంబు గాని
నూలుపో గిది కాదు సూత్నభారతకామ సౌరభేయీ పయోధార గాని
కాదు కా దిది కదురుధ్వంకారరవము - సకలభారతవర్ష ప్రజాసుజాత
దీప్రకామగవీ నవీనప్రదోహ - భవఘుమంఘుమ ఘుంఘుమారవము గాని.

---



దక్షిణాఫ్రికాలో కారాగృహమున నున్నప్పటి వైఖరి



యౌవనదశలోని వైఖరి



ఉత్తరీయమును ధరించిన వైఖరి



కటివస్త్రధారిణము-సంపూర్ణవిగ్రహము



దక్షిణాఫ్రికానుండి భారత దేశమునకు వచ్చిన క్రొత్తలోని వైఖరి



కటివస్త్రధారణ వైఖరి



బారిస్టరుగా
ప్రాక్టీసు చేయుచున్నప్పటి వైఖరి



మహాత్ముని
పాశ్చాత్యనాగరకతా వైఖరి



గాంధిటోపీని ధరించిన వైఖరి



ఆశ్రమవాసియగు గాంధి



మహాత్ముడు-యంగుఇండియా పత్రిక సంపాదకుడు



చిరునగవుతో నమస్కరించుచుండుట



సన్మానసభలో ప్రత్యుత్తరమును చదువుచున్న రీతి

# పెమ్మసాని వీరతిమ్మానాయడు

[పెమ్మసాని తిమ్మానాయనిని గురించిన యీ క్రింది వృత్తాంతము స్థానిక చరిత్రలలోనుండి గ్రహింపబడినది. అధికారముకను రాక పూర్వము ఆవంశమువారి వృత్తాంతమును, వారికి పెమ్మసాని వారను పేరు కలిగినవిధమును, వారినామములను గూర్చి తెలుపుచుండుటచేత చరిత్రపాఠకుల కిది కొంత యుపయుక్తముగను, ముచ్చటగను నుండకపోదని తలంచి దాని నిచ్చట పొందుపఱచుచున్నాను.— మ. సోమశేఖరశర్మ.]

ప్రౌఢ దేవ మహారాయలవారి కాలంలో పావురేళ్ల తిమ్మానాయడు (రాయలవారియాజ్ఞననుసరించి) మూడకిగ్రామానికి వచ్చి గ్రామంలో కిల్లా ఆవరణం యేర్పరిచి... 20 మంది శిబ్బందిని వుంచుకొని కిల్లాలో తమ యిల్లుకట్టించి గ్రామంబస్తీ చేసుకుంటూ పొలం కిర్దు చేసుకొని అనుభవించుకుంటూ వుండెను. పావురేళ్ల తిమ్మానాయణికి కొమాళ్లు లేనందున తన యిలవేల్పు వీరభద్రుణ్ని వేడుకుంటే కొమారుడు కలిగినట్టయితే నీపేరు పెడుతూ వున్నామని చెప్పి నిత్యమున్ను భక్తిపూర్వకంగా వీరభద్రస్వామిని శేవచేసుకుంటూ వుండగా కొన్నిదినములకు శ్రీస్వామివారి అనుగ్రహం వల్ల కొమారుడు కలిగెను. ఆకొమారునికి పేరు వీరతిమ్మానాయడని పేరుపెట్టి శ్రీస్వామివారికి సకలవైభవములున్ను జరిగిస్తువుండెను. అప్పుడు గ్రామానకు పశ్చిమం వకకోసుమీద వక వూరు తమతల్లిపేరట వెంకటాపురం అనే గ్రామం కట్టించి భావి తొవ్వించెను. తర్వాత కొన్నాళ్లకు ఆపావురేళ్ల తిమ్మానాయనికి కాలంసమీపించేటప్పటికి తనకుమారుణ్ణి పిలిపించి మహాదేవభట్ల కుమారుడైన చెన్నరాజును పిలిపించి లోగడ రాయలవారి ఆజ్ఞ తీసుకొని మీతండ్రిగారున్ను మేమున్ను వచ్చి గ్రామం కోటకట్టించి చుట్టు రెండుపల్లెలు కట్టించితిమి. పొలం తెగుబడి అవుతూవున్నది. యిక్కడిసంగతులు రాయలవారితో విజ్ఞాపన చెయ్యవలెననివుంటిమి యింతలో తనకు కాలం పరిపక్వమాయనుగనుక మీతో వున్నపూర్వోత్తరం చెప్పితిని గనుక మీరు బుద్ధిమంతులై రాయలవారి సన్నిధికిపోయి ముందు జరుగవలసిన్ని కార్యములకు నిర్వాహకం చేసుకోవలసినదని వుభయులకు చెప్పి తిమ్మానాయడు స్వర్గస్థుడాయను............(తండ్రిమాటలను బట్టి) విజయనగరానకు పోయి శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాపకృష్ణదేవ మహారాయలు వజ్రసింహాసనాసీనులై పృధివీరాజ్యంచేయుచుండగా వీరతిమ్మానాయడు కొలువుకుపోయి దండం సమర్పించి పరాకా- నేను పెమ్మసాని వీరతిమ్మానాయణ్ని మాతండ్రి పావురేళ్ల తిమ్మానాయడు..........అని చెప్పినందున అప్పుడు రాయలవారు అనుజ్ఞ యిచ్చినది యేమంటే మొదట పావురేళ్ల తిమ్మానాయని కుమారుణ్ని అనిచెప్పి తర్వాత

పెమ్మసాని తిమ్మానాయణ్ని అని చెప్పినావు. యీ రెండు పేర్లు యేల చెప్పితివని అడిగినందున అప్పుడు తిమ్మానాయుడు తిరిగి మనవిచేశిన వైనం—పరాకా-లోగడ రాయలవారు మా తండ్రిని పావురేళ్ల మీద కొలువుంచి వుండగా పావురేళ్ల తిమ్మానాయుడు అని పేరువచ్చెను. పూర్వాన్నుంచి మాయింటిపేరు పెమ్మసాని వారు అయినందున పెమ్మసానితిమ్మానాయుడు అనేపేరు పూర్వంనుంచి కలిగివున్నది గన్క—పావురేళ్ల తిమ్మానాయుడి కుమారుణ్ని అని చెప్పితే యేలినవారికేమి యేలినవారిమంత్రులు మొదలైనవారికేమి సులభంగా తెలుసునని తలచి ఆప్రకారం మనవిచేసినానని చెప్పుకున్నందుకు రాయలవారు చదురున కూర్చునేటందుకు ఆజ్ఞ చేసిరి. అప్పుడు యీవీర తిమ్మానాయుడు తిరుగా రాయలవారికి దండం సమర్పించి పరాకా—మామూలపురుషుడు ఆలం వెంకటపతి నాయడనేవాడు—నెలదినముల శిశువు అయివుండగా తల్లి తండ్రి యిద్దరు కాలం చేశినందున వారి యింట్లో వుండే పెమ్మసాని అనే బోనగత్తె ఆ శిశువును యెత్తి పెంచినందున అప్పుడు పెమ్మసాని వెంకటపతినాయడని పిల్వబడుతూ వచ్చిరనిన్ని యీ వెంకటపతినాయుడి కుమారుడే మా తండ్రి అయిన పెమ్మసాని తిమ్మానాయుడు అనిన్ని నాపేరు వీరతిమ్మానాయుడు అనిన్ని వివరించెను.

యితనియందు రాయలవారు కరుణించి వుండగానే మరికొన్ని దినములకు కార్యం ప్రసక్తి అయినందున యీ వీరతిమ్మానాయణ్ణి పిలిపించి కొంతసైన్యం యిచ్చి నీవు యీ కార్యం ఫత్తే చేసుకొని రమ్మని శెలవు యిచ్చినందున అదేప్రకారం కార్యభారమందు మహాన్నతు చేశి జయప్రదం చేసుకుని వచ్చి దండములు సమర్పించి సన్నిధిని నిలిచినందున అప్పుడు రాయలవారు కరుణించి యాడకి అనే పరగణా ఘండికోట తుకిడిలో చేరిన తాలూకా జహాగీరు దయచేశినారు........................

......పిదప రాయలవారి అనుజ్ఞ తీసుకుని వీరతిమ్మానాయుడు యాడకిగ్రామానికి వచ్చి శ్రీ స్వామికి దండములు సమర్పించి వుత్సవం చేయించి తమ యిష్టదైవమైన వెంకటరమణ ప్రతిమె ముందరవుండేటట్టున్ను వెనుకతట్టు తమ కులదైవమైన యాడకి వీరభద్ర అనే పేరు నాగరం అక్షరాలతో నాయణి మాడలు రూకలు తస్సాలు వేయించి రాజ్యంలో నడిచే లాగున చేసిరి.

[స్థానికచరిత్రల నుండి]







డా॥ ఆచారి ఓమెనా కన్యగారు
బరంపురంలో గౌరవ బెంచి మేజిస్ట్రేటుగ
నియమింపబడిన ప్రథమస్త్రీ.



శ్రీమతి అలిమేలు మంగతాయారమ్మగారు
మదరాసు జిల్లా విద్యాసంఘసభ్యురాలుగ నియమింపబడిరి.



వేదనాయకం కన్యగారు, బి. ఎ., యల్. టి.

ఈమె మద్రాసు విశ్వవిద్యాలయమునందు జర్మను భాషలో ఉత్తీర్ణురాలయ్యెను. ఇంతవఱకు ఏ స్త్రీయు ఈపరీక్షయందు విజయము నందియుండలేదు.



శ్రీమతి డా॥ జానుగారు

మదరాసు ప్రభుత్వమువారు పంపగా ఇంగ్లండునకుబోయి ఉన్నత వైద్యవిద్యను బడసి తిరిగివచ్చిరి.

---

## స్వాగతము

అల్లంశెట్టి అప్పయ్యగారు

మందానిలోద్ధూత చందనానోకహా విరత సువాసనావితతి యెచట;
    పరిపక్వ మాకందఫల రసాస్వాదనానంద గ్రథిత కీరబృంద మెచట;
సాంద్ర శరచ్చంద్రచంద్రికా ధవళిత విమల సౌధాగ్రభాగము లవెచట;
దర వికస్వర మనోహర బిన ప్రసవ సంవాసితామల సరోవరము లెచట;
నచట నర్పింతు నీకుఁ గళ్యాణరాగ-సలలితానృత్యప్రయుక్త సుస్వాగతంబు
బాగు బాగని యామోదభరిత మతిని-గైకొనెదు వేగ రారమ్ము కవికుమార!

---

# పత్రికాసన్మానము

## సన్మానపత్రము

### ఆంధ్ర, కృష్ణాపత్రికా సంపాదకులగు
### నాగేశ్వరరాయ కృష్ణరాయల చరణసన్నిధికి

ఇప్పటి కిరువది రెండేండ్లనుండియు ఆంధ్ర కృష్ణా పత్రికల మూలమున యావదాంధ్ర జీవన వికాసమునకై సర్వతోముఖముగ ప్రబోధించుచున్న దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారికిని, ముట్నూరి కృష్ణరావుగారికిని ఆంధ్రమహాజనుల పక్షమున భక్తితాత్పర్యములతో ప్రణమిల్లుచున్నాము.

తరతరములనుండియు నఖండమగు తన మహాశక్తిని విస్మరించి నిద్రామాంద్యమున నున్న ఆంధ్రమహాజనమును మత్తకంఠములో మేల్కొలిపిన మీ యిరువురకును నమస్కారములు.

స్వతంత్రదేశములయందు వార్తాపత్రికలు రాజ్యతంత్రమునం దత్యంత ప్రధానములుగా గౌరవింపబడుచున్నవి. పరాధీనమగు మనదేశమున నొకవైపున నిరాశాహతులైన ప్రజల నిరాదరణమునకును, వేరొకవైపున ప్రభువులవైముఖ్యమునకును పాత్రములై నిస్తేజములగుచున్న ఆపత్సమయమున మహాదీక్షాబద్ధులై ప్రతిభావంతములును, ప్రజారంజకములును, దేశహితైకములు నగు రచనలతో, వ్యాపులమగు నాంధ్రజీవనమున స్థైర్యమును, శాంతిని చేకూర్చిన మీకు వందనములు!

దీర్ఘధీతులైన మీ కివే ప్రణామములు. కాలపరిత్యక్తములై క్రుంపుపట్టియున్న ఆంధ్రుల మనోబుద్ధులు మీ రచనలచే నుత్తేజితములై నవనవోదయాభిరుచుల దనరారుచున్నవి. కాలపురంధ్రి ఆర్ద్రత్వ రంజితమగు మీ మనస్సునయందు శారదామూర్తి యైనది. ఆ దేవమూర్తి చిత్రవిద్యామూర్తియై, ప్రవృత్తినే యుపదేశించెనో, వైరాగ్యశోభితయై నివృత్తినే గఱపెనో, కాలమూర్తియై జాతీయధర్మమునే యుద్ఘోషించెనో కాని యాంధ్రులు లబించిరి, తన్మయులైరి.

నాగేశ్వరా, కృష్ణరాయా, నిరంతరాయముగ మీ రొనర్చిన దేశసేవ నుచితరీతిని సత్కరింపజాల మని యెంచియు, నీశుభ సమయమున మీ సమక్షమున మా యానందమును వెలిపుచ్చి ధన్యుల మగుచున్నాము. సర్వేశ్వరుడు మీ యిరువురకు చిరతరాయురారోగ్యసంతుల నొసర్చుగాక!

బెజవాడ.
8-9-1929

ఇట్లు మీ శ్రేయఃకాంక్షి,
ఆంధ్ర, కృష్ణా పత్రికల
సన్మానసంఘము.

## శ్రీ కా. నాగేశ్వరరావుగారి ప్రత్యుత్తరము

ఓం నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైకమూర్తయే,
నిర్మలాయ ప్రసన్నాయ దక్షిణామూర్తయే నమః.

ఈ సన్మానసభ కధ్యక్షతభారమును వహించిన శ్రీయుత గా. నరసింహరాజుగారికిని, సన్మాన సంఘాధ్యక్షునకును, సన్మానసంఘమునకును, సదస్యులకును, దేశబాంధవులకును వారు చూపిన గౌరవాదరణములకు వందనములను సమర్పించుచున్నాను. ఆనందసమయమునందు మౌనవ్యాఖ్య యుచితము. బహిరంగముగ సన్మానోద్యమమునందు ప్రమేయము గల మిత్రులకును లోనే రహస్యముగ నధిక్షేపించిన మహాజనులకును వందనముల నర్పించుచున్నాను. ఆంధ్రస్వసిద్ధికిని, పత్రికానిర్వహణమునకును నేను చేసిన ఘనకార్య మేదియును లేదని నేను బాగుగ నెఱుగుదును. ఏ స్వల్ప ప్రయోజనమునో సమకూర్చినను నది లోపభూయిష్ఠమనియును నే నెఱుంగుదును. ఇట్టి సందర్భములం దీ సన్మానమునం దహంకారమున కవకాశము లేదని మనవిచేయుచున్నాను. కేవల మాంధ్రసోద

గల శ్రేయదే దీనికి మూలమనియును, నా ప్రయోజక త్వము గాదనియును మనవి చేయుచున్నాను. ఈ సన్మానము నెవరేర్పరచినదియును, నెందుల కేర్పరచినదియును, దీని ప్రయోజన మేది యైనదియును నే నూహింపజాలక పోయినను, ఆంధ్రపత్రికా సన్మానము వ్యక్తిగతమైన సన్మానము గాదనియు, ప్రజాశేయసన్మాన మనియును నేను విశ్వసించుచున్నాను. ఆంధ్రాభ్యుదయమున కెందరో మహానుభావు లితరరంగములందువలె పత్రికానిర్వహణమునందును పాటుబడి ప్రజాగౌరవమునకు పాత్రులైరి. ఆ మహానుభావులందు రావుబహద్దరు వీరేశలింగము పంతులుగారు సకలవిధములను పూజ్యులు. ౧౯౨౧ వ సంవత్సరమునందు వృత్తాంతిని ప్రకటించిన మహోపాధ్యాయ వేంకటరాయశాస్త్రిగారు మొదలు నేటివరకును నెందరో మహానుభావు లాంధ్రాభ్యుదయమునకై పత్రికానిర్వహణమును జేసియుండిరి. రావుబహద్దరు వీరేశలింగము పంతులుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారు, చిలుకూరి వీరభద్రరావుగారు, ఏ. సి. పార్థసారథి నాయుడుగారు, రంగయ్య నాయుడుగారు, శేషాచార్యులు గారు, శేషాచలపతిగారు, మొదలగు పత్రికా నిర్వాహకులు సన్మానమునకు పాత్రులు, పురుషార్థప్రదాయిని, వివేకవర్ధని, చింతామణి, ఆంధ్రకేసరి, దేశమాత, ఆంధ్రప్రకాశిక, శశిరేఖ, దేశాభిమాని, న్యాయదీపిక, సమదర్శిని, కాంగ్రెసుపత్రిక, సత్యాగ్రహి, ఇంద్రావతి మొదలగుపత్రికలును సన్మానమునకు భాజనంబులు. వృద్ధాప్యమునందును నీసన్మానసభ నలంకరించుచున్న న్యాపతి సుబ్బారావు పంతులుగారును, పత్రికానిర్వహణమునందు కష్టముల ననుభవించిన సర్వోత్తమరావుగారును యథార్థముగ నీసన్మానమున కర్హులుగ నున్నారు. హిందూ, వివేకవర్ధని, చింతామణి మొదలగు పత్రికల నిర్వహణమునందును, రాజ్యాంగ రంగమునందును పంతులుగారు చేసిన సేవ సన్మానమునకు దగియున్నది. నేటిసన్మానమున కాంధ్ర కృష్ణాపత్రికలు నిమిత్తకారణము కాని యథార్థకారణము గాదు. సన్మానమున కాంధ్రపత్రికా నిర్వాహకు లందరును నధికారులు.

బొంబయి నగరమునందు ౧౯౦౮ వ సంవత్సరమున నాంధ్రపత్రికను ప్రారంభించినపుడు కలలోనైనను నే నీమహాసన్మానము నూహించి యుండలేదు. ప్రపంచమునందు ఘటనాఘటన ఫలములను మహానుభావులకును నూహించుట సాధ్యముగాదు. నా వంటి యల్పజ్ఞున కది యెత్తుగా నసాధ్యము. కాని మహాసంకల్పము చేసి యంతరాశోధనమును జేయుట మానవస్వభావము. ఫలము దైవాధీనము. బొంబయి కలకత్తా నగరములందు విశేష వ్యాపకముగల దేశీయవార్తాపత్రికలను జూచినప్పుడాంధ్రాభ్యుదయమున కాంధ్రపత్రికా ప్రచురణావసరము గోచరంబైనది. రెండవసంవత్సరాది సంచికయం దాంధ్రరాష్ట్ర నిర్మాణావసరమును వ్యక్తీకరింపబడినది. ఆంధ్రమహాసభ లాంధ్రరాష్ట్రావసరము నంగీకరించినవి. ఆరంభమునందు పరిహాసపాత్రమైన ఆంధ్రరాష్ట్ర నిర్మాణము వర్తమానకాలమునందు ప్రయోగ యోగ్యముగ గ్రహింపబడుచున్నను, కార్యరూపమును దాల్పకుండుట శోచనీయము. దీనికి మన నిద్రావస్థయె కారణము. గతించిన ౨౨ ఏండ్లయందును ఆంధ్రపత్రిక ఆంధ్రాభ్యుదయమునకు చేసిన సేవను నిర్ణయింపగల యధికారము ప్రజలమీదనే గలదు. ఆంధ్రపత్రిక చేసిన స్వల్పమైన సేవను గొప్పగా జేసి సన్మానించినందులకు కృతజ్ఞతను దెలుపుచున్నాను. ఈ స్వల్పఫలమునకైనను పత్రికానిర్వహణమునందు శ్రద్ధ్గొనిన సేవాపరాయణు లందరును పాత్రులు. నేను నిమిత్తమాత్రుడను. కోపల్లి వెంకటరమణారావుగారు, ఆదిపూడి గోపాలరావుగారు, ఆనటపల్లి నారాయణరావుగారు, కోటంరాజు పున్నయ్యగారు, గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, చల్లా శేషగిరిరావుగారు మొదలగు సంపాదకులును నితరసహాయసంపాదకులు, అచ్చుకూర్చువారు, పనివాండ్రును నీసన్మానమునకు పాత్రులు. ముఖ్యముగా బొంబాయి యందు పత్రికను ప్రారంభించిన కాలమునుండియును నేటివరకును పత్రికా ప్రకటనమునం దభిమానముతో పనిజేయుచున్న నారాయణస్వామినాయుడు, పార్థసారథినాయుడు, గోపాలస్వామినాయుడు గారలు మొదలగు

# ఆంధ్ర కృష్ణాపత్రికల సన్మానసభ




అధ్యక్షులగు శ్రీ. నరసింహరాజుగారు ఉపన్యసించుచుండుట
వీరికి ఇరుప్రక్కల ముట్నూరు కృష్ణారావు, కా. నాగేశ్వరరావుపంతులుగార్లు గలరు.




పత్రికాధిపతులకు కానుకగా ఇచ్చిన వెండి దంతపుబెట్టెలు




ఆంధ్రపత్రికా కార్యాలయమున 13-వ సంవత్సరపు గణపతిపూజ

వారు కృతజ్ఞతకు పాత్రులు. అనుదినమును పత్రికానిర్వహణమునందు పాల్గొనెడివారందరును స్థానదశాభేదము లేక సన్మానసందర్భమునందు శ్లాఘింపదగియున్నారు.

వార్తాపత్రికలు ప్రజాసంకల్పములకును, ప్రజాభీష్టములకును, ప్రజాభిలాషలకును ప్రతిబింబములు. స్వాతంత్ర్యదేశము లందువలె పారతంత్ర్యదేశములందు వార్తాపత్రికలకు గౌరవప్రతిష్ఠలు లేవు. ముఖ్యముగ దేశభాషాపత్రికలకు బొత్తిగ లేవు. దేశభాషాపత్రికలు ప్రభుత్వ నిర్బంధములకును, ప్రజల నిరాదరణకును పాల్పడుచున్నవి. ఆరంభమునుండియు కాంగ్రెసు నిర్ణయించిన రాజ్యనీతిని నవలంబించుట కాంధ్రపత్రిక ప్రయత్నించినది. అంతర్విభేదములను, ప్రభుత్వాధికారములను గమనింపక స్వరాజ్యసిద్ధికై కాంగ్రెసుధ్వజమును సంరక్షించుటకై ప్రయత్నించినది. ఆర్థిక నైతిక మతసాంఘిక విషయములందును సమరసభావమును గాపాడుట కాంధ్రపత్రిక యత్నించినది. కాని సాధనను సాధ్యమును సంభావించినపుడు కురుక్షేత్రమునందు విజయునకు గలిగిన విషాదమే పత్రికా నిర్వాహకులకును గలుగుచున్నది. చేసినది స్వల్పము. చేయవలసినది యపారము. చేసిన దానియందును సంశయములు ప్రబలునపుడు నిరుత్సాహము గలుగుచున్నది. కాని నే డీమహాసభయం దాంధ్రస్వరూపస్వభావములను ప్రత్యక్షముగ సందర్శించునపుడు సందేహసమ్మోహము లంతరించి స్వధర్మనిర్వహణాభిలాష సువ్యక్తమగుచున్నది. ఆంధ్రదేశమునకు దూరస్థమైన బొంబయియందు జేసిన యంకురారోపణ నేడాంధ్రదేశమధ్యస్థమైన విజయవాడయం దాంధ్రమహాజనుల సమక్షమున మూర్తీభవించినది. ఈ మహాసభ ఆంధ్రాభ్యుదయమునకు స్వధర్మ నిర్వహణదీక్షను నుపదేశించుచున్నది. ఆంధ్రుల కుపాస్యదైవమైన శ్రీరామచంద్రమూర్తి కర్మయోగి, జ్ఞానయోగి. ఈరెండు యోగములను సమన్వయముచేయుటయే విశ్వకల్యాణమునకును, ఆంధ్రాభ్యుదయమునకును సాధనములు. అహింసా దీక్షాపరాయణుడు సత్యాగ్రహసంపన్నుడు గాంధీమహాత్ముడు భారత జాతీయజీవనమునందు, ప్రపంచయాత్రయందు నూతన యుగ నిర్మాణమును జేయుచున్నాడు. ఈ శుభసమయమునందు వారి యనుచరులమై పనిచేయుట మహాభాగ్యము. ఆంధ్రకృష్ణాపత్రికల సన్మాన నిమిత్తమున ఆంధ్రలోకము ప్రత్యభిజ్ఞానసంస్మరణములు గలిగి పురుషార్థములను బడయునటుల శ్రీరామచంద్రమూర్తి యాశీర్వదించుగాక. ఈ సన్మానసభలను సంకల్పించి బహుశ్రమల కోర్చి వానిని జయప్రదముగ నిర్వహించిన ఆచటపల్లి నారాయణరావుగారు మా కృతజ్ఞతకును, ఆంధ్రుల కృతజ్ఞతకును పాత్రులు."

## శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి ప్రత్యుత్తరము

ఈ సన్మానము, దీర్ఘకాలమునుండి పనిచేయుచున్నవను కారణమున కృష్ణాంధ్ర పత్రికల పేరున జరుపబడుచున్నను, తెలుగుపత్రిక లన్నిటి శ్రేయము నుద్దేశించి సంకల్పింపబడిన దని కార్యదర్శులు చెప్పినందున నా యంగీకారము నుపసంహరించుకొంటిని. ఇంతకు నీ సన్మానము కేవలము అభిమానపూర్వకమైనదే కాని తెలుగుపత్రికల యభివృద్ధికి సంతృప్తి చెంది కాదనుట నిస్సంశయము. తెలుగు పత్రికలలో గొంతవఱకు ఆంధ్రపత్రిక తప్ప, ఇక నేవియు జీవకళ కలిగి ప్రవర్ధమానములుగ లేవని చెప్పుట యనవసరము. తెలుగు పత్రికల హైన్యస్థితికి ప్రజలు బాధ్యులు కారని మాత్రము చెప్పవలసియున్నది. విద్యావంతులును, సంస్కారులును పత్రికా నిర్వహణమునకు బూనుకొనక పోవుటచేతనే పత్రికలకు దేశములో దగిన వ్యాప్తికాని, పలుకుబడిగాని, లేకున్నవనుట నిజము. వైద్యశాస్త్రమునందు సుశిక్షితులైన గాని డాక్టరులు ప్రాక్టీసు చేయుటకు యోగ్యత కలుగదు. న్యాయవాదులును వారి శాస్త్రమునందు కొంత పాండిత్యమును, తర్ఫీయతును బొందినగాని వారికి పట్టాలు పుట్టవు. టీచర్లకు ఎల్. టీ. శిక్షణము విధింపబడినది. కాని ఎడిటర్లగుటకు నట్టి శిక్షణము అవసరము లేదు! ఒక అచ్చుకూటము, ఒక రీలు కాగితము, ఒక ఊటకలము సమకూడిన చాలును, పత్రికాధిపత్యము సిద్ధించును. పత్రికానిర్వహణము చాల బాధ్యతతో

గూడిన కార్యము. భాషాప్రభుత్వము, రచనాకౌశలము, భావోద్రేకము ఉన్నచాలవు. క్రమానుగతములైన సంప్రదాయములను, ధారావాహికములైన చరిత్రాదులను గుర్తింపగల చరిత్రజ్ఞానము, ప్రజల నిజమనోరథములను, నిగూఢ చిత్తవృత్తులను పరీక్షింపగల భావనాశక్తి, ప్రపంచ పరిణామరీతులను బరీక్షింపగల విశాలదృష్టి, దేశ భవితవ్యము నుపలక్షింపగల గంభీర విశ్వాసము, పత్రికాధిపతులు అలవరుచుకొనదగిన లక్షణములు. వీని యన్నిటికంటెను గావలసినది నిర్మలమైన సత్యానురతి. ఈ లక్షణములు పత్రికా నిర్వాహకులతో జాలవంతు గొరవడియుండుటచేతనే, తెలుగు పత్రికలు పొందదగినంత గౌరవమును బొందుట లేదని చెప్పినందుకు సోదర పత్రికాధిపతులు మన్నించెదరు గాక!

పత్రికల యుపకృతితోపాటు, అపకృతినిగూడ దలచుకొనినప్పుడు పత్రికా వ్యాప్తి తగినంతగ లేకపోయిన దని చింతించుట కవకాశముండదు. ఇక్కాలమున ప్రజాపబోధమునకును, ప్రపంచ పరిజ్ఞానమునకును, సామాన్య విద్యా వ్యాపనమునకును పత్రిక యొక సాధనమనుటకు సందియము లేదు. కాని ధాన్యాశేషన్యాయముగ, నీ శేర్లనంటి కొన్ని కీళ్లు కూడ గలవు. పత్రికా పఠనము మూలమున జ్ఞానప్రదమైన ఉద్గ్రంథావలోకనము క్రమముగ మరుగగుచున్నదని విజ్ఞులకు దెలియని విషయము కాదు. ప్రజలలో గ్రంథావలోకనమే చాల అరుదు. అక్షరాస్య లేకొలది నిమిషములైనను మేధావులును, జ్ఞానసంపన్నులును రచించిన ఉత్తమ గ్రంథములను బఠింపక తాత్కాలిక వినోదమును గల్పించు పత్రికలను జదువు అభ్యాసమొకటి దేశమునందు వ్యాపించుచున్నది. కొందరు యువకులు బలము, పుష్టి నిచ్చు భోజనమును మాని, జిహ్వాచాపల్యమును బరికొల్పు కాఫీ హోటళ్లనే శరణ్యముగ జేసికొని అజీర్ణవ్యాధులకు లోనగుచున్నట్లు, ఆత్మోన్నతికిని చిత్తసంస్కారమునకును తోడ్పడు సద్గ్రంథపఠనమునకు బ్రత్యామ్నాయముగ బుద్ధిచాపల్యకరములగు పత్రికలను పారాయణము చేయుచుండుటచే చిత్తవిభ్రమణములకు లోనగుట సంభవించుచున్నది. పత్రికాపఠనము ప్రజలలో గొంత ప్రబోధము

వకు సాయపడుచున్నను; స్వతంత్ర చింతనా పటిమను బరికొల్పజాలక పరప్రత్యయ నేయు బుద్ధిని బలపరచుటకే యెక్కువగ నుపకరించుచున్నదనికూడ గొంచెము బరిశీలించిన దెలియగలదు. పత్రికలయభిప్రాయములు పరిహితము శ్రమప్రమాదములతో గూడిన వ్యక్తిగతాశయములే యని దలిసికొనుటకు బదులు, అవి శిరసావహింపదగిన ప్రమాణ వాక్యములుగ జనసామాన్యము స్వీకరించుటకు దగు సందర్భములు కల్పింపబడుచున్నవి. పత్రికలు ప్రజాభిప్రాయ వ్యక్తీకరణమునకు బూనుకొనుచున్న ట్లొకయపోహ వ్యాపించియున్నది. ప్రజాభిప్రాయ మనునది బాహ్యమున స్పష్టముగ నిర్ణీతమైయుండు భావము కాదు. పత్రికాధిపతి తనయొక్కయో, తన పక్షముయొక్కయో, తాత్కాలికనిర్ణయము సర్వజనామోదము బడయునట్లు చేయుటకు దాని ప్రాశస్త్యమును స్వతంత్రయుక్తులతో నిరూపించుటకు బదులు, దానిని బ్రజలపై రుద్ది, వారు నమ్మమన్న సిద్ధాంత మదియే యను వ్యామోహమును గల్పించుట పత్రికారచనా నైపుణ్యముగ నెంచబడుచున్నది. అర్చకుడు తన చేతితో జేసిన పసుపుముద్దను విఘ్నేశ్వరునిగ భావించి ధూపదీపనైవేద్యము లొసగునట్లు పత్రికాధిపతులు స్వకీయాభిప్రాయములను ప్రజాభిప్రాయముగ బ్రతిష్ఠించి పత్రికలలో నూరేగించుట ప్రచారకధర్మముగ విశ్వసింపబడుచున్నది. ఇది పత్రికలవలంబించుచున్న "మెస్మరిజము" పద్ధతి. ఈ మెస్మరిజము మూలమున పత్రికాపాఠకులలో స్వతంత్రాలోచనాశక్తి కుంటుపడకతప్పదు.

ఇంతియకాదు. పత్రికలు సర్వ సామాన్యముగ దేశములోని ఆయా పక్షముల నాశ్రయించుకొనియే ప్రవర్తిల్లుచున్నవనుట లోకవేద్యము. ఒక పక్షమునకే సంబంధించిన పత్రికయందు స్వపక్షమును బలపరచుటకై కొందరు న్యాయవాదులవలె సత్యమును మరుగుపరచి అబద్ధమును స్ఫురింపజేయుపద్ధతి యెక్కువగనో తక్కువగనో పత్రికాధిపతియొక్క రచనా చతురత్వ తినిబట్టి సహజముగ ప్రయోగ్యమగుచున్నది. ఈ పద్ధతిలో అర్ధోక్తులు, అతిశయోక్తులు, కొన్ని సందర్భములలో అసత్యోక్తులుకూడ బ్రయోగింపబడుటచే సత్యహాని

కలుగకుండ నుండజాలదు. పత్రికాప్రపంచమంతయు నెదకి చూచిన గాంధిమహాత్ముని ఒక "యంగ్ ఇండియా" తప్ప ఈ రాజనీతినుండి తప్పించుకొనగలిగినపత్రిక యింకొకటి కలదా యని సంశయింపవలసి వచ్చుచున్నది. పాశ్చాత్య దేశములలోని పత్రికా రాజములు మితిమీరి రాజ్య దురహంకారములను, జాతిద్వేషములను బురికొల్పి గత యూరపీయను మహాసంగ్రామమునకు గారణభూతము లయ్యెనని ఒక యాధునిక చరిత్రకారుడు వాక్రుచ్చినప్పుడు పత్రికల యపకృతి యెట్టిదో యూహించుకొనవచ్చును. మన దేశమునందు రాజకీయ పక్షభేదములు కేవలము రాజకీయముగ నుండక, కుల కక్షలుగను, మత కలహములుగను బరిణమించుటకు గొంతవఱకు దేశ పరిస్థితులు గారణములైనను, పత్రికలకు గూడ నీ దుస్స్థితికి గొంత బాధ్యత కలదని యొప్పుకొనక తప్పదు. ఉత్తర హిందూస్థానములో ఉర్దూ హిందీ పత్రికలే హిందూ మహమ్మదీయ కలహములకు హేతుభూతములని గవర్నమెంటువారు ప్రకటించిన విషయములో గొంత సత్యము కలదు. మన ప్రాంతములలో కులవైషమ్యములకు పత్రిక లెంతవఱకు గారణములో యోజించిన, పత్రికాప్రచార మీ దేశమునకు గూడ నెందుకు సంక్రమించినదా యని దేశ శ్రేయోభిలాషులు సంతాపపడవలసియుండును.

యూరపు అమెరికాలలోవలె పత్రికా ప్రకటన మీ దేశములో నింకను వర్తక వ్యాపారముగ బరిణమించి యుండలేదు. పత్రికాప్రకటనము పెద్ద మూలధనముతో వ్యాపార సరళిని నడపిన, పత్రికకు స్థిరత్వమును, బహుళ ప్రచారమును గలుగుననుటకు సందియము లేదు. కాని, ఆ పద్ధతివలన పత్రికాస్వాతంత్ర్యమునకు భంగకరము లగు సందర్భము లెన్నియో సంఘటించును. పత్రికలు ధనికులకు, షాహుకారులకు, పెట్టుబడిదారులకు అమ్ముడుపోయినయెడల నవి యెంతవఱకు ప్రజోపయోగకరము లగుటకు అవకాశము కలదో యోజింపుడు. పత్రికా సంపాదకుడు తన శుద్ధాంతఃకరణ ప్రవృత్తినిబట్టి వ్యాఖ్యానము చేయుటకు వీలుండదు. పత్రిక యజమానులను, రాజపోషకులను రంజింపజేయు ఇచ్చకపు వ్రాతలను వ్రాయవలసియుండును. ఇటీవల స్వదేశ సంస్థానాధీశుల చేతులలోబడిన పత్రికలు కొన్ని తమ తొల్లింటిస్వాతంత్ర్యమును గోలుపోయి, కూలి కట్టి వ్రాతలను ప్రకటించుచున్నవియు లోక మెఱుగనిది కాదు. వంగదేశములో గొన్ని బంగాళీ పత్రికలు గవర్నమెంటు సబ్సిడీకి లోబడి యాత్మగౌరవమును నష్టమొనర్చుకొనినవి. వివిధ సంఘములవారు వారి వారి ప్రత్యేక ప్రయోజనముల కొఱకు వేరు వేరు పత్రికలను బెట్టుకొనిన బెట్టుకొందురుగాక. కాని బయటకు ప్రజల పేరున నడుపునట్లు ప్రకటించుచు, రహస్యముగ ఏ ధనాఢ్యులకో ఏ జమీందారులకో, ఏ సంస్థానాధీశులకో అమ్ముడు పోవుట మాత్రము విచారకరము. అట్టి పరిస్థితు లీ దేశమునకు గూడ క్రమముగ సంక్రమింప నారంభించుటచే నీ విషయమును సూచింపవలసివచ్చుచున్నది. స్వతంత్రులైన పత్రికాధిపతుల చేతులలో నున్నప్పుడే, స్వాతంత్ర్య భంగకరములగు సందర్భము లెన్నియో సంఘటించుచుండును. ఒకమారు పత్రికా కార్యాలయమునకు వచ్చి అక్కడకు చేరు ఉత్తరప్రత్యుత్తరములను బరీక్షించిన దీని యాంతర్యము తెలియగలదు. "నా లేఖను బ్రకటించనందున నా పేరును చందాదారులపట్టిక నుండి కొట్టివేయుడు" అను ఉత్తరములు చాల తరచుగ వచ్చుచుండును. "మా సంఘములకు బ్రతికూలములైన జాబులను ప్రకటించుచున్నందున మా సాంఘికులచే మీ పత్రికను బహిష్కరింప జేసెద"మని బెదరించుచు వ్రాయువారు కలరు. ధనాధిక్యముచేతనో, స్వసంఘాభిమానము చేతనో, పలుకుబడి గల ఒక ప్రముఖుని చర్యలను ఖండించవలసిన అవసరమున్నను, అట్లుచేసిన పత్రికకు బ్రజలలో బలుకుబడి పోయి, చందాదారులు తగ్గుదురేమో యని బెదరు ఒక వైపు; ఏదిలేఖకుని వ్యాసమో ప్రకటనార్హము గాకపోయినను వానిని ముద్రింపక పోయిన వాని యాదరణ పోవునేమో యను జంకు ఇంకొక ప్రక్క; లోపల నిష్టము లేకపోయినను బయటకు ఒక యధికారినో, ఒక ప్రముఖునో, ఒకధనికునో, ప్రశంసించుచు వ్రాసి మెప్పుబడయవలయునను స్తోత్రాభిలాష యింకొక దిక్కున; ఎంత రోషముతో ఎంత ఘాటుగ దిట్టుచు వ్రాసిన ప్రజలు తమ ధైర్యసాహసములకు అంత మెచ్చు

కాసెనరను కీర్తికాంతకు ఇంకొక దక్కినీ; స్వాభిమానము చేతనో, స్వపక్షమును సమర్థించుటయందో, విపక్షమును ఖండించుటలోనో కేవల మనాలోచితముగ శమదమములను వీడి భావోద్రేకమునకు లోనగు చిత్తవికారము ఒక వంకను, పత్రికాధిపతులను బాధించుచుండు విషయము లని వారిలో గొంతమందికైనను అనుభవైక వేద్యములు.

ఇదంతయు నిట్లుండ, పత్రికలలోని అడ్వర్టయిజుమెంటులు కూడ పత్రికాధిపతులను బాధించు విషయములలో నొకటి. పత్రికలు ఏ యర్థాకలితోనైన బ్రతుకుటకు ప్రకటనలే ఆధారము లను సంగతి యెల్లరెరిగిన విషయము. వర్తకవ్యాపారములందు బ్రకటనము నవీన విధానములలో నొకటి. ప్రజల దృష్టి నెటులైన నాకర్షించి తమ వస్తువులను గొనునట్లు చేయుటయే వాని లక్ష్యము. ఇందు నిమిత్తము ప్రకటనదారులు తమ వస్తువుల ప్రాశస్త్యమును వర్ణించుటకు గావ్యరచనత నంతయు జూపెదరు. ఎట్టి యతిశయోక్తులను వ్రాయుటకైనను జంకరు. కృత్రిమము లైన యోగ్యతాపత్రములను ప్రకటించుటకు వెనుదీయరు. ముఖ్యముగ నీ దేశములో నే పరిశ్రమయు అభివృద్ధిలో లేకపోయినను, ఔషధముల వ్యాపార మతిశయించినది. వీనిలో నేవి మోసములో, ఏవి గుణముగలవియో, పత్రికాధిపతులు విచక్షణము చేయలేరు. కాని ఈ ప్రకటనలు చాల వరకు కేవలము ప్రజలను భ్రమింపజేయుటకు అతిశయోక్తులతో వర్ణింపబడు ననుసంగతి తెలియనిది కాదు. కొన్ని సందర్భములలో వీనిభాష జుగుప్సాకరముగ నుండుటయు కద్దు. కవులు గ్రంథకర్తల వంటి సంస్కారులే యెట్టి మోమోటమియు లేక తమ రచనలను గూర్చి అతిశయోక్తులతో వర్ణించి ప్రకటించుకొనుచున్నప్పుడు, ఔషధాలవారు దేవాదిదేవుల పేర్లతో, పురాణేతిహాసాలంకారములతో, చిత్ర విచిత్ర రీతుల వర్ణించి, ప్రజల విశ్వాసము నాకర్షింప గడంగుటలో నాశ్చర్యము లేదు. గాంధీమహాత్ముని "యంగ్ ఇండియా" లోవలె నీ అడ్వర్టయిజుమెంటులను బూర్తిగ విసర్జించుటయే సర్వోత్తమమైన పద్ధతి. కాని యీ పద్ధతి నవలంబించిన పత్రికలన్నియు మూలబడక తప్పవు. ఈ ప్రకటనలలో నే గ్రంథములు పరమార్థములో, ఏ కంపెనీలు మోసములో, ఏమందులు కృత్రిమములో, విచక్షణ చేయుట కష్టసాధ్యము. ఇట్లనుటచే నీ విషయములో పత్రికాధిపతుల కట్టి బాధ్యతయు లేదని గాదు. పత్రికల యపకృతులలో అడ్వర్టయిజుమెంటుల బాధ యొకటియని సూచించుటకే యీవిషయము తెలుపబడినది. ఇక రవీంద్రునివంటి రసభోగి పత్రికలను క్రీగంటనైన జూడడనిన ఆశ్చర్యపడవలసినపని లేదు.

ఈ యపచారము లనివార్యములు కావు. పత్రికాధిపతులు తమ బాధ్యతను గుర్తించిన కొలది, అధికారులును, సంస్కారులును పత్రికా నిర్వహణమునకు బూనుకొనిన కొలది, దేశములోని రాజకీయ సాంఘిక పరిస్థితులు పరిష్కృతములై ప్రజాశక్తి జాగరితమైన కొలదిని, పత్రికల పలుకుబడి, వశీకరణశక్తి, స్వాతంత్ర్యదీప్తి హెచ్చునే కాని తగ్గనేరవు. ప్రస్తుతము దేశమునందు ప్రతికూల పరిస్థితు లధికముగ నున్నందున తక్కిన సంస్థల వలెనే పత్రికాసంస్థయు గొంత వికృతరూపమును దాల్చియున్నది. స్వాతంత్ర్యమే పత్రికలకు బ్రాణము. స్వాతంత్ర్యసంస్థాపనయే పత్రికల లక్ష్యము. ప్రతి వ్యక్తియందు, ప్రతి సంఘమునందు, ప్రతిజాతియందు స్వాతంత్ర్యబీజములను వెదజల్ల నారంభించినప్పుడు, ఆరంభదశలో సమన్వయము కుదురక దేశసంక్షోభము కలుగుట సహజము. దేశమునందు నిద్రాణములై యున్న శక్తు లొక్కమారుగ విజృంభించుటతోడనే ప్రతివ్యక్తియు తన హక్కులను బ్రతిష్ఠింపగోరును. ప్రతి సంఘము ఉన్నతస్థానము నాక్రమింప జూచును. ప్రతి జాతియు తన సంపూర్ణశక్తిని బ్రకటింప నభిలషించును. అంతట బ్రాతబాటలకు కట్టుపడిన పూర్వాచార పరాయణు లీసంచలనమును జూచి భీతిల్లుట సహజము. వారి నిరోధమే కలకలములకు, సంఘవైషమ్యములకు గారణమగును. ప్రభుత్వాధికారులును ఆగ్రహావిష్టులై కఠిన శాసనములకు గడంగెదరు. దీనికి ఫలితముగ రాజద్రోహము, విప్లవకరములైన ఉద్యమములు బయల్వెడలును. వెనుకటి పూజలు, విధేయతలు, గౌరవములు నిలువనేరవు.

క్రొత్తభావములు ఝంఝామారుతములవలె వీచి భయంకరరూపము దాల్చును.

ప్రాతకట్టడములు కూలిపోవును. వెనుకటి యధికారములు భగ్నములగును. ఎక్కడజూచినను అశాంతి, అసంతృప్తి, అసహనము, వ్యాకులత, ఉద్వేగము బహిర్గతము లగును. సంఘములో నెక్కడను స్థిరత్వము, స్తిమితతయు నున్నట్లు కన్పట్టదు. ఏప్రతిఘాతమునకో నిద్రాభంగము చెంది బెదరినమనుజుడు ఇటునటు పరుగెడునట్లు సంఘ మొక్కమారుగ జాగరిత మగుటచే అధికారధిక్కారము, శాసనాతిక్రమణము, విద్రోహము, విద్వేషము, మొదలగుసంక్షోభతరంగములు బయల్వెడలుట సహజము. ప్రాతక్రొత్తలకలయిక, తూర్పుపడమరల రాపిడి, వ్యష్టిసమష్టుల సంఘర్షణ, పాలకపాలితులవైరము దేశమున అపూర్వమైన అల్లకల్లోలమును గలిగించుచున్నవి. దేశమంతయు నడుగంట గదలిపోవుచున్నది. భరతఖండములో గదలని ప్రాంతము లేదు. పరివర్తనము నొందని జీవన ప్రకరణము లేదు. సర్వవిషయములందును తీక్ష్ణప్రచండ సమస్య లెదుర్కొనుచున్నవి. ఆత్మవిస్మృతి పొందిన దేశమగుటచే నీసమస్య లత్యంతగహనము లగుచున్నవి. ఒకవైపున దేశముయొక్క చిరంతన సభ్యతా స్వరూపము నన్వేషింపవలసి యున్నది. ఇంకొక ప్రక్కను భారతజాతీయ సమ్మేళనమును నిరూపించి తత్సిద్ధికి సాధనవిధానములను గనుగొనవలసి యున్నది. అనైక్యమునుండి యైక్యము, వైషమ్యములనుండి సామరస్యము, అశక్తతనుండి సంఘటనాశక్తి, అంధత్వమునుండి జ్ఞానప్రతిభ అభివ్యక్తము చేయుట యెట్లు? రవీంద్రునివంటి కవిపుంగవులు, అరవిందునివంటి జ్ఞానయోగులు, గాంధిమహాత్మునివంటి కర్మవీరులు, జగదీశచంద్రబోసునివంటి ప్రకృతవైజ్ఞానికులు ఈ జాతీయసాగర మథనమునకు బూనుకొనినారు. భారత సామ్రాజ్యలక్ష్మి శేపామాపో తన నిండుకళలతో ప్రత్యక్షమగుచున్నది. ఆమహోదయము ఒక్క భరతవర్షమునకే కాక జగత్తునకంతటను గల్యాణదాయకమై వెలయగలదు. ఇది కవుల వాసంతికస్వప్నము కాదు. పత్రికల అతిశయోక్తియు గాదు, ఇది కేవలము ప్రకృతి పొందుచున్న నూతనవికాసము. ఈశ్వరవిధానోద్దిష్టమైన విశ్వపరిణామము కానిచో యీ కదలికకు, ఈ కలహములకు, ఈ విద్రోహములకు, ఈ యావేదనలకు అర్థము లేదు, ప్రయోజనము లేదు, సాఫల్యము లేదు. ఉషఃకాలము ముందు చీకట్లు దట్టమగును. వర్షపాతము ముందు గాలి దుమారము లేచును. బీజోత్పత్తిముందు గడ్డవిరుగును. ఫలసిద్ధి ముందు కుసుమదళములు వాడి రాలిపోవును. శిశూదయము ముందు తల్లి ప్రసవవేదన నొందును. అట్లే నూతన భారతజాతీయావరణమునకై నేడు దేశములోని ప్రతి సంఘము ఆవేదన నొందుచున్నది. ఆ యావేదనయే రాజ్యాంగమునందు స్వరాజ్యాందోళనము. ఆ యావేదనయే సంఘమునందు వర్ణవైషమ్యము. ఆ యావేదనయే మతముల యంతఃకలహము. ఆ యావేదనయే పత్రికల యుపకృతి. వసంతఋతుసమాగమమున చెట్లయాకులు రాలిపోవునట్లే యపచారము లన్నియు రాలిపోగలవు. ఆత్మజ్ఞానవిలసితమైన, క్రియాశక్తిభరితమైన, వివిధకళాలంకృతమైన, సర్వాంగసుందరమైన, జగదానందకరమైన, ఏక భారతజాతీయ సంస్థాపనమే అంతిమధ్యేయమే కాక, సన్నిహిత క్లిష్టపరిస్థితులందు వ్యక్తమగుచున్న ప్రతి స్పర్ధయందును, ప్రతి యపచారమునందును, ప్రతి తిరుగుబాటునందును, అంతర్గతముగ, అట్టడుగున, స్పందించుచున్న ప్రాణశక్తి యని హృదయస్థము చేసికొనిన, నీ వార్తాపత్రిక లీసంకటావస్థనుండి బయల్పడి, ప్రజావళిని ఆనందవారినిధి నోలలాడించు భారతజాతీయ కల్యాణ మహోత్సవాహ్వానపత్రికలై వెలయగలవు. ఈ సన్మానము తెలుగుపత్రికల కట్టి యాశీర్వాద బలము నొసగుగాక!

సీ. మ్రోగుచున్నది విశ్వమోహనలోక క
        ల్యాణ తంత్రీ ముక్త గానరవము
కదలుచున్నవి దేశ గర్భ గర్భిత జీవ
        నోదారశక్తు లెల్ల పాదుకదలి
ధ్వనియించె గగనంబు ధాత్రీజన స్వర్ణ
        యుగసమాహ్వానంపు యోగ మనుచు
ఓలగంబున్నవి ఉర్వి నేలెడు తప
        శ్శక్తిసంతతు లెల్ల సంభ్రమమున
ఈ లయాకృతిలోన డా నే మహస్సు
వెలుగునో చూడగల్గు సంవిత్త్వగరిమ
తెచ్చుకోలేరు గాబోలు తెలుగువారు
అలముకొన్నట్టి యోగమాయాత్మకేళి!







కీ॥ శే॥ యతీంద్రనాథదాసు

[ఇతడు ప్రభుత్వమువారి చర్యలకు నిరసనము చూపుచు నిరంతరోపవాసదీక్షచే జైలునందు ప్రాణములు వాసి 'దేశముకొఱకు ప్రాణ మర్పించిన వీరు' డయ్యెను. ఇతని దహన సంస్కారము కలకత్తాలో జరిగినప్పుడు కీ॥ శే॥ దేశబంధు దాసుగారి మరణ సందర్భమున జరిగిన ఊరేగింపు టుత్సవముకంటె గొప్పగా లక్షలకొలది ప్రజలు సమావేశమయి వీరుని కొఱకు అశ్రుధారలు కార్చిరి. ఊరేగింపు టుత్సవమును 12 కెమేరాలతో ఛాయాగ్రహణము గావించి సినీమాఫిల్ముగా దేశమున ప్రదర్శించుచున్నారు.]

## యతీంద్రనాథదాసు

ఇరువదియైదేండ్ల ప్రాయమున, మానవుడు తన స్వతంత్ర జీవితపథమున తప్పటడుగుల నిడుచు ప్రవేశించు లేతవయసుననే, కేవలనిస్స్వార్థమును నొక మహదాశయమునకై నిర్భయముగ పరమానందముతో తన ప్రాణముల నర్పించిన మహావీరుడు యతీంద్రనాథదాసు. యతీంద్రనాథుడు బెంగాలీ యువకుడు. 1920 సం. న సహాయనిరాకరణోద్యమము సాగించుటకు కాంగ్రెసు మహాసభ తీర్మానించుకొన్నది. యతీంద్రు డా యుద్యమమునఁజేరి మిగుల నుత్సాహముతో పనిజేయ మొదలిడెను. అతడిట్లు కాలేజీలో చదువుమాని రాజకీయోద్యమమునదిగుట తండ్రికిష్టము లేకుండెను. కాని యతీంద్రుని యుత్సాహము, కార్యదీక్ష, తండ్రియభిప్రాయమును ధిక్కరించివైచినవి. మొట్టమొదటిసారి 1922 సం. న నీతడు మూడునెలల శిక్ష ననుభవించి కారాగృహమునుండి మిగుల ననారోగ్యముతో వెలువడెను. కాని యీయనారోగ్య మాతని యుత్సాహము లేశమాత్రము భంగపరుపలేదు. కొంచెము దేహస్థితి కుదుటబడగనే మరల యతీంద్రుడు రాజకీయరంగమున దిగెను. ఈసారి మరల కాలేజీలో ప్రవేశించి విద్యార్థిగనుండియే రాజకీయప్రచారమును కొనసాగించుచుండెను. ఇట్లుండ నమాంతముగా బెంగాల్ ఆర్డినెన్సు వచ్చిపడినది. ప్రభుత్వమువారి యనుమానమునకు గురియై ఈ ఆర్డినెన్సు మహోగ్నికి కాహుతియైన వంగయువకులలో మరల మన యతీంద్రు డొకడు. 1925 సం. న మొదలుకొని 1928 సం. సెప్టెంబరువరకునించుమించుగ నొకమూడేండ్లకాలము మరల కారాగారవాసము. ఈకాలముననే యతడు రాజకీయనిర్బంధితులకు తగు సౌకర్యములను ప్రభుత్వమువారిచ్చుటలేదని బాగుగ తెలిసికొనెను. ఈ మూడేండ్లలో ప్రభుత్వమువా రీతని నెన్నిజైళ్లకో త్రిప్పిరి. యతీంద్రనాథదాసు మహాసాహసి మైమనసింగు జైలులో నొకసారి జైలుసూపరింటెండెంటుతో మాటపట్టింపు రాగా, తుద కాతనితో గ్రుద్దులాటకు దిగి యతనిని మర్దించెను. ఆయధికారి యతనిపై కేసు తెచ్చెను, కాని లాభము లేకపోయినది.

జైలుసూపరింటెండెంటు తనయెడ జూపిన దుష్ప్రవర్తనమునకై కొన్నాళ్లు నిరాహారియై యుండి, యా యధికారినుండి క్షమాపణముగైకొని, యతీంద్రనాథుడే తుదకు విజయమందెను. 1928 సం. అక్టోబరునెల 29 తేదిని మరల జైలునుండివిముక్తి కలిగినది. కాని జైలులో నెన్ని బాధల ననుభవించినను యతీంద్రనాథుని యుత్సాహమునకుమాత్రము తరుగు లేకుండెను. జైలునుండి రాగనే కాంగ్రెసువ్యవహారములలో నతనిదీక్ష మరింతయధికమైనది. వలంటీరుదళములకు నాయకుడు; కాంగ్రెసుకమిటీకార్యదర్శి; స్వాతంత్ర్యసమితి సభ్యుడు: ఇన్నివిధముల రాజకీయవ్యవహారములతో సంబంధముగలయతీంద్రనాథదాసు కాలేజీలో బి.ఏ. విద్యార్థికూడ నయ్యెను. ఇంక నాయువకుని ప్రభుత్వమువారిదృష్టి విడుచు టెట్లు? ఇట్లు కొంతకాలము జరుగగనే లాహోరుకుట్రకేసు వచ్చిపడినది ఈసందర్భమున పోలీసువారి పరిశోధనలచే ఉత్తరహిందూస్థానమంతయు నుడికిపోయినది ఈపరిశోధనలలో యతీంద్రనాథుడు పోలీసువారి యనుగ్రహమునకు పాత్రుడగుటలో నింక నాలస్య మేమున్నది? 14-6-29 తేదిని అరెస్టుచేయబడి యతీంద్రనాథబాబు లాహోరుజైలులో నుంపబడెను. రాజకీయనిర్బంధితుల నిరాదరణ ఇంతకుమున్నే యతని హృదయము గాల్చి వైచుచుండెను. అందుచే లాహోరు జైలులో ప్రవేశింపగనే యతడు ఈయన్యాయమును తొలగింప ప్రయత్నించుటయే, దీనికి నిరోధము బూనుటయే తన ప్రధానకర్తవ్యమని నిశ్చయించుకొన్నాడు. అతనితోడిఖైదీలుగూడ నతని యభిప్రాయము నంగీకరించిరి. వెంటనే యుపవాసము లారంభమైనవి ఆ యన్యాయ మంతరించినగాని భోజనము ముట్టమని వారందరును స్పష్టముగ జాటిరి. వారములు, పక్షములు గడచిపోయి, విచారణకూడ నిలిపివేయవలసిన యవసరము తటస్థించువరకు ప్రభుత్వమువా రావంకకు తమదృష్టి బోనీయలేదు. తుదకు కేసు విచారణకే యవకాశము లేకుండపోయినప్పుడు, ఖైదీలను కోర్టులోనికి తీసికొనివచ్చుటయే యసాధ్యమై పోయినప్పుడు, వారిలో కొంచెము కదలిక పుట్టినది. సమాధానమునకు ప్రయత్నము లారంభమైనవి. జైలుపరిస్థితులను విచారించుట కొక విచారణ సంఘము నియమింపబడినది. యతీంద్రనాథు డెట్టి షరతులు లేకయే విడిచిపుచ్చుటకు వాగ్దానము గావింపబడెను. అంతటితో అభోజనవ్రతము చాలమంది మానివైచిరి; కాని ప్రభుత్వమువారు మరల మామూలు పాటయే పాడ నారంభించిరి. జామీను నిచ్చిననేకాని యతీంద్రనాథుని వదలిపెట్టుటకు వీలు లేదనిరి. ఇట్లు ప్రభుత్వమువా రసంబద్ధముగ ప్రవర్తించినప్పుడు యతీంద్రుడు తన యభోజనవ్రతమును విడిచిపెట్టునా? జామీను నిచ్చుటకతడు ఆసలే యొప్పుకొనలేదు. యతీంద్రనాథు డింక జీవించునన్న యాస లేదు. కాని యతని చావుబ్రతుకులతో ప్రభుత్వమున కేమి సంబంధము? భారతదేశమున బ్రిటిషు ప్రభుత్వమువారి ప్రతిష్ఠయెదుట నిర్భాగ్యుడగు నొక భారతీయయువకుని ప్రాణ మేపాటిది? ఇంత మొండితనమా? ఇంత పట్టుదలయా? చావుబ్రతుకులలో నున్నను జామీను నివ్వడేమి? ప్రభుత్వప్రతిష్ఠను మంటగలుపు నేమి? యతీంద్రుని ప్రాణము లోకమునుండి యెగిరిపోవుచున్నది. ప్రభుత్వమువారికి దానితో పని యేమున్నది? దుకాణమంతయు దొంగల కప్పగించి, యజమాని యాజ్ఞప్రకారము "తలుపులు జాగ్రత్తపెట్టిన సేవకునివలె, వారు పైనుండి యతీంద్రనాథుని చూచుటకై ప్రజ లెక్కడనుండి వచ్చి జైలుమీద పడిపోవుదురో యని ఆ విషయమున కట్టుదిట్టముల గావించుటలో మిక్కిలి తన్మయులై యుండిరి. తుదకు 63 రోజుల సుదీర్ఘోపవాసమున కనంతరము యతీంద్రనాథుని ప్రాణము లాతని భౌతికశరీరమును వీడిపోయినవి యతీంద్రుని దేహము నిష్ప్రాణమైనది; కాని ముందుగ ప్రభుత్వప్రతిష్ఠను నిర్జీవ మొనర్చియే యది తనజీవము వీడినది. యతీంద్రుడు పోరాడినది తన సౌకర్యముల కొరకు కాదు ప్రత్యేకముగ నధికారులు తనకు కొన్ని సదుపాయము లొనర్చినను అతడు తనపట్టు వీడడు. లేక మరియేవ్యక్తికినిగూడ సంబంధించినది కా దతనిదీక్ష. ఒక జాతి మరియొక జాతియెడసలుపు ఘోరమగు నొక యన్యాయమును బహిరంగముగ, హృదయస్ఫూర్తిగ ప్రతిఘటించుటయే, సాధ్యమైనంత తీవ్రనిరసనభావమును దానియెడ ప్రకటించుటయే దాని యాశయము. సాధ్యమైనంత శీఘ్రముగ నన్యాయము నంతరింపజేయుటయే దాని పర

మాదర్శము. తనయాదర్శము సిద్ధించునా యనుచర్చ కిట నవకాశము లేదు. సాధించు ప్రయత్నము మాత్రము తన కర్తవ్యము. మహాయోధుల కర్తవ్యనిర్వహణదీక్షకు వారి జీవితానురాగ మడ్డురాజాలదు. "కర్మణ్యే వాధికారస్తే" యను సజ్జ్వలాదర్శమే వారికి మార్గదర్శి. యతీంద్రుని కార్యదీక్షకు శత్రువులైన నభినందనము లర్పించి తీరవలసినదే. ఆమహాత్యాగము లోకమున కెంతకు ప్రణామయోగ్యమే. ఆ కార్యదీక్ష, ఆనిస్స్వార్థత, ఆ బాధానుభవ సంతృప్తి, ఆజీవిత సమర్పణానందము నెవ్వనిహృదయము విక్షుబ్ధ మొనరింపకుండును? యతీంద్రనాథుని అద్భుతవిజయముచే నెవ్వనిహృదయ మాకృష్టము కాకుండగలదు?

ప్రతివాదిభయంకరం రంగాచార్యులు.

---

## శారదాచట్టము

రాయిసాహెబ్ హరవిలాస శారదాగారు భారత శాసనసభలో నుపపాదింపగా 'బాల్యవివాహ నిషేధ శాసనము' ప్రభుత్వము తోడ్పాటుతో సభ్యులలో ౬౭గురు అనుకూలముగను, ౧౪గురు మాత్రము ప్రతికూల



హరవిలాస శారదాగారు

ముగను ఓటుచేయగా మొన్న సెప్టెంబరు ౨౩వ తేదిని అంగీకరింపబడెను. వ్యతిరేకులుగా నుండిన వారిలోను పెద్దలు కొందరు శాసనమూలసూత్రము నంగీకరించియుండిరి. ౧౪ ఏండ్లలోపు బాలికలకును, ౧౮ ఏండ్లలోపు బాలురకును వివాహములు నిషేధింపబడెను. ఇది రాబోవు వత్సరము ఏప్రిలు మొదటినుండి ఆచరణలోనికి వచ్చును.

ఈ బిల్లు స్టేటుకౌన్సిలువారిచేతను సెప్టెంబరు ౨౮వ తేదీని సంపూర్ణముగ నామోదింపబడెను. అక్టోబరు ౧వ తేదిని రాజప్రతినిధి దానికి సమ్మతితెల్పుచు సంతకము చేసెను.

---

## కాంగ్రెసు అధ్యక్షుడు

సెప్టెంబరు మాసాంతమున జరిగిన అ. భా. కాం. సంఘసభయందు గాంధీమహాత్ముడు రాబోవు లాహోరు కాంగ్రెసున కధ్యక్షులుగా నుండ నిరాకరించి జవాహర్‌లాల్ గారిని ఆ స్థానమునకు సూచింపగా, సభ్యు



జవాహర్‌లాల్ నెహ్రూగారు

లందరి ఆమోదముతో వారు రాబోవు మహాసభకధ్యక్షులుగ నెన్నుకొనబడిరి. ఇంతవరకు కాంగ్రెస్ అధ్యక్షులైన వారిలో గోఖలేగారి వెనుక వయసుచిన్న వారు వీరే.




## ఆంధ్రమహిళామణుల కొరకమనవి

అనసూయపత్రికాముగత వ్యాసము. క్రౌను సైజు 30 పుటలు. 'యమ్. యస్. శాస్త్రి అండ్ సన్స్, వేలువాక, (వయా) యలమంచిలి (విశాఖపట్నంజిల్లా)'కు ౦-౨-౬ తపాలబిళ్లలు పంపి ప్రతిని పడయవచ్చును.

శ్రీ కూచి నరసింహముపంతులుగారు అనసూయా పత్రిక కడపటి కొన్నడో వ్రాసియుండిన వ్యాసము ౧౯౧౪ లో ఈ చిన్నికరపత్రముగ ముద్రింపబడినది. ఇందు చక్కని సరళభాషలో శాంతముగ ఆంధ్రమహిళలకు తమ ఉన్నత పవిత్రస్థానమును జ్ఞాపకము, తమ జాతీయసత్త్వమును గుర్తింపుడని, మూఢాచారములను చాందసములను విడిచిపెట్టుడని, అతిబాల్య వివాహములు మానుడని, రజస్వలావివాహాదులు మేలని-నీతి, భక్తి కలిగి యుండుడని-చెప్పిన బోధలు కలవు. పాశ్చాత్యనాగరకత యనబడు వ్యామోహమున బడకుండవలయుననియు నిందు వారు బోధించిరి. జ. బ్ర.

## గృహస్థాశ్రమ తత్త్వము

శ్రీరామతీర్థస్వామి ప్రణీతము. అనువాదకులు తత్త్వానందస్వామివారు. ఇది 'శ్రీ సనాతనగ్రంథమాలలో' మొదటి ప్రచురణము. క్రౌను ౫౧ పుటలు. వెల ౧-౩-౦. వలయువారు గ్రంథమాలాధికారికి 'శ్రాపపోస్టు, (వయా) కొల్లూరు, గుంటూరుజిల్లా' అని వ్రాయవలెను.

ఇందు రామతీర్థులవారు 'గృహస్థజీవనము మోక్షమునకు ప్రతిబంధకము కాకపోగా తక్కుంగల యాశ్రమముల కన్నింటికి నవలంబన మొసగునదై ధన్యమై వెలయగలదు' అను సూత్రమును తమకు సహజమగు మృదుమధురశైలిలో, ఉపమలతో, ఉదాహరణములతో వైరాగ్యబోధకముగ రచియించిరి. మమకారమును అహంకారమును వీడి ప్రతి గృహిణియు, గృహస్థుడును విశ్వాత్మతో తన సామ్యమును గుర్తించి మోహరహితులై ధర్మజీవనమును గడపుటయే ముక్తిమార్గమని యిందు చక్కగ బోధింపబడినది. అనువాదమును సరళముగనే యున్నది. జ. బ్ర.

## గ్రామపునర్నిర్మాణము

కోట భాస్కరరావు, కొండెపల్ల సుబ్బారాయుడు, వేదమూర్తి సత్యనారాయణమూర్తి గార్లచే విరచితము. రాజమండ్రి, రాజన్ ప్రెస్ న ముద్రితము. క్రౌను ౧౬ పుటలు. వెల తెలియదు

గత సంవత్సరపు ఆంధ్రవిద్యార్థి సభాతీర్మానము ననుసరించి వేసవి సెలవులలో కొందరు విద్యార్థులు గ్రామములలో ప్రచారమునకు బయలువెడలి గోపాలపురము, పోలవరము, పాడగట్లపల్లి, ర్యాలి, ఆత్రేయపురము, ఉచ్చిలి, వద్దిపఱ్ఱు, వెలిచేరు, రాజవరము, పేరవరము, క్రొత్తపేట గ్రామములందు చేసిన ప్రచారకార్యక్రమ వివరము లీచిన్ని పుస్తకముగా ప్రచురింపబడినవి. ఇందు విద్య, భాండాగారములు, పత్రికలు, ఖద్దరు, పరపతి సంఘములు, పంచాయతులు—వీని యావశ్యకతయు, సాంఘికదురాచారములు తొలగిపోవలసిన యావసరమును గూర్చిన యుపన్యాసముల సారాంశము కలదు. జ. బ్ర.

## కర్మఫలము

ఒకపారసీకకథ ననుసరించి బులుసు పాపయ్యశాస్త్రిగారిచే వ్రాయబడినది. అనకాపల్లి, సూర్య ముద్రాయంత్రమునుండి వెలువడినది. వెల ౦-౦-౬.

సరళమైన పద్దెములలో ౮ పుటలుగ వ్రాయబడిన యీ చిన్ని కథ మంచినీతియు, చమత్కారమును గలది.

అంపశయనము సాగించుచుండిన యొకయువకుని తన ప్రియురాలి చేతి విషాహారమువలననే మృత్యువాత బడుటయు, నామె వెఱ్ఱియెత్తి 'చేసినదానికి ఫలము పొందక తప్పదు తప్ప'దని యఱచుచు ఊరుదిరుగుటయు దీని పర్యవసానము. జ. బ.

## సహకార ప్రథమబోధిని

## (Primer of Co-operation)

ఇది బొంబాయిరాష్ట్ర సహకార ఇన్‌స్టిట్యూట్ వైస్ ప్రెసిడెంటును, సైడెన్‌హాం కాలేజి ప్రొఫెసరు నగు హెచ్. ఎల్. ఖాజీగారు (ఎం. ఏ., బి. ఎస్-సి., ఐ. ఈ. ఎస్., జే. పి.) ఆంగ్లభాషలో వ్రాసినపుస్తకముయొక్క భాషాంతరీకరణము.'

డెమ్మిసైజున ౬౪ పుటలు. దళసరి కాగితము. చక్కని యచ్చు. వెల ౧౧ అణాలు.

గ్రంథకర్త ౧౯౩౬ జూన్ నెలలో బొంబాయిలోని ఇండియన్ బ్రాడ్‌కాస్టింగ్ కంపెనీ (దూరశ్రవణ యంత్రనిర్మాణము) వారి కోరికపైని బహుళప్రచారమునకై ౧౪ నిమిషములలో నొక్కొక్కటి ముగియునట్లుగ నొసగబడిన ౬ ఉపన్యాసముల సంపుటీకరణమిది. ఇందు బొంబాయి రాష్ట్రములోని సహకార పరపతి సంఘముల, వ్యవసాయ ఋణసంఘముల, ఉద్దేశ్యములు, ఆశయములు, నిర్వహణము, చరిత్ర వివరింపబడినవి. బాగుగా తెలిసినవా రొసగిన యుపన్యాసములే యైనను అనువాద మేమియు బాగుగ నుండలేదు. అరవ తెలుగు అనబడు మద్రాసు తెలుగులో తికమకల వాక్యములలో రచియింపబడుటచే నిది పాఠకునికి కొంత కష్టము కలిగించును. ప్రచురణము మాత్రము నేటిరోజులలో ఆవశ్యకమైనదే.

జ. బ.

## సంతాన నిరోధము

గుణదోష విచారణ

క్రౌను సైజున 52 పేజీలు. వెల 8 అణాలు. గ్రంథకర్తవిలాసము:— జ. సాంబశివరావుగారు, 32, అక్బరు సాహెబువీధి, ట్రిప్లికేను, మదరాసు.

ఇది గ్రంథకర్తగారు పూనుకొని గ్రంథముగ వ్రాసి అచ్చొత్తించిన ప్రచురణ కాదు. ఆంధ్రపత్రికలో ప్రచురింపబడిన వారి కొన్ని వ్యాసముల పునర్ముద్రణ మిది. అందుచే సంతాననిరోధ సమస్య - దాని జన్మము-అవలంబనము-దాని కనుకూల ప్రతికూల వాదనలు-దానియొక్క ఆర్థిక నైతిక బాధ్యతలు-తుదిపరిణామము-భారతదేశమునకు, ఆంధ్రదేశమునకు నదెట్లు వర్తించును?- బిడ్డ లెక్కువయుండుట దేశమునకుగాని, ప్రపంచమునకుగాని నష్టమా?- నైతిక బ్రహ్మచర్యసాధనములు సాధ్యమే కావా?-పవిత్రమగు గార్హస్థ్యజీవన విధులను అనుమానాస్పదమైన వాదముతో కూడుకొనిన పాశ్చాత్య రాజకీయార్థిక వైద్య సిద్ధాంతములు కల్లోలపరుప వలయునా?-అను నీ మొదలగు మూలసూత్రములపై శాస్త్రీయదృష్ట్యా క్రమముగా జరిగి, నేటి సంతాననిరోధ కృత్రిమ నీచవిధానములు ఖండింపబడుట కింత నవకాశము లేదు. అందుచే నిది యొక గ్రంథముగ సంపూర్ణత కనజాలదు. ఎక్కువ వాదసౌలభ్యము కంటెను, అంకెలు లెక్కలునే సర్వసమస్యలకు జీవనము- పరిష్కారము ననుకొను ఈరోజులలో నిట్టిగ్రంథమునకు ముఖ్యముగా నుండదగిన గట్టిప్రమాణములకంటెను, ఎక్కువగ సత్యమగు దూరపుచూపుతో కృత్రిమవిధానముల నవలంబించుటవలన సంభవమున కలుగజాలు అవినీతి-'నైతికముగు దివాలా'ను గూర్చి వ్రాయబడినది.

మనకు కామోపభోగము కావలయునట! ఈశ్వరప్రసాదమగు సంతతి యక్కఱలేదట! మానవునిలోని పశుప్రవృత్తి ప్రకటనమున కడ్డుపెట్టలేమట! కేవల సంతానము కొఱకే నియమింపబడిన స్త్రీపురుష సంయోగ పవిత్రతను దుర్వినియోగపఱుతుమట! కర్మ కావలెను: ఫల మక్కఱలేదు! మన కామమును పోషించుకొందుము: బిడ్డలను పోషించుకొనజాలము! ఇంద్రియనిగ్రహము-సద్బ్రహ్మచర్యము చేయజాలనియెడల, హెచ్చు కామసంతృప్తి కావలసినయెడల, తృప్తికిమీరిన బిడ్డలు కలుగుదురు! కన్నవారిని పోషించియే తీరవలయును. గర్భము మాత్రము కలుగకుండుటకు పెట్టుఅడ్డులకు వలయు కృత్రిమపు సాధనములన్నియు విదేశీయులు తయారు

చేసి దిగుమతి చేయుచున్నవే. తుదకీమార్గమునను-ఇట్టి గ్రంథములకును, సాధనములకును-పరాయివానికే ధనప్రవాహమును పంపవలసియున్నది నిర్భాగ్యమగు భారతదేశము. సరియగు ప్రభుత్వవిధానమును, ఆర్థికనిర్మాణము నుండినయెడల ౩౫ కోట్ల ప్రజలకును మన భరతమాత సుష్ఠుగా భోజనమిడి వస్త్రాచ్ఛాదనము చేయగలదు. ఇప్పుడే అందులకు వలయు సామగ్రి దేశమున సమృద్ధిగను న్నది: దొరలు, ఇతరదేశపు బందిపోట్లును కొల్లగొనిపోవుచున్నారు, మనల దరిద్రులుగ విడిచి.

ఎంత స్థూలముగ వ్రాయబడినను, సూక్ష్మజ్ఞానయుతమగు ప్రతిపాదన జరుపబడకపోయినను, శాస్త్రీయముగ (scientific) నిర్దుష్టఖండనము కాజాలకపోయినను, ఈగ్రంథమున కర్త ఉత్తమాభిప్రాయములను— భారతీయాత్మకు సహజమగు వానిని— వెల్లడించెను. మార్క్సు సబబుగను, క్రొత్తసిద్ధాంతమే అవశ్యాచరణీయముగను ఎంచు తొందరపాటు గల నవీన భారతీయులకు తప్ప, నేటి యీ కృత్రిమ గర్భనిరోధ సిద్ధాంతమెవ్వరికిని నచ్చదను సంగతి వంద అంగీకరింతురు. జ. బ్ర.

## గంగావతరణము (పార్వతీగర్వభంగము)

గ్రంథకర్త:—దేశముఖు (?) దేశపాండ్యా (?) సోమరాజు రామానుజరావుగారు. డెమ్మీసైజు. ౧౧౪ పేజీలు. వెల రు ౧-౮-౦. గ్లేజు కాగితములపై ముద్రింపబడినది.

ఇది యేడంకముల నాటకము. ఉపోద్ఘాతము లేదు. దీని యితివృత్తము పౌరాణికము. ప్రస్తుతకాలమున పౌరాణికగాథల ననుసరించి వ్రాయబడిన నాటకములు వందలకొలది కలవు. ఇవి వాఙ్మయమున కొనర్చు ఉపకార మధికముగ లేదు. అతిలోక స్త్రీపురుషుల కథల నూహించుటగాని, నిర్వహించుటగాని పరిపూర్ణమైన కార్యము కాదు. ప్రత్యక్షములు, అంతర్ధానములు, పునర్జీవులగుట, దేవతలు, రాక్షసులు, ఇట్టివి ప్రపంచకజ్ఞానమునుగాని, తత్త్వజ్ఞానమునుగాని యభివృద్ధి సేయక మనుష్యుల నకార్యకులుగను, నపౌరుషులుగను చేయజాలుచున్నవి. ఈ రకమైన వాఙ్మయము ప్రోత్సాహనీయము గాదు.

ఇందలి కథ స్త్రీపురుషుల కెల్లరికి తెలిసినదే. గంగలో పార్వతి స్నానము చేయబోవ గంగ బలమగు కారణము చెప్పకయే వారించును. పార్వతి వినదు. "నేనే నీకు సవతినై నీపతి శిరం బెక్కి తాండవమాడి నీగర్వ మడచకున్న నా పేరు మందాకినిగా"దని గంగ ప్రతిజ్ఞ సేయును. నారదుడు కుతంత్రముల బన్ని యిరుపక్షములకు రగుల్కొనవలసిన పగను కల్పించెను. గంగను గొనివచ్చి పితృదేవతలను రక్షింపుమని భగీరథునకు బోధచేసెను. అంత నాతడు తప మారంభించెను. గంగ లేమిచే దేవతలు తల్లడిల్లి విష్ణు శరణుజొచ్చిరి. పాలసముద్రము మథించి అమృతము బొందుడని ఆతడానతిచ్చెను. దేవదానవు లట్లు చేసిరి. శివుడు గరళము మ్రింగి యున్మత్తుడయ్యెను. పార్వతి విచారించెను. నగవేషమున గంగను శివునికి వైద్యముచేయ బంపిరి. అది తెలిసి పార్వతి ఆమెను వెడలగొట్టెను. తపముచేసి నివారింపవలెనని పార్వతి తలచి తపోవిఘ్నము గాకుండుటకు విఘ్నేశ్వరుని సృష్టించెను. శివుడు విఘ్నేశ్వరుని జంపి పార్వతి తపస్సు భగ్నముచేసెను. శివుని అవసానస్థితి. అశ్వినీదేవతలు శివునిపిచ్చి కుదుర్చుటకు గంగతప్ప మఱియెవరి సాధ్యము కాదని తెల్పిరి. పార్వతి యియ్యకొనెను. శివుడు బ్రదికెను. విఘ్నేశ్వరుడు గజాననుడయ్యెను. భగీరథుడు దీక్షాసిద్ధుడయ్యెను.

ఈ యితివృత్తమునకు సహజమగు విపరీతములు తప్ప వేఱేమియును లేవు. శైలి గ్రాంథికము. పద్యములు, పాటలును అతివిస్తారములు. ప్రాకృతికరణ (naturalization) ము గోరవలసిన యీ కాలమున నిట్టివి చాలమట్టుకనవసరము. అవసరమగుచోటగూడ గ్రామ్యము వాడబడలేదు. ఉదా:— ౫ అం. ౩ రం. పాత్రపోషణ చక్కగ నున్నది. యుద్ధము (struggle)యొక్క వివిధదశలు బాగున్నవి. శైలి సులభముగను, వీనుల విందుగ నున్నది.

ప్రకాశకుడు: కురుపూరి సుబ్బారావుగారు, సరస్వతీబుక్కుడిపో, బెజవాడ, కృష్ణాజిల్లా. కే. కా.

## మోహిని

గ్రంథకర్త:—కాశులపాటి గురుమూర్తిగారు. డెమ్మీసైజు, ౯౬ పుటలు. వెల రూపాయి. శ్రీసాహిత్య రత్న గ్రంథమాలా ద్వితీయ కుసుమము. అట్టబైండు. గ్లేజుకాగితములపై ముద్రింపబడినది.

ఇది అయిదంకముల నాటకము. పౌరాణిక కథ. ప్రస్తుత స్థితుల కీలాటి యితివృత్తములు సరిపోవు. ఈర్ష్య, మాత్సర్యము, పగ సాధించుట, పక్షపాతబుద్ధి గలిగి మానవులకంటె నధములైన వారిని దుర్మార్గులుగా జూడక వారిని దేవతలుగా భావించి వారి చర్యలను వర్ణించుట మనకాలమువారికి తగదు. అట్టివి పురాణ కాలమునకే చెల్లును. కావున నిట్టికథలను గురించి నాటకములు, వచనగ్రంథములు వ్రాయుటగాని, నమ్ముటగాని ప్రయోజనము గాదు. ఇట్టివి మన ప్రపంచజ్ఞానమునకు గాని, తత్త్వజ్ఞానమునకుగాని తోడ్పడవు. ఇట్టి యితివృత్తములను గ్రహించుటకంటె ప్రస్తుత ప్రపంచమందున్న సంస్కరణ విషయములో, ప్రహసనిక విషయములో, లేక మరేదోరకముల విషయములు గ్రహించి నాటకములనుగాని, ప్రహసనములనుగాని వ్రాయుట యుత్తమము.

ఇందలి కథ యెల్లరెరింగినదే. రుక్మాంగదుని యేకాదశీ వ్రతాచరణదీక్ష. నరకమునకు పాపులు రాలేదని యముడు విచారించుట. రాజుయొక్క వ్రతమును భంగపరచుటకు బ్రహ్మ మోహినిని సృజించుట. రాజు మోహినికి లోబడి, తనభార్యను పుత్రుడగు ధర్మాంగదుని మరచిపోవుట. నారదుని కుతంత్రములు పన్నుట. రుక్మాంగదుడు తన కొడుకునైన జంపెదనుగాని వ్రతమును జేయ మాననని చెప్పుటచే మోహిని ధర్మాంగదుని ఖండించి శిరస్సును గోరుట. విషాదస్థితి. రుక్మాంగదుడు తనప్రతిజ్ఞ నెరవేర్ప బూనగా శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమగుట మంచి లకు వంశము లంది జరిగినవే.

ఈనాటకమందలి పాత్రపోషణము బాగున్నది. వ్యతిరేకవిషయములు (conflicting elements) గలవు. పంచమాంకమందలి విషాదరస మనన్యసాధ్యముగ నున్నది. భక్తిరసము పొంగి పొరలుచున్నది. ఈనాటకమందు పాటలు లేని లోప మేమియు గానరాదు. నారదుని పట్ల నొకటిరెండుపాట లున్నను ప్రమాదము లేదు. పద్యములు కొంచె మధికముగ నున్నవి. వచనమునందు నెట్టి అలంకారములు లేవు — సులభముగను, మధురముగ నున్నది.

వలయువారు, 'కాశులపాటి కృష్ణమూర్తిగారు, సెక్రెటరీ, శ్రీ బుద్ధిరాజు సుబ్బమాంబ స్మారకనిధి, విజయనగరము (విశాఖపట్టణంజిల్లా)' అని వ్రాయవలయును.

కే. కా.

## వైతరణి (The Vaitarani)

ఇది ఆధునిక సారస్వతమునకును, పరిశోధనమునకును సంబంధించి, ఉత్కళదేశమునుండి ప్రచురింపబడు చున్న ఒక్కటే ఆంగ్లమాసపత్రిక.

మార్చి ౧౯౩౫నాటి సంపు. ౩, సంచిక ౬ మాకు వచ్చినది. విద్యాధరసింగ్ దేవు, బి. ఏ. గారిచే సంపాదితమై; యల్. యన్. సాహుగారిచే ఇతిగపాడియా, కటక్ నుండి ప్రకటింపబడుచున్నది. డెమ్మీసైజున ౩౬ పుటలు. సం. చందా ౩ రూ.

ఈసంచికయందు వ్యాసపాయ వ్యాసమూర్చిన వ్యాసముక్కటిమాత్రమును, గ్రంథవిమర్శనములును కలవు.

జ. బ్ర.

## గృహలక్ష్మి-దసరాసంచిక

కె. ఎన్. కేసరిగారి సంపాదకత్వమున మద్రాసు ఎగ్మూరులోని లోధ్ర ముద్రాలయమునుండి అక్టోబరు ౧ వ తేదీని ప్రచురింపబడిన యీసంచిక నందుకొంటిమి.

ఇందుండు సుమారు ౫౦ వ్యాసములలోను సగమునకు పైగా స్త్రీలే వనితలకును, సంసారమునకును సంబంధించిన విషయములపై వ్రాయుట ఆనందింపవలసిన విషయము. పురుషులును స్త్రీలనుగూర్చియే వ్రాసిరి. దేవీనవరాత్రులు, మహిషాసురమర్దని, సరస్వతి, విజయదశమి, శమీప్రార్థనము అను శీర్షికలుగల యీ వ్యాసములు దసరాకు సంబంధించినవని తెలియుచున్నది.

పసుపుకుంకుమలు అను వ్యాసముతో సంచిక ఆరంభమగుచున్నది. అవి మంగళద్రవ్యములని బోధించుటకు మాత్రము విపరీత ఛాందసము కనుపరుపబడినది. క. వరలక్ష్మమ్మగారి 'స్త్రీ' యనువ్యాసము సబబుగ నున్నదనవచ్చును. ఉగ్గసుబ్బలక్ష్మమ్మగారి 'దాది' చాల బాగుగనున్నది. ముద్దా విశ్వనాథంగారి 'భూమాత సందేశము' వందలి భావము మేలైనది. కి. శే. అన్నపూర్ణాంబగారి 'బీదకుటుంబము' వృత్తాంతకథనము చదువదగినది. వి. సరస్వతిగారు స్త్రీ స్వాతంత్ర్యమునుగూర్చి చక్కని వాదమును చేసెను. రామమోహనరాయలు గొప్పనారీహితైషి యని నూరిగుచ్చి కృష్ణమూర్తిగారు వ్యక్తపరిచిరి. 'స్వప్నవేదన' అను పద్యములు ఇంపుగా నున్నవి. వడివింటి వెంకటరత్నమ్మగారి 'విజయదశమి' పద్యములు అర్థవంతముగ నున్నవి. అట్లూరి సీతమ్మగారు శారదాబిల్లు నధిక్షేపించు ఛాందసపండితులకు హితబోధ చేసిరి. జాగర్లమూడి జానకమ్మగారు 'స్త్రీలు - నాటకరంగప్రవేశము' గూర్చి వ్రాయుచు దానికీడును, అనావశ్యక చర్చను వివరించి, స్త్రీ భార్యగాను, మాతగాను, గృహిణిగాను ఉండుట ఉత్తమమని ఒప్పునట్లుగ బోధించిరి. ధ. లక్ష్మీదేవిగారు 'కారదకు ప్రత్యుత్తర'మని వ్రాయుచు స్త్రీ నాటకరంగ ప్రవేశమును సమర్థించుటకు చాల శ్రమపడి దీర్ఘవ్యాసమును వ్రాసి సందర్భమునకు దూరమైన అధికప్రసంగమును చేసిరి. ఆంధ్రదేశ స్త్రీ విద్యాసంస్థల గూర్చిన పరిచయమిచ్చు వ్యాసమొకటి ఉచితముగనున్నది. నాగలింగం బసవపున్నమ్మచేసిన 'ప్రబోధము' స్త్రీలకు సర్వవిషయముల నీతిని బోధించును. తుంగలలక్ష్మీదేవివేసిన రాధాకృష్ణులు, నీకలవ్యుడు అనుచిత్రములు అగ్రగణ్యములు.

సంపాదకీయాలోచనలో దుర్గాపూజా తత్త్వముగూర్చి వ్రాయుచు స్త్రీయే శక్తిస్వరూపిణి యని నిరూపింప ప్రయత్నము జరిగినది. ఆంధ్ర కృష్ణాపత్రికల పన్నామనముగూర్చిన ప్రశంసావాక్యములు గలవు. వివాహనిరోధనిర్ణయ శాసనముగూర్చి శారదావరకు 'ప్రభుత్వమువారి శాసనఖడ్గము మాత్రము మారదు' అని వ్రాసినవారైనను, నేడు అధిక సంఖ్యగల సభ్యులచే నీశాసనము అసెంబ్లీలోను, స్టేటుకౌన్సిలులోను పాసైనందుకు సంతసము వెలిబుచ్చుట ఆనందదాయకము.

౫ రంగుల చిత్రములును, అనేక సాధారణచిత్రములను కలిగి యీ సంచిక ౧౩౧ పుటలతో నొప్పారుచున్నది. ఈ సంచిక వెల ౮ అణాలు. జ. బ్ర.

## ఇప్పుడు

'ప్రదర్శన త్రయం'. గ్రంథకర్త: భమిడిపాటి కామేశ్వరరావుగారు, రాజమండ్రి. క్రౌను సైజు ౧౩౬ పుటలు. ఫెదరువెయిటు కాగితముతో, మంచి అచ్చుతో చాలా ముచ్చటైన కూర్పు. వెల ౮ అ.

'బాగుబాగు,' 'ఎప్పుడూ ఇంతే,' 'కాలక్షేపాలు' అను మూడు ప్రదర్శనాల సంపుటము ఇది. ఇవి 'భారతి'లో ప్రకటితములైనవి. ఈకాలపు ఇతివృత్తాలతో ఇప్పటి తెలుగువారి పోకడలు కొన్ని నిదర్శించి విమర్శించే ప్రదర్శనాల సంపుటము కాబట్టి 'ఇప్పుడు' అని దీనికి పేరు పెట్టినారు.

ఓర్వలేమి, స్వార్థపరత, అనైక్యము, సులభముగా కీర్తి సంపాదించడానికి పేరాస మొదలైన అవలక్షణములను అవహేళనచేసే వ్యంగ్యప్రహసనాలివి.

క్రొత్తగా తెలుగువాఙ్మయములో వ్యాప్తి, విలసనము అనుభవిస్తూ, భావిఅభ్యుదయానికి ఉవిళ్లూరుతూ ఉన్న హాస్యవాఙ్మయములో ఇది ఒక క్రొత్తకూర్పు. ఇంకా హాస్యవాఙ్మయ వ్యవస్థ సమగ్రముగా ఏర్పడి, పరిజ్ఞాతము కాని ఈసమయములో ఇటువంటి రచనలు, కొన్ని లోట్లతో ఉన్నా, ఆ వాఙ్మయ వ్యవస్థా పరిణామానికి తోడుపడుతవి.

భావుకహాస్యముతో ఒకసమగ్ర సుందరమైన కావ్యము కళామయముగా తీర్చిహార్చే ఉద్యమము ఈ రచనలో ఎక్కడా ప్రతిఫలించదు. తెలుచు గుర్తులము, కృత్రిమము, సంకరము ఐన హాస్యప్రసక్తి కనబడుగుంది. ఔచిత్యము లోటు. ప్రకృతిలో ఉండే సంకరలు అధికముగా చూపడము వ్యంగ్యరచనములో అవలంబనీయమే అయినా, స్వాభావికతకు సమంజసమైనఆదరము లేనప్పుడు

వ్యంగ్యానికి శక్తి ఉండదు—పరిపూర్ణమైన భూమిక లేక. పాత్ర పోషణలోనూ, సంభాషణ క్రమములోనూ కూడా సమంజసత తక్కువగా ఉన్నది ఈ ప్రహసనాలలో.

రక్తి మొదలుపెట్టిన ఒకపుటలోనే కుంఠితమైపోతుంది, విరసమైన కల్పనములవల్లా, వెగటైన సంభాషణలవల్లాను. సున్నితమైన, కళాన్వితమైన హాస్యముకంటె వాచాలత చాలా అధికముగా ఉన్నది. దాదాపు అన్ని పాత్రలూ ఈ ప్రత్యేక లక్షణానికే కట్టుపడి ఉన్నవి. మధ్యతరగతి సంఘములో సాధారణముగా వాడుకొనే హాస్యపుపనికట్టు—పాచిగిలిపోయినదిన్నీ—అమితమై, సందర్భశుద్ధినికూడా పాటించినది లేదు. శబ్దహాస్యమే ప్రధానముగా అవలంబింపబడి ఉన్నది. తన పరిసరపు రసికభావము అందముగా ప్రయోగిస్తూ, ప్రహసనముయొక్క ప్రధానవస్తువులన్నిన్నీ వినూత్నంగా ఉండాలి. అల్పతరహాస్యానికీ, రసాభాసానికీ కూడా లోలుపత వహించి రచయిత కళాసంపదని వేల్చినాడు. తన శక్తిని గమనింపనీయని ఆత్మవిశ్వాసము ఈ రచనను ఆవహించి, సరియైన ప్రాథమిక సంపాదనానికి ప్రయత్న లోపము కలుగజేస్తూ ఉన్నది. వీనివల్ల ఆనందముకంటె విసుగు ఎక్కువ కలుగుతుంది. ఇతివృత్తములలోను, అంతకంటె సంభాషణలలోను క్రమపరిణామము కొరవపడి ఉన్నది. ప్రదర్శనరచన వీరిచేత తగినంత సొంపుగాని, పోషణగాని కాంచలేదు.

రసికత వీరికి లేకపోలేదు. అయితే అది శిక్షిత రీతిని, తీరుసమ్మేళనములతో, ప్రయుక్తము కాలేదు.

ఈ ప్రహసనాలు ఒక సంఘానికి ప్రదర్శనోత్సుకత కలిగించవచ్చు; పఠిస్తుంది పాఠకులకు వినోదము కూర్చవచ్చు; ఏ వ్యంగ్య వాక్యము చేతనో ఒక సంస్థను ఆక్షేపించవచ్చును. అయితే ఏ గుణములోను పటుత్వము చాలదు. హాస్యము కాని వ్యంగ్యముకాని నాటక, సంవాద కానిసంఘల కలకలము మనసులో మిగులుతుంది, ఇది ఓపికతో చదివితే. కనుకనే కళానిర్మాణముగా ఈ సంపుటము ఉన్న స్థానము ఆక్రమించుకోడానికి అర్హమా?—అంటే,—కాదనాలి.

కొం. జ.

---

# స్వీకారము

## వేమన

సర్. ఆర్. వేంకటరత్నమునాయుడుగారిచే పోషింపబడిన వ్యాసములు. రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారిచే విరచితము. ఆంధ్రవిశ్వకళాపరిషత్ గ్రంథమాల వారి రెండవ ప్రచురణము. ౭ ఉపన్యాసములు. క్రౌను సైజు. ౨౧౬ పుటలు. వెల ౧-౮-౦.

## శ్రీ త్యాగరాజస్వామి

గానవిద్యా విశారద-రామభక్తాగ్రణి చరిత్రము. కన్నడము. బెంగుళూరు 'సుబోధకుసుమాంజలి గ్రంథమాల' వారి సచిత్ర మాస పుస్తకావళిలోని 1929 జూన్ నెల ప్రచురణ. సంపాదకుడు: యం. రామరావుగారు. క్రౌను ౪౮ పుటలు. విడిపుస్తకము వెల ౦-౩-౦.

## శ్రీ మయూరధ్వజ నాటకము

ఐదంకములు. గ్రంథకర్త అశ్వత్థరావుగారు, కలుగోడు. పి. బుస్సయ్యశెట్టి అండ్ సన్, బళ్లారి, గ్రంథవిక్రేతలు. డెమ్మీ సైజు ౯౦ పుటలు. వెల రూ ౧-౧-౦.

## బ్రహ్మసూత్రసారసంగ్రహ విమర్శనము

ముట్నూరి గోపాలదాసుగారిచే రచింపబడి ప్రకటింపబడినది. కాకినాడ ఆల్బర్టు పవర్ ప్రెస్సునందు ముద్రింపబడినది. డెమ్మీ ౫౪ పుటలు వెల ౦-౮-౦.

## శ్రీ భద్రాచల రామదాసు

కూర్పరి: శ్రీ డి. యస్. శర్మగారు, తెక్కలి. పబ్లిషర్సు: వేంకటరామ్ అండ్ కో, ఏలూరు. క్రౌను ౪౦ పుటలు. వెల ౦-౪-౦.

## ఉమాకాళక్షేత్రమాహాత్మ్యము
(నిర్వచనము)

ఇది బ్రహ్మవైవర్తపురాణాంతర్గతమైన సంస్కృత గ్రంథమునుండి బులుసు పాపయ్యశాస్త్రిగారు తెలిగించి

నది. అనకాపల్లి, సూర్యముద్రాయంత్రమునుండి ప్రచురింపబడినది. డెమ్మీ ౨౩ పుటలు. వెల ౦-౮-౦.

## శ్రీ సత్యనారాయణ మాహాత్మ్యము

గ్రంథకర్త: కావ్యతీర్థ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు. చెన్నపురి, వావిళ్ల రామస్వామి ముద్రితము. క్రౌను ౧౧౮ పుటలు. వెల ౦-౮-౦. 'కవితా సామ్రాజ్యము, సంద్యాలోకు వ్రాసిన ప్రతులు దొరయగలవు.

## (౧) అచ్చతెలుగు ఋతుసంహారము

శ్రీ మహాకవి కాళిదాస ప్రణీత కావ్యమునకు భాషాంతరీకరణము. డెమ్మీ ౨౫ పుటలు. వెల తెలియదు.

## (౨) ఆంధ్రస్తోత్రమణిత్రయి

శ్రీ జగద్గురు శంకరాచార్యకృత స్తోత్రముల కనువాదము. క్రౌను ౧౨ పుటలు. వెల ౨ అణాలు.

## (3) ఆంధ్ర బాలరామాయణము

శ్రీ వాల్మీకిమహర్షి ప్రణీత సంక్షేపరామాయణరూప ప్రథమసర్గమున కాంధ్రీకరణము. క్రౌను ౨౩ పు. వెల. ౦-౪-౦.

ఈ పై మూడు పుస్తకములును చింతపల్లి రామకృష్ణమూర్తిశాస్త్రిగారిచే రచింపబడినవి. వలయువారు గ్రంథకర్తకు: 'ఈపురిపాడు, గుంటూరుజిల్లా' అని వ్రాయవలయును.

## శ్రీ ప్రమోదూత సం. సిద్ధాంతపంచాఙ్గమ్

ఇది అనంతపురము మ్యునిసిపల్ హైస్కూలు నందు సంస్కృతపండితుడును కావ్యపురాణతీర్థ అలుమూరు త్రిపురాంతకం శివరామశాస్త్రిగారిచేతను, ధర్మవరంసిద్ధాంతి పంచాఙ్గము నివర్తి కుమారశర్మచేతను గుణింపబడి అలుమూరు జయరామశాస్త్రిచే ప్రకటింపబడినది. డెమ్మీ ౪౮ పుటలు.

## శ్రీమదాంధ్ర కార్తికమాహాత్మ్యము (పురాణము)

ఇది కృష్ణాజిల్లా కొవ్వూరు బోర్డు హైస్కూలు నం దాంధ్రపండితులగు శ్రీ అరిపెద్ది జగన్నాథశాస్త్రిగారిచే రచియింపబడి, ఏలూరు రామా ముద్రాక్షరశాలయందు అచ్చొత్తింపబడినది. డెమ్మీసైజు ౧౬౭ పుటలు. వెల ౧ రూపాయి.

## ముత్యాలసరములు-చిన్నకథలు

గ్రంథకర్త: కీ. శే. గురజాడ వెంకట అప్పారావుగారు, బి. ఏ., ఎఫ్. ఎమ్. యు. ప్రకాశకులు: గురజాడ వెంకటరామదాసుగారు, విజయనగరం ఫోర్టు. క్రౌను సైజున ౧౦౦ పుటల గ్రంథము. వెల తెలియదు.

ఇందు ముత్యాలసరములు, కాసులు, లవణరాజుకల, కన్యక, డామన్ పితియస్, ఆడపిల్లలపాటలు, దేశభక్తి, లంగరెత్తుము, కొరుకొండ, దించులంగరు, మనిషి-యను కవితలును; దిద్దుబాటు, మీపేరేమిటి-యను కథలును కలవు. దీనిపై విమర్శనము రాబోవుసంచికలో ప్రకటింపబడును.

## గ్రామపునర్నిర్మాణపు తరగతుల ఉపన్యాసములు

'తాడేపల్లిగూడెం తాలూకాబోర్డువారిచే వసంత ఋతువిద్యాలయమును పేరిట ౧౫-౫-౨౯ లగాయతు ౫-౬-౨౯ వరకు జరుపబడి, అందు ఆంధ్రప్రముఖులచే వివిధవిషయములనుగూర్చి యిప్పించిన ఉపన్యాసముల సంపుటీకరణమిది. ఇందు ౫౩ ఉపన్యాసము లున్నవి. అనేక ఛాయాచిత్రము లున్నవి. క్రౌనుసైజున ౪౭౨ పుటల గ్రంథము. వెల ౧-౦-౦.

ప్రకాశకులు:— యస్. సుబ్బారావుగారు, కొవ్వూరు, పశ్చిమ గోదావరి జిల్లా.

### భీమావ్యాపారము (Life Insurance)

గ్రంథకర్త: యస్. సుబ్బారావుగారు, ఆర్గనైజరు అండ్ ఏజంటు, ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్, కొవ్వూరు, పశ్చిమ గోదావరిజిల్లా.

క్రౌను ౯౬ పుటలు. వెల ౧-౮-౧. అనేక ఛాయాచిత్రము లున్నవి.

### శ్రీ రఘురామ శతకము

గ్రంథకర్త: కల్వకొలను వేంకటప్పయ్యశాస్త్రి గారు. గుంటూరు, శ్రీ వేంకటేశ్వర ముద్రాక్షరశాలలో ముద్రింపబడినది. క్రౌను ౩౧ పుటలు. వెల తెలియదు.

### కంసవిజయము

ఇది యొక ప్రాచీన గ్రంథము. గద్యపద్యాత్మకమైనది. కర్త: పాటిబండ పురుషోత్తము కవిగారు. గాదె కోటిరెడ్డిగారి సంపాదకత్వమున సత్తెనపల్లి భారతీగ్రంథమండలి తృతీయ కుసుమముగ వెలువడినది. క్రౌను ౧౮౬ పుటలు. చక్కని రేపరు. వెల ౧ రూ.

---

## మాణిక్యవీణ

అష్టావధాని వద్దాది సీతారామాంజనేయులు గారు (కవితాసమితి)

ఈ రతనాలవీణఁ గొనుమీ యది నీయది; దీనిపై శ్రుతుల్
దీరిచి పాడుకొమ్ము గురులీలలఁ; దత్ప్రణవామృత స్రవం
తీరణదూర్మికామృదులనిర్మలడోలల నూఁగుచుం, సహ
స్రార సరోజనౌకపయి హాయిగఁ దేలుచు హంసవాహినీ!

"మణిద్వీపము."

---



సముద్రమున నక్షత్ర రూపము

మార్గ్యాలపస్నాన ప్రయోజనమందు విఖ్యాతముగల 'ప్లిమత్ లేడీస్ స్విమ్మింగ్ క్లబ్'లోని 8 గురు సభ్యురాండ్రు నీటియం దీదులాడుటలో నొక వినోదముగు క్రీడ యిందు కానవగును.

## మహాత్ముని జీవితసందేశము

సత్యంవద। ధర్మంచర। స్వాధ్యాయాన్మా ప్రమదః। ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః। సత్యాన్న ప్రమదితవ్యం। ధర్మాన్న ప్రమదితవ్యం। కుశలాన్న ప్రమదితవ్యం। భూత్యై న ప్రమదితవ్యం। స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యం। దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యం। మాతృదేవో భవ। పితృదేవో భవ। ఆచార్యదేవో భవ। అతిథిదేవో భవ। యాన్యనవద్యాని కర్మాణి। తాని సేవితవ్యాని। నో ఇతరాణి। యాన్యస్మాకగ్ం సుచరితాని, తాని త్వయోపాస్యాని। నో ఇతరాణి ॥

యే కే చాస్మచ్ఛ్రేయాగ్ంసో బ్రాహ్మణాః। తేషాం త్వయాసనేన ప్రశ్వసితవ్యం। శ్రద్ధయా దేయం। అశ్రద్ధయాదేయం। శ్రియా దేయం। హ్రియా దేయం। భియా దేయం। సంవిదా దేయం। అథ యది తే కర్మవిచికిత్సా వా వృత్తవిచికిత్సా వా స్యాత్ ॥

యే తత్ర బ్రాహ్మణాస్సమ్మర్శినః। యుక్తా ఆయుక్తాః। అలూక్షా ధర్మకామాస్స్యుః। యథా తే తత్ర వర్తేరన్। తథా తత్ర వర్తేథాః। అథాభ్యాఖ్యాతేషు। యే తత్ర బ్రాహ్మణాస్సమ్మర్శినః। యుక్తా ఆయుక్తాః। అలూక్షా ధర్మకామాస్స్యుః। యథా తే తేషు వర్తేరన్ ॥

తథా తేషు వర్తేథాః। ఏష ఆదేశః। ఏష ఉపదేశః। ఏషా వేదోపనిషత్। ఏతదనుశాసనం। ఏవముపాసితవ్యం। ఏవము చైతదుపాస్యం। స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యం। తాని త్వయోపాస్యాని విచికిత్సా వా స్యాత్తేషు వర్తేరన్ ॥

ప్రపంచకల్యాణమునకై మహాత్ములకారణముగను సర్వసంగపరిత్యాగమును జేయుచు ప్రజారాధనమునకు పాత్రులగుచున్నారు. సామాన్యులకు స్వప్రయోజన పరాయణత్వము సహజమైనటుల మహాత్ములకు పరహిత పరాయణత్వము సహ[జ]శీలము. సామాన్యులకు పశుబలము పరిపాటియై[న]టులు మహాత్ముల కాత్మబలము సహజమగుచున్నది. సామాన్యులకు భోగ మారాధ్యమైనటులు మహాత్ములకు త్యాగ మారాధ్య మగుచున్నది. సామాన్యుల కాగ్రహము సహజముగ గలుగునటుల మహాత్ములకు నిగ్రహము సహజముగ గలుగ[ు]చున్నది. సామాన్యులకు బాహ్య విషయముల ప్రమాణ మైనటులు మహాత్ముల కాత్మవిషయముల ప్రమాణము లగుచున్నవి. ఒకనికి తనలాభము, త[న]వారి లాభము: రెండవవానికి మానవ లాభము[,] విశ్వలాభము. సామాన్యుల యాచరణము సంరం[భ]మునకును, మహాత్ముల యాచరణము శాంతికి[ని] సాధనము లగుచున్నవి.

మహాత్ములయాచరణములు సామాన్యుల క[ా]దర్శములై పురుషార్థసిద్ధికి సాధనము లగుచున్న[వి.] మహాత్ములయాచరణములుభిన్నసంస్కారములుగ[ల] జనులకు వారుతలచినటులు గోచరంబగుచుండును[.] దైవసంపన్నులు వారిభక్తులకు వారికోరికలకనురు[ూ]పముగను ప్రత్యక్షమగుచు ధర్మాభ్యుదయమును జేయ[ు]చున్నారు. శ్రీకృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తు మొదలగ[ు] దైవసంపన్నులు ధర్మాభ్యుదయమును జేసిన వి[ధ]మును ప్రపంచచరిత్ర సహస్రముఖములను చాట[ు]చున్నది. గాంధిమహాత్ముని దివ్యచరిత్రమును మహనీయుల దివ్యచరిత్రమును సంస్మరింపజేయ

న్నది. తైత్తిరీయోపనిషత్తునందు శిక్షావల్లి తెలు
చున్న సత్యధర్మాదేశోపదేశానుశాసనములు
ంధీ మహాత్ముని గురుత్వమున కనురూపముగ
న్నవి.

గాంధిమహాత్మునకు 60 ఏండ్లు నిండినవి. దేశ
మునం దంతటను అక్టోబరు మాసాదిని జయంత్యు
త్సవములు జరుపబడినవి. ఆ యుత్సవములం దన్ని
తులవారును, మతములవారును, జాతుల
వారును గాంధిమహాత్ముని గుణ సంకీర్తనమును
సిరి. అన్న వస్త్రదానములను జేసిరి. సభలను, సంకీ
ర్తనలను జేసిరి. గీతములను బాడిరి. బోధలను జేసిరి.
ంచికలను ప్రచురించిరి. ఖద్దరును విక్రయించిరి.
మహోత్సవము లన్నియును ధర్మసంస్మరణమును
లుగ జేయుచున్నవి.

గాంధిమహాత్ముడు శ్రీనివాసశాస్త్రి గారికి
తికచక్రవర్తి; డాక్టరు సుబ్బారాయనుగారికి సం
స్కరణప్రియుడు; సత్యమూర్తిగారికి రాజ్యాంగ
రీణుడు; హోమ్సుగారికి మానవసేవా పరాయ
ణుడు; రోమెయిను రోలెండుగారికి ధర్మమూర్తి;
రోజనిదేవిగారికి త్యాగసంపన్నుడు; లోకమునకు
ంతిదూత; భారతీయుల కవతారమూర్తి. సర్వా
స్వరూపుడైన భగవంతు నెవ రేవిధముగ నారా
చెదరో వారల కావిధమున ననుగ్రహించు
న్నాడు.

యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజా మ్యహమ్,
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః.

గీత. అ. ౪, శ్లో. ౧౧.

వర్తమానకాలమునందు లోకమునందంతటను
ఘోష ప్రతిధ్వనిల్లుచున్నది. ఆస్తికులు నాస్తి
కులు, నిరంకుశాధికారులు స్వరాజ్యకాములు, సంగ్రామకాములు శాంతిప్రియులు, పూర్వాచారప్రియులు సంస్కరణప్రియులు, పండితులు పామరులు ధర్మప్రతిజ్ఞలను జేయుచున్నారు. స్వార్థమునకును పరార్థమునకును, భోగమునకును త్యాగమునకును, దైవసంపదలకును ఆసుర సంపదలకును ధర్మప్రవచనములను ధర్మరాజులు చేయుచున్నారు. అధికారానధికారులు చేయుచున్న ధర్మప్రవచనములు ప్రజలకు మహాసంభ్రమమును గలుగజేయుచున్నవి. కర్తవ్యము మాత్రము దుర్గ్రాహ్యముగ నున్నది.

రాజ్యాంగవిశారదులు స్వరాజ్యము పరమధర్మమని చాటుచున్నారు. అర్థికవిద్వాంసులు భౌతిక భాగ్యములు ధర్మార్థము లని నమ్ముచున్నారు. సాంఘికసిద్ధాంతులు సంఘ సంస్కరణము పరమ ప్రయోజన మని ఉద్ఘోషించుచున్నారు. మత ప్రియులు మత సంరక్షణము పరమార్థ మని ఘోషించుచున్నారు. ఆచారప్రియులు పూర్వాచారసంరక్షణమే ప్రధానధర్మ మని వాదులాడుచున్నారు. అసురబలప్రియులు సంగ్రామసన్నాహములు కల్యాణసాధనము లని సమర్థించుచున్నారు. వృత్తమునందలి వలయమునం దన్ని స్థలములును భిన్నమై కేంద్రమునకు సమానదూరమునం దున్నను, కేంద్రముమాత్రము స్థిరముగ నున్నది. కేంద్రధర్మాధారములేని ప్రత్యేకధర్మములు నైమిత్తికధర్మములైనను, నిత్యధర్మములు గాజాలవు. వర్తమానవిషాదదశయందు ధర్మసంరంభమునందు సంశయములను దీర్చి నిత్యమైన ధర్మోపదేశములను చేయగల ధర్మాత్ములు ధన్యులు. అట్టి

ధర్మాత్ములందు గాంధిమహాత్ముడు లోకాదరణమును బడయుచున్నాడు. వారి లోకాదరణమునకు వారి ఆత్మధర్మారాధనమె మూలముగనున్నది.

ధర్మరాజునకు భీష్ము డుత్తమధర్మ మాత్మధర్మ మను విషయమును విశదముచేసెను:

తే. "వినుమ నేకవిధంబుగా విస్తరిల్లు
ధర్మములయం దొకండును దలప నివ్వ
లంబు లే దాత్మమోక్షావలంబి యైన
ధర్మ ముత్తమ మండ్రు తత్త్వజ్ఞు లధిప."

గాంధిమహాత్మ డాత్మకథయందు ఆధ్యాత్మికలక్ష్యముతో జేసిన ధర్మనిర్ణయము భీష్మును ధర్మరాజునకు జేసినధర్మనిర్ణయమున కనురూపముగ నున్నది:

"నా ప్రయోగములం దాధ్యాత్మికము లనగా నైతికములు; ధర్మమున కర్థము నీతి; ఆత్మదృష్టితో ఏనీతి పాలింపదగినదో అది ధర్మము......... నేను తటస్థుడనై, అభిమానరహితుడనై, ఈ కథను వ్రాయగలిగితినేని, ప్రయోగ మార్గానుగాము లగు నితరుల కిందు దారి బత్తెము దొరకగలదు.

నేను కేవలము సిద్ధాంతములను అనగా తత్త్వములను గూర్చి వ్రాయదలచితినేని ఆత్మకథను వ్రాయను. కాని యీ సిద్ధాంతములనుండి బయలుదేరిన కార్యముల యితిహాసమును వ్రాయగోరుచున్నాను. కావున నే యీ ప్రయత్నమునకు సత్య ప్రయోగమని మాఱుపే రుంచితిని. ఇందు సత్యముకన్న భిన్నము లనబడు అహింసాబ్రహ్మచర్యాదినియమములును, వీని ప్రయోగములును రాగలవు. కాని సత్యమే నా కన్నిటికన్న దొడ్డది. మఱియు దీనియందు పెక్కు వస్తువులసమావేశము కలదు. ఆసత్యము స్థూలముగా వాక్సత్యమే కాదు: భావసత్యముకూడ. ఆసత్యము కేవలము నా కల్పనాగతసత్యమే కాదు: అది స్వతంత్రము, చిరస్థాయి; అనగా సాక్షాత్పరబ్రహ్మము.

వందలు వేలు మ్రొందుదురుగాక! సత్యమునకే సదా జయమగుగాక! అల్పాత్ముల ప్రమాణముచే సత్యముయొక్క ప్రమాణము నీచతరము కాకుండుగాక!

నేను నిండు నమ్మికతో ఎవనిని నాయాప్తునిట్టార్పులకేలికగా తలచుచుంటినో, మఱియు ఎవని యుప్పొంగుల్లు నేను తినుచుంటి ననుకొనుచుంటినో, అలవానికి నే నింతవఱకును దవులనే యుంటి నను నీచింత ప్రతిక్షణము నన్ను తొలుచుచున్నది. దీనికి కారణము నావికారములే యని నాకు దెలియును. కాని వీని నింతవఱకు నిర్మూలము చేయజాలకున్నాను."

ఆధ్యాత్మికధర్మము నిత్యమై సకలధర్మముల కాధారభూతముగ నున్నది. సత్యాన్వేషణమునకును, ధర్మాన్వేషణమునకును ఆత్మార్పణముచేయుచున్న గాంధిమహాత్ముని జీవయాత్ర మానవులకు సంకీర్తనయోగ్యముగ నున్నది. జీవయాత్రను సత్యాన్వేషణమునకై ఆహుతిచేయుచున్న మహాత్ముని పావనచరిత్ర మల్పాత్ములకు ధర్మాన్వేషణమునకు సాధనభూతముగ నున్నది.

శ్రీకృష్ణుడు విజయున కాత్మసాక్షాత్కారమునకు కర్మయోగము నుపదేశించెను. బుద్ధభగవానుడు దుఃఖనివృత్తికి విశుద్ధజీవనమును, జీవకారుణ్యమును లోకమున కనుగ్రహించెను. ఏసుక్రీస్తు మానవతరణమునకు ప్రేమతత్త్వమును, త్యాగసాధనమును ప్రసాదించెను. ఆ మహాత్ములు లోకోద్ధరణమును, నాత్మోద్ధరణమును నాత్మధర్మసాధనముననే చేసినవిధముననే గాంధిమహాత్ముడును నాత్మధర్మసాధనమున లోకోద్ధరణమును,నాత్మోద్ధరణమును జేయుచున్నాడు. ప్రపంచము ధర్మముమీద నాధారపడియున్నది.

ధర్మము భౌతికము, నైతికము, ఆధ్యాత్మికము లను రూపములను విశ్వమును ధరించుచున్నది. విశ్వము ధర్మముమీద నాధారపడియున్నది. పాశ్చాత్యదేశములందు భౌతిక ధర్మ ప్రవృత్తి ప్రవర్ధమానమై ఆధ్యాత్మిక ధర్మప్రవృత్తిని స్తంభింపజేసినది.

భారత దేశమునం దాధ్యాత్మిక ధర్మప్రవృత్తి నిద్రావస్థాపన్నమై భౌతికనైతికధర్మప్రయోజనములకు నిరుపయోగమైనది. భారతీయుల కాత్మసంస్మరణము దుస్తరమై భౌతికధర్మమును దురారాధ్యమైనది. శ్రీకృష్ణుడుపదేశించిన కర్మయోగము, బుద్ధదేవు డుపదేశించిన అహింసాధర్మము భరతవర్షమునకు దూరస్థములైనవి. ధర్మనిరీక్షణము నిత్యమైన ఆధ్యాత్మిక ప్రయోజనములనుండి అనిత్యములైన భౌతికప్రయోజనములకు మరలినది. అనిత్యమైన భౌతికప్రయోజనములను సమకూర్చుటకైనను సంకల్పము, సంస్కారము, సాధనసంపత్తి స్తంభించినవి. స్వల్పప్రయోజనములు మహాఫలములైనవి. సకలవ్యవస్థలందును ఆత్మావలంబన మంతర్ధానమై, పరావలంబనము పరమప్రమాణమైనది.

ఇట్టి విషమదశయందు భారత దేశోద్ధరణమునకు గాంధిమహాత్ముడు కార్యరంగమునందు జేరుట భారత దేశ సౌభాగ్యమునకు శుభచిహ్నముగ నేర్పడినది. విద్యావంతులు, విద్యార్థులు, పండితులు పామరులు, శ్రీమంతులు సామాన్యులు, స్త్రీలు పురుషులు, బాలుకు బాలికలు గాంధిమహాత్ముని యుపదేశముల ననుసరించి ఆత్మపరిశోధనమును జేసికొనుట కుపక్రమించిరి. గాంధిపేరు మూలమూలలను వ్యాపించినది. శ్రీ రామనామసంస్మరణమువలెనే గాంధినామ సంస్మరణమును ప్రజలు చేయుచున్నారు. గాంధిసంచారములందు లక్షలకొలది ప్రజలు పాదాక్రాంతులై ఖద్దరునిధికి కానుకలను సమర్పించుచున్నారు. ఆంధ్ర దేశసంచారమునందు ప్రజలు చూపిన భక్త్యుత్సాహములు గాంధిమహాత్ముని మాహాత్మ్యమును సహస్రముఖముల చాటుచున్నవి.

గాంధిమహాత్ముడు వర్తమానయుగమునందు భారత సంస్కారమునకును, విజ్ఞానమునకును అవతారమూర్తియై వెలయుచున్నాడు. గాంధిమహాత్ముడు కర్మయోగి, విరాగి; మహాదాత, యాచకుడు; జ్ఞాని, ఉద్యోగి; నాయకుడు, అనుచరుడు; సత్యవాది, ప్రియవాది; స్వాతంత్ర్యప్రియుడు, నియతకర్మారాధకుడు; ఆంగ్లభాషాపండితుడు, హిందీ ప్రచారకుడు; మానవ సేవకుడు, స్వదేశవ్రతపరాయణుడు.

సద్గుణసంపన్నుడైన గాంధిమహాత్ముడు కేవలము భారతనాయకుడే గాక లోకనాయకుడు, లోకోత్తరపురుషుడు. హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, బౌద్ధులు, పాశ్చాత్యులు, ప్రాచ్యులు మహాత్ముని గుణశీలముల నారాధించుచున్నారు. గాంధిమహాత్ముడు నిస్సహాయస్థితియందు నిద్రించుచున్న భారతీయులను మేల్కొలిపి ఆత్మసహాయమును నేర్పిన మహాయోగి.

ఉద్ధరే దాత్మనాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బన్ధు రాత్మైవ రిపు రాత్మనః.

గీత: అ. ౬, శ్లో. ౫.

ఆత్మవిశ్వాసమును, ఆత్మసహాయము నే సహాయనిరాకరణయోగము, సత్యాగ్రహయోగము. సత్యాగ్రహయోగము మహత్తరమైన ఆత్మయోగము. ఇమ్మహాయోగాభ్యాసమును సకలజనులు చేసి కానితార్థములనుబడయుటకు రాటము, ఖద్దరుపరమసాధనములుగ నున్నవి. రాటము దరిద్రనారాయణులకు కామధేనువు, శ్రీమంతులకు యోగచక్రము. రాట

మును, ఖద్దరు ధారణమును భారతీయుల కాత్మశక్తిని ప్రసాదించుటకు పరమసాధనములుగ నున్నవి. సర్వజనసౌలభ్యమైన స్వారాజ్యసాధనము నారాధించి గాంధిమహాత్ముని సంకల్పమును సఫలము చేయుట భారతీయులకు పరమధర్మముగ నున్నది. గాంధిమహాత్ముని షష్టిపూర్త్యుత్సవసమయమునందైనను ఖద్దరుదీక్షను బూనుట గాంధినామసంస్మరణమునకు ప్రయోజనము. కర్మయోగము లేని జ్ఞానయోగము జీవయాత్రను జేయుటకైనను ప్రయోజనకరముగాదు. దేహయాత్ర చేయజాలనివా రాత్మయాత్రను చేయజాలరు. ఆత్మయాత్రను జేయుటకై గాంధిమహాత్ముడు పూనిన మహాదీక్షలో శతాంశమైనను భారతీయులు పూనినయెడల ముప్పదికోట్ల భారతీయులకు దుర్లభమైన కార్యము గనబడదు.

భౌతిక బలాభిమానధర్మముల కభ్యస్తమైన లోకమున కాత్మబలమునందు విశ్వాసము గలుగుట దుర్ఘటము. ప్రపంచప్రవృత్తియం దాగ్రహము సులభము, నిగ్రహము దుర్లభము. ప్రవృత్తియందు కర్మ కనురూపమైన ఫలము గలుగుచున్నది. హింసకు ఫలము హింస. ప్రేమకు ఫలము ప్రేమ. ప్రపంచవిలయమునకు మూలమైన హింసాధర్మమును లోకమారాధించి హింసాఫలము ననుభవించుచున్నది. గాంధిమహాత్ముడు త్రికరణశుద్ధిగను అహింసాధర్మము నారాధించుచున్న విధమును వారిజీవయాత్ర విశదము చేయుచున్నది. బుద్ధభగవానుడు 2,500 ఏండ్లకు పూర్వము ప్రసాదించిన యుత్తమధర్మమును గాంధిమహాత్ముడు లోకకల్యాణమునకై పూరించుచున్నాడు. ఆ పవిత్రధర్మవ్యాపనమును జేసి ప్రపంచమునందు శాంతిని స్థాపించుట మహాభాగ్యము. ఇట్టిమహోదయసమయమునందు జననమొందుటయును, లోకోత్తరపురుషుడైన గాంధిమహాత్ముని సాంగత్య సంభాషణ సంసేవన లాభములను బడయుటయును, లోక కల్యాణమునకై ఉడుతభక్తిచందాన గాంధిమహాత్ముని దీక్షను సఫలము చేయుటయును మహాభాగ్యముగ నున్నవి. ఈ మహోదయానందము ననుభవించుట కధికారమును బడయుటకు, భారతీయులు ఖద్దరును, సత్యమును, అహింసాధర్మమును సేవించుటకు, భగవదనుగ్రహము గలుగుగాత!

ఆ. దంతియడుగులోనఁ దక్కిన జంతుస
యంబు నడుగు లెల్ల నడఁగియుండు
నట్లు ధర్మకోటు లన్నియు లోనగు
నిద్ధరణ యహింస కింత నిజము.

సకలధర్మములును అహింసాధర్మమునందిమిడియున్నవి. ఒరులు తన కెన్ని చెడుగులను జేసినను నితరులకు చెడుగు జేయకుండుట పరమ ధర్మము. ఇట్టి పరమధర్మమె అహింసా ధర్మము. ఈ పరమధర్మ స్వరూపము మహాత్ములకు ప్రత్యక్షమై సామాన్యులకు సులభగ్రాహ్యమగుచున్నది. ఉత్పన్నమైన ఆత్మధర్మమును నుద్ధరించి భరతవర్షమును, లోకమును నుద్ధరించుటకు గాంధిమహాత్ముడు చూపుచున్న మహాత్యాగము వారికమరత్వమును గల్పించుచున్నది. ఆత్మమాహాత్మ్యమును ప్రత్యక్షముగ సందర్శించుచున్నవారైనను, ఆత్మప్రపత్తిని బడయుటకు గాంధిమహాత్ము డవలంబించిన దీక్షావిధానము నవలంబించి పురుషార్థమును సార్థకము చేయుదురుగాత! భగవంతు డాత్మబల సంపన్నుడైన గాంధి

మహాత్మునకు లోకకల్యాణమునకై ఆయురారోగ్య
ముల నొసంగి కాపాడుగాత!

* * *

శారదావివాహశాసనము

భారతజాతీయ జీవితమునందు శారద వివాహ
వయోనిర్ణయశాసన మొకమహాఘట్టముగనున్నది.
పూర్వము రజస్వలానంతర వివాహము లుండినను,
ప్రస్తుతము బాల్యవివాహములువ్యాపనమునందున్న
ను, పండితులు, ప్రజలు, శాసనకర్తలునిర్ణయించవల
సిన విషయము పురుషార్థమునకు మూలాధారమైన
ధర్మము. ధర్మనిర్ణయమునకు పురాణనవీన సందర్భ
ములు ప్రయోజనకరములుగావు. బాల్యవివాహము
నకును,రజస్వలా వివాహములకును హద్దుపద్దులను
నిర్ణయించుట యసాధ్యము. దేశకాలపాత్రముల
స్థితిగతుల ననుసరించి యివి మారుచున్నవి.
అన్ని దేశములకును వయోనిర్ణయ మొక
రీతిని లేదు; భరతవర్షమునందును భిన్న సంఘము
లందు భిన్నరూపములను నున్నది. వయోనిర్ణయ
ము నైమిత్తికధర్మము గాని నియతధర్మము గాదు.
దేశకాల పాత్రానురూపముగ మారుచున్న
నైమిత్తికధర్మములను కొన్నిసంఘములందును, దేశ
ములందును మార్చుటవలన నిత్యధర్మమునకు హాని
గలుగదు.

నైమిత్తిక ధర్మములను ప్రాచీన కాలము
నందు మఠాధిపతులు, ధర్మసూత్రకారులు నిర్ణయిం
చుట కధికారులుగ నుండిరి. వర్తమాన యుగము
నందు రాజ్యధర్మము సకలధర్మముల నావహించి
నది. సాంఘికమతధర్మములకు రాజ్యాంగధర్మముల
మీద గల యధికారము గతించినది. సాంఘిక
నిర్ణయములు, విద్యావిధానములు,ఆచార వ్యవహార
ములు, నైతికవ్యవస్థలురాజ్యాధికారమున కంతర్గత
ములయినవి. మతధర్మములను సకలజనులకును
వారి మతానుసారముగ నవలంబించుట కధికార
ము గలదు. కాని నీతిబాహ్యములైన మతకార్యము
లను సయితము రాజ్యాధికారము ప్రతిషేధించు
చున్నది. నరబలులను, సహగమనమును, వ్యభిచా
రగృహములను, ద్యూతాలయములను రాజశాస
నములు ప్రతిషేధించుచున్నవి. ఆనిషేధములను
సకలజనులును పాలించుచున్నారు.

మతసాంఘికాచార వ్యవహారములు కలిసి
మెలిసియున్న దేశములందు వీనిని విడదీయుట
దుష్కరము. భరతఖండమునం దాదికాలమునుండి
యును నాధ్యాత్మిక నిర్ణయములందు జిజ్ఞాసువులకు
సంపూర్ణస్వాతంత్ర్యము గలదు. అద్వైతులు, ద్వై
తులు, చార్వాకులు, శాక్తేయులు మొదలగు మత
స్థులు వారివారి మతానుసారముగ బ్రహ్మాన్వేషణ
మును జేయుట కధికారులై యున్నారు. సాంఘికా
చారములను మతధర్మములతో మేళగించుటయును,
మతగ్లాని ఘోషపెట్టుటయును అనుచితము. యూ
రపురాజ్యముల వలెనే ఈజిప్టు తుర్కీ దేశములు
సాంఘికధర్మములను, మతధర్మములను వేర్వేరుచేసి
నవి. లోకమంతయును నవలంబించుచున్న మార్గ
మును భరతవర్షమును నవలంబించుట యుగధర్మ
మున కనురూపముగ నున్నది. లోకమంతయును
నవలంబించుచున్న నైమిత్తికధర్మము భరతవర్షము
నకును నైమిత్తికధర్మముగను పరిణమించుట నియ
తధర్మమునకు ప్రతిబంధకము గాజాలదు. నిత్యధర్మ
స్వరూపమును గ్రహించుటయే శారదవయోనిర్ణయ

శాసనమునందలి ధర్మాధర్మములను నిర్ణయించుటకు సాధనంబుగ నున్నది.

నియతధర్మము నిత్యమై విశ్వాసమునుధరించుచున్నది. అనియతధర్మ మనిత్యమై విశ్వమును హరించుచున్నది. పురుషార్థములకు సాధనమైన స్త్రీపురుషసాహచర్య సాంగత్యములకు కీలకము వివాహము గాని వయస్సుగాదు. పురుషార్థమునకు నియతధర్మమైన వివాహమును కామపరము చేసి భోగమునకై వినియోగించుటధర్మగ్లానికి సాధనము గాని ధర్మాభ్యుదయమునకు సాధనము గాదు. [illegible] సాధనమును, సాధ్యమును సత్యము, జ్ఞానము, ఆనందము. అసత్యము, అజ్ఞానము, దుఃఖమును సంసార ప్రవృత్తికి ప్రయోజనములుగావు. వివాహసమయమునందు వధూవరులు చేసెడి ధర్మప్రతిజ్ఞలను పాలించుటకై సత్యము,జ్ఞానము సాధనములుగ నున్నవి. తెలియక చేసెడి ప్రతిజ్ఞలు సంసారప్రవృత్తికి ప్రతిబంధకములై, పురుషార్థములు నిరుపయోగము లగుచున్నవి. ప్రకృతియందు విషయోపభోగమునకును,సంతానప్రాప్తికిని నియత ధర్మము గలదు. ప్రకృతి సిద్ధమైన నియత ధర్మము ననుష్ఠించుటయేసత్యమైనధర్మానుష్ఠానము. నియతమైన ధర్మమార్గమును విడిచి అసహజమైన ధర్మమార్గము నవలంబించుచు ధర్మగ్లానిని ఘోషించుట యధర్మము గాని ధర్మము గాదు.

ధర్మసాధనమునకుశరీరము మూలాధారముగ నున్నది. ఆరోగ్యరహితమై రోగభూయిష్ఠమైన శరీరముధర్మారాధనమునకునిరుపయోగముగనున్నది. దేశావృతమైన అనారోగ్యము, శిశు మరణములు, ప్రసవమరణములు, అకాల మరణములు, దౌర్బల్యము, బాలవైధవ్యములు బాల్య వివాహములకు దుష్ఫలములై వెలయుచున్నవి. వివాహప్రతిజ్ఞలను జేయుటకు యుక్తవయస్సులేని వధూవరులు ప్రతిజ్ఞలను జేయుట యధర్మముగ నున్నది. సాంఘిక నైతిక మతధర్మముల నతిక్రమించని వివాహవయో నిర్ణయము సదాచారముగాని దురాచారముగాదు. ప్రపంచమంతయును నవలంబించుచున్న మార్గము భారతీయులకును నవలంబన యోగ్యముగ నున్నది. ధర్మాభ్యుదయమునకై వివాహ వయోనిర్ణయశాసనమును తలపెట్టి విజయమును బడసిన హరవిలాస శారదాగారు భారతీయుల కృతజ్ఞతకు పాత్రులు. సామ్రాజ్య శాసనసభ్యులును ప్రజల కృతజ్ఞతకు పాత్రులు. ప్రభుత్వసభ్యుడు శ్రీ రావుగారు చూపిన దీర్ఘదృష్టి ప్రశంసనీయముగ నున్నది. రాజప్రతినిధి అక్టోబరు మొదటి తేదీని శారద శాసనమునకు సమ్మతి నొసంగి స్వధర్మ నిర్వహణమును చేయగలిగెను. శాసనరూపమును దాల్చిన తరువాతనైనను సనాతన ధర్మప్రియులు వాదప్రతివాదములనువిడిచి దేశాభ్యుదయమునకును, ధర్మాభ్యుదయమునకును శాసనమునకు స్వాగతంబు నొసంగుట వివేకము. వయోనిర్ణయశాసనము భగవదనుగ్రహము వలన సార్థక మగుగాత !

*　　*　　*

కాంగ్రెసు సభాధిపత్యము

జవాహరిలాలునెహ్రూగారిని లాహోరుకాంగ్రెసునకు అధ్యక్షునిగను కాంగ్రెసుస్థాయిసంఘ మేకగ్రీవముగ నెన్నుకొని స్వధర్మ నిర్వహణమును

జేసినది. దేశము సహజముగను గాంధిమహాత్ముని వరించినది. సత్యప్రియుడైన మహాత్ముడు దేశవరణమును నిరాకరించుట సహజముగ నున్నది. అధికారవ్యామోహము, స్వార్థపరత్వము స్వధర్మనిర్వహణమునందు గాంధిమహాత్మున కితరనాయకులకువలెను ప్రతిబంధకములు గాజాలవు. గాంధిమహాత్ముని సంకల్పము దేశారాధనము, దైవారాధనము గాని స్వార్థారాధనముగాదు. కపటనాయక నామధారుల మాయోపాయములతో నిమిత్తములేకయే మహాత్ముడు సభాధిపత్యము నారంభము నుండియును నిరాకరించుచుండెను. గాంధీమహాత్ముని లక్ష్యము దేశారాధనము గాని స్వార్థారాధనము కాదు. ఆత్మార్పణము చేయుటకు సత్యాగ్రహదీక్షను ఆరాధించుచున్న గాంధీమహాత్మునకు ప్రాపంచికలాభములు సమ్మోహమును గలుగజేయవు. కాంగ్రెసు స్థాయిసంఘసమావేశమునందు గాంధీమహాత్ముడు చేసిన వ్యాఖ్యానము వారి నిష్కల్మషహృదయమును విశదముచేయుచున్నది. స్వరాజ్యసంపాదనమునకు సత్యాగ్రహము పరమసాధనమని గాంధీమహాత్ముడు విశ్వసించుచున్నాడు. గాంధీమహాత్ముడు స్వరాజ్య ప్రస్థానమునందు, తనకు అనుచరు లుండినను, లేకున్నను, సత్యాగ్రహదీక్షను నవలంబించుటకు సంకల్పమును గలిగియున్నాడు. నిగ్రహమును, ఆత్మవిశ్వాసమును లేనియువజనులకును, నాయకులకును సత్యాగ్రహప్రస్థానమునందు విశ్వాసము లేకపోవుట సహజము. ఈ విషమపరిస్థితులందు యువజనులకు ప్రియుడైన జవహరిలాలు నెహ్రూగారిని సభాధిపతినిగ గాంధీమహాత్ముడు నిర్ణయించి సమర్థించుట వారి సత్యప్రవృత్తికి అనురూపముగ నున్నది. నెహ్రూగారివరణము నిరంకుశాధికారవర్గమునకును, వారిపోషకులకును భయసంభ్రమములను గలుగజేయుట సహజము. కాని గాంధీమహాత్మునకు రాజ్యతంత్రారోపణము చేయుట యనుచితము.

ప్రజాహృదయమునందు దౌర్జన్యరహితమైన అసహాయోద్యమమునందు విశ్వాసము పోయి దౌర్జన్యమార్గమునందు విశ్వాసము కలుగుటకు బాధ్యులు నిరంకుశాధికారులు గాని శాంతికాముడైన గాంధిమహాత్ముడు కాడు. ప్రపంచమునందు శాంతినిస్థాపించుటకై విశ్వప్రయత్నములను జేయుచున్న లేబరుప్రభుత్వము భరతవర్షమునందు వ్యాపించుచున్న విషమపరిస్థితులను గ్రహించి విశాలదృష్టిని బూని రాజ్యాంగసంస్కరణములను నిర్ణయించుట భరతవర్షసౌభాగ్యమునకును, బ్రిటిషుసామ్రాజ్యప్రయోజనములకును, ప్రపంచశాంతికిని సాధనము కాగలదు. జవహరిలాలు నెహ్రూగారి అధ్యక్షతక్రింద లాహోరు కాంగ్రెసుజయప్రదముగ జరుగుటకును, స్వరాజ్యసంపాదనమునకుసాధనమగుటకును భగవదనుగ్రహము గలుగుగాత! నెహ్రూకుటుంబము స్వరాజ్య సంరంభమునందు శాశ్వతమైనకీర్తిని బడయుగాత!

* * *

ఆంధ్రమహాసభలు

విజయవాడయందు నవంబరు మాసారంభమునందు గూడనున్న ఆంధ్రమహాసభలు ప్రజాహృదయమునందు సర్వతోముఖమైన సంచలనమును

గలుగజేయుటకు వినియోగపడుట ప్రయోజన
కరము. మహాసభల ప్రయోజనము సర్వతోముఖ
మైన ప్రజావికాసము. ఈవికాసమునకు సాంఘిక
ధములు, వ్యక్తిప్రయోజనములు, పదవులు ప్రతి
బంధకములగుట కార్యసిద్ధికి ప్రతిబంధకముగ బరిణ
మించుచున్నది. విజయవాడకు ౧౧ ఏండ్లతరువాత
ఆంధ్రమహాసభలను జరుపగలభాగ్యము గలిగినది.
చిరకాలానంతరముగలిగిన యవకాశములను విజయ
వాడ పౌరులును, పశ్చిమకృష్ణామండల వాసులును
సార్థకము చేయుటకు వారి యావచ్ఛక్తిని వి
యోగించవలసి యుందురు. గాంధీమహాత్ముడు జ
హరిలాలు నెహ్రూగారిని కాంగ్రెసు సభాపతినిగన
నిర్ణయించుటయందు చూపిన నిగ్రహము, సహ
నము, త్యాగము, దేశసేవాపరాయణత్వము ఆంధ్ర
మహాసభల నిర్వాహకులకును స్వధర్మనిర్వహణము
నకును, జ్ఞానోపదేశమునకును, విజయవాడప్రతిష్ఠన
కాపాడుటకును సాధనమగుటకు భగవంతు డను
గ్రహించుగాత!

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7,ThambuChetty St, Madras